# АНТОЛОГИЯ РУССКОГО РАССКАЗА

## КЛАССИКИ РУССКОЙ ЛИТЕРАТУРЫ

ИЗДАТЕЛЬСТВО ЛИТЕРАТУРЫ НА ИНОСТРАННЫХ ЯЗЫКАХ · МОСКВА

# రష్యన్ రచయితల కథానికా సంకలనములు

రష్యన్ సారస్వత ప్రౌఢకృతులు

విదేశభాషా ప్రచురణాలయం. మాస్కో

అనిల్

# విషయసూచిక

# అలెక్సాండ్ర్ పూష్కిన్

## మజిలీ గుమాస్తా



మజిలీ గుమాస్తా పద్దులు రాసుకునే ఉద్యోగే,
ఐతేనేం, అతడు అచ్చమైన డిక్టేటరే.
— రాజకుమారుడు వ్యాజెమ్‌స్కి.*

మజిలీ గుమాస్తాలను తిట్టని వాడెవడు? వాళ్ల పేరు చెబితేనే భగ్గున మండిపడని వాడెవడు? వాళ్లమీద కారాలూ మిరియాలూ నూరుతూన్న ఆగ్రహావేశపు గడియలలో వాళ్లపాలిటి చిత్రగుప్తుడి చిఠ్ఠాలాంటి ఆ ఫిర్యాదు

*పి.ఎ.వ్యాజెమ్‌స్కి (1792–1878) – ప్రఖ్యాత కవి, పూష్కిన్ సమకాలికుడు, మిత్రుడు.– సం.

పుస్తకం తేతెస్మనమనీ, ఆ తాత్సారాలూ, ఆ దురుసుతనాలూ, ఆ అల స్యాల గురించి తాను ఎంతగా చెప్పకున్నా పెడచెవిని పెట్టడంతప్ప ఏమీ ఫలితం లేకపోయిందని ఆ పుస్తకంలో రాసిపారేస్తాననీ బెదరించని ప్రయా ణీకు డెవడున్నాడు? మజిలీ గుమాస్తాగాళ్లను ఎందుకూ పనికిరాని క్షుద్ర జనం కిందనూ, శాంతమూర్తులైన మునబుకోర్టు గుమాస్తాలతోనూ, కాదూపోదూ అంటే మూరొమ్ అరణ్యంలోని బందిపోటు దొంగలతోనూ* సమానంగా చూడని వాడెవడున్నాడు? ఇదంతా నిజమే అనుకోండి, అయినా మనం నిష్పాక్షికంగా ఆలోచించుదాం; వారి వాస్తవ పరిస్థితులను తెలుసు కొనడానికి మనం ప్రయత్నించుతే, బహుశ వారియెడల మనకి కనికరం కలిగి, వారిపై ఇంత కఠినమైన తీర్పు చెప్పమేమో?

ఇంతకీ మజిలీ గుమాస్తే అంటే ఎవడు? తనమీద ఇతరులు చెయ్యి చేసుకొనకుండా కేవలం తనను కాపాడుకునేందుకు మాత్రమే ఉప యోగపడుతూన్నట్టి — పోనీ ఆ విధంగానైనా ఎల్లప్పుడూ ఉపయోగపడు తూందా అంటే అదీ లేదు కూడా (నేను చెప్పినదాని నిజానిజాలను గురించి పాఠకుని అంతఃకరణకే విజ్ఞప్తి చేస్తున్నాను) — గవర్నమెంటు ఉద్యోగి అనే హోదాను కలిగినట్టి, గవర్నమెంటు నౌకరీలో వున్న పద్నాల్గవ ఉద్యో గపు తరగతి నోచుకున్న అష్టకష్టాలనూ భరించే పాపాల భైరవుడెవడయ్యా అంటే 'ఓయ్' అని పలికే వ్యక్తే మజిలీ గుమాస్తా. డిక్టేటరు అని హాస్యానికి రాజకుమారుడు వ్యాజెమ్స్కి పేరుపెట్టిన ఈ వ్యక్తియొక్క విధులేమిటి?

---

*ఆ రోజుల్లో ఒకా నది కుడి గట్టున వుండినట్టి, పేరుపడిన బంది పోటు దొంగలు నివసించుతూండినట్టి అరణ్యం. — సం.

అతడిది నిజంగా బండచాకిరీ అవునంటారా కాదంటారా? పగలుకాదు, రాత్రికాదు, ఒక్క నిమిషమైనా అతనికి తీరుబడి వుండదు కదా. దూర ప్రయాణం చేసి చేసి విసుగెత్తిపోయిన ప్రయాణికుని మనస్సులో పోగు పడి పేరుకున్న చిరాకూ కోపమూ అంతా మజిలీ గుమాస్తా నెత్తిమీద విరుచుకు పడుతుంది కదా. వాతావరణం చండాలంగా వున్నా, రహదారులు పాడుగా వున్నా, గుర్రపుబండి కోచిమేను తలబిరుసుగా ప్రవర్తించినా, గుర్రాలు మొండికేసి కదలకపోయినా — వీటన్నిటికీ గుమాస్తావే కదా బాధ్యుడు. పాపం నిర్భాగ్యుడైన అతగాడి ఇంట్లో ప్రయాణికుడు అడుగు పెట్టీపెట్ట డంలో, అతగాడు తన బద్ధశత్రువైనట్టే పరిగణిస్తాడు, ఆ ప్రయాణి కుడు. పిలువని పేరంటంగా వచ్చిన ఈ అతిథిని ఎలాగో ఒకలాగున వదిలించు కునే సరికి తన అదృష్టం పండినట్టు సంతోషించాల్సి వస్తుంది మజిలీ గుమాస్తా. ఇక ఆ ప్రయాణికుడు కోరినట్టూ అంచె గుర్రాలు దొరకక పోయెనా — ఆరె భగవంతుడా, ఎన్ని తిట్లూ, ఎన్ని శాపనార్థాలూ, ఎన్ని బెదరింపులూ శరపరంపరలుగా అతగాడిమీద వచ్చి పడతాయో కదా! వాన దిమ్మరిస్తున్నా సరే, రహదారి కడుహింపిగా వున్నా సరే, ఇంటి ముంగిట్లో అతడు ఇటూ అటూ తచ్చాడుతూండాల్సిందే కదా; ఇక హోరుమంటూన్న తుపానులోనూ, ఎముకలు కొరికేస్తూన్న చలిలోనూ, ప్రయాణికుల కేకలనుండీ దాడులనుండీ కనురెప్పపాటు తలదాచుకోవాలంటే అటకుమీదకెక్కి కూచోవాల్సిందే.

సైన్యాధిపతి జనరల్‌గారు ఒకరు దయచేస్తారు: మజిలీ గుమాస్తా హడలుతూ వణకుతూ తన దగ్గర ఇంకా మిగిలి వున్న మూడుగుర్రాల జతలు రెండింటినీ అయనగారికి ఇచ్చేస్తాడు, వీటిలో ఒకటి మెరుపులా పరుగెత్తే తేజీ

కూడానూ. ఆ గుర్రాలను కట్టించుకుని, 'ధన్యవాద' మంటూ ఒక్కమాట అయినా ఆడకుండా వెళ్లిపోతాడు జనరల్‌గారు. ఆయన వెళ్లిపోయిన మరో ఐదు నిమిషాలకల్లా గణగణమని గంట వాయించుకుంటూ పోస్టుబగ్గీ వస్తుంది... అందులోంచి చెంగున మిలిటరీ హర్కారా దిగివచ్చి, నిలుచున్న పాళంగా తనకు అంచె గుర్రాలు కావాలంటూ ఫర్మానా కాగితం అతడి ముఖంమీద పారే స్తాడు!..

ఈ సంగతుల నన్నింటినీ మరింత కూలంకషంగా పరిశీలించితిమా, అతగాడిపై మనకు కోపం రావడం బదులు, అతగాడంటే మన హృదయం యథార్థమైన కనికరంతో నిండిపోతుంది. మరి రెండు మాటలు: ఇంచు మించు ఇరవై సంవత్సరాలై నేను రష్యా దేశమంతా నలుమూలలా, ఈ కొసనుండి ఆ కొసకి తిరుగుతూనే వున్నాను, ఇంచుమించు అన్ని అంచెల హైరోడ్లూ నాకు తెలుసు, రెండు మూడు తరాల కోచిమేన్లతో నాకు బాగా పరిచయం వుంది; నాకు స్వయంగా తెలియని మజిలీ గుమాస్తాలు బహు కొద్దిమంది; వారితో నాకు ఏదో ఒక విధంగా వ్యవహార సంబంధం లేనివారు మరీ కొద్దిమంది. నా ప్రయాణాల్లో నేననుభవించిన కొన్ని ఔత్సుక ఘటనలను గురించి ఆద్యతన భవిష్యత్తులో రాయడానికి సంకల్పించు కున్నాను కూడా. ఆ కారణంచేత ప్రభుత్వోద్యోగులుగా ఈ మజిలీ గుమాస్తాల తరగతిపై ప్రజలలో ఏర్పడిన దురభిప్రాయం ఎంతైనా శోచ నీయమని మాత్రం ఆ విషయం గురించి ప్రస్తుతానికి నేనిక్కడ చెప్పాల్సి వుంది.

నలుగురి నోళ్లలోనూ పడి నలుగురి వల్లనూ అభాండాలకు పాల్పడు తూన్న ఈ మజిలీ గుమాస్తాలు సర్వసాధారణంగా బహు సాధుస్వభావులు,

ఎదుటివారికి సహాయంచేసే తత్వం వారిది, అందరితోనూ కలుపుగోలుగా మసిలే రకరం, మొగమోటపు మనుషులు, వారికి మొత్తంమీద డబ్బు కాపీర్నం తక్కువ. వారితో సంభాషణ సాగించుతూంటే – వీరితో సంభాషణ ఏడ్చినట్టే వుంటుందని ప్రయాణికులలో శ్రీమంతులు కొందరు అన్యాయంగా అభిజాతంతో మూతివిరుపు మాటలు అంటే అనవచ్చుగాక – ఎన్నో తమషా విషయాలూ, పనికివచ్చే సంగతులూ మనం నేర్చుకోవచ్చు. రాచకార్యంమీద ప్రయాణం చేస్తూన్న ఏ ఆరవ తరగతి ప్రభుత్వోద్యోగి సంభాషణకంటె వీరి సంభాషణే నామట్టుకు నాకు ఎంతో ఇష్టం.

గౌరవపాత్రులైన ఈ తరగతి ఉద్యోగులలో నాకు కొందరు స్నేహితులున్నారన్న విషయం ఏమంత ప్రయాసపడకుండా తేలికగానే బయట పడుతూంది కూడా. యథార్థం చెప్పాల్సొస్తే వారిలో ఒకరి స్మృతి నాకెంతో ప్రేమాస్పదమైనదిగా ఎంచుకుంటాను నేను. కొన్ని సంగతి సందర్భాల వల్ల మేమిద్దరమూ కలుసుకోవడం తటస్థించింది. వాటిని గురించి నా పాఠకమిత్రులకు ఇప్పుడు వివరించబోతున్నాను.

1816వ సంవత్సరం మే నెలలో ఒకానొక రాష్ట్రంలో నేడు ఉపయోగంలోలేని ఒక రాజమార్గంపై నేను ప్రయాణం చేయడం తటస్థించింది. గవర్నమెంటు నౌకరీలో నా ఉద్యోగం చెప్పుకోదగ్గదేమీ కాదు. పోష్టుబగ్గీలోనే రెండు అంచీలకు రుసుము ఇచ్చి ప్రయాణం చేసేవాడిని. ఫలితంగా మజిలీ గుమాస్తాలు నేనంటే నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తూ, నా అభిప్రాయంలో నాకు న్యాయంగా చెందాల్సిన హక్కులకూ సదుపాయాలకూ సహితమూ అప్పుడప్పుడు నేను బలప్రయోగం చేయాల్సి వచ్చేది. అప్పట్లో నేను కుర్రకారు వయస్సులోనే వుండడం చేతనూ, ముక్కోపితనం కారణంగానూ, నా బండికి

కట్టాల్సిన మూడు గుర్రాలనూ గొప్పహోదాలో వున్న ఏ ఉద్యోగస్థుడి బగ్గీ కోసమో ముందుగానే కట్టేసే సరికి, మజిలీ గుమాస్తాలు ఇచ్చకాల రాయుళ్లు అనీ చవటి పెద్దమ్మలనీ నాకు వొళ్లు మండిపోయేది. గవర్నరు గారి ఇంట్లో విందు జరిగినప్పుడు దర్బారు మర్యాదలను తు.చ పాటించే భృత్యుడెవడైనా ఏదైనా భక్ష్యాన్ని నాకంటె పెద్దహోదాలో వున్న అతిథి కెవరికైనా నాకంటె ముందుగా వడ్డించినట్లాయెనా, అందుకు నేను ఒకంతట అలవాటు పడలేకపోయేవాడిని. వాటినన్నిటినీ ఈనాడు తల్చు కుంటే అవన్నీ న్యాయంగా వుండినట్టే అనిపిస్తుంది ఇప్పుడు. ఆ మాట కొస్తే, "గొప్ప హోదాకి కొద్ది హోదా తల వొగ్గాలి" అనే నిజంగా అందరికీ సదుపాయమైన నీతివాక్యం వదలుకుని, అందుకు బదులు "గొప్ప తెలివికి కొద్ది తెలివి తల వొగ్గాలి" అనే లోకంమీద ఎక్కడాలేని పద్ధతి ఒకటి తెచ్చి పెట్టుకుంటే ఇకనీ ప్రపంచంలో ఇంకేమైనా వుందా? ఎన్ని అల్లర్లు, ఎన్ని తగాదాలు ఇక బయల్దేరుతాయో కదా! ఈ కొత్త పద్ధతి వడ్డించేవాడు గనుక శిరసావహించాడంటే, పంక్తిలో ముందు ఎవరికి వడ్డించగల్గుతాడు? ఈ విషయం ఇక్కడికిలా వుంచి, మన కథ సాగించుదాం.

ఆ రోజు నిప్పులు చెరుగుతూంది. మజిలీ స్టేషను ఇంకా రెండు మైళ్లు వుందనగా నాలుగు చినుకులు పడి, మరి కాస్సేపటికి కుండపోతగా మొదలైంది వాన. నేను శుభ్రంగా తడిసిపోయాను, నాదుస్తులన్నీ తడిముద్ద లైపోయాయి. మజిలీ దగ్గర ఎప్పుడు బండి ఆగునా, ఎప్పుడీ తడిగుడ్డలు విడిచేసి పొడిగుడ్డలు కట్టుకుందునా అని ఒకటే తాపత్రయం నాది. ఇక ఇన్ని టీ చుక్కలు నా కడుపులో ఎప్పుడు పడునా అని నా రెండవ తాపత్రయం.

"ఒసేవ్ దూన్యా! ఎక్కడున్నావే?" అంటూ మజిలీ గుమాస్తా కేకే శాడు, "సమొవార్* సిద్ధంచేసి, పరుగెత్తికెళ్లి పాలు పట్టుకురావమ్మా!"

ఈ మాటలు అతని నోటివెంట వచ్చీ రావడంతో, పద్నాలుగేళ్ల అమ్మాయి ఒకామె అక్కడున్న తెర వెనుకనుండి వచ్చి వసారాలోనుండి బయటికి వెళ్లింది. ఆ అమ్మాయి అందాన్ని చూసి నాకు నోటివెంట మాట రాలేదు.

"మీ అమ్మాయా?" అని మజిలీ గుమాస్తాని అడిగాను.

"అవునండి, నా కూతురేనండి" అని సగర్వమైన వాత్సల్యం ముఖంలో తొణికిసలాడుతూ అతడు జవాబుచెప్పాడు. "మంచి తెలివైనదండి, తెలివికి తగ్గట్టు మంచి పనిమంతురాలండి; మూడుమూర్తులా మళ్లీ వాళ్ల అమ్మ పోలికేనండి, అది బతికివుంటే ఎంత సంబర పడేదోనండి!"

ఆలా అంటూనే, తాజా గుర్రాలు కావాలని నేనిచ్చిన ఆర్డరు రాసు కుంటూ కూచున్నాడతడు. ఈలోపుగా, నిరాడంబరంగానూ అతిశుభ్రం గానూ వున్న ఆ గదికి అలంకారంగా గోడలకు తగిలించి వున్న చిత్రపటా లను చూస్తూ నిలబడ్డాను. ఆ చిత్రపటాలు "కొరగాని కొడుకు" కథను చిత్రించుతున్నాయి. నిద్రపోయేటప్పుడు తొడుగుకునే దుస్తులు వేసుకుని, తలకు కుళ్లాయి పెట్టుకుని, తన కుమారునికి డబ్బుసంచి అందిచ్చి, ఆశీ ర్వదించుతూన్న తండ్రీ, డబ్బుసంచినీ ఆశీర్వాదాన్నీ అందుకుని ఇంటినుండి బయలుదేరి వెళ్లిపోవడానికి అరికాలు నిలవకుండా వున్న కొడుకూ మొదటి

---

* నీళ్లు మరిగించి, టీ తయారుచేసేందుకు రష్యా దేశమంతటా వాడుక చేసేపాత్ర. — అనువాదకుడు.

బొమ్మలో వున్నారు. కపట స్నేహితులతోనూ సిగ్గు బిడియాలు లేని స్త్రీల తోనూ కూడి డబ్బు తగలబెడుతూ విందులారగించడమూ తప్పతాగడమూ మొదలైన దుర్వ్యసనాలకు అలవాటు పడిన ఆ యువకుని జీవితం రెండవ బొమ్మలో స్పష్టంగా చిత్రించి వుంది. చేతిలో చిల్లిగవ్వ అయినా లేకుండ బగ్గంపాడైన ఆ యువకుడు పాతగిలి చిరిగిపోయిన చొక్కా తొడుగుకొని, ముక్కోణపు టోపీ పెట్టుకుని పందులు కాస్తూండడం తరువాతి బొమ్మలో వుంది: ఆ యువకుని ముఖంలో తీవ్రమైన బాధ, ప్రగాఢమైన పశ్చాత్తా పమూ ద్యోతక మవుతూంది. ఆ యువకుడు తండ్రి ఇల్లు తిరిగి చేరు కోవడమూ, ఆ వెనుకటి దుస్తులలోనే, నిద్రపోయేటప్పుడు వేసుకునే అంగరకా కుళ్లాయీతోనే వున్న తండ్రి, ఆ దయాళుడు, కొడుకు ఇంటికి తిరిగి రావడం చూసి, కొడుకును మహదానందంతో ఆదరించడమూ, అప్పుడు ఆ కొరగాని కొడుకు తండ్రి కాళ్లమీద పడి క్షమాపణ వేడుకోవడమూ; చిత్రం పూర్వరంగంలో, వంటవాడు విందుకోసమని బలిపించి వుంచిన దూడను బలిపెట్టడానికి ఆయత్త పడుతూండగా, ఈ పండుగ వేడుకకు కారణమే మిటని వంటవానిని పెద్దకొడుకు అడగడడమూ — ఇదంతా కడపటి బొమ్మలో వుంది. బొమ్మలలో ప్రతిదాని కిందనూ బొమ్మకు తగ్గట్టు జర్మను భాషలో వున్న పద్యాన్ని చదివాను. ఇదంతా కూడా నా మనస్సులో చిరాంకితమై పోయింది. గోడమీద వేలగట్టి వున్న ఈ బొమ్మలే కాకుండా, చిగుర్చు తూన్న నీలగోరింట మొక్కలూ, చిన్న చిన్న పూల వాజులూ, రంగురంగుల అద్దకంగుడ్డ తెర వేసి వున్న మంచమూ, ఇంకా ఆ గదిలో నా చుట్టూ వుండిన వస్తువులూ, ఇవన్నీ నా స్మృతిపథంలో చిరస్థాయిగా నిల్చిపోయాయి. ఆ ఇల్లే మజిలీ స్టేషనుగానూ, అదే తన స్వగృహంగానూ ఏర్పరచుకొని,

తన సొంత ఇంట్లోనే చిన్న పూటకూళ్ల వ్యాపారము చేసుకుంటూన్న ఆ గృహస్థు — ఏభయ్యోపడిలో వుండి, ఇంకా నడివయస్సులో వున్న మనిషిలా కనబడుతూ, మంచి చురుకుగా వుంటూ, వెలిసిపోయిన రిబ్బనులనుండి పతకాలు వేలాడుతూన్న ఆకుపచ్చ యూనిఫారం అంగరకా కోటు తొడుగు కున్న ఆ గృహస్థు — నాకళ్లముందు వున్నట్టే ఇప్పటికి కూడా నాకనిపిస్తూ వుంటుంది.

నేను ఎక్కివచ్చిన బండికి ఇవ్వాల్సిన అద్దె బండివానికి ఇచ్చివేసి అతడిని పంపివేశానో లేనేలేదో, ఇంతలోనే సమోవార్ పట్టుకుని చక్కావచ్చింది దూన్య. ఆ వగలాడి చిన్నది నాకేసి రెండవసారి చూచి, తాను నాపై కల్గించిన ప్రభావాన్ని వెంటనే పసికట్టేసింది. చేరడేసి వున్న తన నీలంపు నయనాలను ఆమె వెంటనే కిందకు వాల్చేసింది; ఆమెను పలుకరించి ఆమెతో సంభాషణ ఆరంభించాను. ప్రపంచాన్ని బాగా ఎరిగివున్న యువతిలాగు, ఆమె ఏమా త్రమూ బిడియపడకుండా నా ప్రశ్నలన్నింటికీ బదులు చెప్పింది. నేను తెచ్చిన 'పంచ్' మద్యములో, ఒక గళాసు ఆమె తండ్రికోసమూ, ఆమె కోస మని గళాసు టీ నేను పురమాయించి తెప్పించి, పాత పరిచయస్థులకు మల్లేనే ముగ్గురం బాతాఖానీ ప్రారంభించాం.

గుర్రాలను కట్టి బండీ తయారై ఎంతసేపటినుండో రోడ్డుమీద సిద్ధంగా నిలబడుంది. అయినప్పటికీ, ఆ మజిలీ గుమాస్తానూ, అతని కూతు రినీ విడిచిపెట్టి వెళ్లిపోవడానికి నాకు ఒకంతట మనస్కరించింది కాదు. ఎలాగైతేనేమి చివరకు బయల్దేరాను. క్షేమంగా వెళ్లిరావాల్సిందని అతడు నాకు వీడ్కోలివ్వగా, నన్ను సాగనంపడానికని అతని కూతురు నాతో కూడా బండీ వరకూ వచ్చింది. వీధి గుమ్మంలో నేను ఆగి, వీడ్కోలు జ్ఞాప

కార్థం ఒక్క ముద్దు ఇవ్వమని నేనామెను వేడుకున్నాను. ఆమె అందుకు అంగీకరించింది...

''ఈ చుంబన నేను మొదలిడిన నాట నుండి,''

ఈ వ్యాసంగం వ్యవహారంలో కొంత అనుభవం గడించాననే చెప్పాలి; అయి తేనేమి, ఇంతలా ఆనందదాయకమై నా హృదయంపై శాశ్వత ముద్రవైచిన స్మృతి అనుభూతి ఇంకొకటి నాకు జ్ఞప్తి లేదనే చెప్పాలి...

ఇది జరిగి ఎన్నో సంవత్సరాలు గడచిపోయిన తరువాత, ఆ రోడ్డు మీదనే, ఆ మజిలీ మీదుగానే నేను మళ్లీ మరొకసారి ప్రయాణం చేయ డం సందర్భపడింది. ముసలి మజిలీ గుమాస్తా కుమార్తె నాకు జ్ఞప్తికి వచ్చి, ఆమెను తిరిగి కలుసుకొన గల్గుదును కదా అని ఎంతో సంతోషించాను. బహుశ మజిలీ గుమాస్తా ముసలి వృద్ధు అయిపోయి మరొక వూరికి వెళ్లి పోయుంటాడేమో, దూన్యకి ఎనాడో వివాహమైపోయుంటుందేమో అని మళ్లీ అనుకున్నాను.

ఈ ఒక్క ఆలోచనే గాదు, ఒకవేళ తండ్రిగానీ, కూతురుగానీ కాలం చేసి వుండవచ్చునేమో అని కూడా అనుకుని, దానితో మనసు చాలా కలత చెంది, ఇంకా మరే ఉపద్రవమైనా జరిగి వుంటుందో ఏమిటో అని వ్యసన పడుతూ ఆ మజిలీస్టేషను సమీపించాను... ఆ చిన్న మజిలీస్టేషనుకు ఎదురుగా గుర్రపుబండి ఆగింది.

బండి దిగి ఇంట్లో అడుగు పెట్టేసరికల్లా, ''కొరగాని కొడుకు'' కథను వర్ణించుతూన్న చిత్రపటాలను వెంటనే గుర్తుపట్టాను; బల్ల, మంచము వాటి పూర్వస్థలంలోనే వున్నాయి; కాని వెనుకటిలాగున కిటికీ

గుమ్మంలో మాత్రం పువ్వులు లేవు; చుట్టుపక్కల అంతా చీకిరిబాకిరి గానూ శిథిలావస్థలోనూ వుంటూ శ్రద్ధ తీసుకునే వాళ్లెవ్వరూ లేరన్న విషయాన్ని చెప్పకనే చెబుతూంది. గదిలోకి వెళ్లేటప్పటికి ఆ మజిలీ గుమాస్తా గొర్రెబొచ్చు కంబళీ కప్పుకొని ఒక మూల కునుకుతున్నాడు; నేను రావడం విని అతడు మేల్కొని, లేచి నిలబడ్డాడు.

అతడు నిజంగా సిమెయొన్ వీరిన్ అని నేను మొదట నమ్మలేకపోయాను — మనిషికి ఎంత ముసలితనం వచ్చేసిందో! నాకు తాజా అంచె గుర్రాలు కావాలని నేను ఇచ్చిన పురమాయింపును అతడు నమోదు చేసుకుంటూండగా, అతని నెరసిన తల, ఎన్నాళ్లనుండో క్షురకర్మ ఎరగని అతని గడ్డము, లోతుగా నెరియలువారి ముడుతలు పడివున్న ముఖము, వంగిపోయిన నడుము, వీటన్నిటినీ కనిపెట్టడానికి నాకు అవకాశం దొరికి, వెనుక అంత బలంగానూ నడివయస్సులోనూ వుండిన మనిషి, మూడు నాల్గేళ్లల్లోనే ఇంత బలహీనపడిపోయి ఇంత వార్ధక్యం వచ్చేయడానికి కారణమేమై వుంటుందో అని ఆశ్చర్యపడుతూ ఆ వృత్తాంతం తెలుసుకొనేదాకా నాకు ఇక వుండబట్టక:

"నేనెవరినో మరచిపోయావుటయ్యా? మనం పాత స్నేహితులం!" అన్నాను నేను.

"అయితే అయుండొచ్చు" అన్నాడతడు ముఖం చిట్లించుతూ, "ఇదొక పెద్ద ట్రంకురోడ్డు, ఎందరో ప్రయాణికులు వస్తూ పోతూంటారు, ఎందరో నాదగ్గర బసచేస్తారు — లెక్కా పద్దా?"

"నీ కూతురు దూన్య కులాసావేకదా?" అని నేను మళ్లీ అడిగాను, ముసలి గుమాస్తా కనుబొమలు ముడిపెడుతూ:

2*

''ఏమో? ఆ భగవంతునికే తెలియాలి!'' అనేశాడు.

''పెళ్లి అయిపోయి వెళ్లిపోందనిటయ్యా అలా అంటున్నావ్?'' అన్నాను నేను.

నా మాటలు తనకు వినబడనట్టుగా నేను తీసుకొచ్చిన ఫర్మానా కాగితం గొణుగుతూ చదువుకుంటూ కూచున్నాడు.

ఇక నేను ప్రశ్నించడం మానివేసి, టీ పురమాయించాను. అసలు ఏమి జరిగి వుంటుందో అన్న జిజ్ఞాస నన్ను బాధించసాగింది. నా పాత స్నేహితుడు ఆ విధంగా నోటికి తాళం వేసుకుని కూచుని వుండడం చూచి, 'పంచ్' మద్యం కొంత గొంతుకలో పడితే నాలుక కొంతవరకూ ఆడుతుందేమో అని ఆశించాను.

నేను ఆశించినట్టే జరిగింది కూడానూ. నేను అందిచ్చిన పానీయాన్ని అతడు వద్దనలేదు. మొదటి గళాసు 'రమ్'తో అతగాడి చిరాకు కొంతవరకూ మాయమైంది, రెండవ గళాసుతో అతగాడి నోరు విడి ఇక బాతాఖాని లోకి దిగాడు; మరి నిజంగా అతగాడికి జ్ఞాపకం వుందో లేదో గాని, నన్ను జ్ఞాపకం వున్నట్టే మాటాడడం మొదలుపెట్టాడు. ఆనాడు నన్ను అతితీవ్రంగా కలతపెట్టి నా ఊహాశక్తికి పని కల్పించినట్టి వృత్తాంతమంతనూ అతని మాటల ప్రవాహంలో నేనప్పుడు తెలుసుకున్నాను.

''నా కూతురు దూన్యను మీరు ఎరుగుదు నంటున్నారు, కదూ?'' అంటూ అతడు చెప్పడం ప్రారంభించాడు. ''అవును, దానిని ఎరగని వారెవరున్నారు గనుక! అయ్యో, దూన్య, దూన్య! ఎటువంటి పిల్ల అండీ! అహాహా! ఇక్కడకు వచ్చేపోయే వారందరిలోనూ దానిని చూచి మెచ్చుకొనని వారు ఒక్కరు లేరు కదా! ఇంతమందిలోనూ ఒక్కరైనా దానిని గురించి ఒక్క పల్లె

త్తు మాటైనా అనలేదుకదా! ఎవరైనా ఘరానా స్త్రీలు వచ్చారంటే — చిన్న రుమాలు అనో, జత లోలక్కులనో — ఏదో వస్తువు ఒకటి దానికి ఇవ్వకుండా వెళ్లేవారుకారనుకోండి. ఎవరైనా ప్రభువులు, దొడ్డవారు ఈ దారంట ప్రయాణం చేశారూ అంటే, మధ్యాహ్నం భోజనానికనో, రాత్రి ఫలహారానికనో మా యింట్లో దిగేవారు, కాని నిజంగా దూన్యను చూసేందుకు మరి కాస్సేపు అవకాశం దొరుకుతుంది కదా అనే ఉద్దేశ్యంతోనే అలా దిగేవారు. నామీద ఎంత ఆగ్రహంతో మండిపోతూన్న ప్రభువైనాసరే, అమ్మాయిని చూసీ చూడడంతో ఆ కోపమంతా ఇట్టే ఎగిరిపోయి, ఎంతో మర్యాదగా నాతో మాటాడేవారు. తమరు నమ్ముతారో నమ్మరో కానండి, మిలిటరీ వార్తాహరులు, ఫౌజు హర్కారులు అంత తొందర పనుల్లోనూ మాయింటివద్ద ఆగి దానితో ఒక అరగంటసేపైనా మాట్లాడనిదే వెళ్లేవారుకారు. ఇల్లంతా అదే చక్కబెట్టుకునేది కదా; ఊడుపులూ తుడుపులూ అన్నీ అదే చూసుకునేది కదా. అన్ని పనులూ అదే సిద్ధంచేసుకుని అదే చేసుకునేది కదా. ఇన్నిటికీ దానికి ఎక్కడ వేళవుండేదో ఎక్కడ తీరిక వుండేదో మరి! ముసలి వెధవని, దానిని చూసుకుని ముచ్చట పడిపోయేవాడిని. నాపంచప్రాణాలూ దానిమీదే వుండేవి, కంటిపాపలా దానిని చూసుకునేవాడిని! నా ప్రాణం కంటెనూ నా పిల్లనే హెచ్చుగా చూసుకుని, నెత్తిమీద పెట్టుకునేవాడినే! దానికి ఏంలోటొచ్చింది గనుక, ఎంతో హాయిగా వెళ్లిపోయేవే దాని రోజులు? అయితేనేం, నొసట రాసిన రాత తప్పుతుందా, చెప్పండి? ఎంత రాసివుంటే అంతా అనుభవించాల్సిందే మరి!''

ఆలా అంటూ, తన కడుపులో వున్న బాధంతా ఇక పూసగుచ్చినట్టు చెప్పుకుపోయాడు. ఆలా హాయిగా రోజులు గడచిపోతూండగా, మూడేళ్ల

కిందట శీతకారులో ఒకనాడు సాయంకాలం తాను కూచుని కొత్త రిజిష్టరు బుక్కుకి రూళ్లు గీసుకుంటూ, కూతురు తెరచాటున కూచుని కొత్త గౌనొకటి తనకోసమని కుట్టుకుంటూ వుండగా, మూడుగుర్రాల బండి ఒకటి వచ్చి మజిలీస్టేషను గుమ్మంలో ఆగింది. సర్కేషియన్ టోపీ పెట్టుకుని, మిలిటరీ ఓవర్‌కోటు వేసుకుని, పెద్ద శాలువ కప్పుకుని బండి దిగి, సరాసరి గదిలోకి వచ్చి, అంచె గుర్రాలు కావాలన్నాడు. నా దగ్గరున్న గుర్రాలన్నీ అద్దెలకు వెళ్లిపాయాయి, సాలలో ఒక్క గుర్రమైనా లేదాయె. ఆ మాటే నేను చెప్పే సరికి, ఇకేముంది — గొంతు చించుకుని, కోసక్కు కమిచీ పైకెత్తాడు. సరిగ్గా ఆ క్షణంలో — ఇలాటి ఉదంతాలకు అది అలవాటుపడి వుండడం చేత — దూన్య గదిలోకి వచ్చి, ఆ బాటసారిని చూచి, ఆయన చాలా బడలిక పడ్డట్టున్నారనీ, సేదతీరడానికి ఏదైనా కాస్త తీసుకుని రమ్మంటారా? — అనీ ఎంతో మృదువుగా అడిగింది.

దూన్యని చూడడంతోనే, ఆమె చక్కదనం అందరిపైనా మామూలుగా ఎటువంటి ప్రభావం కలిగించుతుందో సరిగా ఆ ప్రభావమే కలిగించింది. ఆ ప్రయాణికుడి ఆగ్రహం అమాంతం అదృశ్యమైపోయింది; అంచె గుర్రాలు తిరిగి వచ్చేవరకూ ఆగేందుకు తనకేవీ అభ్యంతరం లేదనీ, ఆ రాత్రికి మా యింట్లోనే భోజనం చేస్తాననీ చెప్పి, భోజనం పురమాయించాడు. మంచులో తడిసిపోయిన ఆ కుచ్చు టోపీ తీసివేసి, తాను కప్పుకుని వున్న శాలువను తీసి ఒక పక్కను వుంచి, పైన వేసుకున్న ఓవర్‌కోటును తీసి గిరవాటేసేసరికి అప్పుడు అతడి నిజవిగ్రహం కనబడింది. మనిషి సన్నంగా వున్నాడు, ఉక్కుచువ్వలాంటి శరీరం, స్ఫురద్రూపి, యువకుడు, హుజార్ రెజిమెంటులో ఆఫీసరు, నల్లని మీసం. ఇక ఆపాళంగా అతడు ఉత్తరక్షణంలో

మజిలీ గుమాస్తాతో మంచి దోస్తీగా వుండి, అతడితోనూ అతడి కూతురు తోనూ కులాసాగా కబుర్లు చెబుతూ కూచున్నాడు.

సరే, రాత్రి భోజనం వడ్డించడం, భోజనం చేయడం – అంతా పూర్తి అయింది. ఇంతట్లో అంచెలవీూద వెళ్లిన గుర్రాలు తిరిగి వచ్చేశాయి. ఆ ప్రయాణికుడికి ఎక్కడ ఆలస్యమైపోతుందో అని చెప్పి మజిలీ గుమాస్తా, గుర్రాలకు మళ్లీ దాణా పెట్టించకుండానే వాటిని అతడి బండికి కట్టించేసి, ప్రయాణానికి అంతా సిద్ధం చేసి, ఆ సంగతి తెలియజేసేందుకు గదిలోకి వచ్చేసరికి, ఆ యువకుడు ఇంచుమించు వొంటిపై స్పృహ లేకుండా బెంచి బల్లమీూద పడిపోయున్నాడు. ఏమి జబ్బుచేసిందో ఏమిటో అని అడిగేసరికి, తనకు హఠాత్తుగా ముఖం ఝుమాలుమందనీ, తల బద్దలైపోయేటంతగా పోటు పెడుతూందనీ, ఇక ప్రయాణం సాగించే స్థితిలో లేననీ అతడు చెప్పాడు... ఇక ఏమి చేయడం? సరే, చేసేదేమీూ లేదని చెప్పి, తన మంచం పైనే అతడిని పడుకోబెట్టి, మరునాడు ఉదయానికి నయం కాని పక్ష మందు పొరుగూరిలో వున్న వైద్యుడిని పిలిపించుదామని అనుకున్నాడు మజిలీ గుమాస్తా.

మరుచటినాడు ఉదయాన ఆ హుజార్ ఆఫీసరు పరిస్థితి మరింత విషమించింది. పొరుగూరిలో వున్న వైద్యుడివి తీసుకువచ్చేందుకని అతడి నౌకరు గుర్రంమీూద వెళ్లాడు. దూన్య సిరకాలో తడిపిన రుమాలుతో అతడి తలకు వాసిన కట్టి, అతనికి ఉపచారం చేస్తూ, అతని మంచం పక్కనే సూదీ దారమూ తెచ్చుకుని ఏదో కుట్టుకుంటూ కూచుంది: అతని దగ్గర మజిలీ గుమాస్తా వున్నంత సేపూ ఆ జబ్బుమనిషి ఒక్కటే మూలుగు మూలుగుతూ, మాటా మంతీ లేకుండా ఆలా పడుకునే వుండేవాడు; అయితేనేమి,

అంత జబ్బుతోనూ రెండు గళాసులు కాఫీ కాళీచేసి, అపసోపాలు పడుతూనే మధ్యాహ్నపు భోజనం పురపూయించాడు. జబ్బుమనిషి మంచం దగ్గరనుండి దూన్య ఒక్క క్షణమైనా కదలకుండా, అతడికి హమేషా ఉపచారం చేస్తూ, పాపం అక్కడే అంటిపెట్టుకుని వుండిపోయింది. గొంతుక ఎండి పోతూందనీ, ఏదైన గొంతుకలో పొయ్యమనీ నిమిషం నిమిషానికీ రోగి ఆమెను బతిమాలుకునేవాడు. శీతలోపచారం చేస్తూన్న దూన్య, పాపం లిమొనేడు తయారుచేసి, గళాసులో పోసి తీసుకొచ్చి అతనికి ఇచ్చేది. జబ్బుమనిషి లిమొనేడు కాస్త తాగి, ఆమెకు గళాసు తిరిగి ఇచ్చివేసేటప్పుడు, తన కృత జ్ఞతను తెలిపేందుకని తన బలహీనమైన చేతితో ఆమె చేతిని తాకేవాడు.

మధ్యాహ్నానికి వైద్యుడు వచ్చాడు. వైద్యుడు రోగిచేయి చూచి, రోగితో జర్మను భాషలోనూ రష్యను భాషలోనూ ఏదో చెప్పి తరువాత, అతడికి ముఖ్యంగా విశ్రాంతి అవసరమనీ, మరి రెండు రోజులలో ప్రయాణం తిరిగి సాగించగల్గుతాడనీ బోధపరచి చెప్పాడు. ఆ హుజార్ ఆఫీసరు, తనను వచ్చి చూచినందుకు పారితోషికం కింద పాతిక రూబుళ్లు వైద్యుని చేతిలో పెట్టి, వైద్యుడిని తనతో కూడా మధ్యాహ్నపు భోజనానికి ఆహ్వానించాడు. ఆ ఆహ్వా నాన్ని వైద్యుడు అంగీకరించాడు. రోగీ వైద్యుడూ ఇద్దరూ కలిసి సుష్టుగా భోజనం ఆరగించి, ఒక సీసా ద్రాక్షసారాయి సేవించి, ఉభయలూ పరస్పరం అతి సంతుష్టి చెంది, ఒకరినుండి ఒకరు సెలవుతీసుకున్నారు; వైద్యుడు వెళ్లిపోయాడు.

మరొక రోజు గడచింది. మరునాడు హుజార్ ఆఫీసరు పూర్తిగా ఆరోగ్యం కోలుకున్నాడు. ఆనాడతడు మామూలు కంటెనూ మరింత ఉల్లా సంగా వుండి, ఒకసారి దూన్యతోనూ ఒకసారి మజిలీ గుమాస్తాతోనూ నవ్వు

తాలు మాటలాడుతూ, పాటలు పాడుతూ, ప్రయాణికులతో బాతాఖానీ కొడుతూ, తాజా అంచె గుర్రాలకని వారు ఇచ్చిన ఆర్డర్లను మజిలీ గుమాస్తా పుస్తకంలో తానే నమోదుచేస్తూ, మజిలీ గుమాస్తాను ఎంతగా మంచి చేసుకున్నాడంటే, ఇక మూడవ రోజున ఆ ఆఫీసరు వెళ్లిపోయేటప్పుడు అయ్యో, ప్రేమాస్పదుడైన తన అతిథి వెళ్లిపోతున్నాడే అని అతనిని వదిలిపెట్టలేక మజిలీ గుమాస్తా ఎంతగానో వాపోయాడు.

ఆరోజు ఆదివారం. దూన్య చర్చికి వెళ్లేందుకని ముస్తాబైంది. హుజార్ ఆఫీసరు బండీ బయల్దేరడానికి సిద్ధంగా గుమ్మంలో నిలబడి వుంది. అంతకు ముందే అతడు తన బసకూ తన భోజనవసతికీ అయిన ఖర్చువెచ్చాలకు గాను మజిలీ గమాస్తాకు అతి ఉదారంగా ముట్టజెప్పి, తాను బయలుదేరే సమయం ఆసన్నమైనందున గుమాస్తాకు వీడ్కోలు చెప్పి, దూన్య దగ్గర సెలవు తీసుకున్నాడు. ఆమె చర్చికి వెళ్లేందుకు సిద్ధంగా వుండడం చూచి, చర్చి వూరి పొలిమేరను వుండడం కారణంగా, ఆమెకు అభ్యంతరం లేనియెడల తన బండిలో ఆమెను చర్చివద్ద దిగబెట్టుతానన్నాడు. దూన్య మాత్రం కొంత అనుమాన పడుతూ ఏమీ ప్రత్యుత్తర మివ్వకుండా నిలబడిపోయింది...

"ఎందుకలా భయపడుతున్నావే?" అన్నాడు తండ్రి కూతురును చూసి. "శ్రీవారు తోడేలనుకున్నావా? ఆయన నిన్నేమీ మింగేయరులే, ఆయనతో కూడా చర్చివరకూ వెళ్ళు, మరేమీ ఫరవా లేదులే."

దూన్య బండి ఎక్కి హుజార్ ఆఫీసరు పక్కను కూచుంది; ఆఫీసరుగారి నౌకరు కోచిమేనుపెట్టె మీదకెక్కి కూచున్నాడు; కోచిమేను ఈల వేశాడు; వాయువేగమనోవేగంతో పరుగెత్తాయి గుర్రాలు.

బండి వెళ్లిన మరో గడియకల్లా దూన్యని ఆ హుజార్ ఆఫీసరుతో ఎలా వెళ్లనిచ్చాను, అంత ఎలా కళ్లు మూసుకున్నాను, తనకు అంత ఎలా మతి పోయింది? — అని అనుకుని వూరికే దురపిల్లాడు, పాపం ఆ మజిలీ గుమాస్తా. ఒక అరగంట అయిందో లేనేలేదో — అతని మనస్సు పీక్కుతినడం మొదలుపెట్టింది. ఇక మనస్సులో ఆ గాభరా ఆందోళనా ఎంత తీవ్రమై పోయాయంటే, మరి భరించ శక్యంగాక, తానే స్వయంగా చర్చికి బయల్దేరాడు.

అతడు చర్చి చేరుకునే సరికి, చర్చిలో ఉపాసన, ప్రార్థనలూ అయిపోయి అందరూ ఇళ్లకు వెళ్లిపోతూన్నారు, కాని వాళ్లలో దూన్య మాత్రం అతనికి కనబడలేదు. ఆదరా బాదరా చర్చి లోపలికి వెళ్లాడు; మతగురువు వేదిక వెనుకనుండి వస్తూ, అతడికి ఎదురయాడు; అర్చకుడు ఒక్కటొక్కటే దీపాలు ఆర్పేస్తున్నాడు; వృద్ధస్త్రీలు ఇద్దరు ఒక మూల కూచుని ఇంకా ప్రార్థన చేసుకుంటున్నారు; చర్చి అంతా వెతికేశాడు, కాని దూన్య మాత్రం అతనికి ఎక్కడా కనబడలేదు. ఉపాసన సమయానికి దూన్య చర్చికి వచ్చిందా, మీరు ఆమెను చూశారా అని పూజారిని అడుగుదామా అని తటపటాయించాడు కాని, ఇక ఉండబట్టక అడిగేశాడు. ఆమె ఎక్కడా తన కంటబడలేదే అని పూజారి జబాబిచ్చాడు. ఇక చేసేదేమీ లేక, పాపం ఆ మజిలీ గుమాస్తా ఇంటికి చేరుకున్నాడే గాని, మనిషి మనిషేకాడు, జీవచ్ఛవమే. కాని అతనికింకా ఒక్క ఆశ మాత్రం మిగిలిపోయింది: ఎగువ మజిలీ వూళ్లో దూన్య అభిమాన మాత వుంటూండడంచేత, మరేమీ ఫరవా లేదులే ఇంతట్లో ఏ కొంపా మునిగిపోదని కుర్రతరహా దుందుడుకుతనంతో, బాధ్యత ఎరగకుండా ఆ ఆఫీసరుతో కూడా బండిలో కూచుని పొరుగూరికి వెళ్లివుంటుందనీ, తిరుగు అంచె బగ్గీలో మళ్లీ ఇంటికి వచ్చేస్తుంది కదా అనీ గుండె

నిబ్బరం చేసుకున్నాడు. ఆమె ఏ బండిలో ఆ ఆఫీసరుతో ఇంటినుండి వెళ్లిందో ఆ బండి తిరిగి ఇంటికి వచ్చేవరకూ మనస్సులో చిత్రవధ అనుభవించుతూ, తీవ్ర ఉద్విగ్న స్థితిలో అలా పడిగాపులు కాచుకుని కూచున్నాడు. ఆ బండివాడు ఇంతకీ రాడాయె అంతకీ రాడాయె. చిట్టచివరకి చీకటిపడే వేళకి ఆ బండివాడు బండి తోలుకుంటూ ఇల్లు చేరుకున్నాడు. మనిషి తప్ప తాగి కైపెక్కి వున్నాడు. పక్క మజిలీకే వెళ్లిందికదా, మరి దూన్య ఏది?. — అని అతడిని మజిలీ గుమాస్తా అడిగే సరికి: ''పక్క మజిలీ లేదు, దూన్యా లేదు; ఆ హుజార్ ఆఫీసరుతో లేచిపోయింది దూన్య'' అని ఘోరవార్తను బయట పెట్టాడు బండివాడు.

ఆ దెబ్బకు ఇక తట్టుకోలేక, ఏ మంచంలోనైతే ఆ యువకుడు ఆషాఢభూతి క్రితం రాత్రి పరున్నాడో ఆ మంచంలోనే కూలబడ్డాడు పాపం ఆ మజిలీ గుమాస్తా. జరిగిన సంగతుల నన్నింటినీ అతడు మరొకసారి ఆచి తూచి పరిశీలించగా, ఆ యువకుడి రోగం మాయరోగమనీ, అదంతా ఒక దొంగ వేషమనీ అర్థమైపోయిందతనికి. ఇక దానితో పాపం ఆ ముసలతనకి పెద్దగా జ్వరం వచ్చేసింది; అతనిని పొరుగూరికి తీసుకెళ్లి, వైద్యుడికి చూపించారు; అతని స్థానే తాత్కాలికంగా మరొక మజిలీ గుమాస్తాను నియమించారు. వెనుక ఆ హుజార్ ఆఫీసరుని జబ్బులో చూసిన వైద్యుడే ఇప్పుడు కూడా ఇతనిని చూశాడు. ఆ యువడికి ఏ రోగమూ రొష్టూ లేదనీ, టింగురంగడిలా ఆరోగ్యంగానే వున్నాడనీ, ఆ యువకుడిని చూచీ చూడడంతోనే అతడేదో కుతంత్రం పన్నాడన్న విషయం తాను గ్రహించాననీ, కాని అతడి కోసక్కు కమిచీని చూచి హడలిపోయి, నోరు మూసుకున్నాననీ ఆ వైద్యుడు చెప్పాడు. ఆ జర్మన్ వైద్యుడు నిజమే పలికాడో, లేక తన సూక్ష్మదృష్టిని

గురించి ప్రగల్భాలు చాటుకుందుకే అలా చెప్పాడో మనకి తెలియదుగాని, అతని మాటలు మాత్రం పాపం ఆ మంచంపట్టిన రోగికి మాత్రం ఏ మాత్రమూ ఉపశమనం కల్గించలేకపోయాయి. ఏమైతేనేమి, మజిలీ గుమాస్తా కాస్త కోలుకున్న తరువాత, పొరుగూరిలో వున్న తన పై అధికారితో చెప్పకుని రెండు నెలలు సెలవు పుచ్చుకుని, తన మనస్సులో వున్న ఉద్దేశం రెండో మనిషికి తెలియకుండా, తన కూతురిని వెదుక్కుంటూ కాలినడకని దేశాటనం బయల్దేరాడు.

అశ్విక రెజిమెంటు కెప్టెన్ మీన్‌స్కి స్మొలేన్‌స్క్ నగరం నుండి పీటర్స్‌బర్గ్ పట్నానికి బయల్దేరినట్లు తాను తన రిజిస్టరులో నమోదు చేసుకున్న పత్రాలనుండి మజిలీ గుమాస్తా తెలుసుకున్నాడు. ఆ ప్రయాణంలో కెప్టెన్ మీన్‌స్కి ఏ గుర్రపుబండి ఎక్కి వెళ్లాడో ఆ బండి కోచిమేనుని భోగట్టా కనుక్కొనేగా, దూన్య తాను ఇచ్ఛికంగానే ఆ కెప్టెన్‌తో ప్రయాణం చేసేందుకు సమ్మతించినట్టే కనబడినా, దారికడవరకూ ఆమె కంట తడి పెట్టుకుంటూనే వుంది అని ఆ కోచిమేను చెప్పాడు.

"దారి తప్పిన పసికూన, పాపం నన్ను చూడగానే తప్పకుండా నా వెంట ఇంటికి వచ్చేస్తుంది!" అని అనుకున్నాడు మజిలీ గుమాస్తా.

ఈలాగు ఆలోచించుకుంటూ అతడు పీటర్స్‌బర్గ్ చేరుకున్నాడు. ఆ పట్నంలో ఇజ్‌మైలొవ్‌స్కి బారకాసులో వెనుకటి రోజుల్లో తనతో కూడా సేనలో నిర్బంధ సైనికుడిగా చేరి, ఇప్పుడు సార్జెంటుగా పని చేస్తూన్న తన ప్రాణస్నేహితుని దగ్గర బసచేసి, ఇక తన అన్వేషణ ప్రారంభించాడు. అన్వేషణ ప్రారంభించిన కొద్ది కాలానికే, మీన్‌స్కి వాస్తవంగా పీటర్స్‌బర్గ్‌లోనే వుంటూన్నట్టూ, దెమూత్ హొటేలులో బస

చేసినట్లు మజిలీ గుమాస్తా తెలుసుకుని, అతడిని ముఖాముఖి కలుసు కొనడానికే నిశ్చయించుకున్నాడు.

అతడు మరునాడు ఉదయాన్నే మీన్స్కి బసచేస్తూన్న హొటేలు చేరుకుని, హాలుకి ముందున్న వసారాలోకి వెళ్ళి, అక్కడున్న నౌకరు కుర్ర వానితో తానొక మాజీ సైనికుడననీ ఘనతవహించిన శ్రీవారి దర్శనార్థం వచ్చాననీ, ఆ విధంగా ఆయనతో మనవిచేయమనీ చెప్పాడు. బూడ్సు జోళ్ళకు రంగేస్తూన్న ఆ కుర్రవాడు, తన యజమానిగారు ఇంకా నిద్ర నుండి లేవలేదనీ, ఏమైనాసరే పదకొండు గంటలకు ముందు ఎవ్వరినీ లోప లకు పంపించేందుకు వీలుపడదనీ చెప్పేశాడు. సరే అనిచెప్పి, మజిలీ గుమాస్తా వెళ్ళిపోయి, సరిగ్గా ఆ చెప్పిన వేళకల్లా మళ్ళీ వచ్చాడు. పడక దుస్తు ల్లోనూ, ఇంట్లో వున్నప్పుడు పెట్టుకునే ఎరుపురంగు కుళ్ళాయితోనూ మీన్స్కి తన గదిలోనుండి హాల్లోకి వచ్చాడు.

''ఏంహోయ్, ఏంపనిమీద వచ్చావ్?'' అని అడిగాడు మీన్స్కి.

ముసలతని గుండెలు దడదడ కొట్టుకొనసాగాయి, కళ్ళు చెమ్మ గిలాయి. ఎంతో కష్టంమీద, గద్గదస్వరంతో:

''ఆ భగవంతుని పుణ్యముండేను, ఘనతవహించిన శ్రీవారు నామీద కటాక్షం వహించి...'' అంటూ చెప్పకొనబోయాడు.

అతనికేసి మీన్స్కి కరకుగా చూసి, ముఖం జేవురించుకుని, ముసలతని చేయిపట్టుకుని, తన గదిలోకి తీసుకునివెళ్ళి, తలుపు మూసివేశాడు.

''ఘనతవహించిన శ్రీవారికి తెలియనిదేముంది?'' అంటూ ముసల తను ప్రాధేయపడ్డాడు. ''కిందపడిన వస్తువు పోయినట్టే లెక్క; అయితే

నేమి, నా కూతురిని నాకు ఇప్పించేయండి, బాబూ! తమరివల్ల అది ఏలాగూ పాడైంది, ఉత్త పుణ్యానికి దానిని నాశనం చేయకండి, బాబూ!''

''జరిగినదానికి వగచి లాభంలేదు'' అన్నాడు ఆ యువకుడు తత్తర పాటుతో. ''నేను నీకు చాలా అన్యాయమే చేశానని ఒప్పుకుంటున్నాను. నన్ను క్షమించమని వేడుకుంటున్నాను కూడా. కాని అంత మాత్రాన దున్యను పంపించివేస్తానని మాత్రం అనుకోకు. ఆమె ఎంతో సౌఖ్యపడుతుంది, ఎంతో అదృష్టవంతురాలవుతుంది, నామాట నమ్ము. నీకేమైనా కావలిస్తే, ప్రతి ఫలం ముట్టజెప్పమంటే చెప్పు. ఆమె నన్ను ప్రేమించుతూంది, వెను కటి అలవాట్లూ, వెనుకటి పనిపాటులూ అన్నీ ఆమె మరచిపోయింది. అయితే ఒకటి — జరిగినదానిని మరచిపోవడం — ఆమె తరమూ కాదు, నీ తరమూ కాదు.''

ఆలా అనేసి, ముసలతని చొక్కాయచేతిలో ఏదో దోపేసి, తలుపు తెరచాడు. ఆతరువాత ఏమి జరిగినదీ ముసలతనికే తెలియదు; కాని ఉత్తర క్షణంలో చూచుకునే సరికల్లా తాను నడివీధిలో వున్నట్టు గ్రహించుకు న్నాడు.

నిశ్చేష్టుడై కొంతసేపు ఆలా నడివీధిలో నిలబడిపోయాడు ముస లాడు. అప్పుడు తెలివితెచ్చుకుని చూసుకునే సరికల్లా, చొక్కాయచేతిలో కాగితాలకట్ట వుందని బోధపడిందతనికి. చొక్కాయచేతిలోనుండి ఆ కాగి తాలకట్టను వూడదీసి చూచుకొనేటప్పటికల్లా — ఐదు రూబుళ్ల నోట్లు కట్టికట్ట వున్నాయి. ఆ డబ్బునంతటినీ చూచే సరికి అతని నేత్రాలనుండి అశ్రుకణాలు రాలాయి — ఆగ్రహపూరితములైన అశ్రుకణాలు. ఆ నోట్లను

నలిపేసి నేలమీద కొట్టేసి కాలిమడమతో నేలలోకి మట్టేసి, అక్కడనుండి వెళ్లిపోయాడు...

నాలుగు అడుగులు ముందుకు వేసి, మళ్లీ అక్కడ ఆగి, ఏమి ఆలో చించుకున్నాడో మరి... తిరిగి నాలుగు అడుగులు వెనక్కి వేసి తాను వెనుక నిలబడిన చోటకు వెళ్లి చూసుకునే సరికి... ఆ నోట్ల కట్ట అక్కడనుండి అప్పుడే అంతర్థానమైపోయింది. ముసలాడు తొలుత ఆ నోట్ల కట్టను నలి పేసి గిరవాటువేయడం, డాబుగా దుస్తులు వేసుకున్న పెద్దమనిషి ఒకతను చూచి, చప్పున ఆ నోట్ల పొట్లాన్ని లంకించుకుని, దారిని పోతూన్న గుఱ్ఱపు బగ్గీలోనికి హుటాహుటిని దుముకి కూచుని, "తొందరగా పోనీ, తొందరగా పోనీ!" అని బండివాడిని కేకవేశాడు.

ముసలతను ఇదంతా చూస్తూనే వున్నప్పటికీ, బండివెంట మాత్రం పరుగెత్తలేదు. అందుకు బదులు తిరిగి ఇంటికి వెళ్లిపోవడానికే నిశ్చయించు కున్నాడు. కాని తాను ఇంటికి వెళ్లిపోయేముందు మాత్రం, పాపం ఆ నిర్భాగ్యురాలు తన కూతురిని ఒక్కసారి చూచి మరీ వెళ్లిపోదామని అనుకు న్నాడు. ఆలా అనుకుని, మరి రెండు రోజులైన తరువాత, మీన్స్కి బసకి వెళ్లాడు; కాని అక్కడున్న నౌకరు కుఱ్ఱవాడు, తన యజమాని దర్శనం దొరకదని కసురుకుంటూ చెప్పి, ముసలతనిని వసారాలోనుండి బయటకు గెంటేసి, అతని ముఖం మీదనే తలుపు మూసివేసి బిడాయించేశాడు. పాపం ముసలతడు ఆ బస ఎదుట నిలబడి నిలబడి మరేమీ లాభంలేక తనదారిని తాను వెళ్లిపోయాడు.

ఆరోజు సాయంకాలం ఉపాసన వేళకు ముసలి మజిలీ గుమాస్తా "సర్వ బాధా వేధితుని" చర్చికి వెళ్లి, తిరుగు దారిలో లితెయ్న్నీ వీధి దాటు

తూండగా, గుర్రపుబగ్గీ ఒకటి అతని పక్కనుండే వెళ్లింది. అప్రయత్నంగా ఆ బండికేసి చూచేసరికి అందులో కూచునున్న వ్యక్తి మీన్స్కి అని గుర్తు పట్టాడు. ఆ గుర్రపుబగ్గీ ఒక మూడంతస్తుల మేడ ఎదుట ఆగింది. బండిలోనుండి ఆ హుజార్ రెజిమెంటు ఆఫీసరు దిగి చెంగున మెట్లెక్కి ఇంట్లోకి వెళ్లిపోయాడు. అదంతా కనిపెట్టుతూనే వున్న మజిలీ గుమాస్తాకి తటాలున ఒక ఆలోచన తట్టింది. అతడు ఆ బండిని సమీపించి, కోచిమేను దగ్గరకెళ్లి:

"ఈ గుర్రం మీన్స్కిగారిది కాదటయ్యా?" అని కోచిమేనుని ప్రశ్నించాడు.

"అవును, మీన్స్కిగారిదే. ఎందుకలా అడుగుతున్నావ్?" అని కోచి మేను బదులు ప్రశ్నించాడు.

"ఏమీ లేదూ; ఒక చిన్న విషయం. మీ యజమానిగారు నాకొక చీటి ఇచ్చి, అతడి దూన్యకి ఇవ్వమని చెప్పి, ఆమె ఇల్లు ఎక్కడుందో చిరు నామా చెప్పాడు, కాని తీరా ఇప్పుడు నేను దానిని మరచిపోయాను."

"ఆమె ఈ ఇంట్లోనే రెండవ అంతస్తులో బస. ఇప్పుడు నువ్వా చీటి ఆమెకివ్వాల్సిన అవసరమే తీరిపోయిందిలే. ఆయనగారే ఇప్పుడిక్కడికి వేం చేశారు."

"పోనీలే. నువ్వు మంచివాడివి, ఆ భోగట్టా ఏదో చెప్పావు. నేను చేయా ల్సిందేదో చేస్తానులే."

ఆలా అంటూనే అతడు మేడమెట్లెక్కి, ఇంట్లోకి వెళ్లాడు.

తలుపు వేసి వుండడం చూసి, అతడు గంటకొట్టాడు. అతి ఆత్రంతో ఆగాడు. కొంతసేపటికి తాళం తీస్తూన్నట్టు చప్పుడై, మరొక

క్షణానికి దాసి ఒకామె తలుపు తీసింది. ''అవ్‌దోత్య సెమ్యొనొవ్‌న ఇల్లు ఇదే కదూ?'' అని అడిగాడు ముసలతను.

''అవును ఇదే! ఏమి, ఎందుకాలా అడుగుతున్నావు?'' అని అడిగింది ఆ దాసీమనిషి.

ముసలతను జబాబు చెప్పకుండా తటాలున వసారా గదిలోకి చొర బడ్డాడు.

''లోపలికి వెళ్లుతున్నావేమిటయ్యా? అలా వెళ్లకూడదు! అవ్‌దోత్య సెమ్యొనొవ్‌న ఇప్పుడెవరితోనో మాట్లాడుతున్నారు. ఇప్పుడామెను చుడ్డానికి వీల్లే దయ్యా!'' అని ఆ దాసి కేక వేసింది.

ఆ కేక వినిపించుకోకుండానే, మజిలీ గుమాస్తా ఆ ఇంట్లో ప్రవే శించాడు. ముందు గదులు రెండూ చీకటిగా వున్నాయి. మూడవ గది వెలుగ్గా వుంది, తలుపు తెరచి వుంది. గది గుమ్మం దగ్గరకు వెళ్లి, అతడు అక్కడ నిలబడిపోయాడు. అమూల్యమైన వస్తువులతో అలంకరించి వున్న ఆ గదిలో ఏదో ఆలోచనలో మునిగి కూచున్నాడు మీన్‌స్కి. సరికొత్త ఫాషన్‌లో తీర్చి దిద్దిన విలువైన దుస్తులు ధరించి, ఇంగ్లీషు స్వారిజీనుపై కూచున్నట్టుగా, చేతులున్న మెత్తాల కుర్చీలో కూచుని వుంది దూన్య. ఆమె మీన్‌స్కి పక్కనే కూచుని, అతనికేసి తన ముఖం పైకెత్తి ప్రేమ వీక్షణములు ప్రస రించుతూ, అమూల్యమైన వుంగరాలతో మెరసిపోతూన్న తన వేళ్లతో అతని నల్లని ముంగురులను మెలిపెడుతూంది. తన కూతురు ఇంత అందంగా వుండడం పాపం ఆ మజిలీ గుమాస్తా ఇదివరకెన్నడూ చూడలేదు! ఆమెను చూచి ఆశ్చర్య చకితుడై ఆలా నిలబడిపోయాడు.

''ఎవరక్కడ?'' అంది ఆమె, తలయెత్తి చూడకుండానే. మజిలీ గుమాస్తా బదులు చెప్పకుండా వూరుకున్నాడు.

తన ప్రశ్నకు జబాబు రాకపోవడం కారణంగా, ఆమె తలయెత్తి చూచి, కెవ్వుమని ఒక్క కేకవేసి మూర్ఛిల్లి కిందపడిపోయింది.

ఆమె కిందపడిపోవడం చూచి, మీన్స్కి తుళ్లిపడి, చప్పున ఆమెను నేలపైనుండి లేవదీయబోయాడు. కాని ఆమెను లేవనెత్తడంలో గుమ్మంలో నిలుచుని వున్న మజిలీ గుమాస్తా అతని కంటబడ్డాడు. ముసలతనిని చూచీ చూడడంతో మీన్స్కి ఆమెను అక్కడ వదలిపెట్టి, పళ్లు పటపట కొరుకుతూ కోపంతో మండిపడిపోతూన్న గొంతుతో అతనిమీద విరుచుకుపడ్డాడు:

''నిన్ను ఎవడు రమ్మన్నాడిక్కడికి? బందిపోటు దొంగను వెంట తరిమినట్టు నన్నిలా వెంట తరుముతున్నావేమిటి? నన్ను చంపేస్తావా? వెళ్లు ఇక్కడనుండి!''

ఆలా కేకవేసి కండలు తిరిగి వున్న చేతులతో అమాంతంగా ఆ ముసలతని మెడ పట్టుకుని మేడమెట్లపైనుండి కిందకు ఒక్క తోపు తోశాడు.

పాపం ఆ ముసలాడు కాళ్లీడ్చుకుంటూ తన బసకు వెళ్లిపోయాడు. అతడి స్నేహితుడు సలహా చెప్పాడు కోర్టులో ఫిర్యాదు దాఖలు చేయమని, కాని ముసలతను ఒక గడియ ఆలోచించుకొని, అబ్బే వద్దు అని చేయి వూపి, ఇటుపైన ఇక ఎట్టి చర్య సహితమూ తీసుకొన కూడదనే నిశ్చయించుకొన్నాడు. మరి రెండు రోజులు తరువాత మజిలీ గుమాస్తా పీటర్స్‌బర్గ్ నుండి వెళ్లిపోయి, తన స్వగ్రామం చేరుకుని, తిరిగి తన పనిలో చేరాడు.

"దూన్య నన్ను వదలిపెట్టి వెళ్లిపోయి ఇది మూడవ సంవత్సరం; నాటినుండి నేటి వరకూ దానిని నేను చూడనూ లేదు, అది ఎక్కడుందో కూడా నాకు తెలియనూ తెలియదు. బతికేవుందో, చచ్చిపోయిందో మరి ఆ భగవంతునికే ఎరుక! ఏమిటో — మనం అనుకుని ఆశ్చర్యపడుతాంగాని — ప్రపంచంలో అన్నీ జరుగుతూనే వుంటాయి. ఏ దారంట పోయే దానయ్యా హాయల్లోనో తగుల్కొని, నాలుగు రోజులు వాడు వుంచుకుని, వాడికి దాని అవసరం తీరిపోయి, ఇంట్లోనుండి గెంటేసిన తరువాత, వూరి మీద బతకాల్సి వచ్చిన ఆడది — ఇది మొదటిదీ కాదు, ఆఖరిదీ కాదు. ఈవేళ చీనీచీనాంబరాలు కట్టి వొంటినిండా నగలు దగేసుకుని అందలం ఎక్కి వూరేగి, రేపు చిప్ప చేతబుచ్చుకుని అడ్డమైన వాళ్లతోనూ కలిసి ముష్టెత్తుకు తిరగాల్సి వస్తుందని తెలుసుకోలేని వెర్రిపిల్లలు నేడెందరో వున్నారు పీటర్స్‌బర్గ్‌లో. వీళ్లందరిలాగానే నాకూతురు దూన్య కూడా శుభ్రంగా చెడిపోయి నాశనమైపోతుందేమో కదా అని నాకు అనిపించినప్పుడల్లా, అయ్యో ఆలా అనుకోవడం ఎంత పాపమో కదా, దాని చావుతోనే ఈ పాపానికి ప్రాయశ్చిత్తం అవుతుందే అని అప్రయత్నంగా అనుకుంటూంటాను."

ఇదీ నా మిత్రుడు ముసలి మజిలీ గుమాస్తా కథ — కంటివెంట బొట బొట కారుతూన్న కన్నీళ్లను, దీమిత్రియెవ్ కూర్చిన చక్కని పాటలో తెరెంతిచ్ లాగానే, తన అంగరకా అంచులతో చిత్రోపంగా తుడుచుకుందుకు అప్పటప్పట ఆగిపోతూ ఆగిపోతూ చెప్పిన కథ. కొంతవరకూ ఈ కన్నీళ్ళు 'పంచ్' మద్యం — కథ చెబుతూన్నంత సేపూ ఐదు గళాసులు సేవించా డనుకోండి — ఫూటుకు రాలినవే; అయితేనేంగాక ఆ కన్నీళ్లు మాత్రం

నా మనస్సును ప్రగాఢంగా కదలించివేశాయి. నేను అతనికి వీడ్కోలు చెప్పి వెళ్లిపోయిన ఎంత కాలానికోగాని, ఆ ముసలి మజిలీ గుమాస్తాని మరచి పోలేక పోయాను. కాగా ఇంకా సుదీర్ఘకాలమూ నా స్మృతిపథంలో నిల్చిపోయింది పాపం దూన్య కథ...

కొద్దిరోజులక్రితం ఆ వూరు మీదుగా నేను ప్రయాణం చేయడం తటస్థించగా, నా స్నేహితుని వృత్తాంతం జ్ఞాపకం వచ్చింది. మునుపు అతడు గుమాస్తాగా పనిచేసిన మజిలీ స్టేషను ఇప్పుడు ఎత్తివేయబడిందని నాతో ఎవరో చెప్పారు. ఆ ముసలి మజిలీ గుమాస్తా ఇంకా బతికే వున్నాడా అని నేను ప్రశ్నించగా అందుకు సరైన సమాధానం రాలేదు. నాకు సుపరి చితమైన ఆ స్థలాన్ని మళ్లీ చూదామని నిశ్చయించుకొని, గుర్రపుబండి ఒకటి అద్దెకు మాట్లాడుకుని ఆ గ్రామానికి బయల్దేరాను.

అది శరత్తు. ధూసరవర్ణపు మేఘాలు ఆకాశాన్ని ఆవరించాయి. చల్లని గాలి వీస్తూ వీస్తూ తన దారికి అడ్డుగా నిల్చిన చెట్లనుండి ఆకు లను తెంచివేసి పంట కోతలు కోసిన పొలాల మీదుగా వాటిని ఎగరవేసు కుంటూ పోతూంది. సూర్యాస్తమం అయే వేళకు ఆ గ్రామం చేరుకుని, ఆ చిన్న మజిలీ స్టేషను దగ్గర బండి దిగాను.

నేను ఆ ఇల్లు తలుపు కొట్టేటప్పటికల్లా వలంగా వున్న ఒకామె తలుపు తీసి — వెనుక ఏ గుమ్మంలోనైతే పాపం ఆ నిర్భాగ్యురాలు దూన్యను నేను ముద్దుపెట్టుకున్నానో ఆ గుమ్మంలో ప్రత్యక్షమై, నేనడిగిన ప్రశ్నకు జబాబు చెబుతూ, ముసలి గుమాస్తా చనిపోయాడనీ, అతడు చనిపోయి అప్పుడే సంవత్సరమైందనీ, ఇప్పుడా ఇంట్లో ఒక 'బీర్' ఫ్యాక్టరీ వుందనీ, తానా ఫ్యాక్టరీ యజమాని భార్యననీ చెప్పింది. ఇంత దూరం ప్రయాణం

చేసి రావడం వ్యర్థమే అయిందనీ, ఏడు రూబుళ్లు అనవసరంగా ఖర్చు చేశానే అనీ నాకు విచారం కలిగింది.

"పాపం ఏం జబ్బుచేసి చనిపోయాడు?" అని అడిగాను, ఆ 'బీర్' ఫ్యాక్టరీ యజమానురాలి భార్యను.

"తాగుడు జాస్తీ అయి" అందామె నా ప్రశ్నకు ప్రత్యుత్తరమిస్తూ.

"అతడి సమాధి ఎక్కడుంది?" అని అడిగాను.

"ఆ కంచె వెనకాతల, అతడి భార్య సమాధి పక్కనే" అని చెప్పిందామె.

"ఆ సమాధిని నాకెవరేనా చూపించి పెడతారా?"

"అయ్యో, దానికేమొచ్చె! ఒరే, అబ్బాయీ, వాంక! ఆ పిల్లిని కాల్చు కుతినక, దాన్నక్కడ పడేసి, ఈయనకి మజిలీ గుమాస్తా సమాధి చూపించి రా, తెలిసిందా?"

ఆమె పిలుపు అందుకుని, ఎర్రని చింపిరి జుట్టుతో చీకిరి బాకిరిగా వున్న ఒంటికంటి కుర్రవాడొకడు నాకేసి పరుగున వచ్చి, నన్ను చర్చి వాటి కకు తీసుకెళ్లాడు.

"చచ్చిపోయిన ఆయనను నీకు తెలుసునా ఏమిటి?" అని తోవలో నేనా అబ్బాయిని అడిగాను.

"ఏం, తెలియకపోవడమేమి? నాకు బాగా తెలుసే! కర్ర గొట్టాలతో ఈలలు చేయడమోలాగో ఆయనే నేర్పాడు నాకు. పానశాలనుండి ఆయన వస్తూండేటప్పుడు ఎన్నిసార్లు నేనాయనను పిల్చి, 'మామయ్యా, మామయ్యా! హేజెల్ పిక్కలు రెండివ్వవూ?' అని అడగలేదు. అడిగినప్పుడల్లా రెండు పిక్కలు పారేసేవాడు. మాతో ఎప్పుడూ ఆటలాడేవాడు కూడానూ."

"అతనిని ఇంకా జ్ఞాపకం వుంచుకున్న ప్రయాణికులు ఎవరేనా ఇక్కడకు వస్తూంటారా?"

"అబ్బే! ఇటు పక్క ఎప్పుడో ఒకప్పుడుగాని, తరుచు ఎవ్వరూ రానే రారు. అప్పుడప్పుడు మాత్రం ఇటుపక్కకి వచ్చినప్పుడు ఇక్కడకు కూడా ఒక సారి వస్తూంటాడు ఇన్‌స్పెక్టరు. అయితే ఏం, చచ్చిపోయినవాళ్ళ గురించి అతనేమీ పట్టించుకోడు. కిందటి ఎండకాలంలో మాత్రం గొప్ప ఇంటి ఆవిడె ఒకామె ఇక్కడికనే ప్రత్యేకంగా ప్రయాణం కట్టుకునివచ్చి, మజిలీ గుమాస్తా గురించి వాకబు చేసి, ఆయన సమాధిని చూసి వెళ్ళింది."

"గొప్ప ఇంటి ఆమె అంటున్నావు, ఎవరామె?" అని అడిగాను జిజ్ఞాసతో.

"అతి అందమైన ఆవిడె అంటే నమ్మండి" అంటూ ఆ కుర్రవాడు చెప్పుకుపోయాడు. "ఆమె సొంత గుర్రపు బగ్గీ మీద మూడు జతలు గుర్రాలు కట్టుకొచ్చిందండీ, ఏ మనుకున్నారోగాని! ఆమెతో కూడా, ఆమె కొడుకులు చిన్నబ్బాయిలు ముగ్గురూ, ఆయా ఒక్కర్తీ, నల్లని బుచ్చికుక్కపిల్ల ఒకటీనీ. ముసలి మజిలీ గుమాస్తా గురించి ఆమె వాకబు చేయగా, అయన ఏనాడో చనిపోయాడని చెప్పేసరికి, ఆమెకు ఏడుపు వచ్చేసి, ఆ అబ్బాయిలతో: 'బాబులూ, మీరిక్కడ బుద్ధిగా కూచోండి, నేను చర్చికి వెళ్ళొస్తాను' అని చెప్పింది. చర్చి వాటిక ఎక్కడుందో నేను మీకు చూపిస్తాను అన్నాను నేనామెతో. 'అవసరంలేదు, నాయనా, దోవ నాకు తెలుసులే' అంటూ, ఐదుకోపెక్కుల కాసు ఒకటి ఇచ్చింది నాకు. అబ్బా, ఎంత మంచి ఆమె అండీ!" —

చర్చి వాటికకు వెళ్లాం. చుట్టూ ప్రహరీ గోడ లేనేలేదు, ఎంత బావురుమంటూ వుండాలో అంత బావురుమంటూనూ వుంది; ఎటు చూసినా వున్నాయి కొయ్య శిలువలు, అడవిలాగ — అంతేగాని వాటికి నీడ ఇచ్చేందుకు ఒక్క చెట్టు అయినా లేదు. చర్చి వాటికలను ఎన్నింటినో చూశానుగాని, ఇంత ఏడుపొస్తూన్నది నేనెక్కడా చూడలేదు.

''ఇదీ ముసలి గుమాస్తా సమాధి'' అంటూ చిన్న మంటి దిబ్బ ఒకదానిపై చెంగున గెంతాడు. ఆ దిబ్బమీద నల్లని శిలువ ఒకటుంది, శిలువ మీద రాగిరేకు బొమ్మ ఒకటుంది.

''ఈ సమాధిని ఆమె చూసిందా?'' అని అడిగాను ఆ అబ్బాయిని.

''ఆ, చూసిందే!'' అన్నాడు వాంక. ''ఆమెను నేను దూరంనుండి చూస్తూనే వున్నాను. ఆమె సమాధి ఎదుట మోకాళ్లమీద పడి, అలానే వుండిపోయింది ఎంతో సేపటిదాకా. తరువాత ఆమె వూళ్లోకి వచ్చి, మత గురువుని చూసి, ఆయనతో మాట్లాడి, ఆయనకి కొంత డబ్బు ఇచ్చి, తరువాత బండెక్కి వెళ్లిపోయింది; నాకూ ఇచ్చిందిగా ఐదుకోపెక్కుల కాసు! ఎంత ఉదారితనమండీ ఆమెది!''

నేనూ ఇచ్చాను ఆ కుర్రవాడికి ఐదుకోపెక్కుల కాసు. అంత దూరం ప్రయాణంచేసి వచ్చాననిగాని, ఏడు రూబుళ్లు ఖర్చు పెట్టాననిగాని నేనెంత మాత్రమూ విచారించలేదు.



ఒకానొక గవర్నమెంటు డిపార్టుమెంటులో... ఫలానా డిపార్టుమెంటులో అని పేరుపెట్టి చెప్పడం అంత మంచిదికాదు లెండి. ఈ ప్రపంచంలో వున్న రకరకాల వస్తువులన్నిటిలోనూ డిపార్టుమెంటులూ, రెజిమెంట్లూ, ఆఫీసులూ — వీటంతటి ముక్కోపులూ ఉడుకుబోతులూ అవేగాని మరిలేవు — ఆమాటకొస్తే గవర్నమెంటు సంస్థ ఏదైనా సరే అంతే. ఇక ఈ రోజుల్లో ప్రతి మనిషీ కూడా తనకు వ్యక్తిగతంగా జరిగిన ప్రతి అవమానమూ సంఘానికంతకూ జరిగిన అవమానమనే భావిస్తాడు. ఈ మధ్యనే

ఒకానొక వూళ్లో — ఆ వూరి పేరేదో నాకిప్పుడు జ్ఞాపకంలేదు — ఒకానొక పోలీసు సూపరింటెండెంటు గవర్నమెంటుకు విజ్ఞాపన పంపించుకుంటూ, ప్రభుత్వపు ఫర్మానాలన్నా హుకుములన్నా ప్రజలలో భయభక్తులు పూర్తిగా నశించిపోతున్నాయనీ, చివరకు ప్రజలు మరీ బరితెగిపోయి తన పవిత్రనామం సహితమూ అతినిర్లక్ష్యంగా ఉచ్చరిస్తున్నారనీ మెర పెట్టుకున్నాడనీ, అందుకు దాఖలాగా, అధమం ఏదో ఒక పోలీసు సూపరింటెండెటు పాత్రను, అది కూడా ఒళ్లెరగకుండా తప్పతాగిన స్థితిలో చిత్రించబడిన పాత్రను, ప్రతి పది పుటలకూ ఒకసారైనా తీసుకొస్తూన్న ఉత్కృష్ట కాల్పనిక నవల ఒకదానిని తన విజ్ఞాపనతో జతపరిచాడనీ అందరూ చెప్పుకుంటున్నారు. ఈ కారణంచేత అనవసరమైన చిక్కులూ చికాకులూ ఎట్టివీ కలగకుండా ఉండేందుకని సదరహీ డిపార్టుమెంటును "ఒకానొక డిపార్టుమెంటు" అని ఉదాహరించడమే ఉత్తమం.

కాగా ఒకానొక డిపార్టుమెంటులో ఒకానొక ఉద్యోగి పనిచేస్తూండేవాడు; అతడిగురించి ఘనంగా చెప్పతగ్గ విషయం ఏదైనా వుందేమోనని వెతకుదామా అంటే ఏదీ కనబడదు — కాస్త పొట్టి మనిషి, ముఖంమీద కాసిన్ని మశూచికపు మచ్చలు, కాసంత ఎరుపువాగు జుట్టు, కాస్త దృష్టిలోపం, అప్పుడే నుదుట కాసంతమేర ప్రారంభించిన బట్టతల, రెండు చెంపల మీదనూ అవుపడుతూన్న ముడుతలు, తోపురంగు ముఖమూ... ఇంతకీ ఎవరి నేమని అనగలం గనుక! ఎవరినైనా అంటే, సెంట్ పీటర్స్‌బర్గ్ గాలినే అనాలి. అతడి హోదా గురించి చెప్పాలంటే (మనలో అన్నిటికంటే ముందు మనిషి హోదా చెప్పి, తరువాత మనిషి పేరు చెప్పాలికదా మరి) — మాట

వరసకు శాశ్వతపు నామకా సలహాదార్ల గుమాస్తాల* — ఏ కులమూ ఏ హోదా అయితే, అందరకూ తెలిసినట్టుగా, తమ మీద పదిరాళ్ళు విసిరితే తాము ఒక రాయనైనా విసరే స్థితిలోలేని వాళ్ళకులమూ హోదా — తమను తనవి తీరా వెక్కిరించి అపహాస్యం పాల్జేసే శ్లాఘాపాత్రమైన అభ్యాసానికి అల వాటుపడిన నానాగోత్ర రచయితల రాతకూ గురిఅయినట్టి కులమూ హోదా — ఇతగానిది. ఈ ఉద్యోగి ఇంటిపేరు బష్మాచ్‌కిన్. బష్మాక్ అంటే చెప్పు జోడు గనుక ఆ వస్తువునుండే ఈపేరు వచ్చిందని ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది; అయితే ఏ కాలమందు, ఏయే పరిస్థితులలో ఆ పదంనుండి ఈ నామం ఉద్భవించిందో మాత్రం ఇంతవరకూ ఎవ్వరకూ ఏమీ తెలియదు. అతని తాత, అతని తండ్రి, అతని బావగారు, ఆ మాటకొస్తే బష్మాచ్‌కిన్‌లు అం దరూ కాళ్లకు బూడ్సు తొడుక్కునే నడిచేవారు, ఏటా సరిగ్గా ముమ్మారూ తమ బూడ్సుల అడుగు అట్టలు అరిగిపోతే మళ్లీ కొత్తవి వేయించుకునే వారు. అతడి పేరు అకాకి; తండ్రివల్ల వచ్చిన పేరు అకాకియెవిచ్. ఇదే మిటి, ఇలాంటి చిత్రమైన పేరు, దేశమంతా గాలించినా దొరకని పేరు ఇతనికి పెట్టడం ఏలా సంభవించిందని పాఠకుడు కొంత ఆశ్చర్య పడవచ్చు. లోకం మీద ఎన్నో పేర్లు వుండగా, అచ్చంగా ఈ పేరే ఎంచి పెట్టడం ఎలా జరి గిందో, ఏయే పరిస్థితులలో సంభవించిందో అన్ని విషయాలూ మేం కనుక్కున్నా మనే అతడు పూర్తిగా నమ్మవచ్చు. అసలు ఆ సంగతి ఇలా జరిగింది:

---

* అనగా గవర్నమెంటు ఆఫీసు ఉద్యోగులలో వున్న పద్నాల్గు కులాలలోనూ తొమ్మిదవ కులం. — అనువాదకుడు.

అకాకి అకాకియెవిచ్ మార్చి 23న, నాకు జ్ఞాపకం వున్నంత వరకూ, ఆరోజు రాత్రి అనుకుంటాను, జన్మించాడు. కీర్తిశేషురాలైన అతని తల్లి, గవర్న మెంటు ఉద్యోగి భార్య, ఉత్తమ ఇల్లాలు, శిశువుకు క్రిస్టియను మతసం ప్రదాయం ప్రకారం నామకరణ సంస్కారం జరిపించడానికి అన్ని యేర్పాట్లూ చేసింది. గదిలోపల గదిగుమ్మానికి ఎదురుగా వున్న పురిటిమంచం మీాదనుండి ఆమె ఇంకా లేచి తిరగడమే లేదు. ఆమె మంచానికి కుడిచేతి వైపున, శిశువు అభిమాన పితరుడూ బహుయోగ్యుడూ సుప్రీమ్‌కోర్టు హెడ్‌గుమాస్తా ఇవాన్ ఇవానొవిచ్ ఎరోష్కిన్ నిలబడ్డాడు. ఎడమ చేతివైపున నిలబడి వుంది శిశువు అభిమానమాత, టౌన్ సర్కిల్ పోలీసు ఇన్‌స్పెక్టరుగారి భార్య, పెద్దముత్తైదువు అరీన సెమ్యోనొవ్‌న బెలొబ్ర్యుష్కొవ. శిశువు నామధేయానికని వారు మూడు పేర్లను బాలెంతరాలికి సూచించి, అందులో ఆమెకు నచ్చిన పేరు ఎంచుకోమన్నారు. ఆ మూడు పేర్లూ ఇవి: మోక్కియ్ అనే పేరైనా సరే, సోస్సియ్ అనే పేరైనా సరే, లేదంటే దైవభక్తుడూ పరమత్యాగమూర్తి అమరజీవీ అయిన హొజ్‌దజాత్ అనే పేరైనా సరే. ఈ మూడు పేర్లూ విని: ''అబ్బే, ఈ పేర్లన్నీ అదేమిటోలా వున్నాయి'' అని కీర్తిశేషురాలు ఆ శిశువు తల్లి పెదవి విరిచేసింది. సరే తల్లి ఇష్టమే కాని మ్మనిచెప్పి, పంచాంగాన్ని యాదృచ్ఛికంగా ఇంకొక పుట దగ్గర విప్పి, ఆ పుటలో ఏ పేర్లు చెప్పబడి వున్నాయో చూశారు. ఆ పుటలో: త్రిఫీలి, దూల, వరహాసి అనే మూడు పేర్లున్నాయి. ఈ మూడింటిలోనూ ఏదో ఒక పేరు ఎంచుకోమన్నారు ఆమెను. ''అబ్బా, ఇదేం ఖర్మ బాబూ! వెనక టివే ఏమిటో అదోలాగ వున్నాయనుకుంటే, వాటిని మించి వున్నాయి ఇవి! ఇటువంటి పేర్లు నేనెప్పుడూ వినేలేదు. పోనీ, వరదాత్ అనే పేరో, లేకుంటే

వారుహ్ అనేపేరో వస్తుందేమో అనుకుంటే, త్రిఫీలి అనీ, వరహాసి అనీ ఇవే రావాలా?'' అంది ఆ ముసలి ఇల్లాలు. పోనీ అనిచెప్పి, మళ్లీ మరొక సారి పంచాంగం తిరగేసి మరొక పుట దగ్గర విప్పిచూశారు. ఆ పుటలో పప్సికాహి, వహ్తాసి అని రెండు పేర్లున్నాయి. ''చూడగా, పిల్లాడి ఖర్మ ఇంత ఈలా వుంటే నేనేం జేస్తాను?'' అని వాపోయింది ఆ ముసలి ఇల్లాలు. ''వాడి ఖర్మ అంతలా వున్నప్పుడు అకాకి అని తండ్రిపేరు పెడితేనే తీరి పోయె!'' అందామె. ఈ విధంగా పిల్లాడికి అకాకి అకాకియెవిచ్ అని పెట్టారు. నామకరణ సంస్కార సమయమం అంతసేపూ కూడా పిల్లాడు గుక్కతిప్ప కుండా ఒకటే ఏడుపు యేడుస్తూ, ముఖం ఎంత అష్టవంకర్లుగా పెట్టా డంటే, మీదటికి తాను శాశ్వతపు నామకా సలహాదారు గుమాస్తా ఉద్యో గినవుతానని ఆ పిల్లాడికి అప్పుడే ముందుగానే భవిష్యత్ జ్ఞానం కలిగిందా ఏమిటి చెప్మా అని అనిపిస్తూంటుంది ఇప్పుడు.

సరి ఇదంతా ఈ విధంగా జరిగింది. ఈ విధంగా తప్ప అన్యథా జరి గేందుకు అసలు అవకాశమే లేకుండెననీ, ఆ పిల్లవానికి ఈ పేరుతప్ప మరొక పేరుపెట్టే అవకాశమే లేకపోయిందనీ పాఠకునికి విదితమవడానికనే ఇదంతా ఇంత సవివరంగా చెప్పకొచ్చాం.

ఏనాడు ఏ మహూర్తాన గవర్నమెంటు డిపార్టుమెంటులో అతడు ప్రవేశించాడో, అతడికా ఉద్యోగం ఎవరిచ్చారో ఇప్పుడెవ్వరికీ జ్ఞాపకంలేదు — అదంతా ఏనాడో కాలగర్భంలో కలిసిపోయింది. ఆ డిపార్టుమెంటులో అతడు పనిచేసిన కాలమంతటిలోనూ ఎంతోమంది డైరెక్టర్లు, ఎందరెందరో మేనేజర్లు, ఇంకా ఎందరెందరో సిరస్తాదార్లు మారారు: అతడు మాత్రం అచ్చంగా ఆ స్థలంలోనే వున్నాడు, అచ్చంగా ఆ జీతభత్యంలోనే వున్నాడు,

అచ్చంగా ఆ హోదాలోనే వున్నాడు, అచ్చంగా అదే ఉద్యోగంలో స్థిరోభనా అని అచ్చంగా ఎప్పటిలాగానే ఉత్తరాలకీ, కాగితాలకీ, దస్తావేజులకీ నకళ్లు రాసే కాపీయిస్టుగానే వున్నాడు. అతడు పుట్టినప్పుడే ఈ గుమాస్తా ఉద్యోగ చిహ్నమైన యూనిఫారం పొడుగుకోటూ, నడినెత్తిమీద బట్టతలా, వీటితోసహా అంతా తయారుగా సిద్ధమయే, ఈ గుమాస్తాగిరీ ఉద్యోగం కోసమనే అవతారమెత్తాడు కాబోలుననే కాలక్రమేణా అందరూ నిజంగానే అనుకునేవారు. డిపార్టుమెంటులో ఎవ్వరూ కూడా అతనంటే పిసరంత గౌరవమైనా చూపేవారుకారు. బంట్రోతులకు అతడు ఎదురుపడినప్పుడు వాళ్లు సహా ఎక్కడ కూచున్నవాళ్లు అక్కడే కూచుని వుండిపోయేవారేగాని, లేవనైనా లేచేవారుకారు సరికదా, అతనికేసి కన్నెత్తి చూడనైనా చూసేవారు కారు — అక్కడికా హాల్లోనుండి ఏ ఈగో దోమో ఎగిరి వెళ్లిపోయినట్టు, అతనంటే అంత లోకువ కట్టేవారు. సిరస్తదార్లు అతనిని ఎందుకూ కొరగానట్టుగా అదొక మోస్తరు దాస్టికపు తిరస్కారభావంతో చూసే వారు. ఏ అసిస్టెంటు హెడ్‌గుమాస్తావో కాగితం ఒకటి పట్టుకొని అతని దగ్గరకు వచ్చి: ''దీనికొక నకలు తయారుచేసిపెట్టండి!'' అనో లేకుంటే, ''ఇదొక తమాషా కేసయ్యా!'' అనో ఏదో మంచిమాట ఒకటి పారేసి పనులు చేయించుకునే ప్రతి మర్యాదగల ఆఫీసులోనూ వుండే సంప్రదాయాన్నయినా పాటించకుండా, పాపం అతడు బుర్రవొంచి రాసుకుంటున్నా సరే లెక్క చేయకుండా, ఆ తెచ్చిన కాగితాన్ని అతని ముఖం మీదే గిరవాటేసి వెళ్లిపోయే వాడు. ఆ కాగితాన్ని తెచ్చిన మనిషి ఎవడో, అసలా మనిషికి ఆ కాగితాన్ని తన ముందు పడవేయడానికి అధికారం వుందా లేదా అని కన్నెత్తి చూడనైనా చూడకుండా, అతడా కాగితంకేసి మాత్రమే చూస్తూ, దానిని తీసుకునే

వాడు. ఇక ఆ కాగితాన్ని తీసుకున్న తడవుగా దానికి నకలు రాసేయడానికి సిద్ధపడిపోయేవాడు. కుర్రకారు గుమాస్తాగాళ్లందరూ అతనికి తాటాకులు కట్టుతూ, ఉద్యోగుల్లో కుర్రరకంవాళ్లు మామూలుగా చేసే నానా వేళాకోళాలు చేస్తూ అతనిని హింసపెడుతూండేవారు. అతని ఎదుటే అతనిమీదనూ, అతడు గదితీసుకుని అద్దెకున్న ఇంటి యజమానురాలు, డెబ్బయ్యోపడి దాటిన ముసలామె మీదనూ లేనిపోని కథలన్నీ కల్పించి వెటకారాలాడేవారు. ఆ ముసలామె అతనిని పట్టుకొని ఛడా మడా బాదుతుందనో లేకుంటే, ఆమెకూ నీకూ ఎప్పుడు పెళ్లి అని ప్రశ్నించో హాస్యాలాడేవారు. అతని నెత్తిమీద కాగితపు ముక్కలు జల్లి, మంచు పడుతూందని వెక్కిరించేవారు. అకాకి అకాకియెవిచ్ మాత్రం, తనను ఇన్ని వేళాకోళాలూ చేస్తున్నా కూడా, తన ఎదుట మనుషులెవ్వరూ లేనట్టే కిమ్మనకుండా తన పని చేసుకుంటూ కూచునేవాడు. ఆమాటకొస్తే తన పనికి ఇవేమీ అడ్డమే వచ్చేవికావు. ఇన్ని చికాకులలోనూ ఇన్ని అల్లర్లలో సహితమూ తాను తయారుచేసే నకళ్లలో ఒక్క పొరపాటైనా దొర్లకుండా రాసేవాడు. ఇక ఆ వేళాకోళాలూ వెక్కిరింతలూ మరీ శ్రుతి మించి రాగాన పడి భరించ శక్యం గాకపోతేనూ, తన చేయి పట్టుకుని కదిపించి తన పనికి అంతరాయం కలిగించితేనూ: "నన్ను చంపకండి బాబూ! నన్నెందుకిల్లా కాల్చుకు తింటారు నాయనా?" అని మాత్రం అనేవాడు, అంతే. ఆ మాటలు అనడంలోనూ, అతని మాటలూ అతని కంఠమూ అదొకమోస్తరుగా ధ్వనించేవి. వాటిలో ఎంత దైన్యం వ్యక్తమయేదంటే, ఒకసారి అప్పుడే కొత్తగా గుమాస్తా ఉద్యోగంలో ప్రవేశించిన యువకుడొకడు, కడమ గుమాస్తాలను చూసి తాను కూడా అతనిని వెటకారమాడడం మొదలుపెట్టగా, ఆ

మాటలు ఆ యువకుని గుండెల్లోకి ములుకుల్లా దూసుకునిపోయి, ఇక ఆ క్షణంనుండి ఆ యువకుడు పూర్తిగా మారిపోయి, తన కళ్లముందున్న ప్రతివిషయాన్నీ ఒక నూతనదృష్టితో చూడసాగాడు. తనలో వున్న అపూర్వ మైన శక్తి ఏదో ఒకటి, సభ్యతగలవారనీ లౌక్యులనీ తానంతవరకూ అను కున్న తనతోటివారినుండి తనను గుంజేసి తనను విడదీసేసినట్టు అతనికి అనిపించింది. ఇలాగు జరిగిన ఎంతో కాలంవరకూ కూడా ఈ యువకుడు తాను మంచి సరదాగా వున్న సమయాల్లో, నుదుటిమీద బట్టతల చిన్నెలు కనబడుతూ పొట్టిగావున్న ఆ గుమాస్తా విగ్రహం అతని కళ్ల ఎదుట అవు పడి, దైన్యంతో కుంగిపోయిన ఆ దీనాలాపనే అతని చెవిలో వినిపించేది: ''నన్ను చంపకండి బాబూ! నన్నెందుకిల్లా కాల్చుకు తింటారు నాయనా?'' నికృష్ట దైన్యంతో సంతృప్తమైయ్యున్న ఆ మాటల్లో: ''నేనూ నీ సోద రుడనేసుమా'' అని కొత్త మాటలు కొన్ని ధ్వనించేవి. పాపం ఆ యువ కుడి స్మృతిపథంలో ఆ దృశ్యం ప్రత్యక్షమవగానే, అతడు ముఖాన్ని చేతుల్లో పెట్టేసుకుని, ఎంతో పశ్చాత్తాపపడుతూ, అయ్యో, మనిషిలో ఎంత అమా నుషం వుందోకదా, ఎంతో నాగరికులలోనూ సంస్కృతీపరులలోనే కాకుండా, ఓరి దేవుడా, ఎంతో సచ్ఛీలురనీ గౌరవనీయులనీ ప్రపంచంయొక్క మన్న నలను పొందేవారి హృదయాల్లో సహితమూ ఎంతటి భయానకమైన మొరటుతనం దాగుని వుంటూందో కదా అని తల్చుకుని అతని వొళ్లు గడగడ వణకిపోయేది...

కంచుకాగడలు పెట్టి ప్రపంచమంతా వెతకినా, ఇతని మోస్త రుగా తన పనిలో మునిగిపోయి, తన పనికోసమే తన జీవితాన్నంతనూ అంకితం చేసినట్టి మనిషి ఇంకొకడు మనకి కనబడదు. తన పనిని అత

డెంతో దీక్షతో చేస్తాడని మనం చెప్పినంత మాత్రాన చాలదు — అబ్బే, అతని పనే అతని జీవితసర్వస్వం అని చెబితే కొంతవరకూ సరిపోతుందేమో. ప్రపంచంలో వుండే నిరంతర వైవిధ్యాన్నీ, సకల సౌందర్యాన్నీ ఆ కాపీయిస్టు పనిలోనే ఆ నకళ్లు తయారుచేసే రాతపనిలోనే అతడు దర్శించేవాడు: ఆ నకళ్లు రాస్తూన్నప్పుడు అతని ముఖంలో ఆనందపారవశ్యం తాండ విస్తూండేది. ప్రత్యేకంగా కొన్నికొన్ని అక్షరాలు రాయడమంటే అతడు చెవి కోసుకునేవాడు; వాటిని రాయడానికి అవకాశం దొరికినప్పుడల్లా ఆ సంతో షంలో ఒళ్లు మరచిపోయేవాడు: వాటిని రాసేటప్పుడు తనలో తానే నవ్వు కుంటూ, వాటిని చూసి మురిసిపోయి కన్నుగీటుతూ, మూతి తిప్పుకుంటూ, వాటికి వన్నెలు చిన్నెలు పెట్టుతూ వాటిని ముస్తాబు చేస్తూంటే, అతని కలం తీర్చిదిద్దుతూన్న ప్రతి అక్షరాన్నీ అతని ముఖం చూసే మనం చదివేయ్యొచ్చన్నమాట. అతని దీక్షకు తగినట్టూ అతనికి నిజంగా ఉద్యోగ రీత్యా ప్రతిఫలం ముట్టజెప్పివుంటే, బహుశ ఏ హుజూర్ సలహాదారు ఉద్యోగంలోనే పడి వుండేవాడే; నిజంగా అంతపనీ జరిగి వుండి అతనికా గౌరవం లభించే వుండినట్టయితే ఆశ్చర్యంతో అతడికే వెర్రెత్తిపోయుండేది. కాని, అతని పరిచయస్థులూ తోడిగుమాస్తాలూ ఛలోక్తులు విసరినట్టు, అంత దీర్ఘకాలం నౌఖరీ చేసినందుకు అతనికి ముట్టిన గౌరవమేమిటయ్యా అంటే, ఒక వెండి బిళ్లపిన్నూ, దానితోపాటు మూలవ్యాధీ. అయినప్పటికీ ఉన్నది ఉన్నట్టూ చెప్పాలికదా: అతని గురించి ఎవ్వరూ పట్టించుకోలేదని చెప్పడం సత్య దూరమే అవుతుంది. బహుయోగ్యుడైన డిపార్టుమెంటు డైరెక్టరు ఒకాయన, ఇతని దీర్ఘకాలపు నౌకరీకి తగినట్టూ ఇతనిని గౌరవించదలచి, మామూలు కాపీయిస్టు పనికంటె మరి కాస్త హుచీతోకూడుకున్న పనికి అతనిని నియ

మించుతూ హుకుం జారీచేశాడు. ఏమిటయ్యా ఆ పని అంటే, మరేం లేదు: ఇదివరకప్పుడే ఫైసలైపోయినట్టి వ్యవహారాల గురించిన నివేదికనే ఇంకొక ఆఫీసుకు పంపిస్తూ మరొక నివేదికను రాయడం. అందుకు చెయ్యాల్సిన పనంతా ఏమిటంటే: అసలు కాగితంలో మొట్టమొదటి పంక్తిలో వున్న చిరునామా పైవిలాసాన్ని మార్చి కొత్త చిరునామా పైవిలాసం రాయడమూ, కొన్ని క్రియాపదాలను ఉత్తమ పురుష నుండి ప్రథమపురుషకి మార్చి రాయడమూ. ఈ పనే అతనికి ఎంత కష్టమైపోయిందంటే, అది సగం సాధించేసరికే అతనికి వొళ్లంతా ముచ్చెమటలూ పోసిపోయి అదే పనిగా నుదురు తుడుచుకుంటూ చివరకి: "నాకీపనివద్దు బాబూ, తమ దయుంటుంది, నాకేదేనా కాగితం దయచేయిస్తే, నకలు రాసుకుంటాను!" అంటూ కాళ్లావేళ్లా పడ్డాడు. నాటినుండి నేటివరకూ అతనికి శాశ్వతంగా కాపీయిస్టు పనే దఖలుపడిపోయింది. ఈ నకళ్లు రాస్తూ కూచోవడం పని తప్పితే, ప్రపంచంలో ఇతరమైనది మరేదీ లేనట్టే అతనికుండేది. తాను తొడుక్కునే దుస్తులు గురించి అతడెన్నడూ తల్చుకొనేవాడే కాదు. అతని ఉద్యోగ చిహ్నమైన పొడుగుకోటుకు మొదట వుండిన ఆకుపచ్చరంగు ఏనాడో వెలిసిపోయి, దానికీనాడు అదొక చిత్రమైన ఎరుపు గోదుమనూక చాయ వచ్చింది. ఆ కోటు కాలరు ఎంత బిగుతుగానూ ఎంత సన్నంగానూ అయిపోయిందంటే, అసలు నిజంగా పొట్టిగానే వున్న అతని మెడ అందులోనుండి పైకితోసుకొస్తూ ఎంతో పొడుగ్గావున్నట్టు అవుపడి, రష్యనేతర జాతులవారు తాము తయారుచేసిన ఇరవై ముప్ఫై బొమ్మలను నెత్తివిూద పెట్టుకుని వీధిలో అమ్మజూపే తలకాయలాడిస్తూన్న పింగాణీ పిల్లికూనల మెడలా కానొచ్చేది. ఇక అతని కోటుకి ఎప్పుడూ ఏదో

ఒకటి — ఒక గడ్డిపరకో, ఏదో ఒక దారపు పిసరో, మరేదో మరొకటో — అంటుకునే వుండేది. ఇక వీధిలో నడుస్తూన్నప్పుడల్లా అతడికొక గొప్ప కళాకౌశలం ఒకటుండేది — ఎవరైనా ఏ ఇంటి కిటికీనుండైనా ఏచెత్తో ఏ చండాలమో రోడ్డుమీదకి గిరవాటు వేసినట్టాయెనా, సరిగ్గా ఆ సమయం కనిపెట్టి ఆ కిటికీ కిందనుంచే నడుస్తాడు. ఫలితంగా అతని టోపీమీద ఎల్లప్పుడూ ఏ కర్బూజాపండు తునకో, ఏ బొప్పాసపు తొక్కో, లేకుంటే ఇలాంటిదే మరే చెదారాన్నో అతని టోపీ ఎల్లప్పుడూ అతను ఎక్కడికి వెళ్లితే అక్కడకల్లా అతనితో కూడా రవానా చేస్తూండేది. వీధిలో ఆవలి చప టాపై నడుస్తూన్న ఫలానా మనిషి పంట్లాం కాలుపట్టీ జోడుకింద తెగి పోయుండడం ఇట్టే కనిపెట్టేసి — మరెందుకనో దానితో ఎక్కడాలేని వెకిలితనపు నవ్వొకటి వాళ్ల ముఖాలకు వచ్చేస్తుంది — తమ సూక్ష్మదృక్కు లను సుదూరంలోకి సారించుతూ తమ వేడి వాడి చూపులకు నిరంతరా యంగా పని కల్పించే తన తోడి కుర్రకారు గుమాస్తాల్లా కాకుండా, ప్రతీ రోజూ వీధిలో ఏం జరుగుతూందో, రోడ్డుమీద ఏమి తటస్థపడుతూందో ఒక్కనాడైనా అతడు పరికించిన పాపాన పోలేదు.

అసలు ఒకవేళ అతడు దేనినైనా పరికించినప్పటికీ కూడా, నీట్యైన పంక్తులలో ముత్యాల్లా కూర్చి పేర్చిన తన దస్తూరీ అక్షరాలే అతని ఎదుట ప్రత్యక్షమయ్యేవి; తన మనోవీధిలో నాట్యమాడుతూన్న ఆ అక్షరాలను చూస్తూ ఆనందించుతూండగా, తటాలున ఎక్కడనుండో వచ్చిన గుర్రం మెడ ఒకటి అతని భుజంమీద ఆనుకుని, దాని ముక్కు చెరమలనుండి వచ్చే ఝుంఝూమారుత నిశ్వాసం అతని మెడను తాకగా, అప్పుడు మాత్రమే అతనికి తన పగటి కలనుండి మెలకువవచ్చి, తాను నకలురాస్తూన్న అక్షర

పంక్తి మధ్యను తాను లేననీ, తాను రోడ్డుమధ్య నున్నాననీ అప్పుడు తెలుసుకునేవాడు.

ఆఫీసునుండి ఇంటికి చేరుకోగానే, ఉత్తరక్షణమందే అతడు బల్ల దగ్గర కూచుని తన ముందున్న కేబేజీ పులుసును గడగడమని నాలుగు గుటకల్లో జుర్రేసి, గొడ్డు మాంసపు నంజుడు నోట్లో వేసుకుని, ఉల్లిగడ్డ కొరుక్కుని, రుచీపచీ చూసుకోకుండానే, ఆ నిమిషానికి దేవుడు అక్కడ ఏ వస్తువును వుంచాడో, దోమ అయేది ఈగ అయేది, వాటన్నిటితోసహా నమిలేసి దిగమింగేసేవాడు. అలా తింటూండగా, తన పొట్ట నిండ నారంభించుతూందన్న విషయం గ్రహించి, బల్ల దగ్గరనుండి లేచిపోయి, తన సిరాబుడ్డి తెచ్చుకుని, తాను ఆఫీసునుండి తెచ్చుకున్న కాగితాలను ముందు పెట్టుకుని, వాటికి నకలు రాయడం ఇక మొదలుపెట్టేవాడు. ఒకవేళ నకలు రాయాల్సిన కాగితాలు లేకపోవడమే గనుక సందర్భించెనా, తాను వెనుక ఇదివరకప్పుడే నకలు రాసిన కాగితాల్లోనే ఏదైనా ఒక ఉత్తరం, భాషా సౌష్ఠవంలో గాకపోయినా, కేవలం ఒక నూతన వ్యక్తి సముఖానకో, లేదా ఏ ప్రఖ్యాత పురుషుని పేరనో ఆ వుత్తరం రాసివుండడం కారణంగానే, తన ఆనందం కోసమో, తన సరదా తీరడం కోసమో, పనికట్టుకుని దానికి మళ్లీ మరొకసారి ఇంకొక నకలు తయారుచేసేవాడు.

సెంట్ పీటర్స్‌బర్గ్ విభూతివర్ణపు ఆకాశమందలి వెలుగంతా అణగారిపోయిన తరువాతనూ, గవర్నమెంటు ఉద్యోగులందరూ — ఆఫీసులలో కలాల గరగర చప్పుడూ, హడావుడీ రణగణధ్వనీ సద్దుమణగి, తమ పనులనూ ఇతరుల అత్యవసర వ్యవహారాలనూ, ప్రశాంతత ఎరుగని మానవులు తమ స్వేచ్ఛాయుతా భీష్టాన్ననుసరించి తమపై వేసుకున్న కార్య

కలాపాలన్నిటినీ ముగించిన తదుపరి — తమకు ముట్టే నెలసరి జీతాలనను సరించీ, తమకు స్వాభావికములైన అభిరుచుల ప్రకారమూ వారు భోజనాలు చేసి, కడుపులు నింపుకొన్న తరువాత, ఇక ప్రతి ఉద్యోగి ఇంకా తనకు మిగిలి వున్న విశ్రాంతి గడియలను తన చిత్తానుసారం వినియోగించు కుందుకు ఆదరా బాదరా ఆరాటపడుతూన్న సమయంలో: వీరిలో మరింత ధీరుడూ శూరుడూ యోధుడూ అయిన ఒక వ్యక్తి నాటకశాలలోకి చొర బడగా; స్త్రీలు ధరించే టోపీలను పరిశీలించి వాటిపై తన తీర్పు ప్రకటించ డానికని మరొకడు వాహ్యాళికి వెడలగా; ఏ చిన్న ఉద్యోగులకో పరిమిత మైన సామాజిక బృందపు గగనసీమలో తారగా వెలుగుతూన్న ఏ అందాల బరిణనో కలుసుకొని ఆమె చెవిలో తన అభినందనలను విన్నవించడంలో తన తీరికసమయాన్ని వినియోగించుకుందుకని ఏ సాయంకాలపు సమావేశానికో ఇంకొకడు బయలుదేరగా; వేరొకడు — పదింట తొమ్మండుగురు గవర్నమెంటు గుమాస్తాల విషయంలో సర్వసాధారణంగా సంభవించేటట్టుగా — ఏ ఇంట్లోనో ఏ మూడవ అంతస్తులోనో నాల్గవ అంతస్తులోనో చిన్నగదులు రెండు అద్దెకుపుచ్చుకుని, తాను ఏదోమహా దర్జాగా కాలక్షేపం చేస్తూన్నట్టు నలుగురిచేతనూ అనిపించుకుందుకుగాను అత్యవసరపు ఖర్చులనెన్నింటినో — మధ్యాన్నంపూట భోజనం మానుకునో, విశ్రాంతికై పల్లెపట్టుకు వెళ్లడం వదలుకునో — కూడికచేసి, తోడివారందరూ చూసి మెచ్చుకుందుకని కొన్న ఏ దీపపుస్తాండునో, మరొక వస్తువును దేనినో ప్రదర్శిస్తూన్న వాటాలో కాపురంచేస్తూన్న తన అన్నదమ్ముడిని చూచేందుకు వెళ్లాడు; ఏమైతేనేమి, మొత్తంమీద గుమాస్తా ఉద్యోగస్థులందరూ తమతమ స్నేహితుల ఇళ్లకు వెళ్లి, అక్కడ ఉద్రేకంలో మునిగి డబ్బేసి చీట్లపేకాడుతూ,

మధ్యమధ్య చవుకరకం రస్కులు తింటూ గాజుగళాసుల్లో టీ సేవించుతూ పొడుగాటి పైపులను వెలిగించి పొగతాగుతూనో, చీట్లపేక కలుపుతూన్న సమయాల్లో ఫురానాఫాయాలోని కుటుంబాలను గురించి పిచ్చాపాటీ ముచ్చట్లు చెప్పుకుంటూనో — రష్యన్ అన్నవాడికల్లా ఫురానాఫాయా కుటుంబాలంటే ఎంత ప్రేమా ఎంత అనురాగమూ అంటే, మరి వాళ్ళ గురించి చెప్పుకుంటేనేగాని వాడికి ఇక క్షణమైనా కాలం వెళ్లదు — ఇక కబుర్లు చెప్పుకుందుకు ఏదీ లేకపోతే, ఫాల్కోన్ చెక్కిన శిలావిగ్రహంలోని గుర్రం తోక పొట్టిగా కత్తిరించేశారని అదేదో వూరులో వున్న కోట గవర్నరుతో ఎవరో వెళ్లి చెప్పేసరికి అతగాడు నమ్మేశాడన్న పాత హాస్యమే, ఎవ్వరకీ తెలియనట్టు అదొక కొత్తకథలా మళ్లీ చెప్పుకుంటూనో — ఏలాగైతే నేమి, రాజధానీ నగరంలో వున్న వేనవేలు గవర్నమెంటు ఉద్యోగస్థులలో ప్రతి ఉద్యోగస్థుడూ తనకు నచ్చిన విధంగా ఆడుతూ పాడుతూ కాలం వెళ్లబుచ్చుతూ వుండే సమయంలో — అకాకి అకాకియెవిచ్ మాత్రం తన తీరిక సమయాన్ని ఆడుతూ వెళ్లబుచ్చడంలేదు, పాడుతూ వెళ్లబుచ్చడం లేదు. అతగాడిని ఫలానా టీపార్టీలో చూశాననిగానీ, ఫలానా విందులో అతడు తనకు అవుపడ్డాడనిగానీ ఎవ్వడైనా ఎన్నడైనా చెప్పగా నేను వినలేదు. తాను ఇంటికి తెచ్చుకున్న ఆఫీసు కాగితాలకు తనివితీరా నకలు రాసుకున్న తరువాత, ఇక పండుకునేవాడు; ఆ పండుకునేటప్పుడు కూడా: రేపు నకళ్లు తయారు చేయమని తనకు దేవుడు ఏమేమి మంచిమంచి కాగితాలు పంపిస్తాడో కదా అని అదే ధ్యాసతో ముందుగానే తనలోతానే ఆనందంతో పొంగిపోయి నవ్వు కునేవాడు. సంవత్సరానికి నాలుగువందలు జీతంతో ఏ చీకూ చింతా లేకుండా సంతుష్టిగా కాలం వెళ్లమార్చుకోవడమెలాగో తెలిసిన ఈ మనిషి

జీవితం — శాశ్వతపు నామకా సలహాదారు ఉద్యోగే కానీయండి, హుజూరు సలహాదారు ఉద్యోగే కానీయండి, ఆంతరంగిక సలహాదారు ఉద్యోగే కానీయండి, ఆస్థాన సలహాదారు ఉద్యోగే కానీయండి, మరే సలహాదారు ఉద్యోగే కానీయండి, ఆనూటకొస్తే తననుండి ఇతరులూ ఇతరులనుండి తానూ ఎవ్విధమైన సలహా పుచ్చుకోని సలహాదారు ఉద్యోగే కానీయండి — అతగాడి జీవితాన్ని పట్టుకు వేధించుకు తినే లక్షాతొంభై కష్టనిష్ఠురాలు లేకుండా వుంటే పండుముదిమి వరకూ అతగాడి జీవితం ఏ విధంగా హాయిగా ప్రశాంతంగా గడచిపోతుందో, ఆ విధంగా ఇతగాడి జీవితమూ హాయిగా ప్రశాంతంగా గడచిపోతూంది.

సంవత్సరానికి నాలుగువందల రూబుళ్లూ, ఆ ప్రాంతంలోనూ జీతం తెచ్చుకునే వారందరికీ సెంట్ పీటర్స్‌బర్గ్‌లో పరమశత్రువు ఒకడున్నాడు. ఆ శత్రువు మరెవ్వడూ కాడు — మన ఉత్తరాదిని వీచే చలిగాలి దేవుడే. ఈ చలిగాలి వొంటికి మహా మంచిదని ఎందరు ఎన్ని చెప్పినా, ఈ వాయుదేవుడు ప్రాణాంతకుడే — అందుకేమీ సందేహంలేదు. ఉదయం సరిగా తొమ్మిది గంటలూ కొట్టేటప్పటికల్లా ఆదరాబాదరా ఆఫీసులకు పరుగెత్తుకొని వెళ్తూన్న ఉద్యోగస్థులతో వీధులు నిండిపోయుండే వేళకి, వారిదీ వీరిదీ అనే విచక్షణలేకుండా అందరి ముక్కులనూ చురుక్కు చురుక్కుమని సూదులతో పొడుస్తూ, తన వాడిపళ్లతో కొరికేస్తూ ఫెడీఫెడీమని కొడుతూన్న చలిగాలిని వాయుదేవుడు ఎంతటి జోరుతో పంపిస్తాడంటే, ఇక ఆ గాలి ఉధృతానికి తమ ముక్కులను ఎక్కడ దాచుకోవాలో ఏమిటో ఏమీ తెలియక ఆ ఉద్యోగస్థులందరూ అల్లల్లాడిపోతారు. ప్రభుత్వపు కొలువులో వున్న అత్యున్నతోద్యోగుల లలాటములను సహితమూ కాట్లు కరచేస్తూన్న చలి

గాలికి బాధపడిపోయి, వారి నే(త్రములు అ(శుపాతములైనప్పుడు, ఇక దిక్కు మాలిన సలహాదారు గుమాస్తాలు బొత్తిగా తట్టుకోలేక కేవలం నిస్సహాయులైపోతారన్నమాటే. ఇక వాళ్లకున్న రక్షణల్లా ఒక్కటే. అదేమిటంటే: వలగుడ్డకింద అరిగిపోయిన తమ ఓవర్‌కోట్లతోనే తాము వెళ్ళాల్సిన ఐదారు వీధులలోనుండీ ఎంత త్వరగా పరుగెత్తగలరో అంత త్వరగానూ పరుగెత్తి ఆ వీధులను దాటి, వారు తమ తమ ఆఫీసులు చేరుకున్న తరువాత, దారిలో చలికి గడ్డకట్టుకుపోయిన తమ శక్తిసామర్థ్యాలను రాచకార్యాలు చక్కబెట్టడానికి వీలుగా వుండేందుకు తిరిగి యథాస్థితికి తెచ్చుకుందుకని, ఆఫీసు వసారాలో బలంగా కాళ్లతో కదం తొక్కడం.

చట్టరీత్యా తాను ఆఫీసు చేరుకోడానికి పరుగెత్తాల్సిన దూరము తన శక్తివంచన లేకుండా తానెంత త్వరగా పరుగెత్తినప్పటికీ కూడా హిమశీతలంతో వీచుతూన్న ఆ గాలి ఇంత అ(పతిహతంగా తన శరీరంలోకి దూసుకొనిపోయి తన పృష్ఠభాగాన్నీ తన భుజస్కంధాల్నీ కరడుకట్టించేస్తూందే, ఇదేమి చి(తం చెప్మా అనే ఆలోచన ఒకటి అకాకి అకాకియెవిచ్ మనస్సులో కొన్నాళ్లయి మెదలసాగింది. ఓహో, అవునుసుమా, ఇందుకు తన ఓవర్‌కోటు బాధ్యత వహించాల్సి వుండొచ్చు ననుకోవడానికి బొత్తిగా అవకాశం లేకపోలేదే అని అప్పుడతనికి తటాలున తట్టింది. ఆ సాయంకాలం ఆఫీసు నుండి ఇంటికి వెళ్లిన తరువాత, అతడు తన ఓవర్‌కోటును క్షుణ్ణంగా పరిశీలించగా, రెండు మూడు చోట్ల, అనగా వీపునా బుజాలమీదనూ గుడ్డ శు(భంగా చీకిపోయి కేవలం నూలుపోగులతో నేసిన జామారు రేకులా వుండడం కనిపెట్టాడు: గుడ్డ ఎంతలా విడిపోయుందంటే దానిలోనుండి

గాలి ధారాళంగా లోపలికి వచ్చేస్తూందన్న మాట. ఇక పోతే, అస్తరుగుడ్డ కూడా ఎక్కడికక్కడికి వూడొచ్చేస్తూంది.

ఇక్కడ ఒక విషయం చెప్పాల్సి వుంది; ఏమిటంటే: అకాకి అకాకి యెవిచ్ ఓవర్‌కోటు కూడా తోడిగుమాస్తాల హాస్యాలకు ఒక కథావస్తువుగా ఉపయోగపడుతూండేది; వాళ్లు దానిని ఓవర్‌కోటు అనే గౌరవనామంతో పిలవడం మానివేసి, దానికి 'కపోట్'* అని నామకరణం చేశారు. అసలు నిజానికి దానికొక అపూర్వమైన స్వరూపమే వచ్చింది: ఆయేటి కాయేడు దాని కాలరు అంతకంతకు మరింత సన్నమైపోతూండేది; అందుకు కారణం మరేమీలేదు — కోటుకి ఇంకెక్కడైనా మాసిక వేయాల్సొస్తే కాలరులో ఒక ముక్క కత్తిరించి దానితో మాసిక వేయడం జరిగేది. ఆ మాసికలు కూడా దర్జీవాని కళాకౌశల్యానికి ఏ మాత్రమూ వన్నెతెచ్చే విధంగా వుండక, మొత్తంమీద ఓవర్‌కోటుకొక గోనెసంచి రూపునిచ్చి, చివరకది అందవికారంగా తయారైంది. ఇక కర్తవ్యం ఏమిటో తెలుసుకొన్నవాడై, దానిని తీసికెళ్లి పెత్రోవిచ్‌కి చూపించుదామని నిశ్చయించుకున్నాడు అకాకి అకాకియెవిచ్. ఏ మారుమూల సందుగొందిలోనో ఏ చీకటింట్లోనో నాలుగో అంతస్తులో కాపురముంటున్నాడు పెత్రోవిచ్. పెత్రోవిచ్ ఒక దర్జీ. అతడు ఏకాక్షే అయినప్పటికీ, ముఖంనిండా మశూచికపు మచ్చలే వున్నప్పటికీ కూడా, ఈ లోపాలతోనే, గవర్నమెంటు ఉద్యోగస్థులయొక్క, ఇతరులయొక్క ఫ్రాక్ కోట్లూ, పంట్లాములూ మరమ్మతు చేస్తూ ఒక విధంగా బాగానే జీవనం సాగించుకుంటూండేవాడు — అనగా మరేంలేదు, మరీ తాగుడు మైకంలో

---

*డ్రెస్సింగ్ గౌన్ — అనువాదకుడు.

వుండకుండా, ఇతరత్రా మరే ఆలోచనలూ బుర్రలో ప్రవేశించకుండా, వొంటిపై తెలివి వుండినప్పుడన్నమాట.

ఈ దర్జీని గురించి మనం సవిస్తరంగా చెబుతూ కూచుని కాలం వృధాచేయడం ఎంతమాత్రమూ అవసరం లేదనుకోండి; కాని కథలో వచ్చే పాత్రలనన్నింటినీ ఆపాదమస్తకమూ వర్ణించడం ఇప్పుడొక శిలాశాసనం అయి పోవడం కారణంగా అన్యథా మనకి మరొక మార్గం లేదు కాబట్టి, పెత్రో విచ్ దగ్గరకే వెళ్దాం పట్టంది.

అతనిని మొదటిలో అందరూ గ్రిగోరి అని అతని సొంతపేరు పెట్టి పిలవడమే మామూలు; ఏ జమీందారు కింద దాసుడుగానో వుండేవాడి తడు. దాస్యంనుండి అతనికి విముక్తి సిద్ధించిన తరువాతనే అతడు తనపేరు పెత్రోవిచ్ అంటూ అందరితోనూ చెప్పుకోవడం మొదలెట్టాడు; అంతే కాదు, ఇక అప్పటినుండీ ముఖ్యమైన ప్రతీ పండుగనాడూ కాస్త జోరుగానే చుక్కవేసుకోవడం ప్రారంభించి, తరువాత ఆ పండుగా ఈ పండుగా అనే పక్షపాతం చూపకుండా, పంచాంగంలో పండుగ అని శిలువచిహ్నంతో సూచించ బడిన ప్రతిదినమూ పానపూజ చేస్తూండేవాడు. ఈ విషయంలో మాత్రం అతడు తన తాతముత్తాతల సంప్రదాయాన్నే ఎట్టి లోపమూ లేకుండా యథావిధిగా పాటించుతూ, ఈ విషయమై తన భార్యతో తగవు పెట్టు కున్నప్పుడల్లా ఆమె వొట్టి ఇహలోక చింతనలో మునిగిపోయిన ఆడమనిషి అనీ, ఆమెది వుత్త జర్మన్ జన్మ అనీ ఆడిపోస్తూంటాడు. ఆమె గురించి కూడా ఏ రెండు మాటలో చెప్పాలికదా మరి. కాని దురదృష్టవశాత్తూ ఆమె గురించి మట్టుకు అంతగా మనకేమీ తెలియదనే చెప్పాలి; మనకి తెలిసినదల్లా ఒకేఒక విషయం; అదేమిటనగా: పెత్రోవిచ్ భార్య తలకి

రుమాలు చుట్టుకోకుండా, టోపీ పెట్టుకునేది. కాస్త నాజూగ్గా చెప్పాలంటే, సౌందర్యం విషయంలో ఆమె ఏమంతగా మురిసిపోవాల్సిన కారణమేవీ అగపడదనే అనాలి మరి; అయితే ఒక విశేషం మాత్రం మనమిక్కడ వివరించాలి మరి; ఒకే ఒకమాటు గార్డు రెజిమెంటు సోల్జరు ఒకడు ఆమెను వీధిలో పలకరించడం తటస్థించింది. అతడామెను పలకరించి ఆ టోపీకింద దాగివున్న ఆమె ముఖాన్ని తొంగిచూచి, మీసంమెలివేస్తూ అదేదో చిత్రంగా ఘుర్ఘురించి వెళ్లిపోయాడు.

పెత్రోవిచ్ కాపురం వున్న ఇంటికి వెళ్దామని అకాకి అకాకియెవిచ్ ఆ ఇంటి మేడమెట్లు ఎక్కుతూండగా — ఆ మెట్లకు మనం తీరని అన్యాయం తలపెట్టకుండా వుండాలంటే, వాటిపై నానారకాల ఎంగిలినీళ్లు పారుతున్నాయనీ, ఆ ప్రవాహంలో సర్వవిధముల ఉచ్ఛిష్టాలూ తేలుతున్నాయనీ, ఆ మెట్లమీద తేలియాడుతూన్న వాతావరణమంతా కళ్లకి నీళ్లు తెప్పించేటట్టి ఘాటు సారా వాసనతో నిండివుందనీ చెప్పాల్సి వుంటుంది. సెంట్ పీటర్స్‌బర్గ్ సందుగొందుల వెనకలోగిళ్లలో వున్న అన్ని ఇళ్ల మేడ మెట్లకూ ఇదొక శాశ్వతాలంకారమనే సంగతి లోకప్రఖ్యాతమని మనమిక్కడ పేర్కొనితీరాలి — ఆ ఇంటి మేడమెట్లు ఎక్కుతూండగా, కుట్టుకూలికి గాను పెత్రోవిచ్ ఎంత ఇమ్మంటాడు చెప్మా అని అకాకి అకాకియెవిచ్ అట్టే ఆలోచించి ఆలోచించి, ఏమైనా సరే రెండు రూబుళ్లకు మించి ఇవ్వకూడదనే నిర్ణయానికొచ్చాడు. మేడమెట్లెక్కి పెత్రోవిచ్ అద్దెకున్న భాగం దగ్గరకు వెళ్లేసరికి, తలుపు తీసేవుంది — కారణం మరేమీ లేదు: ఇంటి ఇల్లాలు ఏదో చేప వంటకం తయారు చేస్తూండడంచేత వంటిల్లంతా, వంటింట్లో కాపురంచేస్తూన్న బొద్దింకల సంసారం సహితమూ

కంటికి కనబడడానికి వీల్లేనంత దట్టంగా పొగ కమ్మేసింది. ఆ ఇంటి ఇల్లాలు వంటింట్లో వున్నదన్న సంగతి ఆ పొగలో చూడకుండానే అకాకి అకాకియెవిచ్ వంటింట్లోనుండి నడచుకునివెళ్లి చివరకి ఎలాగైతేనేమి పెత్రోవిచ్ వున్న గది చేరుకున్నాడు. ఆ గదిలో రంగువెయ్యని ఒక వెడల్పాటి బల్లమీద టర్కిష్ పాషాలాగు బాసికపట్టు వేసుకుని కూచున్నాడు పెత్రోవిచ్. పని చేసుకుంటూన్నప్పుడు దర్జీల అలవాటు ప్రకారం అతడి కాళ్లకి జోళ్లూ మేజోళ్లూ లేకుండా నగ్నంగానే వున్నాయి. అన్నిటికంటెనూ మొట్టమొదట అకాకి అకాకియెవిచ్ కంటబడినది, అతనికి చిరపరిచితమైనదీ, వికృతంగా తాబేటి డిప్పలా దళసరిగా గట్టిగా మొలిచిన గోరు వున్నట్టి పెత్రోవిచ్ కాలి బొటనవేలు. పెత్రోవిచ్ మెళ్లో పట్టూ నూలూ కలిసిన దారపు బుడుత ఒకటి వేలాడుతూంది, అతడి వొళ్లో చిరుగులున్న పాత గుడ్డ ఒకటుంది. అతడు గత రెండు మూడు నిమిషాలనుండీ సూదిలో దారం ఎక్కించేందుకు నానాతంటాలూ పడుతున్నాడు; కాని ప్రతీ సారీ దారం ఎక్కకపోవడం కారణంగా, మొదట ఆ చీకటి గదిమీదనూ తరువాత ఆ దారం మీదనూ అమితమైన కోపం వచ్చేసి ఇక వాళ్ల మండిపోయి: ''ఎక్కనంటావా? ఓసి రాకాసీ! నీ సిగదరగా! నా ప్రాణం తీస్తున్నావే, పాడుముండా!'' అంటూ ఒకటే సణుగుకుంటున్నాడు. పెత్రోవిచ్ ఇలాగు కోపంగా వున్న సమయం చూసుకుని తాను రావడం ఇదేమీ శుభసూచకం కాదనుకున్నాడు అకాకి అకాకియెవిచ్: పెత్రోవిచ్ మంచి సరదాగా వున్న సమయంలోనో, లేదాంటే అతగాడి భార్య వర్ణించినట్టుగా: ''ఆ ఒంటికంటి దయ్యం బ్రాందీ ఎక్కిస్తూన్న'' గడియల్లోనో ఆ దర్జీకి పని పురమాయించడమంటేనే అకాకి అకాకియెవిచ్‌కి హెచ్చు ఇష్టం. ఆ స్థితిలో వుండేటప్పుడు పెత్రోవిచ్ మనస్సు

సాధారణంగా వెన్నపూసలా వుండి, ఎలా చెబితే అలాగే ఒప్పేసుకుని, సాగనం పడానికి గుమ్మంలోకి వచ్చి వొంగి వొంగి నమస్కారం చేస్తూ, పదేపదే ధన్య వాదాలు చెప్పేవాడు. ఈ విధంగా మజూరీ నిర్ణయం అయిపోయిన తరువాత మాత్రం అతగాడి ఇల్లాలు కాతాదార్ల ఇంటికి వెళ్లి, తన పెనిమిటి తప్పతాగి వున్నాడనీ, ఒళ్లూ పై తెలియక బొత్తిగా చచ్చుకూలికి ఒప్పే సుకున్నాడనీ ఆమె ఏడ్చి మొత్తుకునేదన్న సంగతి నిజమే; ఈ మొర అంతా విని, మరో పది కోపెక్కుల కాసు పెచ్చు ఇస్తానని అకాకి అకాకియె విచ్ ఒప్పుకునే సరికి ఇక వ్యవహారమంతా ఉభయ పక్షాలకూ సంతృప్తి కరంగా రహితమయిపోయేది. కాని తాను వచ్చిన దుర్ముహూర్త బల మేమిటో గాని, పెత్రోవిచ్ నిషాలో లేకుండా తెలివిగానే వున్నాడు. ఫలితంగా మనిషి చిరచిరలాడుతూ మూర్ఖంతో మొండికేసుకుని, ఇక మంచీ చెడ్డా లేకుండా ఆ మనిషికి ఆ నిమిషానికి ఎంత తోచితే అంతా తెమ్మని హఠంవేసుకుని కూచుంటాడన్నమాట. అకాకి అకాకియెవిచ్ ఇదంతా ఒక్క క్షణంలో గ్రహిం చేసుకుని, శాస్త్రం చెప్పినట్టుగా, పలాయన మంత్రం పఠించాలనుకున్నాడు. కాని అప్పటికే వ్యవహారానికి నాంది ప్రారంభమై పోయింది. పెత్రోవిచ్ తన ఒంటి కన్ను చీపిగా పెట్టుకుని నిదానంగా అతితీక్ష్ణంగా అకాకి అకాకియెవిచ్ కేసి చూశాడు. అప్పుడిక ఏమి చేయడానికీ వీలుగాక, అకాకి అకాకియెవిచే పలుకరించాడు:

"నమస్కారం వోయ్, పెత్రోవిచ్!"

"నమస్కారమండి, అయ్యా!" అని పెత్రోవిచ్ బదులు చెప్పాడు, అకాకి అకాకియెవిచ్ చేతికేసే తదేకధ్యాన్నంతో చూస్తూ, తనకు ఉపహారంగా అతడే వస్తువు తీసుకొచ్చాడో పోల్చుకోడానికి ప్రయత్నిస్తూనూ.

''అబ్బే, మరేం లేదోయ్, నేనొచ్చిన పని – చూశావుకదూ, పెత్రో విచ్, దాని తాలుకుందే...''

ఇక్కడ ఒక విషయం వెంటనే చెప్పడం అవసరం: అకాకి అకాకియెవిచ్ నోటిలోనుండి నూటికి తొంభై తొమ్మిది పాళ్ళు ఎప్పుడూ విభక్త్యర్థక అవ్యయాలూ, క్రియావిశేషణాలూ, చివరకి ఇక ఇవీ కాకపోతే అర్థం పర్థం లేని భాషాపరిచ్ఛేదాలూ మాత్రమే వెలువడుతాయి. అసలు తాను వచ్చిన వ్యవహారం మరీ చిక్కుతో కూడుకున్నదైతే, అతడు సాధారణంగా తన వాక్యాలను అసంపూర్ణంగానే వదిలిపెట్టేస్తాడు: అనగా, అతని అలవాటు ప్రకారం వాక్యాన్ని ''ఇదుందే... మరేంలేదు... చూశారుకదూ... దాని తాలూకుందే...'' అంటూ మొదలుపెట్టి, ఆ తరువాత – అక్కడికంతే, అలా వూరుకునేవాడు, తాను చెప్పదల్చుకున్నదంతా సొంతంగా చెప్పేశాననే అనుకుని, వాక్యం పూర్తిచేయడం మరచిపోయేవాడు.

''తమరేదో తెచ్చినట్టుందే, ఏమిటండది?'' అని పెత్రోవిచ్ ప్రశ్నించి, అదే సమయంలో తన ఏకాక్షంతో అకాకి అకాకియెవిచ్ తొడుగుకొనివున్న యూనిఫారం పొడుగుకోటును ఆమూలాగ్రమూ, కాలరు మొదలుకొని చొక్కాయచేతులూ, వీఠీ, తోకలూ, గుండీకన్నాల వరకూ క్షుణ్ణంగా పరీక్షించడం ప్రారంభించాడు; ఎందుచేతనంటే అదంతా తన పనివానితనం ఫలితమే కావడంచేత అతనికది కరతలామలకమే. కుట్టుపనివాళ్లలో అనాదినుండీ వస్తూన్న ఆనవాయితీ అది: తమ కాతాదార్లను చూచీ చూడడంతో మొట్టమొదట వారు చేసే పనే అది.

''మరేంలేదు, నేనొచ్చినది, చూశావు కాదుటోయ్, పెత్రోవిచ్... ఓవర్కోటుందే, గుడ్డ... మరేంలేదు... చూశావా... అంతాగట్టిగానే వుంది.

కాస్త దుమ్ము పట్టి పాతదానిలా కనబడుతూందనుకో, మరేంలేదు... చూశావు కదూ... పాతగిలిం దనుకునేవు, అబ్బే, అదేంలేదు, సరికొత్తదే, ఏదో కాస్త అక్కడా అక్కడా ఓ పిసరు... వీపుమీద, కొద్దిగా ఏదో బుజంమీద ఓరవంత, కాసంత మేల గుడ్డ మన్నితే మన్నిందేమోలే... చూశావుకాదూ... నేనన్నది, మరేంలేదు, బుజంమీద కొద్దిగా... చూశావుగా... అంతే మరేం లేదులే, పోతే నీకు కాస్త పని...''

ఆ 'కపోట్'ని పెత్రోవిచ్ అందుకొని, మొట్టమొదట తన బల్లపై పరచి, దాన్ని సుదీర్ఘంగా పరిశీలించి, తల పంకించి, కిటికీవైపు చేయిచాచి, కిటికీ అంచుమీద — మూతపై అదెవరో జనరల్ బొమ్మ అచ్చువేసి వున్న గుండ్రని పొడుండబ్బీ అందుకున్నాడు. ఆ బొమ్మకి ముఖం వుండాల్సిన చోట, ఎవరో వేలితో కన్నం పొడవడంచేత, అందుపైని నలుచదరపు కాగితపుముక్క అంటించి వుండడంవల్ల ఆ జనరల్ ఎవడో మనం చెప్పలే మనుకోండి, అంతే కారణం మరేంలేదు. చిట్టిడు నస్యం ముక్కులోకి దట్టించి, పెత్రోవిచ్ ఆ ఓవర్‌కోటును రెండు చేతులతోనూ వెల్తురు కెదురుగా పట్టుకుని పరీక్షించి, మళ్లీ మరొకసారి తల పంకించాడు. తరువాత ఆ ఓవర్‌కోటును అస్తరుగుడ్డ పైకి కనబడేటట్టు తిరగళ్లా పరచి, మళ్లీ మరొకసారి తల పంకించి, మూతపైనున్న జనరల్ ముఖానికి కాగితం అతికివున్న పొడుండబ్బీ తెరచి, ముక్కు చరమల్లో నస్యం నింపి, డబ్బీకి మూతపెట్టి, దానిని ఒక పక్కగా పెట్టేసి, చివరికి ఇలా అన్నాడు:

''ఇక మరమ్మతు చేసి లాభంలేదండయ్యా. శాల్తీ బొత్తిగా జీర్ణించి పోయిందండి!''

ఆ మాటలు చెవిని పడడంతో అకాకి అకాకియెవిచ్ గుండె జారి పోయింది.

"మరమ్మతు వీల్లేకపోవడమేమిటోయ్, పెత్రోవిచ్?" అన్నాడు అతడు, చంటిపిల్లడు ప్రాధేయపడుతూన్న గొంతుకతో. "అసలు, కేవలం ఏమి టంటే, ఒక్కపిసరు బుజంమీద, రవంతమేల చిరిగిందేమో, నీదగ్గర ఆ మాత్రం రద్దుముక్కలు వుంటాయి కాదటయ్యా..."

"రద్దుముక్కలు వుంటే వుండొచ్చుననుకోండి నాదగ్గర, బోలెడే వున్నాయి, వాటికేం భాగ్యం!" అన్నాడు పెత్రోవిచ్. "వచ్చిన చిక్కంతా ఏమిటంటే, కుట్టడానికి వీల్లేదండయ్యా: శాల్తీ పూర్తిగా శిథిలమై పోయింది బాబూ! సూదిమొన తగుల్తేనే ఎక్కడికక్కడికి విడిపోతూాందయ్యగారూ!"

"విడిపోతే ఏముంది – మళ్లీకలిపి మాసికేసేయ్!"

"మాసికేస్తే నిలవాలికదండీ? నిలవడానికి గుడ్డలో బలంవుండా లంటారా, చెప్పండి? బలం వుండేందుకు దానిలో ఏమైనా పస వుంటేనా? ఆరె మీాయిల్కు బంగారంగాను, ఇది గుడ్డ కాదండి బాబూ! ఉఫ్‌మని వూదితే ఎక్కడికక్కడికి గుండలా రాలిపోతూాందండి, అయ్యా!"

"గుడ్డ గట్టిగా వుండేందుకు దానికేదేనా చెయ్యొచ్చుగా, అదేదో, నేనన్నది, మరేంలేదు, ఎదో దానితాలూాకు, చూసి చేసేస్తేసరి!.."

"ఎంలాంభం లేదండి" అనేశాడు పెత్రోవిచ్ ఇక తిరుగులేకుండా. "ఏంచేయడానికీ వీల్లేదండి. బొత్తిగా అధ్వాన్నంగా వుందండి. మీారొక పని చేస్తే మంచిదని నాకు తోస్తూాందండి. ఎలాగా చలికాలం రానేవచ్చింది గనుక దీనిని ముక్కలుకింద కత్తిరించేసి మేజోళ్ల బదులు వెచ్చగా కాళ్లకి

పట్టీల్లా చుట్టుకోడానికి పనికొస్తుందండి, అయ్యా! ఇప్పుడు మేజోళ్లంటూ వస్తూన్నవి, మనకి అమ్మి బోలెడు డబ్బు సంపాదించడానికని జర్మనీవాడు సృష్టించిన మాయసరుకండి, బాబూ!'' (ఏదో ఒక సందు చూసుకుని జర్మన్లమీద ఒక రాయి విసరడమంటే పెత్రోవిచ్‌కి భలే సరదా.) ''ఓవర్ కోటు విషయమంటారా, మీరు కొత్తది పురమాయించడమే మంచి దండయ్యా.''

''కొత్త'' అనే మాట చెవినిపడగానే అకాకి అకాకియెవిచ్ కళ్లు చీకట్లు కమ్మేశాయి, గదిలో వున్నది ప్రతీదీ తలకిందులైపోయి గిర్రున తిరగడం మొదలెట్టింది. అతనికి స్థిరంగా కనబడ్డదల్లా పెత్రోవిచ్ తాలూకు కాగితపు ముక్క అంటించిన జనరల్ బొమ్మ మూత వున్న ఆ పొడం డబ్బీ ఒక్కటే.

''కొత్తదే?'' అని అడిగాడు అతడు, నిద్రలో కలగని కలవరిస్తూన్నట్టు. ''అందుకు నాదగ్గర డబ్బులేదే!'' అన్నాడు.

''కొత్తదేనండి, అయ్యా!'' అనేశాడు పెత్రోవిచ్, నిర్దాక్షిణ్యంగా, తపీమని కుండ బద్దలుకొట్టినట్టు.

''అయితే మరి, నేనన్నది... మరిగంటేను... కొత్తది రావాలంటే... దానికి ఎంత పెట్టాలో..?''

''అనగా, ఎంత ఖరీదవుతుందనే కదా మీ ఉద్దేశం?''

''అవును.''

''ఎంతవడానికీ ఏముంది, మూడు ఏభైలు పెడితే చాలండి. కాదూ పోదూ అంటే మరోకాస్త పడితే పడుతుందేమో లెండి'' అన్నాడు పెత్రోవిచ్ మూతి బిగించి.

ఎదుటి వాడికి ముఖం తిరిగిపోయేటట్టు ఫెడీమని ఒక మాట తగిలించడం, అలా తగిలించిన తరువాత ఎదుటివాడు ఎలా బెంబేరెత్తిపోతాడో పరికించడమూ అంటే పెత్రోవిచ్‌కి ఇంతా అంతా సరదాకాదు — వల్లమాలిన సరదా.

"సూటయాభై రూబుళ్లా ఒక ఓవర్‌కోటుకి!" అని గొంతెత్తి ఒక్క కేక వేశాడు పాపం అకాకి అకాకియెవిచ్; అతని జన్మ అంతలోనూ అంత గట్టిగా కేకేయడం అదే బహుశ మొదటిసారేమో, ఎంచేతంటే అతడు సర్వకాల సర్వావస్థలయందూ నెమ్మదిగానే మాట్లాడుతాడని ప్రతీతి.

"అవునండి" అన్నాడు పెత్రోవిచ్, "అది కూడా మీరు ఎలాంటి ఓవర్‌కోటు కావాలంటారో దాన్నిబట్టి వుంటుంది బాబూ. కాలరుకు మార్టెన్ బొచ్చూ, శిరస్త్రాణానికి పట్టు అస్తరూ వుండితీరాలని మీరంటే రెండొందలు పెట్టాలండయ్యా!"

"ఇదిగో, పెత్రోవిచ్..." అంటూ పెత్రోవిచ్ మాటలు వినకుండానే, వినేందుకు ప్రయత్నించనైనా ప్రయత్నించకుండానే, ఒకవేళ విన్నప్పటికీ, తనను గాభరా యెత్తించేందుకు అతగాడి ప్రయత్నాలను లెక్కచేయకుండానే, ఎంతగానో బతిమలాడుకుంటూన్న గొంతుకతో అన్నాడు అకాకి అకాకియెవిచ్, "ఏదో ఒకలాగు మరమ్మతు చేసేవయ్యా, బాబూ, నీ పుణ్యముండేను, నాకు తొడుక్కుందుకు వీలుగా వుండేటట్టు."

"అదేమీ వీలుపడదండయ్యా; నా పని దండగ, మీ డబ్బు దండగ, ఎందుకొచ్చినదండి!" అనేశాడు పెత్రోవిచ్. ససేమిరా, ఇకామాటలకు

తిరుగులేదని తెలిసిపోయి, పాపం అకాకి అకాకియెవిచ్ అధఃపాతాళానికి కుంగి పోయి, ఏమిచెయ్యడానికి తోచక, అక్కడనుండి వెళ్లిపోయాడు.

అతడు వెళ్లిపోయాక పెత్రోవిచ్, మరేపనీ చెయ్యకుండా పెదవులు బిగించేసి, తన ఆత్మగౌరవానికి ఏ విధంగానూ భంగం వాటిల్లకుండానూ, కుట్టుపుకళకు ఎట్టి అపచారమూ కలగకుండానూ తాను దృఢంగా నిలబడ్డాను కదా అని తనలోతాను గర్వపడుతూ, చాలా సేపటివరకూ అలానే నిలబడి పోయాడు.

తానేదో కలగంటూన్నట్టూ, ఆ కలలో తానేదో అలా నడుస్తూ న్నట్టుగానూ అకాకి అకాకియెవిచ్ రోడ్డు చేరుకున్నాడు.

''సరే, ఈ వ్యవహారం ఇలా వుందన్నమాట'' అనుకున్నాడు మన స్సులో, ''ఇలా అడ్డంగా తిరుగుతుందని అనుకోలేదే...'' కాస్సేపు అలా వూరుకుని, మళ్లీ అనుకున్నాడు, ''సరే ఇలా వుందన్నమాట! చివరకి జరి గింది ఇదీ. ఇలా జరుగుతుందని ఎన్నడూ అనుకోలేదే.'' మరికొంతసేపు ఆలోచనా పాలోచనా, మాటా మంతీ లేకుండా వూరుకుని, మళ్లీ అనుకు న్నాడు: ''ఇలా అయిందా? సరే, కానీ! అయినా నిజంగా ఒక్కనాటికి అను కోలేదు సుమా ఇలానని, కథ ఇంత వంకరగా తిరుగుతుందని — అబ్బే, ఒక్కనాటికి అనుకోలేదు — ఎన్నడూ!''

ఇలా అనుకుంటూనే తాను ఎటు వెళ్లుతూన్నదీ మరచిపోయి, ఇం టికి వెళ్లుతున్నానే అనుకుని, ఇంటి ముఖం పట్టడం బదులు, పెడముఖంగా నడుచుకుంటూ వెళ్లిపోయాడు. అలా వీధిలోంచి వెళ్లుతూండగా, పొగ స్తంభాలు శుభ్రంచేసే మనిషి ఒకడు ఆదారినే వెళ్లుతూ, ఇతడిని రాసు కుంటూ వెళ్లిపోయాడు. ఆ రాసుకువెళ్లిపోవడంలో అకాకి అకాకియెవిచ్

బుజమంతా మసి పులుముకు పోయింది; మరో నాలుగు అడుగులు వెళ్లే సరికి, ఆ పక్కనే కొత్తగా కడుతూన్న మేడనుండి పట్టెడు సున్నపుముద్ద అతనిమీద పడింది. తన వీపంతా మసిపూసి పోయిందనిగానీ, తన వొళ్లంతా సున్నం పట్టిపోయిందనిగానీ అతడు చూసుకోకుండానే, అలాగే వీధి చపటామీద వెళ్లుతూండగా, అక్కడ బీటుమీదున్న పోలీసువాడు తన గండ్రగొడ్డలిని గోడవార పక్కగా పెట్టుకుని, పొడుం గొట్టంలోనుంచి కాయలుకాసిన అరచేతిలో పట్టెడు నస్యం పోసుకుంటూండగా, ఆ పోలీసు వాడిమీద వెళ్లిపడ్డాడు. అలా పడేసరికి, ఆ పోలీసువాడు: "అరేయ్, మూరెడు ముక్కూ నువ్వూనూ, మనిషిని చూసుకోకుండా తోసుకొస్తున్నావ్? చపటా అంతా వుండగా ఏడిసినట్టేవుంది?" అని కసిరేసరికి అప్పుడు మని షికి కాస్త తెలివొచ్చింది. చూసుకునేసరికి ఇంటికి పెడముఖంగా నడుస్తూ న్నానే అని అప్పుడు తెలుసుకుని వెనక్కి మళ్లాడు.

ఇంటికి చేరుకున్నాక, అప్పుడు నెమ్మదిగా సంగతులు ఆలోచించుకో వడం మొదలుపెట్టి, జరిగినదేమిటో, తన పరిస్థితులు ఏమిటో, సగమూ పావూ వాక్యాలలో కాకుండా, అసలు విషయమంతా దాపరికం లేకుండా, మనసిచ్చి మాట్లాడగలిగే ఒక ఆప్తమిత్రునితో చర్చించే విధంగా, ఆచి తూచి నిదానంగా నిక్కచ్చిగా స్పష్టంగా పర్యాలోచించుకున్నాడు.

"అబ్బెబ్బే, పెత్రోవిచ్‌తో అసలు నేనీ విషయం మాట్లాడి వుండ కూడదు..." అనుకున్నాడు అకాకి అకాకియెవిచ్. "బహుశ... నేననుకుంటాను, అతని పెళ్లాం అతనికి వేడివేడిగా నాలుగు వొడ్డించి వుంటుంది... మనిషి వాటం చూస్తే... అలాగే కనబడుతూంది. అందుచేత ఆదివారం ఉదయం అతని దగ్గరకు వెళ్లితే మంచిది: శనివారం పండుగ పూట సేవించుకుని,

ఆదివారం నాటికల్లా చేతిలో చిల్లిగవ్వ ఆడక, ఆ ఒంటికన్ను చీపిగా పెట్టు కుంటూ సగం నిద్దరమత్తులోనే వుండి, మైకం తీరడానికి ఒక చుక్క వేసుకుంటే బాగుండునే, చేతిలో డబ్బులులేవే. పెళ్ళాం అసలివ్వదే, ఎలాగు భగవంతుడా అని అతడు కిందా మీదా తికమక పడుతూండే సమయానికి గనుక నేను వెళ్లి, ఓ పదికోపెక్కుల కాసు చేతిలో పెట్టితే, అప్పు డతడు కాస్త దోవలోకొచ్చి, ఓవర్‌కోటు గురించి సజావుగా మాట్లాడు తాడు, తెలిసిందికాదూ, అదీ...''

ఈ విధంగా అకాకి అకాకియెవిచ్ తనలోతాను యోచించుకుని, తనకు తానే ధైర్యం చెప్పకుని సంతుష్టిపడ్డాడు.

సరి, ఆదివారం రానేవచ్చింది. ఆనాడు బయలుదేరి అకాకి అకాకియె విచ్ పెత్రోవిచ్ ఇంటికి వెళ్లాడు. పెత్రోవిచ్ ఇల్లు ఇంకా కాస్తదూరం వుందనగానే, పెత్రోవిచ్ భార్య ఇంటినుంచి బయల్దేరి ఎక్కడికో వెళ్లడం అతడికి కనబడింది. అది చూసి, అతడు సరాసరి ఆ ఇంట్లోకి వెళ్లాడు. శని వారం సేవ ఫలితంగా పెత్రోవిచ్ తన ఒంటికంటితో మరింత చీపిగా చూస్తూ, తల నేలపై రాలి పడిపోతుందేమో అన్నట్టుగా వుండి, ఇంకా సగం నిద్రమత్తులోనే వున్నాడు; అలా వున్నప్పటికీ కూడా, అకాకి అకాకి యెవిచ్ ఎందుకొచ్చాడో తెలుసుకోగానే, ఏదో దయ్యం ఒకటి అతనిలో ప్రవే శించి అతనిని పట్టుకుని పలికించినట్టు:

''కార్యంలేదండి! మీరు కొత్తది పురమాయించాల్సిందేనండి!'' అనేశాడు.

ఆ మాటలు వినీవినడంతోనే అకాకి అకాకియెవిచ్ పదికోపెక్కుల కాసు ఒకటి అతడి చేతులో పెట్టాడు.

''ధన్యవాదాలండి, అయ్యా! బొత్తిగా నీర్సించిపోయానండి. మీపేరు చెప్పుకుని ఒక్క చుక్క సేవిస్తానండి'' అన్నాడు పెత్రోవిచ్. ''ఆ ఓవర్ కోటు గురించి, చూశారూ, అయ్యా, దాని గురించి తమరేమీ మనసు పాడుచేసుకోకండి, అయ్యగారూ! దానిలో పస ఏమీ లేదండి, బాబూ. తమ రికి భేషైన ఓవర్‌కోటు నేను కుట్టిపెడతానండి, ఇలాటిదీ అలాటిదీ కాదండి, తమరే చూస్తారుగా!''

పాత ఓవర్‌కోటు మరమ్మతు మాట మళ్లీ మరొకసారి ఎత్త బోయాడు అకాకి అకాకియెవిచ్. కాని ఆ మాటే చొరనిచ్చాడుకాదు పెత్రోవిచ్.

''చూదురుగాని, అయ్యా! ఎటువంటి ఓవర్‌కోటు నేను మీకు కుట్టిపెడతానో. అటువంటి ఓవర్‌కోటు మరొకటి ఈ ప్రపంచంలోనే వుండదంటే నమ్మండి, అంతషోకుగా కుడతానండి. కొత్త ఓవర్‌కోటు మాట ఏలాగూ సిసలైంది కాబట్టి, పనిలో పనిగా ఇప్పుడు కొత్త ఫాషన్ ఒకటి వచ్చిందండి: కాలరు తగిలించుకుందుకు వెండి మలామా బిళ్లకొక్కెం ఒకటి పెడదామండి'' అన్నాడు పెత్రోవిచ్.

ఇక అప్పటికి తోచింది అకాకి అకాకియెవిచ్‌కి, కొత్త ఓవర్‌కోటు కుట్టించుకొనక తప్పదని; ఆ తోచడంతో గుండె ఝల్లుమంది. అంతా బాగానే వుంది, కాని కొత్తది కుట్టించుకుందుకు డబ్బో? అదెక్కడనుండి తీసు కొస్తాడు? సెలవలకని బోనస్ డబ్బు తనకు దొరుకుతుంది, అనగా, అది నిశ్చయం కాకపోయినా ముప్పాతిక మువ్వీసం దొరికే అవకాశం వుంది; అందుచేత ఆ డబ్బు కలిసిరావచ్చు. సరి, అది కలిసివస్తుందే అనుకుందాం. అయితే — కడమ ఖర్చులకోసమని ఆ డబ్బు ఏనాడో విలియా వేసి మీాదు కట్టడం అయిపోయిందే. కొత్త పంట్లాం ఒకటి కుట్టించుకోక విధిలేదుకదా;

పోతే, పాత బూడ్సులకు కొత్త పై అట్టలు వేసినందుకు గొడారివాడికి ఇవ్వాల్సిన ఆనాటి పాతబాకీ తీర్చేయక తప్పదు. ఇక మూడు షర్టులకని కుట్టుమనిషి దగ్గర ఎలాగా పురమాయించాలి; లోపల తొడుక్కునే ఆ చెప్ప రానివి రెండూ కుట్టించుకోవడం ఎలాగూ వుండనే వుందాయె. ఆ బోనస్ డబ్బు మనదికాదు, అది ఏనాడో కేటాయింపు అయిపోనే అయిపోయింది. ఇక కాదూ పోదూ అంటే, డైరెక్టరుగారు దయతలచి బోనస్‌కింద నలభై బదులు ఏ నలభై ఐదో, పోనీ మహా అవుతే ఏ యాభై యో ఇస్తాడనే అను కున్నా, ఓవర్‌కోటుకు అవసరమైన పెట్టుబడితో పోల్చిచూస్తే అది బహు స్వల్పమే, ఏముంది — సముద్రంలో కాకిరెట్ట. ఈ పెత్రోవిచ్ ఒక్కొక్క ప్పుడు మతీసుతీ లేకుండా పిచ్చెత్తినవాడిలా తనకెంత తోస్తే అంత హెచ్చు ధర అడగడం కద్దనీ, అంత ధర ఖండించి అడగడం చూసి, అతని పెళ్లామే: "మనిషికి బొత్తిగా బుర్రపోయింది; వొట్టి మూర్ఖపు ఘటం! ఒకమాటేమిటో ధర్మానికి చేసినట్టు ఎంత చచ్చుమజూరీ ఇచ్చినా ఒప్పేసుకోవడమా? ఇప్పు డేమో తన తెలివికి మించిన మజూరీ తేతెమ్మనమంటూ వెధవ బుర్రతిరు గుడా?" అంటూ కేకలెయ్యకుండా వుండలేకపోయేదని అకాకి అకాకియె విచ్ పూర్తిగా ఎరిగివున్నప్పటికీ, తన ఓవర్‌కోటును పెత్రోవిచ్ ఎనభై రూబుళ్లకే ఇస్తాడని తనకు నిశ్చయంగా తెలిసినప్పటికీ, ఈ ఎనభై రూబుళ్లూ తాను ఎక్కడనుంచి తేవడం? అందులో సంగోరు, చచ్చీచెడీ ఎలాగో ఒకలాగు జాగ్రత్తపెట్టగలడేమో? ఆమాటకొస్తే, సంగోరుకంటె అర కొర ఒక పిసరు హెచ్చే జాగ్రత్తపెట్ట గలుగుతాడేమో కూడా; అయినప్పటికీ మిగతా సంగోరూ ఎక్కడనుండి తీసుకురావడం?..

మొదటి సగమూ అకాకి అకాకియెవిచ్ ఏలా జాగ్రత్తపెట్ట దల్చు కున్నాడో ఆ సంగతి పాఠకునికి మొదట చెప్పాల్సి వుంది.

అకాకి అకాకియెవిచ్‌కి ఒక అలవాటు వుండేది; అదేమిటంటే: అతని దగ్గర ఒక చిన్న పెట్టె వుంది. దానికెప్పుడూ తాళంవేసే వుంచేవాడు. ఆ పెట్టెలోకి డబ్బు పడేసుకుందుకు వీలుగా దాని మూతకు ఒక చిన్న కన్నం వుంది. తాను ఖర్చుచేసిన ప్రతి రూబులుకూ ఒక అర కోపెక్కు చొప్పున ఆ పెట్టెలో పడేసేవాడు. ఆరేసి నెలలకి పెట్టెతీసి, కూడబెట్టిన డబ్బులన్నీ లెక్కపెట్టి, చిల్లర కాసులను అచ్చ రూబుళ్లలోకి మార్చేసి అందులో పడేసేవాడు. ఇలాగ ఎంతో కాలంగా కూడబెట్టుతూండడంచేత, ఇన్ని సంవత్సరాల్లోనూ నలభై రూబుళ్ల పైచిలుకు పోగైంది. అందుచేత సంగోరు డబ్బా ఇప్పుడు తన చేతిలో వుందన్నమాట. అంతవరకూ బాగానే వుంది; కాని మిగతా సంగోరూ ఎక్కడనుంచొస్తుంది? కడమ నలభై రూబుళ్లా ఎక్కడనుంచి తీసుకురావడం?

అకాకి అకాకియెవిచ్ ఆలోచించాడు, ఆలోచించాడు, అట్టే అదే ఆలోచించి, ఆలోచించి, ఒక సంవత్సరం వరకూ తన మామూలు ఖర్చులు తగ్గించుకోవాలనుకున్నాడు: సాయంకాలం పూట తాను సేవించే కప్పు టీకి ఇక స్వస్తి చెప్పెయ్యా లనుకున్నాడు; చీకటి పడడంతో కొవ్వొత్తి వెలిగించు కోవడం మానెయ్యాలని నిశ్చయించుకున్నాడు, అంతగా తాను చేసు కోవాల్సిన పనివుంటే, ఇంటి యజమానురాలి గదిలోకెళ్లి అక్కడ కూచుని ఆ కొవ్వొత్తి వెలుగునే తాను కూడా పనిచేసుకోవచ్చు ననుకున్నాడు; వీధిలో నడిచేటప్పుడు రోడ్డుమీద వుండే గుండురాళ్లపై అతి జాగ్రత్తగా అతి తేలికగా, ఇంచుమించు మునివేళ్లమీదనే నడవాలనీ, అలా నడిస్తే జోడు

అడుగు అట్ట, మడమ అంత త్వరగా అరిగిపోవనీ, మరమ్మతు డబ్బు ఆదా చేసుకోవచ్చుననీ నిర్ణయించుకున్నాడు; ఎప్పుడో ఒక సారిగాని, అంత తరుచుగా చాకలికి గుడ్డలు వేయకూడదనీ, బట్టలు చాలా కాలం మన్నేందుకని, ఇంటికి రాగానే వాటిని విడచేసి, జీర్ణమైపోయి నిజంగా కాలగర్భంలో కలిసిపోకుండా ఇంకా ఎలా మనగలుగుతూందో ఆశ్చర్య పడాల్సినటువంటి తన జమలినూలు డ్రెస్సింగ్‌గౌను మాత్రమే ఇంట్లో వున్నంత సేపూ తొడుక్కొని వుండాలనీ మనస్సు గట్టిచేసుకున్నాడు. నిజం చెప్పాలంటే ఈ పొదుపరితనానికి అలవాటు పడడమంటే మొదట్లో అకాకి అకాకియెవిచ్‌కి తలప్రాణం తోకకొచ్చినట్టయి ఎంతో కష్టమే అనిపించింది; కాని కాలక్రమేణ అందుకతడు అలవాటు పడిపోయి, తరువాత అదే ఎంతో బాగుందనిపించింది; సాయంకాలం కడుపు మాడ్చుకోవడం అతనికేమీ కష్టమే అనిపించలేదు; ఇప్పుడతనికి బలవర్ధకమైన ఆధ్యాత్మికాహారం లభించింది; ఓవర్‌కోటును సాధించడమనే మహత్తర భవిష్యదాశయంపై అతని మనస్సు లగ్నమైంది. అతని జీవితమే మరింత సమగ్ర సంపూర్ణత నొందినట్టూ, తాను వివాహమాడినట్టూ, తనతో కూడా మరొక జీవి తన చెంతనే వుంటూన్నట్టూ, ఒంటరి జీవితమనేది తానిదివరకెన్నడూ ఎరగనట్టూ, ప్రియతమమైన సహజీవి తన జీవితయాత్రలో సహచర్యాన్ని నెరప నంగీకరించినట్టూ అతనికొక నూతనానుభూతి కలిగింది — ఈ ప్రియతమ సహధర్మచారిణి మరేదీకాదు, ప్రశస్తమైన దళసరి దగలా అస్తరువేసి శాశ్వతంగా మన్నేటట్టు తయారుకానున్న తన భావి ఓవర్‌కోటు తప్ప మరేదీకాదు. ఒక నూతన జీవితోత్సాహం అతనిని ఆవరించింది; తన జీవితలక్ష్యం ఏమిటో, దానిని స్థిరపరచుకుని దానిని—

సాధించే మార్గం ఎట్టిదో గ్రహించిన సాధకుని వలె అతని స్వభావం అప్పుడే కొంత దృఢపడజొచ్చింది. అతని ముఖ కవళికలలోనూ హావభావచేష్టల్లోనూ అన్ని శంకలూ సంశయాలూ తీరిపోయాయి, అన్ని అనుమానాలూ సందేహాలూ అదృశ్యమైపోయాయి — ఒక్క మాటలో చెప్పాలంటే అన్ని ఊగిసలాటలూ తటపటాయింపులూ అతని స్వభావంనుండి మాయమైపోయాయి. అప్పుడప్పుడు అతని కళ్లల్లో నూతన జ్వాల ఒకటి మెరసేది; అత్యంత సాహసోపేతమూ పరాక్రమశీలమూ అయిన ఆలోచన — తన ఓవర్‌కోటుకి మార్టెన్ బొచ్చు కాలరు ఎందుకు పెట్టించుకోకూడదా అనే ఆలోచన — ఒకటి అప్పటప్పట అతని మస్తిష్కంలో రగులుకొనేది. అతని ధ్యానమంతా అస్తమానమూ మరో లోకంమీదనే వుండడంచేత, ఈ లోకంలో పనులనుండి అతని మనస్సు రవంత చెదిరే వుండాలి మరి, ఒకనాడు ఆఫీసులో కాగితం ఒకదానికి నకలు రాస్తూ, చిన్న పొరబాటొకటి రాయబోతున్నాడన్న మాట — రాయబోతూ సరిగా సమయానికి గుర్తొచ్చి పెదవు కరచుకుని, "అరెరే!" అని ఇంచుమించు బిగ్గరగానే కేకేసి, దేవుడిని తల్చుకుని, వొంటిపై శిలువగుర్తు చిత్రించుకున్నాడు. ప్రతి నెలా అధమం ఒకసారైనా పెత్రోవిచ్ ఇంటికెళ్లి, అతనిని కలుసుకుని, ఓవర్‌కోటు విషయమై అతనితో భేటీవేసి, చర్చలు జరిపి, ఏ దుకాణంలో నమ్మకమైన మంచి గుడ్డ చవుక ధరకి దొరుకుతుందో, గుడ్డకి ఎటువంటి చాయ వుంటే బాగుంటుందో వగైరా విషయాలన్నీ నిశ్చయించుకుని ఇంటికి వచ్చేవాడు. ఈ తర్జనభర్జనలన్నీ అతని మనస్సును కొద్దిగా కలవరపెట్టిన మాట నిజమే. కాని ఓవర్‌కోటుకు కావాల్సిన డబ్బంతా తాను త్వరలో జతపెట్ట గల్గుతున్నాను గదా

అని ఆనందభరితుడవుతూ, ఇక అద్యతన భవిష్యత్తులో తన ఓవర్‌కోటు సిద్ధంగా వుంటుందికదా అని ఉవ్విళ్ళూరుతూ మంచి హుషారుగా ఇంటి కొచ్చేవాడు.

తాను ఎంతకాలమో వేచివుండాలనుకున్నది అవసరమే లేకపోయింది, వ్యవహారమంతా అతి త్వరగా రహితమైపోయింది. అకాకి అకాకియెవిచ్ పెట్టుకున్న ఆశలనన్నిటినీ తలదన్ని డైరెక్టరు అతనికి నలభై కాదు, నలభై ఐదూ కాదు, ఏకంగా అరవై రూబుళ్లు ఇచ్చాడు. అకాకి అకాకియెవిచ్ ఓవర్ కోటు కొనుక్కోవాల్సి వుందన్న విషయం డైరెక్టరుకి కూడా తోచిందో, మరి అది యాదృచ్ఛికంగానే జరిగిందో, ఏమైతేనేమి, తనచేతిలో ఇరవై రూబుళ్ళు అధికంగా వచ్చిపడడం మాత్రం వాస్తవం. ఈ సందర్భంవల్ల వ్యవహారమంతా నిమిషాలమీద జరిగిపోయింది. మరొక్క రెండు నెలలు, మూడు నెలలు ఆకలిదప్పుల కోర్చుకొని ఎలాగో ఒకలాగు కాలక్షేపం చేశా డంటే, ఇంచుమించు ఎనభై రూబుళ్లు జాగ్రత్త పెట్టేడాన్నమాటే. అసలు అకాకీ అకాకియెవిచ్‌ది మందకొడి శరీరతత్వం; అటువంటిది అతడి గుండెలు ఇప్పుడు ఉద్రేకంతో దడదడా కొట్టుకోవడం మొదలుపెట్టాయి. డబ్బు చేతిలో పడిన మరుచటి దినమే పెత్రోవిచ్‌తో కలిసి బట్టల కొట్లకి వెళ్లాడు. ఇద్దరూ కలిసి నిజంగా భేషైన గుడ్డ కొనుక్కొచ్చారు. అవును మరి — అందులో ఆశ్చర్యమేముంది? గుడ్డమీద అనవసరంగా హెచ్చు డబ్బు పెట్ట కుండా వుండేందుకని ఆరునెలలై ప్రతి బట్టలకొట్టూ తిరిగి ధరలు అన్నీ వాకబుచేశారాయె; ఫలితంగా, పెత్రోవిచ్ అన్నట్టు, ఇంతకంటె ప్రశస్తమైన గుడ్డ దొరకడం మరి దుస్సాధ్యమే. అస్తరుకోసం పట్టుగుడ్డ బదులు క్యాలికో గడ్డే మంచిదనుకున్నారు; ఎందుచేతంటే, వాళ్లుకొన్న క్యాలికో

ఎంత సొగసుగానూ ఎంత తరుచుగానూ వుందంటే, పెత్రోవిచ్ అన్నట్టు, పట్టుకంటె ఇదే ఎంతో నయంగా వుండడమే కాకుండా, చూడడానికి మరింత అందంగా మరింత మెరుపుగా వుంది కూడాను. కాలరు కోసం మార్టెన్ బొచ్చు కొనలేదు. ఏమంటే అది నిజంగా ఎంతో ప్రియంగానే వుంది; దాని బదులు పిల్లిబొచ్చు కొన్నారు — అదైనా, అన్ని కొట్లూ గాలించి అన్నిటి కంటె భేషైన పిల్లిబొచ్చు కొన్నారు — ఆ మాత్రం ఈ మాత్రం దూరం నుండి చూస్తే అది మార్టెన్ బొచ్చే అనుకుంటారు అందరూను. ఓవర్ కోటును రెండు వారాల్లో తయారు చేసేశాడు పెత్రోవిచ్, అదైనా బోలెడు దగలా కుట్టుకుట్టాల్సి వుండెను కాబట్టి అన్ని రోజులు పట్టింది, లేకుంటే ఇంకా త్వరగానే తయారుచేసి వుండేవాడు. దర్జీ మజూరీకిగాను పెత్రోవిచ్ పన్నెండు రూబుళ్లు పుచ్చుకున్నాడు — అంతకంటె తక్కువ కూలి మాట అసలు నోరెత్తడానికే వీల్లేదు: కుట్టు అంతా పట్టుదారంతో కుట్టాల్సి నట్టి మజుబూతు పనాయె, అదైనా రెండు వరసల దగ్గర దగ్గర కుట్టు కూడాను; అదిన్నీ ప్రతి కుట్టూ పెత్రోవిచ్ స్వయంగా తన పళ్లతో పరీక్షించి చూశాడు, అందుకు దాఖలాగా వాటిమీాద ఎక్కడ పడితే అక్కడ అతగాడి రకరకాల పంటి గుర్తులు స్పష్టంగా అగపడుతూనే వున్నాయి కూడా.

అది సరిగ్గా ఏ రోజో చెప్పలేంగాని... ఆరోజు మాత్రం, ఏ రోజైతే పెత్రోవిచ్ ఓవర్‌కోటు అంతా కుట్టేసి, చివరికి దానిని అందజేశాడే ఆ రోజు మాత్రం అకాకి అకాకియెవిచ్ జన్మానికంతటికీ ఒక శివరాత్రి అని మాత్రం నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆరోజు ఉదయాన్నే, మరి కాస్సేపు పోతే అకాకి అకాకియెవిచ్ ఆఫీసుకు బయల్దేరుతాడనగా, పెత్రోవిచ్ ఓవర్

కోటు పట్టుకొచ్చాడు. ఓవర్‌కోటు ఆ రోజు అందడంవల్ల ఓవర్‌కోటు అవసరం మరీ బాగా తెలుసుకొచ్చింది, ఎందుకంటే ఆ రోజు చలి ఎముకలు కొరికేస్తూ మరీ ఉధృతంగా ప్రారంభించింది. ఇక కాలమానపు స్థితిగతులు చూడబోతే చలి ఉధృతం ఇంకా అధికం అయేటట్టే వుండెను కూడా. అసలైన దర్జీ ఎంత దర్జాగా ఎంత ఠీవిగా తాను తయారు చేసిన శాల్తీ పట్టుకుని లోనికి వస్తాడో, అలా వచ్చాడు ఓవర్‌కోటు పట్టుకుని పెత్రోవిచ్ అకాకి అకాకియెవిచ్ ఇంటికి. పెత్రోవిచ్ వదనంలో ఎంతటి ప్రగాఢమైన గంభీరత ద్యోతకమౌతూందంటే, అతని ముఖం అంతలా వుండడం అకాకి అకాకియెవిచ్ ఇదివరకెన్నడూ చూసి ఎరగడు. తాను నిర్వర్తించిన కార్యం ఏమంత తక్కువదేమీ కాదనీ, ఏదో పాతకోట్లకి మళ్లీ అస్తరు వేయడమో, చిరిగిపోయిన కోట్లను మరమ్మతు చెయ్యడమో, ఇలాంటి ఆషామాషీ పనులుచేసే చిల్లర దర్జీవాళ్లకూ, కేవలం సరికొత్త కోట్లను కుట్టే దర్జీవాళ్లకూ బ్రహ్మాండమైన అగాధాన్ని తాను స్వయంగా ఎరిగి వున్నట్టూ అతని ముఖవర్చస్సులోనే ప్రస్ఫుటంగా తెలిసిపోతూంది. ఆ ఓవర్‌కోటును పెద్ద రుమాలులో చుట్టి తెచ్చాడేమో, ఆ రుమాలును విప్పి ఓవర్‌కోటును పైకితీశాడు పెత్రోవిచ్ (ఆ రుమాలును అప్పుడే ఇస్త్రీచేసి తీసుకొచ్చింది చాకలిమనిషి; ఓవర్‌కోటును రుమాలు చుట్టలో నుండి తీసి, అప్పుడా రుమాలును మడతపెట్టి భవిష్యదుపయోగార్థం తన జేబులో భద్రపరచుకున్నాడు). రుమాలు మూటనుండి ఓవర్‌కోటును తీసి, సగర్వంగా నలుమూలలా పరికించిచూసి, దానిని తన రెండు చేతులతోనూ పట్టుకొని, అకాకి అకాకియెవిచ్ భుజాలచుట్టూ అది పడేటట్టుగా దానిని అతి లాఘవంగా విసరి, అది అకాకి అకాకియెవిచ్ భుజా

లను పరివేష్టించి అలంకరించగానే దానిని చురుకుగా కిందకి చటుక్కున లాగి, వంగి తన చేతులతో ఒగ్గులు లేకుండా సాపుగా సర్దాడు. తరువాత అకాకి అకాకియెవిచ్ విగ్రహాన్నంతా అది కప్పేటట్టుగా వుంచి, ముందు మాత్రం గుండీలు పెట్టకుండా వుంచేశాడు. వయసు మళ్లి పెద్దవాడై పోవడంచేత అకాకి అకాకియెవిచ్ కోటు చేతుల్లో, చేతులు దూర్చి ఎలాగుంటుందో చాడ్డానికి ప్రయత్నించగా, పెత్రోవిచ్ అతనికి సాయంచేశాడు. చేతులు దూర్చి తొడుక్కుని చూసకుంటే — భేషుగ్గా వుంది. ఒక్కమాటలో చెప్పాలంటే — ఓవర్‌కోటు కొలంతా ఎక్కడికక్కడికి సరిపోయి, భలే చక్కగా అమరి, ఎంతో అంత నీటుగా తయారైంది. ఈ సదవకాశం ఎందుకు జారవిడవాలని అనుకుని, తాను ఏ డాబూ దర్పమూ లేకుండా ఒక సైన్ బోర్డు అయినా లేకుండా ఏ సందుగొందిలోనో వుండడం కారణంగానూ, అకాకి అకాకియెవిచ్‌ని తాను చాలా కాలంగా ఎరిగి వుండడం చేతనూ ఇంత చవుకగా మజూరీ పుచ్చుకున్నానని పెత్రోవిచ్ అకాకి అకాకియెవిచ్‌తో అన్నాడు. అకాకి అకాకియెవిచ్చే గనుక తన ఓవర్‌కోటును నెవ్‌స్కీ ప్రాస్పెక్ట్‌లో వున్న ఏ దర్జీషాపులోనో పురమాయించే వుండినట్టయితే, ఒక్క కుట్టుకూలికే డెబ్బై ఐదు రూబుళ్లు ఖండించి పుచ్చుకుని వుందురన్న విషయం కూడా పెత్రోవిచ్ ఈ సదవకాశం వినియోగించుకుని చెప్పేశాడు. ఈ విషయమై పెత్రోవిచ్‌తో చర్చించడానికి అకాకి అకాకియెవిచ్‌కి ఏ మాత్రమూ మనస్కరించలేదు, ఎందుచేతంటే తన ఎదుటి మనిషిమీద ప్రభావం కలిగించాలనే ఉద్దేశ్యంతో పెత్రోవిచ్ తన నోటంట మంచినీళ్లప్రాయంగా గడగడమని దొర్లిస్తూన్న పెద్దపెద్ద మొత్తాలను వింటూంటేనే నిజానికి తనకి భయం వేసుకొస్తూందాయె. పెత్రోవిచ్‌కి ఇవ్వాల్సిన మజూరీ డబ్బు

ఇచ్చేసి, తన కొత్త ఓవర్‌కోటు తొడుక్కుని, అతడు వెంటనే ఆఫీసుకు బయల్దేరాడు. అతనితో కూడా పెత్రోవిచ్ వీధిలోకొచ్చి, తన కళాసృష్టిని ఆనందపరవశుడై దూరంనుండి వీక్షిస్తూ తాను నిలుచున్న చోటనే అలా నిలబడిపోయాడు. అలా చూస్తూన్నవాడల్లా ఉన్నట్టే వుండి తటాలున ఆ చోటనుండి కదలి, అడ్డు సందున బడి, మరికాస్త ఎగువగా వీధిని అందుకుని, వీధి రెండవ చివరనుండి ఈ సారి ముఖాముఖీ ఎదురుగా ఆ ఓవర్‌కోటును మళ్లీ చూడ్డానికని పరుగెత్తాడు. ఈలోపున అకాకి అకాకియెవిచ్ ఆఫీసుకు నడుస్తున్నాడేగాని, అతడీ లోకంలో లేనేలేడన్నమాటే. తన వొంటిపై ఒకసరికొత్త ఓవర్‌కోటు వుందన్న విశేషం అతడు ఒక్క క్షణమైనా మరచిపో లేకపోయాడు. ఆ సంగతి తల్చుకు తల్చుకుని, ఆ తల్చుకోవడమే ఒక ఆనంద కారణమై అప్రయత్నంగా తనలో తాను అదే నవ్వుకున్నాడు. అవును మరి — కొత్త ఓవర్‌కోటు వుండడంలో రెండు ఉపయోగాలున్నాయి: ఒకటేమిటో వొంటికి వెచ్చగా ఎంతో హాయిగా వుంది; ఇక రెండవది, ఓవర్ కోటు అతి ముచ్చటగా వుంది. ఇలాగు అనుకుంటూనే వున్నాడు, తాను చూసుకోకుండానే అప్పుడే ఆఫీసు చేరుకోవడమూ, ఆఫీసులో కాలుపెట్టి ముందు హాలులో నిలబడడమూ అన్నీ జరిగిపోయాయి. హాలులో తన ఓవర్ కోటు విప్పేసి, దానిని నిదానంగా పరీక్షించి, తలుపు దగ్గర వుండే కావలి బంట్రోతుకు దానిని జాగ్రత్త సుమా అని అప్పగించాడు. అకాకి అకాకియెవిచ్ కొత్త ఓవర్‌కోటు తొడుక్కుని వచ్చాడన్న సంగతి ఎలా తెలిసిపోయిందో ఏమిటో మరి, అకాకి అకాకియెవిచ్ తన 'కపోట్'కి స్వస్తిచెప్పేసి కొత్త ఓవర్ కోటు వేసుకొచ్చాడన్న వార్త ఆఫీసంతటా కార్చిచ్చులా వ్యాపించిపోయింది. దాంతో, అకాకి అకాకియెవిచ్ కొత్త ఓవర్‌కోటును చూద్దామంటే చూద్దా

మని ఆఫీసులో వున్న వారందరూ తోలాకి తోలా పరుగెత్తుకుంటూ హాల్లోకి వచ్చి, అకాకి అకాకియెవిచ్ ఓవర్‌కోటును అందరూ తిలకించారు. తిలకించి అందరూ అతనిని అభినందించారు. అందరూ అతనికి శుభాకాంక్షలు తెలియ పరచడం మొదలుపెట్టారు. ఇదంతా విని అతడు మొదట మందహాసం చేశాడు. మందహాసం చేశాడేగాని, తరువాత మాత్రం గాభరాపడ్డాడు. కాని ఎప్పుడైతే వారందరూ అతనిని అభినందించుతూ, కొత్త ఓవర్‌కోటు గౌరవార్థం అతడు తప్పకుండా తమకందరకూ విందుచేయాలనీ, పోనీ విందు చేయకపోతే మానె, అధమం అల్పాహారానికైనా ఆహ్వానించాలని అందరూ పట్టుబట్టే సరికి, అతడు పూర్తిగా తబ్బిబ్బు పడిపోయి, ఏమి చెప్ప డమో ఏమి చెయ్యడమో ఏమి చెందడమో, ఈ చిక్కునుండి ఎలా బయటపడ డమో అతనికేమీ పాలుపోయిందికాదు. కాస్సేపయాక ఎర్రబారిన ముఖంతో, తన ఓవర్‌కోటు కొత్తదేమీ కాదనీ, మరిగంటే... అనగా, చెప్పవచ్చిందేమి టంటే... చూశారుగదూ, ఆ విషయం... అనగా, తనది పాత ఓవర్ కోటేననీ, సత్యకాలంగా నవ్వుతూ వాళ్లకు నచ్చచెప్ప జూశాడు. చివరికి ఆ గుమా స్తాలో ఒకతను — ఎవడో లాకాయ లూకాయ గుమాస్తా అనుకుంటున్నా రేమో సుమండీ, అదేమీకాదు, సాక్షాత్తూ అసిస్టెంటు హెడ్‌గుమాస్తా — తానేమీ గర్వపోతును కానని చెప్పుకోవడానికీ, తనకంటె కింది హోదాలో వున్నవారితో సహవాసం చేయడమంటే పరువుతక్కువ అని తాను భావించననీ నలుగురూ అనుకోవాలనే ఉద్దేశంతోనూ:

"సరే, అలాగే కానీయండయ్యా! అకాకి అకాకియెవిచ్ బదులు నేనే అల్పాహార విందు చేస్తాను. అయ్యా, మీరందరూ ఈవేళ సాయంత్రం

నాయింటికి టీ పార్టీకి దయచేయండి! అసలు ఈవేళ నా పుట్టినరోజు కూడానూ'' అన్నాడు.

సహజంగానే గుమాస్తాలందరూ అసిస్టెంటు హెడ్‌గుమాస్తాను అభినందించి, ఆయన ఆహ్వానం తక్షణమే అంగీకరించారు. అకాకి అకాకియెవిచ్ టీపార్టీనుండి తప్పించుకుందుకు మొదట శాయశక్తులా ప్రయత్నించాడు. కాని అది చాలా అమర్యాదగా వుంటుందనీ, ఆహ్వానం తిరస్కరించడానికి తాను ఎంతైనా సిగ్గుపడాల్సి వుంటుందనీ అందరూ అనేసరికల్లా, ఇక తప్పించుకుందుకు వీల్లేక, తాను కూడా రావడానికి ఒప్పుకున్నాడు. తన కొత్త ఓవర్‌కోటు తొడుక్కుని సాయంత్రం పూట షికారు వెళ్లేందుకు చక్కని అవకాశం లభించింది కదా అని లోలోన మురిసిపోతూ, తాను వెళ్లడానికి ఒప్పుకున్నందుకు తరువాత మాత్రం సంతోషించాడు.

నిజంగా అకాకి అకాకియెవిచ్‌కి ఆ రోజు పరమపవిత్రమైన పర్వది నమే. ఆఫీసునుండి మంచి సరదాగా అతడు ఇంటికి వచ్చాడు. ఇంటికి వచ్చి, తన ఓవర్‌కోటును విప్పేసి, దానిని అతిజాగ్రతతో గోడకు తగిలించి, గుడ్డనీ అస్తరునీ చూసి మళ్లీ మరొకసారి ఆనందించి, కాస్సేపు అలా నిలబడిపోయి, చేతితో ముట్టుకుంటేనే ఎక్కడికక్కడికి విడిపోతూన్న తన పాత ఓవర్ కోటును తరువాత తెచ్చి, రెండింటికీ వున్న వ్యత్యాసాన్ని కన్నులార చూసేందు కని, దాని సరసనే వుంచాడు. ఆ దృశ్యాన్ని వీక్షించి సంతోషం ఆపు కొనలేక: ''ఆరె బాబోయ్, రెండింటికీ ఎంత తేడా వుందో!'' అని నవ్వుకున్నాడు. అలా అనుకుంటూనే భోజనానికి ఉపక్రమించాడు. భోజనం చేస్తూన్నంత సేపూ అతని మనస్సులో ఒక్కటే ఆలోచన — తన పాత ఓవర్‌కోటు నిజంగా ఎంత అవమానకరమైన స్థితిలో వుందోకదా అని అనుకుని అదే నవ్వుకు

న్నాడు. ఆ రోజు భోజనం ఎంతో రుచిగా వున్నట్టనిపించి, హాయిగా కడుపు నిండుగా భోంచేశాడు. భోజనం అయాక ఒక్క కాగితానికైనా నకలు రాయకుండా, ఇంద్రభోగం అనుభవించే భోగలాలసునిలా, పక్కమీాద పడుకుని చీకటి పడేవరకూ చిన్న కునుకు తీశాడు. తరువాత మరేమీా నానుపు లేకుండా, చప్పున బట్టలు తొడుక్కుని, ఓవర్‌కోటును పైమీాదవేసుకుని వీధిలోకి బయల్దేరాడు.

టీపార్టీ చేస్తూన్న ఉద్యోగి ఇల్లు ఎక్కడుందో సరిగ్గా మాకు తెలియదని చెప్పడానికి మేమెంతో చింతిల్లుతున్నాము. మా జ్ఞాపకశక్తి బొత్తిగా క్షీణించి పోవడంతో సెంట్ పీటర్స్‌బర్గ్‌లో వున్న వీధూలూ, ఇళ్లూ అన్నిటి గురించీ ఇప్పుడు మాకు బొత్తిగా గుర్తులేకుండాపోయి, అంతా అయోమయంగానూ కలగాపులగంగానూ వుండి, ఏ వీధి ఎక్కడుందో ఏమిటో ఏమీా చెప్పలేకుండా వున్నాం. సరే, దానికేంగాని, సెంట్ పీటర్స్‌బర్గ్‌లో ఘరానాశ్రేణులు నివసించే పేటలోనే ఈ ఉద్యోగి ఇల్లు వుందనడంలో ఎట్టి సందేహం ఉండనవసరం లేదు. అనగా, ఆ పేటకీ అకాకి అకాకియెవిచ్ బస వున్న పేటకీ అతిదూరం అన్నమాట. అతని ఇల్లు చేరుకోవాలంటే అకాకి అకాకియెవిచ్ మొదట కొన్ని వీధులు దాటాల్సొచ్చింది. ఆ వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి; వీధిలో దీపాలు మసకమసకగా వెలుగుతున్నాయి. కాని ఆ ఉద్యోగి ఇల్లు దగ్గర పడుతూన్నకొద్దీ, వీధులు మరింత సందడిగా వుండి, జన సమ్మర్దం అధికమై, దీపాలు ఉజ్వలంగా వెలుగుతున్నాయి. లెక్కాపద్దూ లేకుండా వున్నారు వీధిలో నడిచేవాళ్లు. స్త్రీలు మంచి మంచి దుస్తులు వేసుకున్నారు. పురుషులలో అనేకులు బీవర్ బొచ్చు కాలర్లు వున్న ఓవర్‌కోట్లు తొడుకున్నారు. చెక్కతోచేసి, ఇత్తడి మేకులు బిగించి కుసి

క్రరలు పక్క దిగ్గొట్టిన పల్లెటూరి స్లెయ్‌బళ్ళూ, వాటికి సారథ్యం వహిస్తూన్న నాటుపురపు బళ్ళవాళ్ళూ ఆ వీధుల్లో బాగా తక్కువే; అందుకు బదులు రథసారథులందరూ ఎర్రని ముఖమల్లు టోపీలు పెట్టుకుని పహిల్వాన్లలా వున్నారు; స్లెయ్‌బళ్ళన్నీ లక్కపూసి నిగనిగలాడుతూ, ఎలుగ్గొడ్డు తోళ్ళు కప్పి వున్నాయి. సారథి కూచునే స్థానం అలంకారాలతో మెరుస్తూ, మంచుపై కరకరమని శబ్దం చేసుకుంటూ మిక్కిలి వడిగా సాగిపోతూన్నాయి గుర్రపుబళ్ళు ఆ వీధుల వెంట.

దీనినంతనూ ఇదేమొదటసారి కొత్తగా చూస్తూన్నట్టు అకాకి అకాకియెవిచ్ నివ్వెరపోయి చూడసాగాడు. చీకటిపడిన తరువాత అతడు తన గది వదలిపెట్టి వీధిలోకి వెళ్ళి ఎన్ని సంవత్సరాలైందో మరి. దీపాలతో వెలిగిపోతూన్న ఒక షాపు కిటికీలో, కాలికి తొడుక్కున్న జోడును తీసివేసి, నగ్నంగానూ మిక్కిలి తీరుగానూ వున్న కాలును — అవును, నిజంగా ఆ కాలు ఎంతో వొయ్యారంగా వుంది — ప్రదర్శిస్తూన్న ఒక అందకత్తె, ఆమె వెనుక మరొక గదిలోనుండి తొంగి చూస్తూ, బుగ్గమీసాలూ, ఫ్రెంచి ఫాషన్‌లో కత్తిరించిన అందమైన చిన్నగడ్డం వున్న ఒక పురుషుడూ వున్న చిత్రపటం ఒకటి వుంటే, దానిని చూస్తూ నిలబడిపోయాడు అకాకి అకాకియెవిచ్. ఆ బొమ్మని చూచి అతడు తల పంకించి, నవ్వుకుని, ముందుకు సాగిపోయాడు. అతడు ఎందుకు నవ్వుకున్నాడోమరి — తానిదివరకు చూడని దృశ్యం — అటువంటి దృశ్యం చూడాలనే మన అందరి హృదయాంతరాళంలో ఏ మారుమూలో దాగుకొని వున్న కోర్కె — ఇప్పుడు తన కళ్ళబడిందనో, లేకుంటే గవర్నమెంటు ఉద్యోగు లందరిలాగానే అతడు కూడా తనలో తాను: "ఆరె! వీళ్ళతస్సాదియ్యా, ఏమండీ, ఈ ఫ్రెంచివాళ్ళు!

వాళ్ళు ఏది కావలని తల్చుకుంటే... అదే — మరేంలేదు — అదేనూ...''
అనుకున్నాడో మరి — మనకి తెలియదనుకోండి. ఇంతకీ — అసలు అతడు ఏవిూ అనుకో లేదేమో కూడా. పరకాయ ప్రవేశం చేసినట్టు ఇంకో మనిషి లోకి దూరి, అతడి మనస్సులో ఏమేమి ఆలోచనలు మెదలుతున్నాయో తెలుసుకోవడం ఎవరి తరం? చిట్టచివరకి అసిస్టెంటు హెడ్‌గుమాస్తా వుంటూన్న ఇల్లు చేరుకున్నాడు అకాకి అకాకియెవిచ్.

అసిస్టెంటు హెడ్‌గుమాస్తా మంచి దర్జాగా జీవిస్తూ ఒక వెలుగు వెలిగిస్తున్నాడు: మేడమెట్లపై హమేషా దీపం వెలుగుతూన్న మేడమీది వాటా. అకాకి అకాకియెవిచ్ హాల్లో కాలుపెట్టగానే, వరుసలుతీర్చి వున్న రబ్బరు పైజోళ్లమీద అతడి కళ్ళు వాలాయి. వాటి నడుమ హాలు నడ మధ్యను సమొవార్ ఒకటి బుస్సుబుస్సుమంటూ ఆవిరి మేఘాలు చిమ్ము తూంది. ఎన్నో ఓవర్‌కోట్లు గోడకి తగిలించి వున్నాయి. కొన్ని ఓవర్ కోట్లకు బీవర్ బొచ్చుకాలర్లూ, కొన్నిటి కాలర్లకు ముఖమల్లు కూడా వుంది. అవతలపక్క వున్న గదిలోనుండి పెద్దగా సందడీ మాటల గొల్లూ హాల్లోకి వినబడుతూంది. ఇక తలుపు తెరచుకొనే టప్పటికల్లా ఆ గొల్లు మరింత స్పష్టంగానూ మరింత బిగ్గరగానూ వినబడింది. తలుపు తెరచుకుని, పళ్లెం నిండా ఖాళీ టీ గళాసులూ, ఒక పాలజాడీ, ఒక బిస్కట్ల బుట్టా పెట్టుకుని యూనిఫారం దుస్తులు వేసుకున్న నౌకరు ఒకడు గదిలోనుండి బైటకొచ్చాడు. ఉద్యోగస్థులందరూ అక్కడకు చేరుకుని అప్పటికే కొంతసేపైందనీ, మొదటి తడవ టీ సేవించడం పూర్తి అయిందనీ దీన్నిబట్టి తెలుస్తూనే వుంది.

అకాకి అకాకియెవిచ్ తన ఓవర్‌కోటును తానే స్వయంగా గోడకి తగి లించి, గదిలోకి వెళ్లాడు. గదిలో కాలుపెట్టగానే — కొవ్వొత్తి దీపాలు,

ఉద్యోగస్థులు, పొగగొట్టాలు, చీట్లపేక బల్లలు ఒక్కసారే కనబడి అతని కళ్లు జిగేలుమన్నాయి. గది నాలుగు మూలలనుండీ ఒకరితో ఒకరు అందరూ ఎడతెరిపి లేకుండా గొడవగా మాట్లాడుకోవడమూ, బఱ్ఱుబఱ్ఱు మని కుర్చీలను ఈడూస్తూన్న శబ్దమూ వినబడి అతని చెవులు గడియలు వేసిపోయాయి. అతడు గదిలోకి వెళ్లి, ఏమి చేయడమో ఏమీ తోచక వెయ్యి విధాల ఆలోచిస్తూ గదిమధ్య అలా నిలబడిపోయాడు. కాని అతడ క్కడకు వచ్చాడన్న సంగతి ఎలాగు పసికట్టేశారో మరి, తక్షణమే అందరికీ తెలిసిపోయింది. దానితో, హర్షధ్వానాలు చేస్తూ, చప్పట్లు చరుస్తూ అందరూ అతనిని ఆహ్వానించి, అందరూ కలిసి మళ్లీ మరొకసారి అతని ఓవర్ కోటును వీక్షించేందుకు హాల్లోకి వెళ్లారు. ఇదంతా చూసి అకాకి అకాకియెవిచ్ మొదట్లో కొంత కంగారుపడి బెదిరిపోయినప్పటికీ, అతనిది కల్లా కపటమూ ఎరగని అమాయకపు స్వభావం అవడంచేత, వాళ్లందరూ తన ఓవర్‌కోటును మెచ్చుకోవడం చూసి, అతను మహా సంబరపడిపోయాడు. కాని మరో గడియకల్లా వారందరూ అతని సంగతీ, అతని ఓవర్‌కోటు సంగతీ పూర్తిగా మరచిపోయి, చీట్లపేక బల్లదగ్గర చేరి ఎత్తడపు ఆట గొడవలో పడిపోయారు — అవును అది సహజమే మరి.

ఇదంతా — ఈ రణగణ ధ్వని, ఈ బాతాఖానీ గొడవ, ఈ జనసందోహం — అకాకి అకాకియెవిచ్‌కి తొలుత చిత్రంగానూ అయోమయంగానే కనబడింది. ఎక్కడ కూచోవాలో, ఎక్కడ నిలబడాలో, ఏమిచెయ్యాలో ఏమి చెందాలో అతనికేమీ తెలియక అగమ్యగోచరంగా వుండెను. ఎలాగైతేనేమి చిట్టచివరకి చీట్లపేక ఆడుతూన్న వాళ్లలో ఒకరి పక్కను జేరి, పేకముక్కలను చూస్తూ, ఒకసారి ఈ ఆటగాడి ముఖ కవళికలూ, ఒకసారి

ఆ ఆటగాడి ముఖ కవళికలూ గమనించుతూ కూచున్నాడు. అలా కొంత సేపు కూచున్న తరువాత, అతనికి విసుగెత్తడం చేతనూ, అందులోనూ ముఖ్యంగా తాను మామూలుగా పండుకునే వేళ అప్పుడే చాలా సేపై దాటి పోవడం చేతనూ, ఫూరికే ఆవలించడం మొదలెట్టాడు. ఇక ఇంటికి వెళ్ళి పోదామని బుద్ధిపుట్టి అతిథిని కలుసుకుని అతని దగ్గర సెలవు తీసుకుందామని ప్రయత్నించాడు. కాని అతని కొత్త ఓవర్‌కోటు గౌరవార్థం ఒక గ్లాసు షాంపేను తామందరమూ అతనితో కలిసి తాగుతేనేగాని ఎంత మాత్రమూ వీల్లేదని వారందరూ బలవంతంచేసి, అతన్ని వెళ్లనీయక పోయడం వల్ల, ఇక విధిలేక అతను వుండిపోయాడు. సుమారు ఒక గంట సేపటిలో భోజనం వడ్డించారు. రష్యన్ చౌచౌ సాలడ్, చల్లని దూడ మాంసం, మాంసపు బజ్జీలు, క్రీముకేకులు, షాంపేనూ — ఇవీ బల్లమీదనున్న భక్ష్యాలు. వారందరూ పట్టుబట్టి అకాకి అకాకియెవిచ్ చేత రెండు గ్లాసులు షాంపేను తాగించారు. అది పుచ్చుకోవడంతో అతనికి మంచి చురుకుతనం కలిగి, ఆ గదిలో జరుగుతున్నదంతా అతి ఉల్లాసంగా వున్నట్టనిపించింది. అయినప్పటికీ, అంత ఉల్లాసంలోనూ కూడా, అప్పటికే రాత్రి పన్నెండు గంటలైందనీ, తాను ఇంటికి చేరుకోవాల్సిన వేళ చాలా కాలంకిందటే దాటి పోయిందనీ అతడు మరచిపో లేకపోయాడు. అతిథివద్ద సెలవు పుచ్చుకుందుకు అతనిని కలుసుకుంటే, అతడు అదీ ఇదీ అంటూ ఏదో చెప్పి తనను ఎక్కడ వుంచేస్తాడో అని భయపడి, అతనిని చూడకుండానే గదిలోనుండి చడీ చప్పుడూ లేకుండా చల్లగా జారుకుని తన ఓవర్‌కోటును తీసుకుందుకు హాల్లోకి వెళ్లి చూడగా, ఓవర్‌కోటు నేలమీద పడిపోయుండడం చూసి, అతని ప్రాణం చివుక్కుమంది. అతడు దానిని తీసి దులిపి, ఎక్కడా

ఒక నలుసు ధూళీ దుమ్మూ లేకుండా తుడిచేసి, దానిని తన బుజంపై కప్పుకుని, మేడమెట్లు దిగి, వీధిలోకొచ్చాడు.

వీధిలో ఇంకా దీపాలు వెలుగుతూనే వున్నాయి. అక్కడా అక్కడా ఏహోకొన్ని చిన్నచిన్న చిల్లర అంగళ్ళూ, నానారకాల నౌకర్లూ అలగా జనమూ పోగయే అహోరాత్రపు క్లబ్బులూ మాత్రం తెరిచి వున్నాయి; కడమవి మూసి వున్నప్పటికీ, వాటి తలుపుల కిందనుండి కనబడుతూన్న దీపపువెల్తురు, ఇంకా సభికులు, బహుశా ఏ దాసీలో ఏ మగనౌకర్లో — వీళ్ళు ఎక్కడున్నారో ఎక్కడ తిరుగుతున్నారో అతీగతీ తెలియని వాళ్ళ యజమానులు కిందామీదా పడుతూండగా, తమ లోకాభిరామాయణమూ, తమ పిచ్చాపాటీ కబుర్లూ సావకాశంగా ముగించుకుంటూన్నట్టి భృత్యువర్గం — లోపల ఇంకా వున్నారని తెలియ జెప్పుతూంది. ఉల్లాసంతో ఉట్టిపడుతూన్నట్టి మంచి హుషారైనట్టి చిత్తవృత్తులను మనస్సులో అనుభవించుతూ అకాకి అకాకియెవిచ్ చకచకా నడవడం మొదలెట్టాడు. ఎవరో ఒక స్త్రీ, తన సమస్త శరీరావయవములూ అసామాన్యమైన చలనాన్ని ప్రదర్శించుతూ మెరపు మెరసినట్టు అతని పక్కనుండే నడచి వెళ్ళిపోగా, ఆమె వెంటే పరిగెత్తాడు అకాకి అకాకియెవిచ్ — ఎందుకు పరిగెత్తాడో మరి తెలియదు. అలా పరిగెత్తాడేగాని, వెంటనే ఉత్తరక్షణంలోనే, చర్రున ఇంత వడిగా పరిగెత్తడానికి తనలో జవసత్వాలు ఎక్కడనుండి వచ్చాయి చెప్మా అని తనమట్టుకు తానే ఆశ్చర్యపడుతూ, మళ్ళీ వెనుకటిలాగానే మెల్లగా నెమ్మదిగా నడవడం ప్రారంభించాడు. కొన్ని వీధులు దాటాడు. మొదలూ కొసా లేని కొన్ని వీధులు పగటిపూటే ఏడుస్తూన్నట్టుండగా, రాత్రిపూట అవి ఏలాగుంటాయో ఇక చెప్పనవసరమే వుండదు. ఇటువంటి వీధులు ఇప్పుడతనికి దారిలో తటస్థ

పడ్డాయి. ఈ వీధులు మరింత దిక్కుమాలినవిగానూ మరింత నిర్జనం గానూ కనబడ్డాయి; దీపాలు ఎర్రబడిపోయి మిణకు మిణకుమంటూ వెలుగు తున్నాయి — చూడగా వాటిలో నూనె ఎక్కడికో షికారు కొడుతూన్న ట్టుంది. ఈ వీధులు దాటిన తరువాత, ఇక దుంగ ఇళ్ళూ, కంచెలూ వున్న పేట వచ్చింది. ఎక్కడా మనిషివాసనే లేదు. రోడ్డుమీద నిరవధికంగా విస్తరించి వున్న మంచు మాత్రం తళుకు తళుకుమని మెరుస్తూండగా, కిటికీతలుపులు బందుచేసి గాఢనిద్రలోమునిగి, కిందికి నడికొప్పులు దిగి పోయున్న గుడిసెలు నల్లని రేఖాచిత్రాల్లా కానవస్తున్నాయి. ఆ వీధి నడి మధ్యను పెద్ద చౌకు ఒకటుంది. ఆ చౌకు ఆవలివైపున వున్న ఇళ్ళు లీలగా కనబడుతున్నాయో కనబడడం లేదో కూడానూ. మొత్తంమీద ఆ చౌకు బ్రహ్మాండంగా వుండి అనంతంగా విస్తరించి వున్న భయంకరమైన ఎడా రిలా అవుపడింది. ఆ వీధివెంట నడిచి నడిచి, సరిగ్గా ఈ స్థలం చేరుకు న్నాడు అకాకి అకాకియెవిచ్.

ఎంతో దూరన — ఎక్కడో ఆ దేవుడికే తెలియాలి మరి — ఒక పోలీసు పహరా బడ్డీనుండి — ప్రపంచం ఏ కొసనో వుండాలి ఆ బడ్డీ — మసక మసకగా దీపపు వెల్తురు కనబడుతూంది. ఆ చౌకులో అడుగు పెట్టగానే, అంతవరకూ అకాకి అకాకియెవిచ్‌లో వున్న కులాసా అంతా ఎక్కడికక్కడికే ఎగిరిపోయింది. చౌకులో కాలుపెట్టాడోలేదో, అదొక మోస్తరు దిగులు ఒకటి తనకు తెలియకుండానే తనను ఆవరించి, ఏదో దుర్ఘటన ఒకటి సంభవించనున్నట్టు అనుమానం పుట్టి, అతని మనస్సుని వేధించడం మొదలుపెట్టింది. అతడు వెనక్కితిరిగి చూశాడు, తరువాత ఇటూ అటూ చూసుకున్నాడు: తన చుట్టూ ఆదిమధ్యాంతములు లేని సముద్రం ఆవ

రించినట్టూ, ఆ సముద్రం నడిమధ్య తానున్నట్టూ అతనికి అనిపించింది. ''ఎటూ చూడకుండా కళ్లు మూసుకుంటేనే మంచిది'' అనుకొని, కొంత సేపు కళ్లు మూసుకునే నడిచి, చౌకు దాటేందుకు ఇంకా ఎంత దూరం నడవాల్సి వుంటుందో చూసేందుకు మాత్రం కళ్లువిప్పి చూశాడు. కళ్లు విప్పి చూసేసరికి, తన కళ్ళెదుట ఇద్దరు మనుషులు నిలబడి వుండడం చూశాడు. ఆ మనుషుల గరిమీసాలు మాత్రమే అతనికి కనబడ్డాయిగాని, వాళ్లెవరో ఏమిటో ఆ చీకటిలో అతనేమీ పోల్చుకో లేకపోయాడు. వాళ్లని చూసేసరికి అతనికి కళ్లు తిరిగిపోయి, గుండెలు పేలిపోతాయేమో నన్నట్టు దడ ప్రారంభించింది.

''అరేయ్, ఇది నా ఓవర్‌కోటు రా!'' అని ఆ ఇద్దరిలో ఒకడు ఉరుము ఉరిమినట్టే కేకేసి, చటుక్కున ఓవర్‌కోటు కాలరు పట్టుకుని గట్టిగా ఒక్క గుంజు గుంజాడు.

''పోలీస్! పోలీస్!'' అని అకాకి అకాకియెవిచ్ కేకలెయ్యా లనుకున్నాడు గాని, ఇంతలో రెండవ మనిషి, పిడికిలి బిగించి — ఆ పిడికిలి ఇంతా అంతా కాదు, గవర్నమెంటు ఉద్యోగస్థుడి తలకాయంత వుంది — అతని ముఖం ఎదుట ఝళిపించుతూ: ''నోరు పెగిలిందంటే చూడు ఏంజేస్తానో!'' అన్నాడు. అకాకి అకాకియెవిచ్‌కి మీదిప్రాణలు మీదికే ఎగిరిపోయాయి, వాళ్లు ఏంచేసేందీ కూడా అతనికి గుర్తేలేకపోయింది. తాను తొడుగుకున్న ఓవర్‌కోటును తనచేత విప్పించేసి, దానిని వారు తీసుకుపోవడమూ, తీసుకుని తనను ఒక్క తాపు తన్నడమూ, ఆ తాపుతో తాను మంచులో బోర్లా పడిపోవడమూ — అత డెరిగినదంతా ఇదే, ఇంతకు మించి అతడికేమీ తెలియనే తెలియదు

పాపం. అలా పడిపోయినవాడల్లా కొద్ది నిముషాలవరకూ లేవలేకపోయాడు. ఏలాగైతేనేం కాస్సేపటికి లేచి, నాలుగు చెరగులా చూచేసరికి ఎక్కడా ఎవ్వడూ కనబడలేదు. ఉపద్రవంగా వేసుకొస్తూంది చలి, తన ఓవర్ కోటేమో లేదు. గొంతుక బద్దలయ్యేటట్టు కేకలు పెడదామనుకున్నాడు. కాని గొంతుక లేవలేదు. తాను పెట్టిన కేక ఆ చౌకు దాటి అయినా విన బడదేమో అని అతనికే అనిపించింది. ఇక నిరాశచేసుకుని ఒక్క నిముష మైనా ఆగకుండా అదే కేక వేసుకుంటూ పరుగెత్తి పరుగెత్తి చౌకులో ఆవలి పక్కనున్న పోలీసు బడ్డీని సరాసరి చేరుకున్నాడు. పోలీసువాడు తన గండ్ర గొడ్డలిని ఆనుకుని బడ్డీ పక్కను నిలబడున్నాడు. కొంప మునిగిపోయినట్టు ఆమడ దూరంనుండే అలా అరచుకుంటూ ఈ మనిషి ఎందుకిలా తనకేసి పరుగెత్తుకుని వస్తున్నాడు చెప్మా అని బహుశ అనుకుంటూ పోలీసువాడు చూస్తూ ఒక అడుగైనా ముందుకు వెయ్యకుండా అలాగు నిల బడే వున్నాడు. అకాకి అకాకియెవిచ్ ఆ పోలీసువాడి దగ్గరకు వెళ్లి: "నీ కంటి ఎదుటే బందిపోటు దొంగతనం జరుగుతూంటే ఇలా కళ్లు మూసుకు నిద్రపోతున్నావేమిటయ్యా?" అని రొజుకుంటూ రొప్పుకుంటూ కేకవేశాడు. తానదేమీ చూడలేదనీ, తాను చూసినదంతా చౌకు మధ్యను ఇద్దరు మనుషులు అతనికి (అకాకి అకాకియెవిచ్‌కి) ఎదురుపడి, అతనితో మాట్లాడడం మాత్రం తాను చూశాననీ, వాళ్లిద్దరూ అకాకి అకాకియె విచ్ స్నేహితులే అయివుంటారని తాను అనుకున్నాడనీ, అంతేగాని తననీలా ఉత్తపుణ్యానికే నిర్హేతుకంగా తిట్టిపోయడం బదులు రేపు ఉదయాన్నే సర్కిల్ ఇన్‌స్పెక్టరు దగ్గరకెళ్లి ఫిర్యాదు దాఖలు చేసుకుంటే, ఇన్‌స్పెక్టరుగారే స్వయంగా దొంగలను పట్టి తెచ్చి చోరీపోయిన

ఓవర్‌కోటును ఆయనే అతనికి తప్పక వొప్పజెపుతారనీ పోలీసువాడు జబాబు చెప్పాడు.

అకాకి అకాకియెవిచ్ అతి గందరగోళ పడిపోతూ, పరుగెత్తు కుంటూనే ఇల్లు చేరుకున్నాడు; కణతల పైనా, తల వెనుకాతలా కాస్తకాస్తగా పెరుగుతూన్న ఆ నాలుగు శిరోజములూ బాగా రేగిపోయున్నాయి. కోటు బుజాలూ ఛాతీ, పంట్లామూ — వీటినిండా మంచే. అతడు ఇంటి తలుపు గట్టిగా బాదుతూండడం విని, ఇంటి యజమానురాలు ముసలామె, నిద్ర నుండి తెలివి తెచ్చుకుని, ఆదరా బాదరా లేచి, కాళ్లకు జోళ్లనైనా సరిగా తొడుక్కోకుండా, ఒంటికాలి చెప్పజోడుతోనే, తన కమీజును బిడియంతో తన వక్షస్థలంపై ఒక చేతితో కూడదీసుకుంటూ, పరుగెత్తుకుని వెళ్లి తలుపు తీసింది. తలుపు తీసి, నానా గాభరా పడిపోతూన్న అకాకి అకాకియె విచ్ స్థితిని చూసి, హడిలిపోయి గభాలున పక్కకు తప్పుకుంది. ఎలాగైతేనేమి, అతడు కొంచెం స్తిమితపడిన తరువాత, జరిగిన వృత్తాంతమంతా చెప్పే సరికి, ఆమె కంగారు పడిపోయి, చేతులు రెండూ ఎగరేసి, అతడు వెంటనే వెళ్లి, జిల్లా సూపరింటెండెంటునే చూడవలిసిందనీ, సర్కిల్ ఇన్‌స్పె క్టరును నమ్ముకుంటే, అతడు అన్ని ఆశలూ చూపించి, ఇదిగో అదిగో అంటూనే, చివరికి మొండి చేయి చూపిస్తాడనీ, అందుచేత సూపరింటెండెం టును చూడడమే మంచిదనీ, అతనిని తాను ఎరుగుదుననీ, ఎందు చేతనంటే వెనుక ఒకప్పుడు తనదగ్గర వంటలక్కగా పనిచేసి వుండిన ఫిన్ లండ్ అమ్మాయి ఇప్పుడు ఆ జిల్లా సూపరింటెండెంటు ఇంట్లో ఆయాగా పనిచేస్తూండడం వల్ల ఆయనతో తనకు ముఖపరిచయం లేకపోయినా, పోల్చి పట్టగల్గుదుననీ, ఆయన తరుచు బగ్గీమీద ఈ ఇంటి పక్కనుంటే వెళ్తాం

డగా తాను చూస్తూ వుంటాననీ, అంతేకాకుండా ప్రతి ఆదివారమూ ఆయన తప్పనిసరిగా చర్చికి వెళ్తూంతాడనీ, ప్రార్థన సమయంలో ప్రార్థన చేసుకుంటూనే అతడు మందహాసం చేస్తూ అందరి కేసి కలియజూస్తూంటా డనీ, బహుశ ఆయన యోగ్యుడే అయి వుంటాడనీ ఆమె చెప్పింది.

విచారంతో కుంగిపోతూన్న అకాకి ఆకాకియెవిచ్ ఆమె చెప్పిన సలహా విని, కాళ్లీడ్చుకుంటూ తన గదిలోకి వెళ్లిపోయాడు. ఆ రాత్రంతా అతడు ఎలా గడపినదీ, ఇతరుల హృదయంలో ప్రవేశించి వారి కష్టసుఖాలను తెలుసు కొన గలవారే వర్ణించ గలగుతారు.

ఉదయమే లేచి అకాకి అకాకియెవిచ్ జిల్లాపోలీసు సూపరింటెండెంటుని చూడడానికని ఆయన ఇంటికి వెళ్లాడు. తీరా వెళ్లేసరికి ఆయనింకా నిద్ర నుండి లేవలేదని చెప్పారు. అందుచేత ఇంటికి వెళ్లిపోయి, పది గంటలకు మళ్లీ హాజరయాడు; ఆయన ఇంకా పండుకునే వున్నాడన్నారు. సరి అని చెప్పి, మళ్లీ పదకొండు గంటలకు హాజరయే సరికి, ఆయనను చూడ డానికి ఇది సమయం కాదన్నారు. సరే అనుకుని, మధ్యాహ్నం భోజనం వేళకి వెళ్లగా, ఏపనిమీద తాను వచ్చినదీ, అసలు విషయం ఏమిటో, ఏమి జరి గిందో ఆ తబిసీళ్లన్నీ ముందుగా తమతో చెబితేనేగాని ఏమైనా సరే సూప రింటెండెంటుగారి దర్శనం దొరకదు పొమ్మన్నారు ఆ ముందుగదిలో కూచున్న ఆఫీసు గుమాస్తాలు. తన జన్మలో ఇదివరకెన్నడూ అనిపించనిది, తానూ వూరూ పేరులేని అనామకుడిను కాననీ, తన గౌరవాన్ని నిలుపు కోవాలనీ అకాకి అకాకియెవిచ్‌కి చివరికి ఈనాటికి అనిపించి, జిల్లా పోలీసు సూపరింటెండెంటును తాను చూసితీరాలనీ, తాను ఆయనను చూడ కుండా అభ్యంతర పెట్టడానికి వారికి ఎట్టి అధికారమూ లేదనీ, అత్యవసర

మైన ఆఫీసు పనిమీద తాను వచ్చ[illegible]తాను గనుక వారిపై ఫిర్యాదు చేసినట్టాయనా ఫలితం వారే అనుభవిస్తారనీ కుండ బద్దలకొట్టినట్టు చెప్పాడు. దానితో ఆ గుమాస్తాలు ఇక ఏమనడానికీ భయపడిపోయి, సూప రింటెండెంటుగారితో కబురు చెప్పడానికని ఆ గుమాస్తాల్లో ఒకడు లోపలి కెళ్లాడు.

ఓవర్‌కోటు చోరీపోవడం కథంతా సూపరింటెండెంటు విని, చిత్రంగా అదేమిటో అదొకమోస్తరు విపరీతమైన ఆసక్తిని కనబర్చడం ప్రారంభించాడు. అసలు వ్యవహార మంతటికీ కీలకమైన ఘంశంపై తన దృష్టిని సారించడం బదులు — అకాకి అకాకియెవిచ్ అంత ఆలస్యంగా రాత్రిపూట ఇంటికి చేరుకోవడానికి కారణమేమిటి? బహుశా అకాకి అకాకియెవిచ్ ఏ అల్లర చిల్లర ఇంటికో వెళ్లాడేమో? — అని ఇలాగు లక్ష యక్షప్రశ్నలు వేయడం మొదలెట్టాడు. ఈ అడ్డుసవాళ్లన్నీ విని, పాపం అకాకి అకాకి యెవిచ్ పూర్తిగా కంగారుపడిపోయి, తన ఓవర్‌కోటును తనకు ఒప్ప చెప్పడానికని ఎన్నడైనా ఎట్టి చర్యనైనా తీసుకోవడమంటూ వుంటుందా అనే అనుమానంతో సతమతమౌతూ అక్కడనుండి వెళ్లిపోయాడు. ఆ రోజంతా మాత్రం అతడు మరి ఆఫీసుకి (తన జన్మలోకల్లా అదే మొదటసారి) హాజరుకాలేదు.

మరునాడు మనిషి బొత్తిగా బేలపడిపోయి, మునపటికంటెనూ మరీ దరిద్రం వోడుతూ ఏడుస్తూన్న తన పాత 'కపోట్' నే మళ్లీ తొడుక్కొని ఆఫీసుకు వెళ్లాడు అకాకి అకాకియెవిచ్చి. అతని ఓవర్‌కోటు పోవడం గురించి తోటి గుమాస్తాలందరూ విని, అతను కష సమయంలో వున్నప్పటికీ అతనిని వేళాకోళం చెయ్యడానికి వెనుదీయని వారు కొందరున్నప్పటికీ కూడా, వారిలో

అనేకులు పాపం చాలా విచారించారు. అతనికి సాయం చేయడానికని విరాళాలు పోగుచేదామని వారిలో కొందరు నిశ్చయం చేయడమేమో చేశారే గాని, డైరెక్టరుగారి చిత్రపటం కోసమని అదివరకే వారందరూ ఇతోధికంగా విరాళాలు వాగ్దానం చేసి వుండడం చేతనూ, దానికితోడు డిపార్టుమెంటు హెడ్‌గుమాస్తాగారి సూచనపై ఆయన స్నేహితుడెవడో ఒక గ్రంథకర్త రచించిన ఏదో ఒక పుస్తకం కొనడంకోసం వారందరూ చందాలు వేసి వుండడం కారణంగానూ వారి నెలజీతం ఏనాడో ముందుగానే ఖర్చు అయి పోవడంవల్ల, బహు స్వల్పమొత్తం మాత్రమే వసూలైంది. ఏమైతేనేంగాక, అకాకి అకాకియెవిచ్‌పై ఒక ఉద్యోగస్థుడికి మాత్రం ఎంతో కనికరం పుట్టి, తాను డబ్బు సాయం చేయలేకపోతే మానె, మరో విధంగా సాయం చేదామనిచెప్పి, ఇన్‌స్పెక్టరు వద్దకు ఎంత మాత్రమూ వెళ్లవద్దనీ, ఎందు చేతనంటే, అతగాడు తన పైఅధికార్ల మెహర్బానీ పొందాలనే ఉద్దేశ్యంతో కిందా మీదా పడి ఏదో ఒక విధంగా చోరీపోయిన ఓవర్‌కోటును ఆచూకీ కట్టి తిరిగి సంపాదించినా, దానిని అకాకి అకాకియెవిచ్‌కి తిరిగి స్వాధీనం చేసేముందు ఆ ఓవర్‌కోటు తనదేనని రుజువు చేయడానికని లక్షాతొంభై సాక్ష్యాలూ సంపన్నాలూ తేతెమ్మనమని అకాకి అకాకియెవిచ్‌ని మూడు చెరువుల నీళ్లూ తాగించి ముప్పతిప్పలా పెట్టి, చివరకి ఆ ఓవర్‌కోటు పోలీసువాళ్ల చేతిలోనుండి వూడిరాక అది వాళ్లే వుంచేసుకుంటారనీ, అందుచేత ఫలానా అతిముఖ్యుడైన వ్యక్తి ఒకతడు వున్నాడనీ, సరాసరి ఆయననే గనుక అకాకి అకాకియెవిచ్ వెళ్లి చూడడం చాలా మంచిదనీ, ఎందుచేతంటే, ఈ విషయం చూస్తూన్న వారి పేర ఈ అతిముఖ్యుడైన వ్యక్తి గనుక ఒక్క చీటీముక్క రాసి, వారి చెవిలో ఒక్క మాట పడేశాడంటే,

వ్యవహారమంతా ఏ చీకూ చింతా లేకుండా ఒక్క దెబ్బలో భలేగా పైసలై పోతుందనీ సలహాచెప్పాడు.

గత్యంతరంలేక ఈ అతిముఖ్యుడైన వ్యక్తిని చూద్దామనే నిశ్చయించు కున్నాడు అకాకి అకాకియెవిచ్. ఈ అతిముఖ్యుడైన వ్యక్తియొక్క అసలు హోదా ఏమిటో, అచ్చంగా అతని ఉద్యోగ మేమిటో ఇంతవరకూ ఎవ్వరికీ తెలి యదు. ఇక మీదటికీ తెలియబోదూ. మనకి తెలియాల్సినదల్లా ఏమిటంటే: ఈ అతిముఖ్యుడైన వ్యక్తి అంతా ఈ మధ్యనే అతిముఖ్యుడైన వ్యక్తి అయా డనీ, అంతకుముందు అంతముఖ్యుడైన వ్యక్తి కాడనీ తెలుస్తేమాత్రం చాలు. అంతేకాకుండా, ఈయన ఆఫీసుకంటే ముఖ్యమైన ఆఫీసులవాళ్లు ఈయన ఆఫీసు ఏమంత ముఖ్యమైనది కానేకాదనీ ఈనాటికీ అంటూనే వుంటారు కూడా. అయితే ఒకటి: ఒకరి దృష్టిలో ముఖ్యముకానివి మరొకరి దృష్టిలో అతి ముఖ్యముగా కనబడతాయి. ఇదేకాకుండా ఈ వ్యక్తికి తన ప్రాముఖ్యతను ఇంకా అనేక మార్గాలద్వారా అధికం చేసుకుందుకు ప్రయత్నించేవాడు. తాను రోజూ ఆఫీసుకు రాగానే ఉద్యోగస్థులందరూ తనను ఆఫీసు మేడ మెట్లపైన కలుసుకోవాలనీ; తనను చూచేందుకు వచ్చేవారందరూ, తన దర్శ నార్థం మొదట అర్జీ నొకదానిని దాఖలు చేసుకొని, తరువాత మాత్రమే వారు తన గదిలోకి రావాల్సి వుంటుందనీ, ఎవరినైనా సరే ఎంత మాత్రమూ నేరుగా తన ఆఫీసులోనికి పంపించ కూడదనీ; చిన్న విషయమయేది పెద్ద విషయమయేది, ప్రతి విషయంలోనూ తు.చ తప్పకుండా పకడ్బందీగా అతి కఠినంగా ఒకానొక రివాజు నడవాలనీ — అనగా స్థానిక రైటరుగుమాస్తా మొదట అర్జీని పుచ్చుకుని, నమోదుచేసుకోవాలనీ, తదుపరి, ఆ అర్జీని తాలూకా గుమాస్తాకు పంపించాలనీ, ఇతగాడు ఆ కాగితాన్ని అందుకుని

శాశ్వత సలహాదారు గుమాస్తాకు, అతడు కాకపోతో తాను నివేదించుకోవా ల్సిన పైఉద్యోగి ఎవడైతే వుంటాడో వాడికే పంపించాలనీ, ఈ తతంగ మంతా పాటించిన తరువాతనే ఏ కాగితమైనా తన దగ్గరకు రావాలనీ — ఫర్మానా మంజూరు చేశాడు. తనకంటె పైహోదాలో వున్న ఉద్యోగస్థుడిని అనుకరించి, తన కింది వాడిని యమయాతనలు పెట్టి, కాల్చుకుతినడ మనే అంటు జాడ్యం ఒకటి పవిత్రమైన రష్యాదేశంలో ప్రతివ్యక్తినీ పట్టుకుని తినేస్తూందని చెప్పడానికి మాకెంతో విచారంగా వుంది. ఏదో ఒక చిన్న చిల్లర ఆఫీసులో వున్న ఒకానొక శాశ్వత సలహాదారు గుమాస్తా ఉద్యోగికి ఆ ఆఫీసులోనే హెడ్‌గుమాస్తా పని కాగా, ఆ ఉత్తరక్షణంలోనే తాను కూచుని పనిచేసుకునే బల్ల దగ్గర ఇటూ అటూ చెక్కతో గదిలా చేయించి, ఆ గదికి రెండు తలుపులు పెట్టించి, దానికి ''హుజూర్ డివాణం'' అని నామకరణం చేసి, జరీ అంచు ఎర్ర కాలరు కోటు తొడుకున్న డవాలీ బంట్రోతును చెరి ఒకడినీ ఆగది ఎదుట ఇటూ అటూ కూచో బెట్టాడనీ, ఆ గదిలో తాను రాసుకునే బల్లకే అసలు జాగా లేకుండా వుండగా, తన దర్శనానికి వచ్చిన వారిని, ఆ గదిలోకి ప్రవేశం ఇవ్వడానికని ఆ ఇద్దరు డలాయతులూ చెరొక తలుపు తెరచి లోపలకు తన సమక్షానికి పంపించాలని హుకుం మంజూరు చేశాడని ప్రతీతి.

ఈ అతిముఖ్యుడైన వ్యక్తియొక్క వాలకమూ అలవాట్లూ అతి డాబుగానూ అతి దర్పంగానూ వున్నప్పటికీ కూడా, ఏమంత తెలివితేట లైనవని చెప్పడానికి వీల్లేకుండా వుండేవి. అతడి పద్ధతికల్లా మూలకందం కాఠిన్యం. ''కాఠిన్యం, కాఠిన్యం, ఇంకా ఇంకా కాఠిన్యం!'' — ఈ మాటలే అతని నోటంట ఎల్లప్పుడూ వచ్చేవి, ఆ రావడంలోనూ చివరి పదం ఉచ్చ

రించేటప్పుడు, ఎదుటి వాడి ముఖంకేసి అదేదో అర్థవంతంగా చూస్తూ మరీ ఉచ్చరించడం అతనికొక అలవాటు. ఈ కాఠిన్యానికి ప్రత్యేకమైన కారణ మేమీ వుండేదికాదు; ఎందుచేతనంటే, మొత్తం తన ఆఫీసు యంత్రాం గంలో వున్న పదిమంది ఉద్యోగులనూ అతడేలాగూ హడలుగొట్టేసి, గొప్ప గడగడాటుమీదే వుంచేవాడు. అతడు వస్తున్నాడని అంత దూరంనుండే వాళ్లు కనిపెట్టేసి, తాము చేస్తూన్న పనిని తక్షణమే అక్కడకు ఆపుజేసి హుజూర్ దరోగా గారు తమ మధ్యనుండి నడిచి తన గదిలోకి వెళ్లిపోయే వరకూ కొయ్యబొమ్మల్లాగు అలా నిలబడి వుండిపోయేవారు. తనకిందివారితో మాట్లాడినప్పుడు సాధారణంగా అతని సంభాషణ అంతా: "బుద్ధి జ్ఞానం లేకుండా ఏమిటయ్యా ఇది? ఎవరితో మాట్లాడుతూన్నదీ తెలిసే మాట్లాడుతున్నారా? ఎవరి సమక్షాన మీరు నిలబడి వున్నదీ మీరేమేనా గ్రహించారా?" — అనే ఈ మూడు వాక్యాలకు మాత్రమే పరిమితమై అతికఠినంగా ప్రతిధ్వనించేది. అయినప్పటికీ నిజంగా అతగాడిది మంచి హృదయమే; తన సహయోద్యోగులతో మంచి సరదాగా వుండేవాడు, మాట సాయమూ చేతి సాయమూ రెండూ వుండేవి అతని దగ్గర; కాని అతనితో వచ్చిన చిక్కు అంతా ఏమిటంటే: ఆఫీసు పెద్ద అయి, హుజూర్ దరోగా అధికారం చేతికి రాగానే అతడి బుర్ర తిరిగిపోయి, ఇక కిందా మీదా కన బడక, ఇది చెయ్యవచ్చును, ఇది చెయ్యకూడదు అనే విచక్షణాజ్ఞానం బొత్తిగా నిండుకుంది. తనతో సమానహోదాగల వ్యక్తితో వ్యవహరించు తూన్నప్పుడు ఇతడు మామూలుగానే వుండి, అతి మర్యాదగా అతిగౌరవంగా ప్రవర్తించడమేకాకుండా, అనేక సందర్భాల్లో తానేమంత తెలివి తక్కువవాడ ననిపించుకునేవాడే కాదు; కాని తనకంటె ఒక మెట్టు తక్కువ హోదాలో

వున్నవాళ్లతో మసలాల్సి వచ్చినట్టాయెనా, ఇక ఆ మనిషి పూర్తిగా చెడి పోయాడన్నమాటే: వాళ్ల మధ్యనున్నంత సేపూ మాటామంతీ లేకుండా అలా నోరు కుట్టుకు కూచునేవాడు; అతని స్థితి చూస్తే మహా జాలి వేసేది; ఇంతకంటే ఎంతో సరదాగా గడిపివుండేవాడినే అని అనుకుని తన మట్టుకు తానే బాధపడేవాడు కూడాను. ఏ సరదా అయిన బాతాఖానీలోనో, హాయిగా ఏ జట్టుతోనో తాను కూడా కలుద్దామని గట్టి కోర్కె ఒకటి అతని కళ్లలో కనబడుతూండేది; కాని మళ్లీ ఉత్తరక్షణంలోనే: అలా నలుగురితోనూ కలసిమెలసి వుంటే తన హోదాకి ఏ లోపం ఎక్కడవచ్చి పోతుందో ఏమిటో? అలా భాయ్‌భాయ్ అని బుజాలు కలిపి స్నేహంగా వుంటే తన గొప్పతనానికి తానే కళంకం తెచ్చుకోవడంకాదా? — అనే అనుమానం అతన్ని పీక్కుతినేసేది. ఈ ధోరణిలో తర్కించుకోవడం ఫలితంగా, ఇక ఆ నలుగురిలోనూ వున్న సమయమంతా అతని నోటికి తాళం పడిపోయి, ఒకమాటు 'అవును' అన్నట్టూ, ఒకమాటు 'కాదు' అన్నట్టూ, ఇలాగు ముక్తసరు మాటలతో సంభాషించే స్థితిలో పడిపోయేవాడు. దానితో "అంబాజీపేట ఆముదంరాయుడు" అన్నపేరు సంపాదించుకున్నాడు.

ఇటువంటి రకం అతిముఖ్యమైన వ్యక్తి దగ్గరకు వెళ్లాల్సొచ్చింది మన అకాకి అకాకియెవిచ్‌కి. ఆ వెళ్లడం కూడా ఎంచి ఎంచి దుర్ముహూర్తమప్పుడు — ఆ అతిముఖ్యమైన వ్యక్తికి అంత అశుభంగా పరిణమించక పోయినా, తనకు మాత్రం అతి అశుభంగా పరిణమించినట్టి దుర్ముహూర్తమప్పుడు — వెళ్లాడు.

అకాకి అకాకియెవిచ్ ఆ అతిముఖ్యమైన వ్యక్తి దర్శనార్థం వెళ్లిన సమయంలో, ఎన్ని సంవత్సరాలయో తాను కలుసుకోనట్టి, ఆనాడే సెంట్

పీటర్స్‌బర్గ్‌కు చేరుకున్నట్టే తన చిన్ననాటి మిత్రునితో, తన బాల్యస్నేహితునితో అతడు తన ఆఫీసుగదిలో సరదాగా భాతాఖానీ కొడుతున్నాడు. బష్మాచ్‌కిన్ అని ఎవరో ఒకతను తమ దర్శనంకోసం వచ్చాడండీ అని గుమాస్తా ఒకడొచ్చి, సరిగ్గా ఈ సమయంలో ఆయన గదిలోకి వచ్చి ఆయనతో చెప్పాడు. ''ఎవరది?'' అన్నాడాయన దభాలున చీదరించుకుంటూనూ. ''ఎవరో గవర్నమెంటు ఉద్యోగస్థుడండి'' అని జబాబు చెప్పాడా గుమాస్తా. ''సరే! నేనిప్పుడు తొందర పనిలో వున్నాను. కాస్సే వుంటేసరి!'' అన్నాడా అతిముఖ్యుడైన వ్యక్తి.

ఆ అతిముఖ్యుడైన వ్యక్తి గొప్ప అబద్ధం ఆడాడనే మనమిక్కడ చెప్పాల్సి వుంది. అతడు పనీ పాటూ ఏదీ లేకుండా వూరికే కూచున్నాడు. తన చిన్ననాటి మిత్రునితో చెప్పదల్చుకున్న ఖబుర్లన్నీ చెప్పనే చెప్పగా, ఇక చెప్పేందుకు ఏ సంగతులూ లేక, బాతాఖానీ మధ్యమధ్య చాలాసేపే ఆగిపోయి నీళ్లుకారిపోతూ, ఇతడి మోకాలు అతడు తట్టుతూనో, అతడి మోకాలు ఇతడు తట్టుతూనో: ''అవునోయ్, ఇవాన్ అబ్రామొవిచ్!'' అని ఇతడంటే, ''అవునోయ్, స్తెపాన్ వర్లామొవిచ్!'' అని అతడు ప్రత్యుత్తరమిచ్చే స్థితికి దిగజారిపోయింది. అయినప్పటికీ, తన దర్శనంకోసం వచ్చిన గవర్నమెంటు ఉద్యోగస్థులను తాను ఎంతసేపు పడిగాపులు కాచుకొని కూచోపెట్టగల్గుదునో చూడు అని, ఏనాడో గవర్నమెంటు ఉద్యోగంనుండి విరమించుకుని తన గ్రామంలో కాలం గడుపుతూన్న తన స్నేహితునికి తెలియజెప్పేందుకని మాత్రమే ఆ వచ్చినతనిని కనిపెట్టుకుని కూచోమన్నాడు, అంతకుమించి మరో కారణమేమీ లేదు. చివరికి ఏలాగైతేనేమి, బాతాఖానీ అంతా అయి

పోయాక, అనగా ఇక చెప్పుకోడానికి మరేమీ ఖబుర్లులేక ఓపిక వున్నంత వరకూ ఉలకకుండా పలకకుండా మెత్తాలున్న పడకకుర్చీలలో అలా కూచుని, హాయిగా చుట్టకాల్చడం పూర్తిఅయాక, ఆ అతిముఖ్యుడైన వ్యక్తి తటాలున అప్పుడు తనకు జ్ఞాపకం వచ్చినట్టు, కాగితాల కట్టలు పట్టుకుని గుమ్మంలో నిలబడి వున్న తన సెక్రెటరీని పిలిచి: "గవర్నమెంటు ఉద్యోగస్థుడెవడో నన్ను చూడ్డానికి వచ్చాడు కదూ? లోపలికి రమ్మనమనండి" అన్నాడు.

అతిదీనంగా కనబడుతూన్న అకాకి అకాకియెవిచ్‌నీ, అతడు తొడుక్కున్నట్టి పాతబడిపోయిన యూనిఫారం పొడుగుకోటునూ పరికించి, అతని కేసి చూసి: "ఏంపనిమీద వచ్చావయ్యా?" అని, తనకు ప్రస్తుతపు ఉద్యోగమూ, ప్రధానోద్యోగి హోదా లభించబోతున్నాయని తెలిసిన ఒక వారంనుండీ, తన గదిలో ఏకాంతంగా నిలువుటద్దం ఎదుట నిలబడి అనేక సార్లు పునశ్చరణచేసి అలవరచుకున్నట్టి తుంచేసిన గొంతుకతో తటాలున పెద్దగా అడిగాడు.

పెద్ద ఉద్యోగీ అతిముఖ్యుడైన వ్యక్తీ యెడల ఉండాల్సిన భయభక్తులతో ఎంతసేపటినుండో గడగడ వణకిపోతూన్న అకాకి అకాకియెవిచ్, ఆ ప్రశ్న విని బాగా కంగారు పడిపోయి, నోట్లో నాలుక ఆడక, మాటలు తడబడిపోతూ, 'చూశారుగాదూ, అనగా, మరేమీలేదు' వగైరా వగైరా ఊతపదాలను మామూలుకంటే అధికంగానే దొర్లించుతూ, చోరీపోయిన ఓవర్‌కోటు యథార్థంగా సరికొత్త దేననీ, దానిని తన దగ్గరనుండి దొంగలు అతి అమానుషంగా ఎత్తుకుపోయారనీ, శ్రీవారి సమక్షమందు విన్నవించుకోడానికి వచ్చాననీ, తనయందు శ్రీవారు కటాక్షించి పోలీసు ఇన్‌స్పె

క్టర్ జనరల్‌గారి పేరనైనా సరే, ఇంకెవరి పేరనైనా సరే ఒక్క చీటీ రాయించి పెడితే, అనగా ఒక్క సిఫార్సు మాట, అయ్యా చూశారు కదండీ; తమరు దయచేయించితే, తను ఓవర్‌కోటును తనకు ఇప్పించేటట్టు చేయించ మని అర్జీ దాఖలు చేసుకుందుకు శ్రీవారి ఎదుటకు వచ్చాననీ, ఎంతో కష్టంమీద చెప్పుకున్నాడు. మరేకారణం చేతనో ఏమిటోగాని, ఈవిధంగా తనదగ్గరకు నేరుగా వచ్చి చెప్పుకోవడం, తన దగ్గర మరీ చనవు తీసు కుంటూన్నట్టుగా ఆయనకు తోచి:

"ఏమయ్యా! అర్జీవిన్నపం ఏ విధంగా ఏ మార్గాలలో దాఖలు చేసు కోవడమో, దాని తతంగం ఏమిటో, మీరు ఎవరి సమక్షానికి వచ్చారో తెలియకుండా మాట్లాడుతూన్నట్టుందే? పద్ధతులు మీరు ఎగరటయ్యా? మీరు మొట్టమొదట నా ఆఫీసులో అర్జీవిన్నపం దాఖలు చేసుకుని వుం డాల్సింది. అప్పుడు ఆ కాగితం హెడ్‌గుమాస్తా దగ్గరకు వెళ్లి, అక్కడ నుండి సిరస్తదారు దగ్గరకువెళ్లి, అక్కడనుండి నా సెక్రెటరీ దగ్గరకు వెళ్లితే, అప్పుడు ఆ కాగితం నా ఎదుటకు వస్తుంది..." అంటూ మాటలు ఒత్తిఒత్తి పలుకుతూ పెద్దగొంతుక పెట్టుకుని అన్నాడు.

"చిత్తం, శ్రీవారు" అంటూ ఆ మిగిలివున్న కాసింత ధైర్యాన్నీ (ఆ కాసింతా కూడా ఆవగింజలో సగంకంటె రవంత తక్కువే) చిక్కబట్టి, అదే సమయంలో తన శరీరమంతా ముచ్చెమటలు పోసిపోతూన్నాయని తెలుసుకుని ఎలాగో అనగలిగాడు అకాకి అకాకియెవిచ్, "క్షమిస్తే, ఘనత వహించిన శ్రీవారిని స్వయంగా స్వతంత్రించి శ్రమ కల్గుగజేయడంలో నా ఉద్దేశం, మరేమీలేదండి, సెక్రెటరీలు, చిత్తమండి, ఘనతవహించిన శ్రీవారు కటాక్షించి క్షమిస్తేనండి, సెక్రెటరీలను నమ్మలేమండి..."

"ఏమిటి? ఏమిటి? ఏమిటి?" అన్నాడా అతిముఖ్యుడైన వ్యక్తి. "ఆ మాటలనడానికి ఎక్కడనుండి వచ్చిందయ్యా మీకు గుండె ధైర్యం? అసలీ ఆలోచనే మీ బుర్రలోకి ఎలా వచ్చిందంటా? పై ఉద్యోగస్థుల మీదనూ పై అధికార్ల మీదనూ ఇలా తిరగబడి ధిక్కరించడమూ చూడగా చూడగా కుర్రకార్లలో ఈనాడు మరీ హద్దుమీరిపోతూందే!"

అకాకి అకాకియెవిచ్ ఏభై య్యేపడి దాటిన వృద్ధుడన్న సంగతి ఆ అతిముఖ్యుడైన వ్యక్తి గమనించనట్లే వుంది. దాన్నిబట్టి చూడగా, అకాకి అకాకియెవిచ్‌ని కుర్రకారు అనడంలో, ఆ పదం సాపేక్షార్థంలో, అనగా డెబ్బయ్యేపడి మళ్లినవాడి కంటె ఏభయ్యేపడి మళ్లినవాడు కుర్రవాడే అన్న అర్థంలో ఉపయోగించి వుంటాడనే మనం అనుకోవాల్సి వుంటుంది.

"మీరు ఎవరితో మాట్లాడుతున్నారో ఏమిటో మీకేమో నా మతీ సుతీ వుందా అంటా? మీరు ఎవరి సమక్షాన నిలబడి వున్నదీ మీరేమేనా గ్రహించారా అని అడుగుతున్నా! ఏమయ్యా, గ్రహించావా లేదయ్యా?"

ఈ ప్రశ్నలు వేయడంలో అతడు తన కాలు నేలమీద కొట్టి, గొంతుక ఎంత పెద్దదిచేసి తారస్వరంలో పలికాడంటే, భయకంపితుడైనది అకాకి అకాకియెవిచ్ ఒక్కడే కాదు.

అకాకి అకాకియెవిచ్ నఖశిఖపర్యంతమూ గడగడ వణకిపోతూ మనిషి తూలిపోయి జోగిపోతూ మూర్ఛపడిపోయి అమాంతగా నేలమీద కుప్పలా కూలిపోయాడన్నమాటే. కాని సరిగ్గా ఆ క్షణంలో తలుపు దగ్గర వున్న తైనాతీ డవాలీ బంట్రోతులు పరుగెత్తుకొని వచ్చి, అతడిని పట్టుకోబట్టి

గాని, లేకపోయుంటే మనిషిపాళంగా కింద పడిపోయుండాల్సిందే. మనిషిలో ఇంచుమించు చలనం ఏమీలేని స్థితిలో అతనిని ఆ డలాయతీలు మోసుకు పోయారు. తన మాటలు తానెన్నడూ ఊహించనైనా ఊహించనంతటి ప్రభావాన్ని ఎదుటివాడిలో కలిగించడం కళ్లారాచూసి ఆ అతిముఖ్యుడైన వ్యక్తి తృప్తిచెంది, తన నోటనుండి వచ్చిన ఒక్కమాట, మనిషంత మనిషిని మూర్ఛిల్లిపోయేటంత పని చేయగల్గిందే అన్న విషయం తల్చుకుని అతడు ఆనందపరవశుడైపోయి, ఇదంతా తన స్నేహితునిపై ఎట్టి ప్రభావం కల్గించిందో అని ఓరకంటితో అతనికేసి చూశాడు; తన స్నేహితుడు గాభరా చెందిన చిత్తవృత్తిని ప్రదర్శించడమే కాకుండా, కేవలం భయపడ నారంభించడం సహితమూ చూసి సంతృప్తిపడి పొంగిపోయాడు.

తాను మేడమెట్లు ఎలా దిగినదీ, వీధిలో నడచి వెళ్లినదీ అకాకి అకాకియెవిచ్‌కే తెలియదు, చేతులూ కాళ్లూ పూర్తిగా చచ్చుబడిపోయాయి. తన జన్మలో ఎన్నడూ ఏ హుజూర్ దరోగా చేతా ఈ విధంగా చివాట్లు తిన లేదు, చూడబోతే అసలీయనేమో మరొక ఆఫీసు హుజూర్ దరోగా అయె. వీధిలో జోరుగా కొడుతూంది మంచుతుపాను, హోరుమని వీస్తూంది గాలి. అయినా అలాగే ఒంటిపై స్పృహలేకుండానే, ఆ మంచులోనూ ఆ గాలిలోనూ, నోరు తెరచుకుని రోడ్డుపక్క చపటామీద తొట్రుటుకుంటూ, పడి పోతూ లేస్తూ అలాగే వీధిలో నడుచుకుంటూ వెళ్లాడు; సెంట్ పీటర్స్ బర్గ్ గాలి వేయకనే పోవాలి, వేసిందంటే మాత్రం, దాని అలవాటు ప్రకారం వీధి నాలుగు దిక్కులనుండీ ఒక్కసారే విసరికొడుతుంది. ఒక్క నిమిషంలో అకాకి అకాకియెవిచ్ గొంతుకలో గవదలు వాచిపోయి, గొంతులో నిప్పులు మండిపోతున్నాయామో అని అనిపించిందతనకి. చివరికి మరి

ఇల్లు ఎలా చేరుకున్నాడో ఏమిటో మరి, తూలిపోతూ తొట్రుకుంటూ ఇల్లు చేరుకునేసరికి నోట ఒక్క పలుకు రాలేదు, మాట పూర్తిగా పడి పోయింది, ఒళ్లంతా వాచి పొంగిపోయింది. ఇక ఇంటికి వచ్చిన ఉత్తరక్షణం మంచం పట్టేశాడు. ముఖం వాచిపోయినట్టు అధికార్లు పెట్టే ముప్ప చివాట్లు ఒక్కొక్కప్పుడు నిజంగా అంత పనీ చేస్తాయన్నమాట!

మరునాటికల్లా అకాకి అకాకియెవిచ్‌కి జర్వం ఉధృతంగా ముంచు కొచ్చేసింది. సెంట్ పీటర్స్‌బర్గ్ శీతోష్ణస్థితి పుణ్యమా అంటూ అతడి జబ్బు అనుకున్నకంటె ఎంత త్వరగానూ ఎంత తీవ్రంగానూ ముదిరిపోయిం దంటే, వైద్యుడు వచ్చి ఆనవాయితీ ప్రకారం చెయ్యిచూచి ఏదో ఒక మందో మాకో ఇస్తేనేగాని బాగుండదని చెప్పి, పట్టువెయ్యండని చెప్పాడేగాని, అప్ప టికే రోగి స్థితి అతని చేయి దాటిపోయింది. అయితేనేంగాక, వైద్యుడు మాత్రం తన అభిప్రాయం బయటపెట్టేశాడు, మరునాటి సాయంకాలాని కల్లా అంతా తేలిపోతుందని. ఈ విధంగా తన అభిప్రాయం తేల్చివేసిన తరు వాత, ఇంటి యజమానురాలి వైపు తిరిగి:

''మరేమీ ఆలస్యం చెయ్యకుండా తక్షణమే శవపేటిక పురమా యించేయి, తల్లీ! దేవదారు చెక్కదైతే చాలు; అతని తాహతుకు ఓక్ చెక్క శవపేటిక మరీ ప్రియమైపోతుందనుకుంటాను'' అన్నాడు.

మృత్యుభరితమైన ఆ మాటలు అకాకి అకాకియెవిచ్ వినేవుంటాడా? ఒకవేళ వినేవుంటే ఆ మాటలు అతని నవనాడులనూ అధఃపాతాళంలోకి కుంగదీసేశాయేమో? తన జన్మలో అతడు అనుభవించిన నికృష్ట దౌర్భా గ్యపు జీవితాన్ని తల్చుకుని అతడు కంట తడిపెట్టుకున్నాడేమో? బహుశ ఇదేదీ జరిగేవుండదు, ఎందుచేతంటే ఆ జ్వరంలో అతడు మరో లోకంలో

వున్నాడు. ఆ లోకంలో ఒకదానిని మించి ఒకటి చిత్రవిచిత్రమైన దృశ్యాలు అతని ఎదుట విధివిరామం లేకుండా తాండవిస్తున్నాయి; ఒక నిమిషం పెత్రో విచ్ కనబడగా అతనితో చెప్పి ప్రత్యేకమైన ఓవర్‌కోటును పురమాయించు తాడు, దానికి దొంగలను పట్టుకోగల్గిన బోనులు అమర్చివుండేటట్టు కుట్టమంటాడు. ఈ దొంగలు తన మంచంకింద దాగున్నారని భ్రమపడి, ఒకసారి ఇంటి యజమానురాలిని క్షణక్షణమూ పిల్చి, వాళ్లను పైకి తోలి వేయమని బతిమాలాడుకున్నాడు; అంతేకాదు ఒకసారి తన బూర్నీసుకింద దొంగాడు దూరేడనీ, వాడిని పిలకపట్టుకుని ఈడ్చేయమన్నాడు కూడా; మరు నిమిషం తాను కొత్త ఓవర్‌కోటును కుట్టించుకోగా తన పాత 'కపోట్' ఇంకా ఆ గోడకున్న చిలక్కొయ్యమీద తన కంటికెదురుగా ఎందు కింకా అలా వేలాడుతూందో చెప్పమని కేకేశాడు; ఒక క్షణం పోయాక, తాను హుజూర్ దరోగా ఎదుట నిలబడి వున్నట్టూ, ఆయన న్యాయంగానే పెడుతూన్న నానా చివాట్లనూ తాను విని: "నావల్ల పొరపాటొచ్చింది, ఘనతవహించిన శ్రీవారు నన్ను క్షమించాలి!" అంటూ పదేపదే పరాకు మాట లాడేవాడు; ఇక చివరకు, ఆ పలవరింత మాటల్లో ఎటువంటి అశ్లీల పదాలూ ఉచ్చరించరాని తిట్లూ దొర్లాయంటే అతడి నోట ఎన్నడూ రాని ఆ మాటలు, అందులోనూ ముఖ్యంగా "ఘనతవహించిన శ్రీవారు" అనే మాట వెనువెంటనే వెడలే ఆ బూతులపంచాంగం వినలేక ఇంటి యజ మానురాలు ఆ వృద్ధస్త్రీ చెవులు మూసుకుని అయ్యో అయ్యో అంటూ తన వొంటిమీద శిలువను చిత్రించుకుంది. అతడు వొంటిపై స్పృహ లేకుండా నిర్విరామంగా కలవరిస్తూన్న అపస్మారకపు మాటలలో మతీ సుతీ ఏమీ వుండేదికాదు; అయితేనేమి అవి సబబూ సందర్భమూ లేకుండా ఎంత కలగా

పులగంగా వున్నప్పటికీ కూడా, అతని మాటలూ అతిని భావాలూ అన్నీ ఆ ఏకైకవస్తువు — ఆ ఓవర్‌కోటు — చుట్టూ పరిభ్రమణం చేస్తూ వున్నాయన్న విషయం మాత్రం స్పష్టంగా విదితమవుతూనే వుంది. కొసకి పాపం అకాకి అకాకియెవిచ్ శాశ్వతంగా కన్ను మూశాడు.

అతడి గదికిగానీ, అతడి సామాన్లకిగానీ గవర్నమెంటువారు వచ్చి సిక్కాముద్ర లేసి సీళ్లు వెయ్యలేదు; ఎందుకంటే మొదటి కారణం: అతడికి వారసులెవ్వరూ లేరు; రెండవది, అతడి ఆస్తి అంతా స్వల్పాతిస్వల్పం, అంతా లెక్కవేస్తే మొత్తం ఆస్తిలో వున్న శాల్తీలు ఇవి: ఒక కట్ట పిట్టకలాలు, ఒక దస్తా గవర్నమెంటు మార్కు తెల్లకాగితాలు, మూడు జతలు మేజోళ్లు, పంట్లాంనుండి వూడొచ్చేసిన ఏవో నాలుగు బొత్తాములు; ఇవిగాక పాఠకునికి సుపరిచితమైన 'కపోట్'. ఈ యావదాస్తీ చిట్టచివరకు ఎవరికి దఖలుపడిందో ఆ దేవుడికే ఎరుక, నిజం చెప్పాలంటే ఈ విషయం తెలుసుకుందుకు కథారచయిత ఎట్టి శ్రద్ధ తీసుకోలేదు కూడా. అకాకి అకాకియెవిచ్‌ని శ్మశానంలో భూస్థాపితం చేశేశారు. అకాకి అకాకియెవిచ్ లేకపోయినా సెంట్ పీటర్స్‌బర్గ్ తన జీవితాన్ని ఎప్పటిలాగే సాగించుకుంటూంది, ఇక అక్కడికి అకాకి అకాకియెవిచ్ అనే వ్యక్తి ఆ పట్నంలో ఎన్నడూ జీవించనట్టుగా. ఒక వ్యక్తి అయిపూ జాడా లేకుండా అంతర్థానమైపోయాడు — ఆదరించాలనిగానీ, రక్షించాలనిగానీ ఎవ్వరికీ తోచనైనా తోచనైన వ్యక్తి; 'నా' అన్నవాడు లేని వ్యక్తి; సూక్ష్మదర్శని కిందవుంచి పరీక్షించేందుకై సర్వసామాన్యమైన ఈగను సహితమూ పట్టుకుని దాని శరీరంలో గుండుసూదిని గుచ్చేందుకు వెనుదీయని ఏ ప్రకృతివిజ్ఞాన శాస్త్రజ్ఞుని దృష్టినీ



57—1

ఆకర్షించని ఒక వ్యక్తి, తన ఆఫీసులో వున్న తోడి ఉద్యోగస్థులు చేసే వేళా కోళాలనూ అవమానాలను వినమ్రుడై భరించుతూ, ఏదో ఒకానొక అపూర్వ ప్రమాదం కారణంగా మృత్యువాతబడినట్టే, తన జీవితమంటిలోనూ జీవితాంతమందలి చరమగడియలలో మాత్రమే ఒక ఓవర్‌కోటు స్వరూపం ధరించినట్టి జాజ్వల్యమాన విగ్రహరూపుడైన ఆప్తమిత్రుని క్షణమాత్రం సందర్శించిన మాత్రాన తన దిక్కుమాలిన జీవితమంతా ఒక్కసారి ఉల్లాస భరితము కావించబడినట్టే, ఈ భూప్రపంచంలో వున్న మహామహు లందరూ విధిగా అనుభవించక తప్పనట్టే భరింప శక్యం గానట్టి దురదృష్టాన్ని తరువాత తాను అనుభవించాల్సి వచ్చిందో అట్టి వ్యక్తి!..

అతడు చనిపోయిన కొన్నాళ్ల తరువాత అతడి డిపార్టుమెంటునుండి, అకాకి అకాకియెవిచ్ తక్షణమే ఆఫీసులో హజరు చెప్పకోవాల్సిందనీ, హుజూర్ దరోగాగారే అతనితో స్వయంగా మాట్లాడుతామంటున్నారనీ ఒక ఫర్మానా పట్టుకుని వెనుక అతడు బసచేసి వుండిన ఇంటికి బంట్రోతు ఒకడు వచ్చాడు! కాని ఆ బంట్రోతు తనతో కూడా అకాకి అకాకియెవిచ్‌ని వెంటబెట్టుకుని తీసుకురాకుండానే ఆఫీసుకు తిరిగి వెళ్లిపోవాల్సి వచ్చింది. బంట్రోతు ఆఫీసుకు వెళ్లి అకాకి అకాకియెవిచ్ ఆఫీసుకు రావడంలేదని మాత్రమే ఖబురు చెప్పాడు. ''ఏమి, ఎందుకు రావడంలేదు?'' అని ప్రశ్నించగా, ''రావడానికి వీల్లేదు కాబట్టి, అనగా అతడు కాలంచేశాడు, భూస్థాపితం జరిగి ఈ వాళటికి నాల్గురోజులైంది లెండి'' అని బంట్రోతు జబాబు చెప్పాడు. అకాకి అకాకియెవిచ్ మరణవార్త ఈ విధంగా డిపార్టుమెంటుకి అందింది; ఆ మరు

నాడు అతని స్థలంలో — అకాకి అకాకియెవిచ్ కంటె బాగా పొడగరి, అతని మోస్తరుగా పొడుగాటి అక్షరాల దస్తూరీ కాకుండా ఒక మోస్తరు కోలగానూ కాస్త వంకరగానూ దస్తూరీ రాసే — కొత్త గుమాస్తా ఒకడు అప్పుడే కూచుని పనిచేసుకుంటున్నాడు.

అయితేనేంగాక, ఇంతటితో అకాకి అకాకియెవిచ్ కథ అంతం కాలే దనీ, అతను కాలధర్మమొందిన మరి కొద్దినాళ్ల వరకూ అతని గురించే పట్నంలో వారందరూ చెప్పుకున్నారనీ, తాను బతికున్నప్పుడు తనను గురించి లోకంలో ఒక్కరైనా తల్చుకునేటట్టుగా సాధించలేకపోయినా, తాను చని పోయిన తరువాత ఈ విధంగానైనా తనను లోకులందరూ తల్చుకొనేట ట్టుగా సాధించగల్గాడనీ ఎవరైనా అనుకుని వుంటారా? ఎవ్వరూ అనుకుని వుండరు; కాని సరిగ్గా అలాగే జరిగింది; ఎందుకూ కొరగాని మన కథ అను కోకుండానే అద్భుతంగా అంతమైంది.

గవర్నమెంటు గుమాస్తా రూపంలో దయ్యం ఒకటి కలీన్‌కిన్ వారధి చుట్టుపట్లా, ఇంకా ఆవల కూడానూ కనబడుతూందనీ, ఈ దయ్యం చోరీపోయిన ఒక ఓవర్‌కోటుకోసం వెతుకుతూందనీ, దొంగలు ఎత్తుకు పోయిన తన ఓవర్‌కోటు కోసం వెతకడమనే మిషతో అందరి వొంటిమీద నుండీ ఓవర్‌కోట్లను — అవి ఎట్టివైనాసరే: పిల్లి బొచ్చు అస్తర్లు వున్నవైనా సరే, బీవర్, రకూన్, నక్క, ఎలుగ్గొడ్ల బొచ్చు వున్నవైనాసరే, ఆ మాటకొస్తే తన తోలును కప్పుకుందకు నాడూ నేడూ మనిషి ఉపయో గించుతూన్నట్టి అన్నిరకాల తోలు, బొచ్చు కోట్లనూ — నిలువునా వొలి చేస్తూందనీ, ఆ వొలిచేయడంలోనూ మనుషుల హోదాగానీ, వారి తాహతు గానీ లెక్కచేయడం లేదనీ పుకారు ఒకటి సెంట్ పీటర్స్‌బర్గ్

అంతటా వ్యాపించింది. అకాకి అకాకియెవిచ్ పనిచేస్తూ వుండిన ఆఫీసులో గుమాస్తా ఒకతడు, తాను ఆ దయ్యాన్ని కళ్లారా చూశాననీ, అది మూడు మూర్తులా అకాకి అకాకియెవిచ్ లాగానే వుందని తాను వెంటనే పోలిక పట్టాననీ, కాని తనకి విపరీతంగా భయంవేసుకు రావడంవల్ల తన కాళ్లకు బుద్ధిచెప్పి బతుకు జీవుడా అంటూ పారిపోవడం కారణంగా ఇక దానిని దగ్గరగా సమీపించి మరింత బాగా చూడలేకపోయాననీ, తనకేసి అది చూపుడు వేలు ఝళిపించుతూ చూపించిందనీ చెప్పాడు. ఈ విధంగా తరుచుగా మనుషుల వొంటినుండి రాత్రిపూట ఓవర్‌కోట్లు పెరికివేయబడుతూ వుండడము కారణంగా, ఒక్క శాశ్వతపు సలహాదారు గుమాస్తా ఉద్యోగుల యొక్క కాకుండా, దివాణపు సలహాదారు గుమాస్తా ఉద్యోగులు అందరి పృష్ఠాలూ భుజాలూ కూడా పడిశంపట్టే ప్రమాదానికి నిరంతరమూ లోన వుతూన్నాయని నాలుగు చెరగులనుండీ ఎడతెరిపి లేకుండా ఫిర్యాదులు అంద సాగాయి. ఈవిధంగా విధివిరామం లేకుండా ఫిర్యాదులు అందుతూండే సరికి, ఆ దయ్యాన్ని బతికున్నా సరే చచ్చినా సరే పట్టి ఈడ్చుకురావాల్సిందనీ, కడమ దయ్యాలకు బుద్ధివచ్చేటట్టుగా దీనికి నిర్దాక్షిణ్యమైన కఠిన శిక్ష విధించాల్సిందనీ పోలీసులకు ఫర్మానా జారీఅయింది. ఈ ఫర్మానా ఫలితంగా పోలీసులు దానిని నిజంగా పట్టుకున్నారన్నమాటే — ఒక్క తల వెంట్రుక వాసిలో తప్పిపోయిందిగాని. జరిగిన సంగతి ఇది: కీర్యూష్‌కిన్ సందు వున్న పేటలో బీటు తిరుగుతూన్న పోలీసు కానిస్టేబు క్రితం రాత్రి ఆ దయ్యం నేరం చేసిన స్థలం దగ్గరకే మళ్లీ గతరాత్రి కూడా రాగానే, ఒకానొకప్పుడు ఫ్లూటు నొకదానిని పీపీ మనిపించిన మాజీ మురళీ విద్వాంసు

డొకడు తొడుగుకున్న ఫ్లానెల్ ఓవర్‌కోటును ఊడబెరికివేస్తూండగా ఆ దయ్యాన్ని అమాంతంగా దాని కోటు కాలరు పట్టుకుని దానిని నిలబెట్టేసి, తనకు సాయానికి రమ్మనమని మరి ఇద్దరు పోలీసు కానిష్టేబులను అతడు పిలవగా, వాళ్లిద్దరూ ఆ నేరస్థుడిని ఒక గడియసేపు పట్టుకొని వుండాల్సిందనీ, ఇదివరకే తన జీవితంలో ఆరుసార్లు చలికి చచ్చుబడిపోయిన ముక్కుకు తిరిగి ప్రాణం పోయడానికిగాను, తన బూడ్సులో దాపుకొనున్న పొడుం డబ్బీని ఈలోపుగా తాను సంగ్రహించుకుని పొడుం పీల్చుకుంటాననీ అతడు తన తోడి కానిష్టేబులతో చెప్పాడు. కాని ఆ పొడుం ఎంత ఘాటైనదో మరి, చివరికి ఆ దయ్యం సహితం దాని వాసనే భరించలేకపోయిందన్నమాట. ఆ పోలీసు కానిష్టేబు తన కుడి ముక్కుచెరమను ఒక వేలితో బిగించి, ఎడమ చెరమలోకి అరసోలెడు నస్యం ఎగబీల్చుతూండగా, దయ్యానికి ఆ ఘాటు తగిలి అది ఎంత ఊపుతో తుమ్మిందంటే ఆ అదురుపాటుకు నస్యం వున్న అతగాడి అరచేయి తుళ్లున ఎగరగా, అరచేతిలోని నస్యం వెళ్లి వారి ముగ్గురి కళ్లలోనూ దూరిపోయింది. కళ్లు నులుపుకుందుకని వారు చేతులు ఎత్తేసరికి ఆ దయ్యం అయిపూ జాడా లేకుండా ఇక ఎక్కడా కనబడకుండా ఎంత పూర్తిగా మాయమైపోయిందంటే, తమ చేతులలో అది పట్టుబడినట్టు కూడా వారు ప్రమాణపూర్వకంగా చెప్పలేక పోయారన్నమాట. ఆనాటినుండీ పోలీసువాళ్లకి చచ్చిపోయిన వాళ్లంటే ఎంత భయం పట్టుకుండంటే, బతికున్నవాళ్లని సహితమూ పట్టుకోడానికి వాళ్లు జడిసిపోయి, బతికున్నవారిని చూసి అల్లంత దూరంనుండే: "ఏయ్, నువ్వేనయ్యా, రోడ్డంతా నీ అబ్బగాడి సొమ్ములాగు, ఎందుకలా నిలబడ్డావయ్యా నడిమధ్యను? నడవ్వయ్యా, నడు!" అని కేకేసేవారు. కాగా ఆ గవర్నమెంటు గుమాస్తా దయ్యం, కలీన్‌కిన్

వారధి దాటి ఆవలనున్న పేటల్లో కూడా కనబడుతూ, స్వాభావికంగా పిరికి వారైన పౌరులందరిలోనూ ఉపద్రవమైన భయాందోళనలు పుట్టించ సాగింది.

ఇదీలా వుండగా, యథార్థమైన ఈ కథ తీసుకున్న అద్భుత పరిణామాని కంతటికీ వాస్తవంగా కారకుడైన ఆ ఒకానొక అతిముఖ్యుడైన వ్యక్తి మాట మనం మర్చేపోయాం. న్యాయం పాటించి అన్నిటికంటే ముందుగా చెప్పాల్సిన సంగతేమిటంటే, తన ఎదుటనుండి నిర్భాగ్యుడైన అకాకి అకాకియెవిచ్ వెళ్లిపోగానే, ఆ దౌర్భాగ్యుడిని కొంచెం కఠినంగానే మందలించానే అయ్యో పాపం అని, ఆ ఒకానొక అతిముఖ్యుడైన వ్యక్తియొక్క అంతఃకరణ నిజంగా చివుక్కుమంది — అంతవరకు మాత్రం యథార్థం. తన తోటి మానవుని పట్ల సానుభూతి అన్నది అతని నైజంలో నిజంగా వుంది; అతని హృదయ కుహరంలోనూ ఎన్నో మంచి గుణాలే వున్నాయి, లేకపోలేదు; కాని అవి పైకి రాకుండా అతని హోదా మాత్రం వాటిని అణచివేస్తూంటుంది. తన ఆఫీసు గదిలోనుండి తాను చిరకాలం తరువాత తిరిగి కలుసుకున్నట్టి తన బాల్య స్నేహితుడు నిష్క్రమించిన ఉత్తరక్షణంలోనే అకాకి అకాకియెవిచ్‌పై అతను నిజంగా కొంత విచారపడ్డాడు. అధికార్లు పెట్టే చివాట్లను అంత మరీ మనస్సుకు పట్టించుకుని, ముఖంమీద గంటుపెట్టినా రక్తంలేనంతగా బొత్తిగా బేలపడిపోయిన అకాకి అకాకియెవిచ్ ముఖం ఆనాటినుండి అనేకసార్లు అతనికి జ్ఞప్తికివచ్చి, అతని స్మృతిపథంలో నిలిచేది.

అకాకి అకాకియెవిచ్ గురించి పదేపదే తల్చుకుని అతను ఎంతగా గాభరా పడ్డాడంటే, వారం రోజులు తరువాత, అకాకి అకాకియెవిచ్ ఫిర్యాదు

సమాచారమై భోగట్టా చేయడానికీ, అతని ఓవర్‌కోటు దొరికినదీ లేనిదీ, అతనికి ఇంకే సాయమైనా అవసరమో ఏమిటో తెలుసుకోడానికీ తన గుమాస్తాలలో ఒకడిని అకాకి అకాకియెవిచ్ ఇంటికి పంపించాడు. అకాకి అకాకియెవిచ్‌కి జ్వరంవచ్చి అకస్మాత్తుగా చనిపోయాడన్న సంగతి అతనికి తెలియగానే, ఆరోజంతా అతడి అంతఃకరణ అతడిని మహా బాధించింది; ఫలితంగా ఆ దినమంతా అతడు అపరిమితంగా మధనపడిపోయాడు. ఈ బాధాకరమైన ఆలోచనలను తన మనస్సునుండి పారదోలి, ఏ విధంగానైనా ఈ విచారకరమైన ఉదంతాన్ని మరచిపోదామనే ఉద్దేశ్యంతో, తన మిత్రుడు ఒకతని ఇంటికి వెళ్లాడు ఆ సాయంత్రం. అక్కడ ఆ మిత్రుని స్నేహితులు చాలామంది అప్పుడే పోగై వుండడమే కాకుండా, వారందరూ కూడా ఇంచుమించు తనతో సమాన హోదా గలవారే అయివుండడంచేత, తనను చికాకుపరచే అవకాశమ్ము మరేదీ లవలేశమూ కూడా లేకపోవడం అతడు గమనించాడు. ఆలాగు గమనించగానే అతనికి ఎక్కడలేని చురుకుతనమూ వచ్చేసింది. అతని ముఖమూ అతని మనస్సూ పుష్పం వికసించినట్టు వికసించాయి. అందరితోనూ మంచి చలాకీగా మాట్లాడుతూ, అందరితోనూ బుజాలు బుజాలు రాసుకుంటూ తిరిగాడు — నిజం చెప్పాలంటే ఆ సాయంకాలమంతా భలేసరదాగా గడిపాడు. విందుభోజనంలో రెండు గళాసులు షాంపేను పుచ్చుకున్నాడు — మనిషికి హుషారు కలిగించాలంటే ఇంతకు మించిన దివ్యౌషధం ఇంకొకటి లేదన్న విషయం జగద్విదితమేకదా. షాంపేను ప్రభావంవల్ల అతని హృదయాంతరాళంలో అపూర్వమైన ఆలోచన ఒకటి మెదల నారంభించింది. అదేమిటంటారేమో, చెబుతా వినండి: విందారగించిన తరువాత వెంటనే ఇంటి ముఖం పట్టకుండా, తనకు పరి

చితమేకాకుండా, తనకు బాగా చనవేవున్న ఒక నారీరత్నం — కారొలీన ఇవానొవ్న, బహుశ ఆమె పూర్వీకులు జర్మన్లు అయివుంటారేమో — ఇంటికి బయల్దేరాడు. ఇక్కడ మనం ఒక సంగతి చెప్పాల్సి వుంది: ఈ అతి ముఖ్యుడైన వ్యక్తి యువకుడేమీ కాదు, వయస్సు మళ్లినవాడనీ, ఆలన పాలనలతో భార్యను చక్కగా చూస్తాడనీ, బహు యోగ్యుడైన గృహస్థు అనీ. అతడు ముగ్గురు పిల్లల తండ్రి: ఇద్దరు కొడుకులూ ఒక కూతురూ. పెద్దబ్బాయి అప్పుడే గవర్నమెంటు ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నాడు. కూతురు పదహారేళ్ల బాలాకుమార్తె. ముద్దులు మూటకడుతూంటుంది — ముక్కు రవంత చిలకముక్కులా వుంటే వుండొచ్చుగాక, అయితేనేం, మొత్తానికి అందమైన ముక్కేలెండి — ప్రతిరోజు ఉదయమూ తండ్రి దగ్గరకు వచ్చి, తండ్రిచేతిని ముద్దుపెట్టుకుని ఫ్రెంచిభాషలో: ''బోంజూర్,* పపా!'' అని నాన్నకి నమస్కారం చేసి పలకరిస్తుంది. అతని భార్య నడివయస్సులో వున్న ప్రౌఢ, పెద్ద అందకత్తె ఏమీ కాకపోయినా, ముక్కూ ముఖమూ తీరుగానే వుంటాయి. ఆమె ఉదయాన్నే మొదట తన చేయి అతనికి అందిస్తే, దానిని అతడు చుంబించేవాడు. అప్పుడామె అతని చేతిని తన చేతితో పట్టుకుని ఇటుంచటు దానిని తిప్పి అప్పుడతని చేతిని చుంబించేది. ఇటువంటి ముచ్చటైన సంసారపు ఆనవాయితీలతో ఆ అతిముఖ్యుడైన వ్యక్తి సరదాగా కాలం వెళ్లబుచ్చుతూండేవాడు. అయినప్పటికీ ఆ అతిముఖ్యుడైన వ్యక్తి కేవలమూ స్నేహపూర్వకమైన సంబంధాన్ని పెంపొందించుకుందామనే

---

*'గుడ్‌మార్నింగ్' — అనువాదకుడు.

అభిప్రాయంతో మాత్రమే పట్నంలో ఇంకొక పేటలో ఒక మహిళతో మైత్రి నెరపుకొన్నాడు. తన భార్యకంటె ఈ స్నేహితురాలు ఏమంత రూపసీ కాదూ చిన్నదీకాదూ — అయితేనేం ఇటువంటి సమస్యలు ప్రపంచంలో సర్వేసర్వత్రా వుంటూనే వుంటాయి, ఇక వాటి మంచి చెడ్డలు నిర్ణయించడం మన పనీకాదూ, మన తరమూకాదూ. సరే దానికేమి లెండి. ఈ అతిముఖ్యుడైన వ్యక్తి తన స్నేహితుని ఇంటి మేడమెట్లు దిగి తన సెయ్‌లో సుఖాసీనుడై, రథసారధితో ''కారొలీన ఇవానొవ్‌న ఇంటికి'' అని ఉత్తరవిచ్చి, చక్కగా వెచ్చగా వున్న తన ఓవర్‌కోటుతో సౌఖ్యంగా వొళ్లంతా కప్పేసుక్కొని ఏ చీకూ చింతా లేకుండా మధురమైన, రష్యన్ అన్నవాడు ఇంతకు మించిన హాయిని తల్చుకోలేని చిత్తవృత్తిలో, అనగా ఎట్టి ఆలోచనలనూ తల్చుకోనవసరం లేకుండానే, వాటిని పట్టుకోడానికిగానీ, వాటికేసి చూడ్డానికిగానీ ప్రయత్నించాల్సిన శ్రమను కల్గించకుండానే ఒకదానికంటె ఒకటి మరింత మనోహరంగా ఒకదాని వెంబడి ఒకటి పందెపు గుర్రాల్లా మస్తిష్కంలో పరుగులిడుతూన్నట్టి తలంపులతో నిండిన చిత్తవృత్తిలో నిమగ్నుడైపోయాడు. ఆనందంతో నిండి పొరలుతూన్న హృదయంతో, ఆ సాయంకాలం విందులో జరిగినట్టి మనోరంజకములైన విషయాలనూ, సన్నిహితమైన ఆ కొంచెపాటి స్నేహబృందంలో పొట్ట చెక్కలయ్యేటట్టు అందరూ విరగబడి నవ్విన హాస్యాలనూ, వాటిలో చాలావాటిని తానే మెల్లగా మననం చేసుకుని, వాటిని తాను మొదట విన్నప్పుడు ఎంత హాస్యరసభరితంగా వుండెనో, ఇప్పుడు కూడా అంత హాస్యరసభరితంగానూ వున్నట్టే అనుకోవడంచేత బండిలో వున్నంతసేపూ అతడు తనలో తాను నవ్వుకుంటూ మంచి హుషారుగా వున్నాడూ అంటే అందులో ఆశ్చర్య

పడాల్సిందేమీ లేదు. కాని ఉండి వుండి హోరుహోరుమంటూ తుపానులా కొడుతూన్న గాలి మాత్రం అతని రసానుభూతికి భంగకరంగా పరిణమించింది; ఎందుచేతనంటే ఒక్కొక్కమాటు ఒకొక్క దిశనుండి — ఏ దిశనుండి కొడుతుందో, మరెందుకు కొడుతుందో ఆ భగవంతుడికే తెలియాలి మరి — ఫెడీమని కొట్టడం మొదలుపెట్టి, కత్తితో గంటు పెట్టినట్టే చురుక్కుమని ముఖానికి తగిలి, ముఖమంతా మంచు తొరకలమయమైపోయి, ఓడతెరచాపలా ఓవర్‌కోటు కాలరు ఆ గాలికి ఉబ్బిపోయి, మళ్లీ మరునిమిషానికల్లా రాక్షసి బలంతో అదే తన తలమీదనుండి ఎగిరి ముఖంపై పడి ముఖాన్ని చుట్టవేసేసరికల్లా, ఇక ఆ ముసుగును తీసివేసుకునేటప్పటికి యమయాతన పడిపోయేవాడన్నమాట. తన ఓవర్‌కోటు కాలరుతో ఇలాగు కుస్తీలు పడుతూండగా, ఆ ఓవర్‌కోటు కాలరును గభాలున ఎవరో వెనుకనుండి దృఢంగా పట్టుకుని గుంజినట్టయింది. ఎవరు తననీలా పట్టుకున్నారని అతడు వెనుకకు తిరిగి చూసేసరికి, పాతగిలిపోయి చిరిగి పీకిపోయిన గవర్నమెంటు గుమాస్తా యూనిఫారం పొడుగుకోటు తొడుగుకొని కాస్త పొట్టిగా వున్న మనిషి కనబడ్డాడు. ఆ మనిషిని చూసీ చూడడంతో అతడు మరెవ్వడూ కాదు అకాకి అకాకియెవిచే అని పోల్చుకుని భయవిహ్వలుడైపోయాడు. ఆ గుమాస్తా ముఖం మంచులాగునే తెల్లగా వుండి, అచ్చు చచ్చిన మనిషి శవంలా వుంది. ఆ శవం ముఖం అష్టవంకర్లూ తిరిగి భయానకమైన శ్మశానవాయువును శ్వాసిస్తూ మాటాడడానికని నోరు తెరచేటప్పటికి ఆ అతిముఖ్యుడైన వ్యక్తికి ఇక చెప్పలేనంత భయం వేసుకొచ్చింది. అతడిని చూచి అకాకి అకాకియెవిచ్ దయ్యం ఇలా అంది:

—

"ఓహో! చివరికి ఏలాగైతేనేమి దొరికావే!.. నీ ఓవర్‌కోటు కాలరు నా చేతిలో పట్టుపడిందన్నమాటే!.. నీ ఓవర్‌కోటే నాకు కావాలి, తెలిసిందా! నా ఓవర్‌కోటు పోయిందయ్యా అని మెర పెట్టుకుంటే నీకు గడ్డిపోచంతైనా లక్ష్యం లేకపోయింది కదూ... పైపెచ్చు నన్ను తిట్టిపోశావేం! — ఇయ్యి, నీ ఓవర్‌కోటు ఇప్పుడు!"

ఆ అతిముఖ్యుడైన వ్యక్తి హడలిపోయి, మీది ప్రాణాలు మీదికే ఎగిరిపోయాయి. ఆఫీసులో తన గుమాస్తాలకేగాక, తనకంటె తక్కువ హోదాలో వున్నవాళ్లందరకూ సింహస్వప్నంలా వుండి, తన కిందివారు తన పరాక్రమవంతమైన విగ్రహాన్నీ ముఖవర్చస్సునూ చూసే సరికే, ఆ చూసిన వాళ్లందరూ: "అబ్బా! చండశాసనుడురా, బాబూ!" అని గుండె బాదుకొనేవారే, అటువంటి మనిషి ఈ తరుణంలో పహిల్వానులలా పైకి అగుపించే వారందరిలాగానే, ఇక ఎంత హడలిపోయాడంటే, తనకి అక్కడికక్కడికే ఏదో జబ్బు ముంచుకొస్తుందని భయపడిపోయాడు — అవును, అందుకు కారణం లేకపోలేదు మరి. ఒంటిపై కప్పుకున్న తన ఓవర్‌కోటును తనంతట తానే విప్పేసి అక్కడ విసరిపారేసి, తన గొంతుకే కాదన్నట్టుగా బొంగురుపోయిన స్వరంతో బండిని తోలుతూన్న కోచిమేనుని పిలిచి కేకేశాడు:

"ఇంటికి పోనీ, చప్పున!"

ఏదో అటో ఇటో తేలిపోయే సంక్షోభసమయాల్లోనే తన యజమానినుండి వినవచ్చే ఆ స్వరాన్ని కోచిమేను పోల్చుకుని, సాధారణంగా అంతకంటెనూ క్రియాశీలమైనదే ఆ స్వరాన్ని అనుగమించి తన శరీరాన్ని ఢీకొనడమునకు అలవాటు పడినవాడవడంచేత, ఎందుకైనా మంచిదని చటుక్కున తన తలకాయను బుజాలమధ్య దించేసుకుని, కొరడాను ఝళిపించి బండిని

వాయువేగ శరవేగాలతో పోనిచ్చాడు. ఒక్క లిప్త ఇటూ అటూ వారాగా ఆరు నిమిషాలలో ఆ అతిముఖ్యుడైన వ్యక్తి ఇల్లు చేరుకున్నాడు.

ముఖాన రక్తపుచుక్కలేక, మనిషి బొత్తిగా బేలపడిపోయి, భయంతో నోట మాటరాక, వొంటిమీద ఓవర్‌కోటు లేకుండా, కారొలీన ఇవానొవ్‌న ఇంటికి వెళ్లడం బదులు, కాళ్లీడ్చుకుంటూ తూలిపోతూ జోగిపోతూ ఎలాగో ఒకలాగ తన గదిలోకెళ్ళి పడ్డాడు. ఆ రాత్రి అంతా అతడు ఒక్కసారైనా కన్నుమూతపడక ఎంత గాభరా పడిపోయాడంటే, ఇక ఉదయాన కూతురు అతనిని చూసి: "ఏమిటి నాన్నా! ఈవేళ నీ ముఖం అంత పాలిపోయుం దేమిటి?" అని వెంటనే అడిగేసింది. కాని తండ్రి మాత్రం ఏమీ ప్రత్యుత్తర మివ్వకుండా వూరుకున్నాడు. క్రితం రాత్రి ఏం జరిగిందో, తానెక్కడికి వెళ్లాడో, తానెక్కడకు వెళ్లాలనుకున్నాడో పల్లెత్తుమాట అయినా ఎవ్వరితోనూ చెప్పలేదతడు.

ఈ ఘటన ఆ అతిముఖ్యుడైన వ్యక్తిపై ప్రగాఢమైన ప్రభావం కలిగించింది. ఆనాటినుండి అతడు తన గుమాస్తాలను చూసీచూడడం తోనే మునపటంతటి తరుచుగా: "బుద్ధి జ్ఞానం లేకుండా ఏమిటయ్యా ఇది? ఎవరితో మాట్లాడుతూన్నదీ తెలిసే మాట్లాడుతున్నారా?" అని విరుచుకుపడడం మానివేశాడు. ఒకవేళ ఎప్పుడైనా అలా అన్నాకూడా, గుమాస్తాలు చెప్పిన విషయం సాంతమూ విని, అటుపైన అంటే అనేవాడు.

ఇంతకంటెనూ ఆశ్చర్యకరమైనది ఏమిటంటే, ఆనాటితో ఆ గవర్నమెంటు గుమాస్తా దయ్యం మరి కనబడడం మానివేసింది. ఆ హుజూర్ దరోగా ఓవర్‌కోటుతో అది ఎంతో సంబరపడే వుండాలన్నమాట — తన

కోసమే పురమాయించి కుట్టించుకున్నట్టుగా బహుశ ఆ ఓవర్‌కోటు దానికి భేషుగ్గా సరిపడే వుండాలి. ఏమైతేనేమి, ఇక ఆనాటినుండి మాత్రం అది ఎవ్వరి ఓవర్‌కోట్లనూ నిలువునా వొలిచేసినట్టు ఎవ్వరూ ఫిర్యాదు చేయ లేదు. అయినప్పటికీ, పనీపాటూ లేని అధిక ప్రసంగులూ, ఉన్నదాని గురించీ లేనిదాని గురించీ మొరపెట్టే మహానుభావులూ ఇదిగో పులి అంటే ఇదిగో పుట్ర అని పుకార్లు పుట్టించుతూ, వూరిలో గాకపోయినా వూరి శివార్లలో దయ్యం తిరుగుతూందని చెప్పుకోవడం మాత్రం మానారుకారు. వారూ వీరూ అనడం ఎందుకు — ఒక ఇంటి వెనుకనుండి ఆ దయ్యం రావడం కొలమ్నాలో పోలీసు కానిష్టేబు ఒకడు కళ్లారా చూశాడు కూడానూ; కాని అతగాడి శరీరతత్వం ముట్టుకుంటేనే ఎక్కడ కమిలిపోతాడో అన్నంతగా బహు నాజూకుదవడంచేత — ఒకసారి మామూలు పందిపిల్లే చిన్నదొకటి ఒకరి ఇంట్లోనుండి బయటికి పరుగెత్తుకుని వస్తూ అతగాడి కాళ్లల్లో పడగా, అతగాడు కంగారు పడిపోయి నిలబడ్డపాటున కిందపడిపోయి నాలుగు దొర్లు దొర్లాడు. అక్కడున్న గుర్రపుబండి వాళ్లందరూ ఆ దృశ్యం చూచి విరగబడి నవ్వగా, అతగాడు అదొక అవమానంగా భావించి, అక్కడికక్కడే అతగాడు ఆ బళ్ళవాళ్ళందరకూ చెరి రెండు కోపెక్కులూ జుల్మానా వసూలు చేసి, ఆ డబ్బుతో నస్యం కొనుక్కున్నాడు — తన కళ్లబడ్డ దయ్యాన్ని పట్టుకుని, 'ఖడేరహో' అని నిలబెట్టడానికి బలంలేకపోవడంచేత ఆ చీకటి లోనే దాని వెంటబడి అలా వెళ్లగా వెళ్లగా, వెళ్నతూ వెళ్లుతూన్నదల్లా ఆ దయ్యం గభాలున నిలబడిపోయి, తటాలున ఆతడికేసి తిరిగి పెద్ద చేతితో — బతికున్నవాళ్ల కెవ్వరకూ అంత పెద్దచేయి వుండదన్నమాట,

అంత పెద్ద చేతితో – పిడికిలి బిగించి, పిడికిలి ఝళిపించుతూ: ''ఏమిటి కావాలి నీకు?'' అని అది అడిగేసరికి, ''నాకేమీ అక్కర్లేదు'' అని ఆ కానిస్టేబు రకీమని జబాబుచెప్పేసి, గిర్రున తిరిగి, తాను వచ్చిన దారినే మళ్ళీ వెనక్కి వెళ్ళిపోయాడు. అయితే ఇక్కడ ఒక్క విషయం, ఈ దయ్యం మాత్రం బాగా పొడుగ్గా వుంది; బ్రహ్మాండమైన గరిమీసాలు; అబూహౌవ్ వారధికేసి వెళ్ళిపోయి ఆ రాత్రిచీకటిలో అది మాయమైపోయింది.



మాస్కో సివార్లలోని ఒక వీధిలో, తెల్లని స్తంభాలున్న బూడిదె రంగు ఇల్లు ఒకటుంది. అది రెండంతస్తుల మేడ. మొదటి అంతస్తు మాత్రం పొట్టిగా వుంటుంది. మేడ గదులకు ముందు కొద్దిగా ఒక పక్కకు వొరిగిన వసారా వుంది. లెక్కలేనంతమంది బానిస భృత్యులచే ఉపచారం చేయించుకుంటూ ఒకామె ఆ ఇంట్లో వుంటూండేది. ఆమె జమీందారిణి, బాగా డబ్బుంది. పెనిమిటి చనిపోయాడు. కొడుకులు గవర్నమెంటు ఉద్యోగం చేస్తూ పీటర్స్‌బర్గ్‌లో వుంటూండేవారు. కూతుళ్లందరికీ పెళ్ళిళ్ళయి

పోయి ఎవరి మానాన వాళ్ళు పైవూళ్లలో కాపురాలు చేస్తున్నారు. ఆమె ఎక్కడికీ వెళ్లకుండా, ఆ ఇంట్లోనే అలా వుండిపోయి, ముసలికాలంలో ఒక్కర్తే పిసినిగొట్టు అయిపోయి, తాను విసుగెత్తిపోతూ, కడమవాళ్లను విసుగెత్తిం చేస్తూ, కాటికి కాళ్లు చాపుకొని కాలం వెళ్లబుచ్చుతూ వుండేది. ఆనంద రహితమూ మేఘావృతమూ అయిన ఆమె అహస్సు ఏనాడో పూర్తి అయి పోయింది, ఇక ఆమె జీవిత సాయింతనం నిశిరాత్రి చీకటికంటె అంధకారంగా వుంది.

ఆమె భృత్యుకోటి అంతటిలోనూ అసాధరణమైన వ్యక్తి ఎవడయ్యా అంటే, గేటు జవాను గెరాసిమ్ — ఆరడుగులు పైచిలుకు పొడగరి, ఆజాను బాహువు, అభినవ భీమునిలా కండలు తిరిగిన కాయము, కాని పుట్టు చెవిటి మూగ. ఇతడు తన స్వగ్రామంలో అన్నదమ్ములనుండి వేరుపడిపోయి, ఒంటరిగా ఒక చిన్న గుడిసెలో వుంటూ, ఆ గ్రామంలో వున్న రైతులం దరిలోనూ బుద్ధిమంతుడూ కష్టపడి పనిచేసేవాడూ అని అందరిచేతనూ అనిపించుకుంటూండేవాడు. తన ఇంట్లో కొలువు చేయడానికని ఆ రైతు బానిసలకందరకూ యజమానురాలైన ఆ జమీందారిణిగారు అతనిని పల్లె పట్టునుండి తన దగ్గరకు రప్పించింది. రాక్షసి బలం వున్నవాడవడంచేత, నలుగురు మనుషులు చేసే పని అతడొక్కడూ ఒంటిచేతితో సునాయాసంగా చేసిపారేసేవాడు. అంతేకాదు, అతడు చేసిన ప్రతిదీ బహుదివ్యంగా వుండేది. నాగలి చేతబుచ్చుకుని పొలం దున్నుతూ వుంటే, బ్రహ్మాండమైన తన ఇనుప పిడికిళ్లతో నాగటి పిడిసీల అదిమిపట్టి నేలను తొల్చుకొని పోనిస్తూంటే, ఆ నేల నవనీతంలా వుండి గుర్రం సహాయం లేకుండానే తనంతట తానే అతడు భూమిని దున్నేస్తున్నాడు కాబోలుననిపించి, చూచేందుకు ఎంతో

కన్నులపండువగా వుండేది. సెంట్ పీటర్స్ దినంనాడు చేతికొడవలి పుచ్చుకుని దానిని వూపుతూ బలమైన విసురుతో వేటు వేస్తూంటే, ఒక్కొక్క వేటుకి గున్న బర్చిచెట్ల చిట్టడవి ఒక్కొక్కటే ఏకంగా కూకటివేళ్లతో సహా గాలిలోకి ఎగిరిపోతుందేమో అనిపించుతూ చూడ ఎంతో సొంపుగా వుండేది; ఇక కళ్లం మీద పంట నూర్చినప్పుడు మూడుగొలుసుల జాటీ పట్టుకుని, చకచకా ఎడతెరిపి లేకుండా పనలను బాదుతూంటే, ఆ బాహువుల నిడుపాటి ఉక్కుకండరాలు యంత్రానికున్న దండంలాగు కిందకీమీదకీ లేస్తూండగా చూచేవారికి కడుపు నిండిపోయేది. ఆపూ అలసటా లేకుండా అతడు చేసే పనికి నోరూ వాయీ లేని ఆ నిరంతరాయమైన నిశ్శబ్దం తోడై, అతడు చేస్తూన్న పనికి ఒక గంభీరమైన ప్రాముఖ్యతను సమకూర్చేది. మనిషి మహా చలాకీగా ఎంతో అందంగా వుండేవాడు; పాపం ఆ లోపం వుండబట్టిగాని, లేకుంటే ఏ ఆడపిల్ల అయినాసరే అతడిని కళ్లకు అద్దుకుని పెళ్లాడి వుండునన్న మాట... ఆలా వుంటూండగా, అతడి యజమానురాలు జమీందారిణి హుకుం ప్రకారం అతడిని మాస్కోకి తీసుకొని పోయి, మోకాలు వరకూ వచ్చే బూడ్సులు అతడికి కొనియిచ్చి, అవి వేసుకొనమని ఆజ్ఞాపించి, ఎండకాలానికి ఒక జుబ్బా, చలికాలానికి గొర్రెబొచ్చు తోలుకోటూ కుట్టించి ఇచ్చి, అవి తొడుగుకొనమని ఉత్తరువిచ్చి, చేతికి చీపురొకటీ పార ఒకటీ ఇచ్చి, అతగాడిని గేటు జవానుగా తయారుచేశారు.

ఈ నూతన జీవితం అతడికి మొదటలో ఏమీ మనస్కరించక మహా కంటకమనిపించింది. పొలం పనికీ పల్లెపట్టు జీవితానికీ అతడు చిన్నప్పటి నుండీ అలవాటుపడ్డాడు. తనకున్న లోపం కారణంగా తన తోటి మనుషుల సహవాసం నుండి అతడు వేరుపడిపోయి, నోరులేని మూగజీవిగా

జగజ్జెట్టిలా, సారవంతమైన నేలలో మహావృక్షంలా పెరిగాడు... అలాంటి మనిషిని పట్నానికి తీసుకొచ్చే సరికి, ఇదంతా ఏమిటి, ఈ ఉపద్రవమంతా ఎందుకు జరిగిందని అతడికేమీ అర్థంకాక — ఏపుగా తన మెడల వరకూ పెరిగిన గడ్డిచేనులో స్వేచ్ఛగా విహరించుతూన్న గిత్తను తీసుకెళ్లి రైలుపెట్టెలో పెట్టి కట్టివేసినట్టయితే, ఈ నిమిషం నిప్పురవ్వలతో మెరుస్తూన్న పొగలూ, మరునిమిషం ఆవిరి మేఘాల కెరటాలూ తన స్థూల కాయాన్ని ఆవరించుతూండడం చూసి, తనను ఎక్కడకు తీసుకుపోతూన్నారో, ఏ లోకానికి పంపించేస్తున్నారో 'ఆ దేవుడికే తెలియాలి!' అని అనుకుంటూ నివ్వెరపోతూన్న ఆ గిత్తలాగానే — మూగవోయిన ఆశ్చర్యంతో ఒక్కటే బాధపడ్డాడు గెరాసిమ్. రెక్కలూడిపోయే పొలం పనికి అలవాటు పడిన గెరాసిమ్‌కు ఈ కొత్త నౌకరీలో చేయవలసిన పని ఒక పనికిందే అవుపడిందికాదు. తన పని అంతటినీ ఒక్క అరగంటలో పూర్తి చేసుకుని, రోడ్డుమీద నడుస్తూన్న మనుషుల ముఖాలకేసి — పొడుపుకథలా అవుపడుతూన్న తన ప్రస్థుతస్థితికి అర్థమేమిటో వాళ్ల ముఖాల్లో రాసి వుంటుందేమో అన్నట్టు—ఆలా చూస్తూ కడమ అంతసేపూ వాకిట నడిమధ్య నిలబడిపోయేవాడు; లేదా అంటే ఏదో ఒక మారుమూలలకు వెళ్లిపోయి, ఆ చీపురునీ పారనీ తన కళ్లకగపడకుండా ఒక పక్కకు విసిరేసి, బోనులో చిక్కుకున్న జంతువులా నేలమీద బోర్లాపడి గంటల తరబడి ఆలా వుండిపోయేవాడు. అయితే ఏముందిలెండి — ఎటువంటి స్థితికైనా మనిషి అలవాటు పడిపోతాడు. గెరాసిమ్ కూడా రానురాను పట్నవాసానికి అలవాటు పడిపోయాడు. అతడు చేయాల్సిన పనులు బహు కొద్దివే — అతని పనులన్నీ ఏమిటంటే: వాకిలి శుభ్రంగా వుంచడమూ, రోజుకు రెండు

తడవలు ఒకపీపా నీళ్ళు బండిమీద తీసుకురావడమూ, ఇంట్లో వున్న పొయ్యలకు సరిపోయినన్ని పుల్లలు కొట్టడమూ, పరాయివాళ్ళెవ్వరూ వాకిట్లోకి చొరబడకుండా చూడడమూ, పోతే రాత్రిళ్ళు కాపలా కాయడమూ. ఇక ఆ మాటకొస్తే, తన పన్నులన్నిటినీ అతడు ఎంతో శ్రద్ధగానూ దీక్షతోనూ చేసేవాడనే ఒప్పుకొని తీరాలి. కంట్లో కలికం పెట్టుకుని వాకిలి అంతా వెతకినా కూడా ఇంత పిసరైనా చెత్తచెదారముగాని, చివరకు పూచిక పుడకైనా సరే అవుపడేదికాదు — వాకలి అంతా అద్దంలా వుండేది. నీళ్ళు నింపుకొస్తూండగా ఆ నీళ్ళపీపాబండి ఎప్పుడైనా వర్షం మూలాన బురదలో కూరుకుపోయి, బండికి కట్టడానికని తనకిచ్చిన ఆ చచ్చు గుర్రం ఇక ఆ బండిని లాగలేక ఆగిపోయినప్పుడు, అతడు తన బుజంతో ఆలా వూరకే ఒక్క నెట్టు నెట్టేసరికల్లా, బండి ఒక్కటే కాదు కదలడం — గుర్రమూ బండీ రెండూ అక్కడనుండి కదలి ముందుకు సాగిపోయేవి. ఇక అతడు కర్రలు కొట్టేటప్పుడు, కిటికీ అద్దాలు అదిరితే ఫెళఫెళామని ఎలా శబ్దమవుతుందో, అతని చేతనున్న గొడ్డలి కూడా ఆలా ధ్వనించి, పేళ్ళూ ముద్దులూ పుల్లలూ నలుమూలలలా ఎగిరిపోయేవి. ఇక పరాయివాళ్ళు గేటు దాటి వాకిట్లోకి చొరబడడం విషయమంటూరా, ఒకనాటి రాత్రి గుమ్మంలో కాలుపెట్టిన ఇద్దరు దొంగలను అతడు పట్టుకుని వాళ్ళ తలకాయలు రెండింటినీ ఒకదానితో ఒకటి ఎంత గట్టిగా ఢీకొట్టించాడంటే, మరి వాళ్ళని పోలీసు స్టేషనులో అప్పజెప్ప నవసరమే లేకపోయి, ఇక ఆనాటినుండి ఆ చుట్టుపక్కల వీధులలో వున్న వాళ్ళందరకీ అతడంటే అపారమైన గౌరవం కుదిరిపోయింది. రాత్రిమాట ఆలా వుండగా, పగటిపూట సహితమూ అల్లరచిల్లరవాళ్ళు కాకుండా కేవలం మామూలు సాదా మనుషులే పరాయివాళ్ళు

ఎవరైనా వాకిట్లోకి కాలు పెట్టబోయి, అతడిని చూసేసరికి, తమ జోలికి రావద్దని చేతులు పైకెత్తి వూపుతూ గట్టిగా కేకలూ బొబ్బలూ పెట్టే వారు — అక్కడకి వాళ్ల కేకలూ బొబ్బలూ అతడికి వినబడుతాయే అన్నట్టు. ఆ ఇంట్లో పనిపాటులు చేస్తూన్న తోడి భృత్యువర్గంతో గెరాసిమ్‌కు వైరమేమీ లేకపోయినా, వాళ్లకీ అతనికీ వున్న సంబంధం స్నేహపూర్వక మైనదని మాత్రం చెప్పేందుకు వీల్లేదు — కారణం, అతనంటే వాళ్లందరకూ గడగడాటు. కాని అతడు మాత్రం వారందరూ తనవారేననీ, తన లాగే వారు కూడా బానిస భృత్యులేననీ భావించేవాడు. అతనితో వారు ఏదైనా చెప్పాలనుకుంటే సంజ్ఞలుచేసి చెప్పేవారు, అతడు కూడా ఆ సంజ్ఞలు అర్థం చేసుకుని, అన్ని ఆజ్ఞలనూ అక్షరాలా శిరసావహించేవాడు, అయినప్పటికీ తన హక్కులకు మాత్రం ఎవరి వల్లనూ ఎట్టి భంగమూ వాటిల్లకుండా చూసుకునేవాడు. ఇక భోజనపుబల్ల వద్ద అతని స్థలం ఆక్రమించడానికి ఎవడైనా సరే జడిసిపోయేవాడు. గెరాసిమ్ అతి గంభీరమైన వ్యక్తి, నీతి నియమాలను అతి కఠినంగా అనుసరించే మనిషి. దానికి తోడు ఎక్కడి వస్తువు అక్కడ వుండేటట్టు క్రమం పాటించడమంటే అతనికి చాలా ఇష్టం. ఆ విషయంలో చివరికి కోడిపుంజులు సహితం అతడి ఎదుట పోట్లాడుకునేవికావు. ఆలా అవి పోట్లాడుకుంటూండగా అతని కళ్లబడ్డట్లాయెనా, అతడు చెరొక దానినీ కాళ్లతో పట్టి గిరగిరా తిప్పి గాలిలోకి ఎగరేసి చెరి ఒక మూలా విసిరేస్తాడని వాటికి సహితమూ తెలుసునన్నమాట! జమీందారిణి ఇంట్లో కోళ్లూ బాతూలు కూడా వుండేవి; అయితే బాతులు మంచి హుందాతనంతోనూ గర్వంగానూ మసిలే పక్షులన్న విషయం ప్రపంచానికంతకు విదితమే; గెరాసిమ్ కూడా వాటిని అతి గౌరవంగా చూస్తూ, వాటికి

చక్కగా సంరక్షణ చేసి మంచి తిండి పెట్టి పెంచేవాడు. మొత్తం మీద గెరాసిమ్ కూడా, ప్రశాంతంగా హుందాతనంతో నడిచే మగబాతు లాగానే వుండేవాడు. అతను వుండడానికని వంటయింటి పైన వున్న ఒక చిన్నకొట్టు అతనికిచ్చారు. ఈ చిన్నకొట్టును అతడు తన సొంత గదికింద వాడుకునేవాడు. ఆ చిన్నకొట్టులోనే అతడు తనకున్న నాలుగు వస్తువులనూ తన అభిరుచుల ననుసరించి సర్దుకొని పెట్టుకున్నాడు. ఓక్ చెక్కలతో మంచం ఒకటి చేసుకుని, మంచానికి కోళ్ళు బదులు నాలగు చెక్కదిమ్మ లను అమర్చాడు — మొత్తంమీద రాక్షసుడికి తగిన మంచమే అది; దాని మీద నూరు మణుగుల బరువు పడేసినా సరే చెక్కు చెదరకుండా ఆలాగే నిలబడుతుంది ఆ మంచం. మంచంకింద రాయిలాంటి ఒక కావడిపెట్టె. అంత రాయిలాంటి టేబిలే వుంది గదిలో ఒక మూల. ఆ టేబిలు దగ్గరగా ఒక మూక్కాలిపీట — ఆ పీట గున్నఏనుగులా ఎంత దృఢంగానూ ఎంత నిద్దగానూ వుందంటే, గెరాసిమ్ దానిని పట్టుకొని నేలను విసరికొట్టి, అది గుండులా వుండడం చూసి తనలో తానే నవ్వుకునేవాడు. ఆ కొట్టు తలుపు గొళ్ళేనికి, దిబ్బరొట్టె అంత పెద్దదీ, అంత నల్లగానూ వున్న కప్పతాళం ఒకటి వుండేది. తన గదికి తాళం వేసుకుని ఆ తాళపుచెవిని తన పటకాకి తగిలించుకునే ఎల్లప్పుడూ తిరుగుతూండేవాడు గెరాసిమ్. తన గదిలోకి వాళ్ళూ వీళ్ళూ వెళ్ళడం అతనికేమీ మనస్కరించేదికాదు.

పట్నం వచ్చి ఒక ఏడాది అయాక గెరాసిమ్‌కి చిన్న ఘటన ఒకటి సంభవించింది.

తాను ఏ యజమానురాలి ఇంట్లోనైతే గేటు జవానుగా బానిసకొలువు చేస్తున్నాడో ఆ జమీందారిణి పూర్వకాలపు సంప్రదాయాలన్నిటినీ

తు.చ తప్పకుండా మిక్కిలి పట్టుదలతో పాటించే వ్యక్తి అవడంచేత, ఆమె కొలువులో దాసదాసీ జనులు అనేకులు నిత్యమూ పనిచేస్తూండేవారు. చాకలి పనిచేసే దాసీలు, బట్టలు కుట్టే దాసీలు, వడ్రంగులు, దర్జీలు, పశు వైద్యం చేస్తూ నౌకర్లకు కూడా మందూ మాకూ ఇచ్చే గుర్రపుజీన్లు తయారుచేసే గొడారివాడొకడు — ఈ బానిస భృత్యులే కాకుండా జమీందారిణిగారికి స్వయంగా వైద్యం చేసేందుకు ఇంటిలోనే డాక్టరు ఒకడూ వుండేవారు; చివరకు తప్పతాగుబోతు అయినట్టి కపితోన్ క్లీమొవ్ అనే నామధేయం కల్గిన జోళ్ళు తయారు చేసేవాడొకడూ కూడా వుండేవాడు. లోకం తనకు గొప్ప అన్యాయం చేసిందనీ, తానొక దురదృష్టవంతుడననీ, తాను చదువుకున్నవాడే, పట్నవాసంలో వుండాల్సినవాడే అయినప్పటికీ తన కర్మ కాలి, తనకు తగిన పని లేకుండా మాస్కో మహాపట్నంలో కాకుండా, దిక్కూ మొక్కూలేని ఈ శివారులో కాలం వెళ్లమార్చాల్సి వచ్చినందు వల్ల తన గుణగణాలను గ్రహించేపాటి వారెవ్వరూ తన చుట్టుపక్కల లేకపోయారనీ, తాను ఎప్పుడైనా నేరకపోయి తాగాల్సి వచ్చిందంటే కేవలం తన దుఃఖాన్ని మరచిపోయేందుకేననీ, గుండె బాదుకుంటూ తానే చెప్పకునేవాడు క్లీమొవ్. ఈ వ్యక్తిని గురించి ఒకనాడు జమీందారిణి తన హెడ్ బట్లరుతో ప్రస్తావించింది. పసుప్పచ్చని చిన్న కళ్ళూ, బాతుముక్కులాంటి ముక్కూ — ఆ హెడ్‌బట్లరు ముఖం తీరు చూసేసరికే ఏదో దాస్టీకపు ఉద్యోగమే ఇతగాడి నొసట రాసిపెట్టాడు విధాత అని తప్పకుండా అనిపించుతుంది. క్రితం దినమే తప్పతాగి ఎక్కడో వీధిలో పడి దొర్లుతూండిన కపితోన్ దుర్నడతను గురించి జమీందారిణి తన హెడ్‌బట్లరు గవ్రీలాతో ప్రస్తావించి చాలా కించపడింది.

''అవును గాని, గవ్రీలా! అతగాడికి మనం పెళ్ళిచేసేస్తేనో?'' అని తటాలున ఆమె అంది. ''ఏమంటావు నువ్వు? పెళ్ళి అయితే మనిషికి స్థిరం కుదరొచ్చు.''

''చిత్తం! తమరు వివాహం చేసేయ్యొచ్చునండి! తమరు తల్చుకుంటే అందుకు అభ్యంతరం ఏముంటుందండి, భేషుగ్గా వుంటుందండి!'' అని గవ్రీలో ప్రత్యుత్తరమిచ్చాడు.

''అవున్లే, కాని అతగాడిని ఎవర్తె చేసుకుంటుంది?''

''చిత్తం! ఫలానా మనిషి చేసుకోవాలని తమరు సెలవిస్తే ఆ మనిషే చేసుకుంటుందండి. ఇంతకీ అతగాడిలో ఏదో కొంత మంచి అంటూ వుండక పోదండి — కడమవాళ్ళకంటె అతగాడు చెడిపోయింది ఏముంది లెండి?''

''అతగాడికి తత్యాన మీద మోజు వున్నట్టు నాకుతోస్తూంది. ఏం?''

ఆ మాట విని, అందుకు ఏదో అభ్యంతరం చెబుదామని గవ్రీలో మొదట అనుకున్నాడు, గాని మళ్ళీ చటుక్కున నోరు కుట్టేసుకున్నాడు.

''సరే... తత్యానకిచ్చి పెళ్ళిచేసేద్దాం'' అని ఆమె నిశ్చయం చేసేసింది, చిట్టిడు నస్యం పీల్చి, తన మాటకు అడ్డు లేనందుకు సంతృప్తి చెందు తూనూ. ''నేనన్న మాట నీకు వినబండిగా?''

''చిత్తం, వినబడిందండి!'' అని గవ్రీలో ప్రత్యుత్తరమిచ్చి ఆమె వద్ద సెలవు పుచ్చుకుని వచ్చేశాడు.

గవ్రీలో తన గదికి (ఇంటి పార్శ్వభాగంలో, ఇనుపపట్టీలతో బిగించిన బోషాణాలతో నిండిపోయుంది ఆ గది) వెళ్ళిపోవడంతోనే, గదినుండి తన పెళ్ళాన్ని పంపించేసి, కిటికీ దగ్గర కూచుని అట్టే ఆలోచించాడు. ఏమాత్రమూ అనుకోకుండా తటాలున జమీందారిణి జారీచేసిన హుకుం

అతడిని కలవర పెట్టివేసిందని ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది. కొంత సేపు ఆలా ఆలోచించిన తరువాత, కిటికీ దగ్గరనుండి లేచి, కపితోన్నుని రమ్మనమని కబురుచేశాడు. కపితోన్ వచ్చాడు... కాని వారిద్దరి సంభాషణను వివరించేముందు, కపితోన్నుని పెళ్లిచేసుకోవాల్సిన తత్యాన ఎవరో, జమీందారిణి జారీచేసిన హుకుం హెడ్‌బట్లరును కలవరపెట్టడానికి కారణమేమిటో పాఠకునికి మనం విశదపరచడం అనవసరం కాదనే అనుకుంటాం.

జమీందారిణి భృత్యుకోటిలో చాకలిపని చేసే స్త్రీలు వున్నారని ఇది వరకే చెప్పాం కదా. తత్యాన పని బట్టలు ఉతికి చలువచేసి ఇస్త్రీ చెయ్యడం (అయితే ఆమె ఎంత పనిమంతురాలూ ఎంత అనుభవశాలీ అంటే అన్ని వలువల్లోనూ అతి ప్రశస్తమూ మిక్కిలి నాజూకూ అయిన వాటినే ఆమెకిచ్చే వారు ఉతకమని). ఆమెకి సుమారు ఇరవైయ్యెనిమిదేళ్లు వుంటాయి. మనిషి పొట్టిగా సన్నంగా వుంటుంది, నార రంగు జుట్టు, ఎడమబుగ్గ పైన పుట్టుమచ్చలు. ఎడమబుగ్గ పైన పుట్టుమచ్చవుంటే అదృష్టహీన జాతకమనీ, జీవితంలో ఆమనిషి ఎన్నో కష్టాలు అనుభవించాల్సొస్తుందనీ అంటారు రష్యాలో... ఈరోజు తనకు సుఖంగా గడిచిందని ఎన్నడూ చెప్పుకొని ఎరగదు కదా, తత్యాన. తాను ఎరిగినదల్లా చిన్నతనం నుండీ ఒళ్లు హూనం అయిపోయి రెక్కలు ఊడిపోయినట్టు బండ చాకిరీ చేయడమే: ఆమె ఒక్కర్తే ఇద్దరి పని చేయాల్సి వచ్చేది; ఆమె అంటే ఎవ్వరూ ఏనాడూ ఆపేక్ష పడలేదు కదా. పాపం ఎప్పుడూ చింకిపాతలే కట్టుకునేది; ఏ చచ్చుజీతమో ముట్టజెప్పేవారు. ఆమెకు బంధువులెవ్వరూ లేరన్ననూాటే: మేనమామ మాత్రం ఒకడున్నాడు, వెనకెప్పుడో ఇక్ష్వాకులనాడు బట్లరు పనిచేశాడు, కాని ఇప్పుడు ముసలి వృద్ధు అయిపోవడాన్ని ఎందుకూ పనికిరాడని గ్రామంలోనే వుంచే



57—1

శారు; ఇతడు గాక మరికొందరు మేనమామలూ పినతండ్రులూ వున్నారు, కాని వాళ్లందరూ పల్లెపట్టు రైతులు — వీళ్లు తప్ప మరెవ్వరూ లేరామెకి. ఒకప్పుడు ఆమె అందకత్తె కిందే లెక్క. కాని ఆ అందమంతా ఏనాడో మాయమైపోయింది. ఆమె అతి సాధువైన మనిషి, అసలు నిజం చెప్పాలంటే ఆమె అతి భయస్థురాలు. తన భవితవ్యం గురించి పూర్తిగా నిరాశచెందిపోయి, ఇక దానిగురించి తల్చుకోవడమే మానివేసింది; పరాయివాళ్లంటే ఆమెకి మీది ప్రాణాలు మీదికే ఎగిరిపోయేవి; ఎంత సేపూ తన పని ఎంత వేగంగా పూర్తి చేసుకుంటానా అన్న తాపత్రయమే తప్ప మరొక ఆలోచనే లేదు ఆమెకు. ఎవ్వరితోనూ మాట్లాడేదికాదు. ఇక జమీందారిణి పేరు చెబి తేనే హడలిపోయి గజగజ వణికిపోయేది — నిజానికి జమీందారిణి తత్యాన పేరు వినడమే గాని, ఫలానా మనిషి తత్యాన అని ఆమెకి తెలియనే తెలి యదు. గెరాసిమ్ తన స్వగ్రామం నుండి అక్కడకు వచ్చిన కొత్తరికంలో, బ్రహ్మాండమైన ఆ మనిషిని చూసేసరికే తత్యాన భయపడి బిక్కచచ్చి పోయి, తనకు వీలైనంత వరకూ అతడి కంటపడకుండా అతడిని తప్పించు కునే తిరిగేది; బట్టలు ఉతికే పెరటినుండి ఆదరా బాదరా ఇంట్లోకి వెళ్లేటప్పుడు కర్మం చాలక అతడి పక్కనుండి వెళ్లవలసి వచ్చినట్లాయెనా, ముఖం చిట్లించుకుని పరుగెత్తి పారిపోయేది. మొదటిలో గెరాసిమ్ ఆమె గురించి ఏమంతగా పట్టించుకునే వాడేకాదు, కాని తరువాత మాత్రం తనకు ఆమె ఎదురుపడినప్పుడల్లా అతడు నవ్వుతూ, ఆ తరువాత కొన్నాళ్లకు ఆమెకేసి ప్రేమవీక్షణాలు సారిస్తూ, ఇక చివరికి ఆమె ఏమి చేసినా చెందినా తన కళ్లు అన్నీ ఆమెకే ఒప్పజెప్పడం మొదలెట్టాడు. ఆమె అంటే అతనికి ఎందుకని నచ్చిందో — ఆమె ముఖంలో కనబడే సాధుత్వమో, మరి

ఆమె గమనంలో వుండే బిడియమో — ఆ భగవంతుడికే ఎరుక! ఏమైతేనేమి, ఒకనాడామె జమీందారిణిగారి బ్లౌజు నొకదానిని ఇస్త్రీ చేసి, దానిని తన మునివేళ్లతో అతి జాగ్రత్తగా పట్టుకుని ముంగిట్లో నుండి ఇంట్లోకి వెళ్ళుతూండగా, తన మోచేతిని ఎవరో దృఢంగా పట్టుకున్నట్టు ఆమెకు అనిపించింది. చప్పున ఆమె వెనుకకు తిరిగి చూచి, కెవ్వుమని కేక వేసింది... ఆమె వెనకాతలే నిలబడున్నాడు గెరాసిమ్. వెర్రిమొర్రి నవ్వు నవ్వుతూ, ప్రేమసూచకంగా 'మె—మ్మె—మ్మే' అని మూగ ధ్వనులు చేస్తూ, రెక్కలకూ తోకకూ బంగారపు ముచ్చిరేకు అంటించి వున్న అల్లపురొట్టి కోడిపుంజును చేతిలో పెట్టుకుని, దానిని ఆమెకు అందిచ్చాడు. ఆమె వద్దని చెప్పాలనుకుంది, కాని ఆ చెప్పేలోపునే బలవంతంచేసి దానిని సరాసరి ఆమె చేతుల్లో పడవేసి, తల పంకించుతూ, చిట్టచివరకు మళ్లీ మరొకసారి 'మే—మే' అని ఆనందసూచకంగా కేక వేసి అక్కడనుండి వెళ్లిపోయాడు. ఇక ఆనాటినుండి ఆమెను పట్టుకుని మరి వదిలాడుకాదు గెరాసిమ్: ఆమె ఎక్కడ వున్నా సరే, తానూ అక్కడ ప్రత్యక్షమయేవాడు, నవ్వుతూ ఆమెకు ఎదురయేవాడు, ఆనందంతో అర్థంలేని ధ్వనులు చేస్తూ, చేతులు వూపుతూ తటాలున తన జుబ్బా ఎడమచేతి జేబులోనుండి రిబ్బను ఒకదానిని తీసి, వద్దంటున్నా దానిని ఆమెమీద గిరవాటేసి, ఆమె అడుగులకు మడుగులొత్తుతూండేవాడు. పాపం ఆ అమ్మాయికి ఏమి చెయ్యడానికీ, అతని పట్ల ఎలా ప్రవర్తించడానికీ, ఏమీ తెలియక మహా మథనపడిపోయింది. మరి నాలుగు రోజులకల్లా మూగి గేటుజవాను వెర్రిమొర్రి చేష్టలు గురించి ఇంటిల్లిపాదికీ తెలిసిపోయింది: వెక్కిరింపులూ, ఎత్తిపొడుపులూ, ములుకుల్లాంటి దెప్పులూ వానలో వడగళ్లలా తత్యాన మీద పడడం మొద

లైంది. కాని గెరాసిమ్‌తో మాత్రం పరిహాసాలాడ్డానికి ఎవ్వరికీ దమ్ములు లేకపోయాయి: వెటకారాలు వేళాకోళాలు గెరాసిమ్‌కి గిట్టేవికావు, పోతే అతని ఎదుట తత్యానను ఎవ్వరూ ఏమీ అనేవారుకారు. ఆమె ఇష్టానిష్టాలతో ప్రసక్తి లేకుండానే ఆమె గెరాసిమ్ సంరక్షకత్వంలోకి వచ్చేసింది. చెవిటి మూగ వారందరిలాగానే గెరాసిమ్ మంచి కుశాగ్రబుద్ధి అవడంచేత తనను చూచిగానీ, ఆమెను చూచిగానీ ఎవరైనా నవ్వుతూన్నట్టాయెనా, ఆ సంగతి తక్షణం పసికట్టేసేవాడు. ఒకనాడు అందరూ భోజనం చేస్తూండగా తత్యానకు పనిపురమాయించుతూ ఆమెపై అజమాయిషీ చలాయించే మేట్రనుకు ఆ అమ్మాయిపై కోపంవచ్చి, ఇక అదే పనిగా చివాట్లు పెట్టడం మొదలు పెట్టే సరికి, పాపం ఆ అమ్మాయి నలుగురిలోనూ తలయెత్తుకోలేక, చిన్నతనం పడిపోయి, కళ్లంట నీళ్లు తిరిగి, ఇక ఆపాళంగా భోరున ఏడ్చేసినంత పనైంది. ఇదంతా చూస్తూన్న గెరాసిమ్, తటాలున లేచి, బ్రహ్మాండమైన తన చేయి పిడికిలిబిగించి, పిడికిలిని ఆ మేట్రను తలకాయపై వుంచి, ఆమె ముఖంకేసి పళ్లు పటపట కొరుకుతూ భయంకరంగా కళ్లు ఎర్రజేసి తేరిచూచే సరికి, ఆమె హడలిపోయి, ఆలా కుంగిపోయి, మెడలు బల్లమీద వాల్చేసింది. అక్కడున్న వాళ్లెవ్వరూ నోరు మెదపలేదు సరికదా, కిమ్మన్నాస్తిగా వూరుకుని కిక్కురు మనలేదు. గెరాసిమ్ మళీ యథాప్రకారంగా తన చమ్చాతో 'సూప్' పుచ్చుకోవడం కానిచ్చాడు. "ఓరి, మూగదయ్యమా!" అని అందరూ సణుగుకున్నారు, మేట్రను లేచిపోయి నౌకర్ల గదిలోకి వెళ్లపోయింది. ఇంకొక సారి ఏమైందంటే, కపితోన్ — ఎవడిని గూర్చి అయితే మనం ఇందాకా చెప్పకున్నామో అతగాడే — తత్యానను మరీ చనువుగా పలకరించుతూండగా, అది గెరాసిమ్ కళ్లబడేసరికి, గెరా

సిమ్ అతగాడిని రమ్మనమని సంజ్ఞచేసి, గుర్రపుబగ్గీల సాలలోకి తీసుకువెళ్లి, అక్కడ ఒక మూల ఏరుగాలు ఒకటి వుంటే దానిని చేతబుచ్చుకుని మర్యాద గానే, అయినప్పటికీ నిస్సందేహంగానే అతగాడిని జడిపించాడు. ఇదంతా జరిగిన తరువాత ఇక తత్యానతో సంభాషించడానికి ఎవ్వరికీ ధైర్యం చాలిందికాదు. ఆ విషయం అందరికీ తెలిసినప్పటికీ ఎవరి మట్టున వారు తమకు తెలియనట్టే నోరు మూసుకుని వూరుకున్నారు. అయినా, నౌకర్ల గదిలోకి వెళ్లిపోయిన తరువాత మేట్రను మూర్ఛిల్లిపోయింది, తనమీద గెరాసిమ్ దౌర్జన్యం ప్రయోగించాడన్న సంగతి ఆమె తరువాత మెల్లగా జమీం దారిణి చెవిని పడేసింది. ఆ తిక్కమనిషి, ముసలి జమీందారిణి ఆ సంగతి వినగానే, పొట్ట చెక్కలయేటట్టు నవ్వి, గెరాసిమ్ ఇనుప పిడికిలికింద మేట్రను బల్లమీాదకి ఏలా కుంగిపోయిందో — అసలే అవమానంతో వాళ్ల మండిపోతూన్న ఆ మేట్రనుకి మరింత ఆగ్రహం కలిగేటట్టుగా — మేట్ర నునే మళ్లీమళ్లీ చెప్పమని, మళ్లీమళ్లీ విరగబడి నవ్వింది ఆమె. ఈ వృత్తాంతమంతా విన్నమరుచటి రోజున, గెరాసిమ్‌కి ఒక వెండి రూబులు ఇనాంగా పంపించింది జమీాందారిణి. అతడు విశ్వాసపాత్రుడూ బలవం తుడూ అయిన కావలివాడని గెరాసిమ్‌పై ఆమెకు గొప్ప నమ్మకం ఏర్పడి పోయి, అతడి విలువను ఆమె గ్రహించింది. గెరాసిమ్‌కి మాత్రం ఆమె అంటే భయమే, అయినప్పటికీ తనపై ఆమెకు దయ కుదిరిందని అతడికి తెలియడంచేత, ఆ భరవసా మీాద తత్యానను పెళ్లాడడానికి ఆమె అను మతి పొందడానికని నేడోరేపో ఆమె దర్శనార్థం సన్నద్ధుడు కాబోతున్నాడు కూడానూ. తన యజమానురాలు జమీాందారిణి గారి దర్శనం చేసుకున్న ప్పుడు మర్యాదైన దుస్తులు వేసుకోవాలి కదా అని అనుకుని, హెడ్‌బట్లరు

తనకు ఇస్తానని ఇదివరలో ఖరారు చేసిన కొత్తజుబ్బా కోసమని ఇంతవరకూ ఆగాడు. కాని ఈలోపున హఠాత్తుగా తత్యానను కపితోన్‌కిచ్చి పెళ్లి చేసేద్దామని జమీందారిణి పుర్రెలో బుద్ధి ఒకటి పుట్టుకొచ్చింది.

జమీందారిణికీ తనకూ సంభాషణ జరిగిన తరువాత, హెడ్‌బట్లరు గ్రవీలో అంత తీవ్రంగా కలవరపడడానికి కారణమేమిటో పాఠకునికిప్పుడు సులభంగానే విశదమవుతుంది. "గెరాసిమ్ మీద యజమానురాలికి సహజంగానే అనుగ్రహం కుదిరిపోయింది" (ఈ సంగతి గ్రవీలొకి మొదటి నుండీ తెలిసే, గెరాసిమ్ పట్ల తానూ దయచూపిస్తూండేవాడు); "ఇంతకీ — అతగాడేమో మూగవాడాయెరి. అతగాడు తత్యానను పెళ్లాడదామనుకుంటున్నాడని నేను మాత్రం ఏ ముఖం పెట్టుకుని జమీందారిణిగారితో చెప్పగల్గుతాను? చెప్పాననే అనుకుందాం — అయితే మాత్రం, పెళ్లిచేసుకున్నంత మాత్రాన వీడు ఆడదాన్ని సరిగ్గా ఏలుకోగల్గుతాడని నమ్మడమెలాగు? కాని, ఇటు ఆలోచించి చూస్తే — తత్యానను కపితోన్‌కిచ్చి పెళ్లి చేస్తారని ఆ రాక్షసి తెలుసుకున్నాడంటే మాత్రం, ఇంటిమీద పెంకులు ఎగరగొట్టేస్తాడు — అంతటి వాడు అవును — అది మాత్రం ఖాయం! వాడితో ఎవడు వాదించగలడు? ఆ దయ్యానికి — పాపాత్ముడనైన నాపై దేవుడు కరుణవహించుగాక! — ఎవడు నచ్చచెప్పగలడు?.. వాడు వినడే... ససేమిరా వాడు వినడు..."

ఈలా గ్రవీలొ ఆలోచించుకుంటూండగా, కపితోన్ అక్కడకు రావడంవల్ల అతని ఆలోచనలకు అంతరాయం కల్గింది. లఘుచిత్తుడైన ఆ గొడారి ఆ గదిలోనికొచ్చి, వీపువెనుక చేతులు పెట్టుకొని, తలుపు దగ్గర ఒక మూల గోడను ఆనుకుని, అతి నిర్లక్ష్యంగానూ చనవు తీసు

కుంటూనూ, ఎడమకాలిమీద కుడికాలు మణచుకుని, తలకాయ ఎగరేసు కుంటూ నిలబడ్డాడు. ''వచ్చానయ్యా, నేను. ఎందుకో రమన్నావటగా?'' అన్నట్టుగా వుండెను అతగాడి వైఖరి.

కపితోన్ కేసి గవ్రీలో ఎగా దిగా చూసి, కిటికీ అంచుపై తన వేళ్లతో దరువు వాయించాడు. కపితోన్ మాత్రం మట్టివుండల్లా వున్న తన కను గుడ్లను చీపిగా పెట్టాడే గాని, కళ్లు దించలేదు సరికదా, అగిసెనారలా తెల్లగా వుండి నలువైపులా నిక్కపొడుచుకునున్న తన జుట్టులో వేళ్లను చొప్పించి తల నిమురుకుంటూ: ''నువ్వు రమ్మంటివిగా, నాకేసి ఎందుకలా మిడిగుడ్లు పెట్టుకు చూస్తావు?'' అన్నట్టుగా, చిన్న నవ్వు కూడా నవ్వాడు.

''చలాకీ మనిషివి నువ్వు, ఏం? చలాకీ మనిషివేగా నువ్వు!'' అన్నాడు గవ్రీలో, కాస్సేపు వూరుకున్నాక.

కపితోన్ ఉలకలేదు పలకలేదు — బుజాలు కాస్త కదిపాడు, ''అక్కడకు నువ్వేమిటో మహా మెరుగైనట్టు?'' అని తన మనస్సులో అనుకుంటూనూ.

''చూడు ఎలాగున్నావో — నువ్వెలా వున్నావో, నీ వాలకం ఎలాగుందో చూసుకోవయ్యా ఒక్కసారి!'' అంటూ చివాట్లు వేయడం మొదలు పెట్టాడు గవ్రీలో: ''ఆహా! ఎలా వున్నావయ్యా!''

బొంతు రేగిపోయి చింకిపాతగా తయారైన తన కోటుకేసి, మాసికలు వేసిన తన పంట్లాం కేసి, చిరిగిపోయిన తన జోళ్లకేసి, వొయ్యారంగా మునివేళ్లతో నేలపైనిటారుగా ఆనుకొని పెట్లిపోయున్న కుడికాలి జోడు మొనను

మరీ ప్రత్యేకమైన శ్రద్ధతో నిదానంగా పరికించి చూసి, తరువాత హెడ్ బట్లరు కేసి చూసి:

''అయితే ఏమిటి?'' అన్నాడు కపితోన్.

''అయితే ఏమిటా?'' అన్నాడు గవ్రీలా ఆమాట అందుకుని. ''అయితే ఏమిటి, అయితే ఏమిటని ఇంకా అడుగుతావా? అచ్చంగా సైతానులా వున్నావు — పాపాత్ముడనైన నాపై దేవుడు కరుణ వహించుగాక! అచ్చంగా మూడు మూర్తులా అలాగే వుందినీ రూపు.''

కపితోన్ గబాగబా గుడ్లు మిటకరించాడు.

''తిట్టవయ్యా, గవ్రీలా అంద్రేయిచ్, నోటికొచ్చినట్టూ తిట్టు నన్ను!'' అనుకున్నాడు మనస్సులో.

''మళ్లీ తప్పతాగావటగా!'' అంటూ మళ్లీ చివాట్లు వేయడం మొదలుపెట్టాడు గవ్రీలా. ''తప్పతాగి తందనాలాడావు, ఏం? అంతేనా?''

''వంట్లో శక్తిలేక నీర్సించిపోతే ఆరోగ్యం కోసమని కాస్తమద్యం పుచ్చుకోక తప్పిందికాదు, వాస్తవమే మరి!''

''వాళ్లు నీర్సించిపోతే ఆరోగ్యం కోసమట! నీకింకా తగిన శాస్తికాలేదు, అదీ అసలు సంగతి. పీటర్స్‌బర్గ్‌లో పని నేర్చుకున్నావు, మళ్లీనీ!.. గొప్ప పనే నేర్చుకున్నావులే, మొత్తానికి! ముదనష్టపు మనిషివి తయారయావు!''

''ఇదిగో, గవ్రీలా అంద్రేయిచ్, ఆ మాట అనడానికి — ఆ దేవుడి కొక్కడికే తప్ప మరెవ్వరికీ అధికారంలేదు. ప్రపంచంలోకల్లా నేనే ముదనష్టపు మనిషిని అవునోకాదో ఆ దేవుడి కొక్కడికే ఎరుక. ఇక ఈ తాగుడు విషయమంటావా — ఇందుకు కారణం నేను కాదు, ఇందుకు కారణం

కేవలం ఒక స్నేహితుడు; అతడు మోసంజేసి నన్నీ మాయదారిలో పడేసి తాను మెల్లగా జారుకున్నాడు, నేను...''

''నువ్వేమో గాడిదలా వీధిలో దొర్లుతున్నావు. ఛీఛీ! వుత్త పనికి మాలిన వాడివి! పోతే, అసలు విషయం ఇదికాదు'' అంటూ హెడ్‌బట్లరు చెప్పడం మొదలుపెట్టాడు. ''జమీందారిణిగారు...'' అని, కాస్సేపు వూరుకుని, మళ్లీ మాట అందుకుని, అన్నాడు: ''జమీందారిణిగారు అంటూంది, నువ్వు పెళ్లిచేసుకోవాలని. వింటున్నావా? పెళ్లి చేసుకుంటే నీకు స్థిరం కుదురుతుందేమోనని ఆమె అనుకుంటూంది. అర్థమైందా?''

''అర్థంకాకేం? అర్థమైంది.''

''అయితే, సరే. నా ఉద్దేశ్యంలో నిన్ను చెవులు నులిపి నీకు బుద్ధి చెప్పేవాడు ఒకడుంటే అదింకా ఉత్తమం. సరి, దానికేంగాని, ఇదీ ఆమె గారి చిత్తం. ఏం, నువ్వేమంటావు? నీకిష్టమేనా?''

కపితోన్ పళ్లిగిలించాడు.

''పెళ్లి మనిషిని బాగుచేస్తుందయ్యా, గవ్రీలా అంద్రేయిచ్! పోతే, ఇక నామట్టుకు నేను అమితానందంతో అంగీకరిస్తాను.''

''అయితే సరే'' అని పైకి అని, గవ్రీలా ఆత్మగతంగా అనుకున్నాడు: ''ఏమంటే అది అనవచ్చుగాని — మాటకారి మాత్రం అవును ఇతగాడు.'' ఆలా అనుకుని, మళ్లీ పైకి అన్నాడు: ''అయితే ఒక్క విషయం. నీకు సరి పడని పెళ్లికూతురిని కుదిర్చింది ఆమెగారు.''

''పెళ్లికూతురెవరో నేనడగొచ్చా?''

''తత్యాన.''

''తత్యానే?''

ఆలా అంటూ కపితోన్ గుడ్లు మిటకరించి, గోడను ఆనుకున్నవాడల్లా చటుక్కున నిటారుగా నిలబడ్డాడు.

"అరే! అలా ఉలికిపడ్డా వెందుకు? ఆ పిల్లంటే నీకిష్టంలేదా?"

"ఆ పిల్ల నాకిష్టం లేకపోవడమేమి? నాకిష్టమే, గ్రవీలో అంద్రేయిచ్. పిల్ల మంచిదే, లక్షణమైన పిల్ల. వొళ్లు వొంచి పనిచేస్తుంది. కొట్టినా తిట్టినా పడుతుంది, మెత్తనిది... కాని, మీకు తెలియనిది ఏముంది గనుక, గ్రవీలో అంద్రేయిచ్? వాడున్నాడే — ఆ కొరవి దయ్యం, ఆ దిష్టిబొమ్మ వెధవ — వాడు దాని వెంట పడుతున్నాడుగా..."

"నాకు తెలుసు నోయ్! అదంతా నాకు తెలుసు" అంటూ కపితోన్ మాటలకు చికాకుతో అడ్డు పడ్డాడు హెడ్‌బట్లరు: "అవును..."

"అవును, బాబ్బాబు, మీ పుణ్యముండేను, గ్రవీలో అంద్రేయిచ్! వాడు నన్ను అమాంతంగా చంపేస్తాడు. దేవుడా! నన్ను ఖూనీ చేసేస్తాడండీ, బాబోయ్! దోమని నలిపేసినట్టు నలిపేస్తాడండీ, నాయనా! అయ్యో బాబోయ్! వాడి చేతులు — మీరు చూసే వుంటారుగా — చేతులన్న చేతులు కావు, నాయనా; కేవలం మీనిన్ పోజార్‌స్కి చేతులే* మల్లీనీ. ఆ చేతులతో ఒక్క దెబ్బ వేశాడంటే — చెవిటి వెధవ వాడికేమిటి, ఆ దెబ్బ ఝోరు వాడికి వినిపించదుగా — అయ్యో బాబోయ్ — ఆదెబ్బతో మరేమైనా వుందా!

---

*మీనిన్, పొజార్‌స్కిలు ఇద్దరూ రష్యన్ జాతీయ వీరులు. 1611–1612 లో జరిగిన పోలిష్ దండయాత్రను ప్రతిఘటించేందుకు వీరిద్దరూ సాయుధ ప్రజాదళానికి నాయకత్వం వహించి యుద్ధంలోకి నడిపించారు. — అనువాదకుడు.

నిద్రలో పిడికిలి ఝళిపించినట్టే. ఇక వాడు పట్టుకున్నాడంటే, విడిపించడం బ్రహ్మతరం గాదు. ఎందుచేతంటారా? ఎందుఛేతంటే — నే చెప్పాలా మరి, అన్నీ మీరే ఎరుగుదురాయె, గవ్రీలా అంద్రేయిచ్ — వాడు చెవిటి వెధవ, అది చాలనట్టు, దానికి తోడు వుత్త మొండి మొరాయి ఘటం. అడవి మనిషండీ వాడు, కేవలం బొమ్మరాయే — గవ్రీలా అంద్రేయిచ్! — ఆ మాటకొస్తే, బొమ్మరాయే ఇంకా నయమేమో... ఉత్త తుమ్మదుడ్డు, బాబూ! నా కర్మం కాలి, వాడిచేత నేనెందుకు దెబ్బలు తినాలి? నాకేం జరిగినా లక్ష్యం లేదనుకోండి: బోలెడు చూశాను, బోలెడు అనుభవించాను, కొలొమ్న కుండలా నాని నాని వున్నాను — అయినప్పటికీ నేనూ మనిషినే, ఎందుకూ పనికిరాని ఓటికుండను కానుగా.''

''నాకూ తెలుసునోయ్, నాకూ తెలుసు. మరీ హెచ్చవేసి చెప్పకు.''

''ఆరె, దేవుడా!'' అంటూ ఇంకా కానిచ్చాడు ఆ గొడారి కోపంగా. ''దీనికి ఇక అంతమంటూ లేదా, ఆరె, దేవుడా! ఎందుకూ పనికిరాని పాపిష్ఠిని, కేవలం కొరగాని పాపాత్ముడను. నాకర్మ! నాకర్మ కాకపోతే మరేమిటన మంటారు చెప్పండి! నా చిన్నతనంలో నా జర్మన్ యజమాని నన్ను కొట్టి నప్పటికీ, నా జీవితం అంతటిలోనూ మంచిరోజుల్లోనే, నా యజమాని ఆ జర్మనీవాడు, నాస్వదేశస్థుడి చేతనే నన్ను కొరడా దెబ్బలు తినిపించాడు. ఇక ఇప్పుడు, నడివయస్సు వచ్చేటప్పటికి చూడండి నా బతుకెలా తెల్లా రిందో...''

''అబ్బే, వుత్త చేవలేని మనిషివయ్యా నువ్వు'' అన్నాడు గవ్రీలా. ''ఇలా సోదె చెప్పకుంటూ ఏడుస్తే లాభమేమిటి?''

"ఏం చేసేది, గవ్రీలా అంద్రేయిచ్? నాకు భయం అనుకుంటున్నారు కాబోలు. అబ్బే, దెబ్బలు తినడమంటే నాకేమీ భయంలేదు, గవ్రీలా అంద్రేయిచ్! యజమాని నన్ను చాటుగా కొడితే దానికేమీ ఫరవా లేదు. నలుగురి ఎదుట నన్ను గౌరవంగా చూస్తే చాలు, నలుగురిలోనూ నేను తలెత్తుకు తిరగ్గలను. అంతేగాని, ఇలాంటి కోన్‌కిస్కాహే వెధవచేతిలోనా, అంత ఖర్మ నాకేల పట్టాలంటా?.."

"ఇక నువ్వు వెళ్ళు" అంటూ కపితోన్ మాటకు చిరాకుగా అడ్డు పడ్డాడు గవ్రీలా. క్లీమొవ్ వెనుకకు తిరిగి మెల్లగా నడుచుకుంటూ వెళ్లి పోయాడు.

"వాడంటూ ఒక అడ్డు లేదే అనుకో — అప్పుడు నువ్వు ఒప్పుకుంటావా?" అంటూ ఆ వెళ్లిపోతూన్నవాడి వెంట కేకేశాడు హెడ్‌బట్లరు.

"నాకు సంపూర్ణంగా అంగీకృతమే" అని జబాబు చెప్పేసి, తన మాన తాను వెళ్లిపోయాడు కపితోన్. మనిషి ఎంత ఇరుకునబడ్డా వాగ్ధాటికి మాత్రం లోపం రానిచ్చాడుకాదు.

హెడ్‌బట్లరు గదిలో ఎగాదిగా నాలుగు సార్లు పచారుచేశాడు.

"ఇక తత్యానను పిలిపిద్దాం" అన్నాడు చివరికి.

కాస్సేపటికి తత్యాన నిశ్శబ్దంగా వచ్చి గుమ్మంలో నిలబడింది.

"నన్ను రమన్నారట, ఎందుకండీ, గవ్రీలా అంద్రేయిచ్?" అని మెల్లగా అడిగింది.

హెడ్‌బట్లరు ఆమెకేసి నిదానంగా చూశాడు.

"అవును గాని, నీకు పెళ్లి అంటే ఇష్టమేనా? నీ కోసం పెళ్లి కొడుకుని ఒకడిని చూసింది జమీందారిణిగారు."

‘‘చిత్తం, గవ్రీలా అంద్రేయిచ్!’’ అని, ఒక్క క్షణమాత్రం ఆగి, తరువాత ‘‘నేనెవరిని చేసుకోవాలని ఆమె నిశ్చయించారు?’’ అని అడిగింది భయపడుతూ భయపడుతూనూ.

‘‘జోళ్లుకుట్టే గొడారి కపితోన్.’’

‘‘చిత్తం!’’

‘‘కొద్దిగా జల్సారాయుడే, అందులో ఏం సందేహంలేదు. కాని నువ్వతడిని దారిలోకి తీసుకొస్తావనే జమీందారిణిగారి భరవసా అంతా.’’

‘‘చిత్తం!’’

‘‘చిక్కు అంతా ఒక్కటి... ఆ మూగాడు, గెరాస్కా, నిన్ను చేసుకోవాలను కుంటున్నాడు. ఆ ఎలుగ్గొడ్డుని నీ వెంట ఎలా పడనిస్తున్నావు? నిన్ను చంపేస్తాడేమో, వుత్త ఎలుగ్గొడ్డుసుమా!’’

‘‘చంపేస్తాడండి, గవ్రీలా అంద్రేయిచ్, తప్పకుండా చంపేస్తాడండి.’’

‘‘చంపేస్తాడంటున్నావు నువ్వు. చంపేస్తాడూ? అదేదో చూద్దాం. నిన్ను చంపడానికి వాడికేమి అధికారం వుంది అని అడగడం మానేసి, చంపేస్తాడంటున్నావు!’’

‘‘అధికారం వుందో లేదో నాకు తెలియదండి, గవ్రీలా అంద్రేయిచ్.’’

‘‘ఆసి, నీ ఇల్లు బంగారంగానూ! సరేగాని, నిన్ను కట్టుకుంటానూ చేసుకుంటానూ అని వాడితో నువ్వేమీ అనలేదుకద?’’

‘‘ఏమని సెలవిచ్చారండి?’’

హెడ్‌బట్లరు అట్టే ఆలోచించి ఆలోచించి: ‘‘ఇంత మెత్తని పిల్లని నేనెక్కడా చూడలేదురా, బాబూ!’’ అని మనస్సులో అనుకుని, తరువాత

తత్యానను ఉద్దేశించి: ''సరే, మంచిదిలే; దీని గురించి మనం మళ్లీ మరొక సారి మాట్లాడుకుందాం, తన్యూష; నువ్వు బుద్ధిమంతురాలవనీ, ఎలా చెబితే అలా వినేదానవు అనీ నాకు తెలుసుగా'' అన్నాడు.

తత్యాన ఆ గదిలో నుంచి వెళ్లిపోతూ ద్వారబంధపు బల్లను మెల్లగా తాకింది.

''బహుశ రేప్పొద్దున్నకి జమీందారిణి ఇదంతా మరచే మరచి పోతుందేమో కూడా. అలాంటప్పుడు ఈ లేనిపోని చిత్తక్షోభ నాకెందుకు? ఆ రౌడీవెధవకి మనమే బుద్ధి బెబుదాం — అంతగా అవసరమైతే పోలీసు వాళ్లకి ఒప్పజెప్పితే తీరిపోతుంది...'' అని మనస్సులో అనుకుని:

''ఉస్తీన్యా ఫ్యోదొరొవ్న!'' అని తన భార్యని గట్టిగా కేకేసి పిలిచి, ''సమొవార్ సిద్ధం చెయ్యండి!'' అన్నాడు.

ఆ రోజంతా తత్యాన బట్టలు ఉతికే ఇల్లు వదలి బయటకు రానే లేదు. మొదట కాస్సేపు ఏడ్చింది, తరువాత కన్నీరు తుడుచుకుని, మళ్లీ మామూలుగా పనిలో పడిపోయింది.

ఆ రోజంతా ఇంచుమించు అర్ధరాత్రి వరకూ కపితోన్ సారాదు కాణంలోనే, ఒక స్నేహితుడితో కూడా కాలక్షేపం చేశాడు. ఆ స్నేహితుడు ఎప్పుడూ కూడా ఏడుపు ముఖం పెట్టుకునే వుంటాడు. ఈ స్నేహితుడితో, పీటర్స్‌బర్గ్‌లో ఒక జమీందారు దగ్గర బానిస భృత్యుడిగా తాను చాకిరీ చేసిన రోజులు గురించి — తన యజమాని మొత్తంమీద మంచి వాడేననీ, అతి సూక్ష్మదృష్టిగల మనిషి అనీ, పోతే, అతనికి ఒక చిన్న దురల వాటు మాత్రం వుండేదనీ, ఎల్లప్పుడూ నిషామీదే వుండేవాడనీ, చూసిన ఆడదాన్ని, అది ఎవర్తె అయినా సరే, ఇక పోనిచ్చేవాడు కాదనీ — పూసగుచ్చి

నట్టు సవివరంగా సోదె చెప్పుకుంటూ కూచున్నాడు... ఇతగాడు చెప్పిన దానికంతా ఆ స్నేహితుడు గంగిరెద్దులా తలవూపాడు. కాని కొన్ని సంద ర్భాల మూలాన మరునాడు తాను తన జీవితానికి స్వస్తి చెప్పడానికే నిశ్చ యించుకున్నానని కపితోన్ చెప్పేసరికి, ఆ ఏడుపు ముఖం స్నేహితుడు లేచి, ఇక అర్ధరాత్రి కావస్తూందనీ, ఇంటికి వెళ్లిపోవడం మంచిదనీ అనేశాడు. దానితో ఇద్దరూ ధుమధుమలాడుతూ మరి ఒకరితో ఒకరు ఒక్క మాటైనా మాటాడుకోకుండా విడిపోయి, ఎవరి దారిన వారు పోయారు.

ఈలోపుగా, బట్లరు ఆశించినట్టు మాత్రం జరగలేదు. కపితోన్‌కి పెళ్లిచేసేద్దామనే తలంపు జమీందారిణి మనస్సులో ఎంత గాఢంగా నాటుకు పోయిందంటే, ఇక ఆ రాత్రంతా తన చెలికత్తెలలో ఒకామెతో ఇదే ఘోషతప్ప మరొక ఘోషేలేదు ఆమె నోటంట. జమీందారిణికి రాత్రి నిద్ర లేమి జబ్బు వుండడంచేత, ఆమెకు వుబుసు పోయేందుకని ఆమెతో రాత్రంతా బాతాఖానీ వెయ్యడమే ఆమె చెలికత్తెలలో ఒకరికి ప్రత్యేకమైన పని. ఈ చెలికత్తె రాత్రంతా జాగరంచేసి, బండి నాయుడిలా పగలంతా కుంభకర్ణుడి నిద్ర తీసేది. మరునాడు ఉదయమే జమీందారిణి ఫలహారం చేసిన తరు వాత, క్రితం దినం జరిగిన సంగతులను ఆమెకు నివేదించి, ఆనాడు ఆమె జారీ చేసే ఆజ్ఞలను అందుకోవడానికి మామూలు ప్రకారం ఆమె దర్శనం చేసుకుందుకు గ్రవీలో ఆమె సమక్షమందు హాజరయీ అవడంతో, ఆమె వేసిన మొదటి ప్రశ్న: ''పెళ్లి పనులు ఎలా జరుగుతున్నాయి?'' అనే. ఇక జమీందారిణిగారు ఆలా ప్రశ్నించగానే, మరే జబాబు చెప్పడానికీ తోచక, పెళ్లిపనులు భేషుగ్గా సాగుతున్నాయనీ, మాపటికల్లా కపితోన్ ఆమె దర్శనం

చేసుకుందుకు హాజరవుతాడనీ ప్రత్యుత్తర మిచ్చాడు. ఆ రోజు జమీందారిణి వంట్లో బాగా లేకపోవడాన్ని ఆమె బట్లరుతో అట్టే సేపు వ్యవహారపు సంగతులు మాట్లాడలేదు. ఆమె ఎదుటనుండి వెళ్లిపోయిన తరువాత బట్లరు తన గది చేరుకుని, కర్తవ్యం సమాలోచించుకుందుకు సలహా సంఘాన్ని తక్షణమే సమావేశపరచాడు. ఇది అత్యంత సుదీర్ఘంగా పరిశీలించాల్సిన వ్యవహారంగా పరిణమించింది. తత్యాన సహజంగానే ఎట్టి అభ్యంతరమూ లేవనెత్తలేదు; కాని కపితోన్ మాత్రం, తనకు ఒక్క తలకాయే వుందనీ, రెండు మూడు తలకాయలు లేవనీ కనబడిన వారందరితోనూ చెప్పాడు... గెరాసిమ్ అందరికేసి అతి త్వరగానూ అతి కఠినంగానూ తేరి చూశాడు; తనకు వ్యతిరేకంగా ఏదో గూడుపుఠాణీ జరగబోతూందని అతడు తక్షణమే గ్రహించాడో ఏమిటో మరి, ఆ సమావేశం జరుగుతూన్నంత సేపూ ఆడ నౌకర్లు వుండే గది వసారాలోనే వుండిపోయాడేగాని, మరి అక్కడనుండి ఏమైనా సరే కదిలాడుకాదు. సమావేశ సభ్యులందరూ (అందులో, వెనుకటి రోజుల్లో ఆ ఇంట్లో మద్యపానీయాలు అందిచ్చే భృత్యుడుగా పనిచేసిన ముసలి నౌకరు ఒకడున్నాడు. అతడికి అందరూ ''తోకపీకుడు మామ'' అని పేరుపెట్టారు. ఇతగాడిని ఏవిషయం గురించైనా సరే సలహా చెప్పమని అడిగేసరికల్లా: ''అవును మరి, నిజమే, అవును, అవునౌను, అంతే మరి, అవును!'' అని అనేవాడు). సమావేశం ప్రారంభించి, కపితోన్‌కి ఎట్టి హానీ వాటిల్లకుండా వుండేందుకుగాను అతనిని మంచినీళ్ల వడపోత సాధనం వుండే కొట్టుగదిలో పెట్టి తాళం వేయడం మంచిదని నిర్ణయించి ఆ ప్రకారం మొట్టమొదట జరిపించి, ఆ తరువాత కర్తవ్యం గురించి దీర్ఘంగా ఆలోచించ సాగారు. బలప్రయోగానికి దిగి ఆ విధంగా వ్యవహారం తేల్చి

పారేయడం సహజంగా సులభమే, కాని (దేవుడు రక్షించి, అలా జరగదనే మనం ఆశించుదాం!) తన్మూలంగా జమీందారిణిగారి విశ్రాంతికి భంగం కలిగిందంటే మాత్రం, అప్పుడు పెద్ద గలభా అయి కొంప మునుగుతుంది! అయితే మరేమిటి దారి? సభవారందరూ ఆలోచించి, ఆలోచించి, ఆలోచించి, చివరకు ఏలాగైతేనేమి ఒక నిర్ణయానికి వచ్చారు. తాగిన మనుషులంటే గెరాసిమ్‌కి సుతరామూ గిట్టదన్న విషయం వారందరూ అనేకసార్లు ఇదివరలో గమనించారు. గెరాసిమ్ గేటువద్ద కావలికాస్తూ వుండగా ఎవరైనా తాగి తూలుతూ జోగుతూ, నెత్తిమీదనున్న గుడ్డటోపిని జల్సాగా పక్కవాటంగా పెట్టుకుని ఆ పక్కనుండి వెళ్ళుతూండడం ఎప్పుడు కళ్ళబడినా సరే, అతడు వెంటనే అతి కోపంతో ముఖం తిప్పేసుకునేవాడు. తత్యాన తాగినట్టు నటిస్తూ ఇటూ అటూ ఊగుతూ జోగుతూ గెరాసిమ్ పక్కనుండే నడిచి వెళ్ళాల్సిందని ఆమెను ఆదేశిస్తూ సభవారు తీర్మానించారు. పాపం ఆ అమ్మాయి అందుకు ఎంత మాత్రం ఒప్పుకుందికాదు. కాని చిట్టచివరకు ఎలాగైతేనేమి ఆమెను వారందరూ కలిసి మెడలు వంచడంచేత ఆమె విధిలేక ఒప్పుకుంది. తన ఆరాధకుడిని వదలించుకుందుకు ఇతరత్రా మార్గం లేదనే ఆమె కూడా నిజంగానే నమ్మింది. సమావేశం అయినాక ఆమె వెళ్ళిపోయింది. కపితోన్‌న్ని కొట్టుగదిలోనుండి విడుదల చేయగా అతడు బయటకు వచ్చేశాడు: ఇంతకీ అదంతా అతనికి సంబంధించిన వ్యవహారమేనాయె. గెరాసిమ్ గేటు దగ్గర తన ముక్కాలిపీట మీద కూచుని చేతనున్న పారతో నేలను కెలుకుతున్నాడు... అన్ని వైపులనుండీ, అన్ని కిటికీ తెరల చాటునుండీ ఇంటిల్లుపాదీ ఏమి జరగబోతుందో అని చూస్తూ కూచున్నారు...

వారందరూ పన్నిన పన్నాగం అమోఘంగా సాగిపోయింది. తత్యానను చూసీ చూడడంతోనే మొట్టమొదట గెరాసిమ్ మామూలుగా ఆప్యాయంతో అవ్యక్త ధ్వనులు చేస్తూ తల వూపాడు; తరువాత ఆమెకేసి తేరిచూచి, చేతనున్న పార జారవిడిచి, చెంగున గంతు వేసి, ఆమె దగ్గరకెళ్లి, ముఖం మీద ముఖం పెట్టి నిలబడ్డాడు... ఆమె భయకంపితురాలై, ఆ భయంతో మరింత జోగిపోతూ, కళ్లు మూసేసుకుంది... అతడామెను తన చేతితో పట్టుకుని, గబగబా ఇంటి ముంగిలిని ఈకొసనుండి ఆకొసకు దాటి, సభ్యులందరూ సమావేశమై వున్న గదిలోకి ప్రవేశించి, ఆమెను సరాసరి కపితోన్ దగ్గరకు నెట్టుకు వెళ్లి, ఆమెను అక్కడ విడిచిపెట్టే శాడు... తత్యాన భయంతో ఇంచుమించు మూర్ఛ పడిపోయింది... గెరాసిమ్ ఒక్కక్షణం అక్కడ ఆగి, ఆమెకేసి చూసి, ఇక అంతా సరి అన్నట్టు చెయ్యి వూపి, చిరునవ్వు నవ్వి, భారంగా అడుగులు వేసుకుంటూ అక్కడ నుండి వెళ్లిపోయి తనగది చేరుకున్నాడు... ఆ రోజంతా అతడు తన గది విడిచి బయటకు రానేలేదు. అతడా గదిలో ఏమి చేస్తున్నాడో చూద్దామని, ఆ గదిగోడ చెక్కలకు ఒక కన్నం వుంటే, ఆ కన్నంలో నుండి బండి గుర్రపు సవారు అంతీప్కా చూసి, గెరాసిమ్ తన అరచేతిలో బుగ్గ ఆనుకుని మంచంమీద నిశ్చేష్టుడై ఆలా కూచున్నాడనీ, అప్పుడప్పుడు మాత్రం ఏదో పాటపాడుతూ, అనగా ఏవేవో అవ్యక్తధ్వనులు చేస్తూ, కళ్లు మూసుకుని, కోచిమెన్లూ ఓడలాగేవాళ్లూ వారి ఏడుపు పాటలు పాడుకుండేటప్పుడు తలకాయ ఎలా ఆడిస్తారో అలా ఆడిస్తున్నాడనీ, అది చూసేటప్పటికల్లా తనకి వొళ్లు ఝల్లుమందనీ, దానితో ఇక ఆ కన్నంలోనుండి చూడలేక వచ్చేశాననీ నివేదించాడు. మరుచటి రోజు గెరాసిమ్ తన గదిలోనుండి బయటకొచ్చినప్పుడు

అతనిలో ప్రత్యేకంగా ఎట్టి మార్పు వున్నట్లూ కించిత్తు అయినా ఎవ్వరికీ ఏమాత్రమూ కనబడలేదు. ఇక కాకపోతే, మామూలుకంటె మరికాస్త ధుమధుమలాడుతూ వున్నాడేమో; కపితోన్ గురించిగాని తత్యాన గురించి గాని అసలు అతడు ఏమాత్రమూ పట్టించుకోనే లేదు. ఆనాడు సాయం కాలమే కపితోన్ తత్యానలిద్దరూ చెరివొక్కరూ ఒక బాతును చంకబెట్టు కుని జమీందారిణిగారి దర్శనం చేసుకున్నారు. వారం రోజులు గడిచాక ఇద్దరికీ పెళ్లిఅయిపోయింది. పెళ్లి రోజున, గెరాసిమ్‌లో ఏ మార్పూ కన బడలేదు. ఎటొచ్చీ ఆనాడు మాత్రం నీళ్లకోసం ఏటికి వెళ్లి, నీళ్లు తీసుకు రాకుండానే వచ్చేశాడింటికి: మరి ఏమి జరిగిందో ఏమిటో, దారిలో పీపా బద్దలగొట్టేశాడు; ఆ రాత్రి గుర్రపుసాలలో తన గుర్రాన్ని ఎంత జోరుగా మాలీషు చేశాడంటే, అతడి ఇనుప పిడికిళ్ల మాలీషుకు అదిక నిలబడ లేక, ఒకసారి ఈ కాలు ఎత్తనూ ఒకసారి ఆ కాలు ఎత్తనూ, గాలికి అల్లాడి పోతూన్న రెల్లుపోచలా, అది ఇటూ అటూ ఆడిపోయింది.

ఇదంతా వసంతంలో జరిగింది. తొలి ఏడు తిరగకముందే కపితోన్ అదే తాగి తాగి, ఇక ఎందుకూ కొరగాకుండాపోయి, తుక్కుకింద తయార వడంచేత, అతన్ని పెళ్లాంతో సహా ఎక్కడో ఒక మారుమూల గ్రామానికి పంపించేసింది జమీందారిణి. ఇక ఇంటినుండి వెళ్లిపోయే రోజు మాత్రం, తొలుత అతగాడు మహా నిర్లక్ష్యంగా తిరుగుతూ, తనను ఎక్కడకు పంపిం చేసినాసరే, చివరకు సప్తసముద్రాల ఆవలకు పంపించేసినా సరే, తాను నిష్పూచీగా తలెత్తుకు తిరుగుతాననీ బడాయిలు కొట్టాడుగాని, తరువాత మాత్రం, మనిషి జోరంతా తగ్గిపోయి, ముఖం తేలవేసుకుని, పొట్ట చిం పుతే అక్షరంలేని మూర్ఖుల మధ్య మగ్గిపోవడానికి తనను పంపించి వేస్తు

న్నారనీ సోకన్నాలు పెడుతూ, ఇక ఎంతగా తాగిమై కంలో పడిపోయాడంటే, టోపీ సహితం నెత్తిమీద పెట్టుకో లేకపోయాడు. చివరికి ఎవరో ఒకతను అతనిపై కనికరించి, టోపీని నెత్తినపెట్టి, అట్ట అంచును నుదిటి మీదకు లాగి, తలకాయపై ఒక చరుపు చరచి, టోపీని సరిగా సర్దాడు. ఇక అంతా సిద్ధమై, 'క్షేమంగా వెళ్ళిరండి!' అంటూ వీడ్కోలు సంజ్ఞకోసమని బండివాళ్ళు ఎదురుచూస్తూండే క్షణంలో, గెరాసిమ్ తన కొట్టులోనుండి బయటికొచ్చి, తత్యాన దగ్గరకెళ్ళి, ఆమెకోసమని తాను ఒక ఏడాది క్రితం కొని భద్రంగా దాచిపెట్టిన ఎరుపురంగు నూలురుమాలును ఆమెకు జ్ఞాపకార్థం ఇచ్చాడు. ఆనాటివరకూ తన జీవితంలో ఎన్ని కష్టాలు అనుభవించినా నిశ్చలచిత్తంలో భరించిన తత్యాన, తటాలున ఇక ఓర్చుకోలేక భోరున ఏడ్చేసింది. బండిలోకి ఎక్కేముందు, క్రిస్టియన్ మతాచారం ప్రకారం ఆమె గెరాసిమ్‌ను మూడుసార్లు ముద్దుపెట్టుకుని, అప్పుడు బండిలోకి ఎక్కిపోయింది. గెరాసిమ్ బండి వెనుకనే నడుస్తూ, వూరి పొలిమేర వరకూ ఆమెను సాగనంపాలనుకున్నాడు మొదట్లో, కాని క్రిమ్‌స్కి రేవు దగ్గర మాత్రం తటాలున ఆగిపోయి, చేయి వూపి, ఏటిగట్టు వెంటే నడిచి వెళ్ళిపోయాడు.

సాయంకాలం పడుతూంది. నదికేసే చూసుకుంటూ నడుస్తున్నాడు గెరాసిమ్. తటాలున, వొడ్డునున్న బురదలో ఏదో కొట్టుకుంటూన్నట్టు అతడికి అవుపడింది. ఏమిటిచెప్మా అని వంగి చూసేటప్పటికి, అదొక చిన్న కుక్కపిల్ల. తెల్లని వొంటిమీద నల్లని మచ్చలు. నీటిలోనుండి పైకి రావడానికి అది వూరికే తంటాలు పడుతూ రొజుకుంటూ, కాలుజారి మళ్ళీ నీటిలో మునిగిపోతూ, ఇలా నానాయాతనా పడుతూ, నీటిలో నాని

పోయున్న దాని సన్నని వొడలంతా గజగజ వణకిపోతూంది. పాపమా కుక్క పిల్లను చూసి గెరాసిమ్ తన బలమైన చేతిని దొప్పగా చేసి, చేతితో దానిని చప్పున పైకి తీసి, తన జుబ్బాలోపున పెట్టేసుకుని, జాంబవంతుని అంగలు వేసుకుంటూ ఇంటికి వెళ్లిపోయాడు. ఇల్లు చేరుకుని తన కొట్టులోకి వెళ్లిపోయి, తాను ప్రాణభిక్ష పెట్టి తీసుకు వచ్చిన కుక్కపిల్లను వెంటనే మంచంమీద పడుకోబెట్టి, తన పెద్ద ఓవర్‌కోటును దానిపై వేసి కప్పాడు. తరువాత గుర్రపుసాలకు పరుగెత్తుకుని వెళ్లి, పట్టెడు ఎండుగడ్డిని తీసుకొనివచ్చి, తరువాత మళ్లీ బయటికి వెళ్లి, వంటయిల్లు చేరుకుని, గిన్నెతో పాలు తీసుకొని తన గదిలోకి వచ్చాడు. అంతకుముందు కుక్కపిల్లపై కప్పిన ఓవర్‌కోటును జాగ్రత్తగా వెనుకకు తీసి, కుక్కపిల్లపైన ఎండుగడ్డి పరచి, పాలగిన్నెను మంచంమీద పెట్టాడు. పాపం ఆ కుక్కపిల్లకి ఇంకా మూడు వారాలైనా నిండలేదు, కళ్లు అప్పుడే విడుతున్నాయేమో, ఒక కన్ను రెండోదానికంటె కొంచెం పెద్దదిగా వున్నట్టు అవుపడుతూంది. గిన్నెలో నుండి పాలుతాగడమైనా దానికింకా చేతకాక, అది గజగజ వణకిపోతూ గుడ్లు మిటకరించింది. అప్పుడు గెరాసిమ్ దాని తలకాయను రెండు వేళ్లతోనూ పట్టుకుని, దాని మూతిని పాలల్లోకి వంచాడు. కుక్కపిల్ల తటాలున ముక్కుతో గట్టిగా ఊపిరి పీల్చుతూ, వణకిపోతూ, పొరపడితే గింజుకుంటూ ఆబతో పాలు తాగడం మొదలుపెట్టింది. అది పాలు తాగుతూంటే, గెరాసిమ్ దానివైపే ఆలా చూస్తూ కూచుని, ఉండి వుండి ఒక్కసారి పక్కున నవ్వాడు... ఆ రాత్రి తెల్లవార్లూ దానిని తన ఓవర్‌కోటులో వేసి చుట్టుచుట్టుతూ, దాని వొళ్లు తోముతూ దానికి ఉపచారం

చేస్తూ, అదొక విధమైన ఆనందం అనుభవించుతూ దాని పక్కనే అత డికి నిద్రపట్టిపోయింది.

గెరాసిమ్ తన ఆశ్రయిని పెంచినట్టు ఏ తల్లీ తన శిశువును పెంచ లేదు. (అది అడకుక్క.) మొదటి రోజు ఆ కుక్కపిల్ల అతి నీర్సంగానూ వికృతంగానూ అవుపడింది. కాని క్రమక్రమంగా అది బాగుపడి, దాని రక్ష కుడు తీసుకున్న నిర్విరామ సంరక్షణ పుణ్యమా అని దాని రూపు దారిలో కొచ్చి, మరి ఎనిమిది నెలలకల్లా స్పానిష్ జాతికి స్వాభావికమైన పొడుగాటి చెవులు, గుబురు తోక, భావగర్భితమైన పెద్ద కళ్లతో అందమైన కుక్కగా తయారైంది. గెరాసిమ్ పట్ల దానికి వల్లమాలిన విశ్వాసం: అతనిని ఒక్క క్షణమైనా వదలకుండా అది ఎల్లప్పుడూ తోక ఆడించుకుంటూ అతని వెంటే తిరుగుతూండేది. దానికి అతడు ఒక పేరు పెట్టాడు కూడా — తాము చేసే అవ్యక్తధ్వనుల మూలంగా ఇతరులు తమను గమనిస్తారని మూగవారు ఎరుగుదురు — దానికి ''ముమూ'' అని నామకరణం చేశాడు. నౌకర్లందరికీ దానిమీద ముద్దు కుదిరిపోయింది. వారందరూ కూడా దానిని ''ముమూన్య'' అనే పిలిచేవారు. అది మంచి తెలివితేటలు కలిగిన కుక్క, అందరి దగ్గరకూ వెళ్లేది, కాని ఒక్క గెరాసిమ్ తప్ప ఇంకెవ్వరి మీదనూ దానికి విశ్వాసముండేదికాదు. దానిమీద గెరాసిమ్‌కి ఇక అంతులేని ప్రేమే... ఇతరులెవ్వరైనా సరే దానిని తట్టితే మరి సహించ లేకపోయేవాడు. వారు కుక్కకి ఏమి చేసిపోతారో అని భయమో, అసూయో — ఆ దేవుడికే తెలియాలి! ప్రతి రోజు ఉదయమూ ముమూ అతడి జుబ్బా పట్టుకుని గుంజాయించి, అతడిని నిద్రనుండి లేపేది; నీళ్లపీపా బండిని లాగే ముసలి గుర్రాన్ని — ఆ ముసలి గుర్రందగ్గర దానికి మంచి

చనవు కుదిరిపోయింది — లగామును తన నోట పట్టుకుని గెరాసిమ్ దగ్గరకు తీసుకుపోయేది, గెరాసిమ్ పక్కనే అది ఎంతో డాబుసరిగా పరుగెడుతూ, తాను కూడా ఏటిగట్టుకు వెళ్లేది, అతడి చీపుళ్లనూ పారలనూ జాగ్రత్తగా కాపలా కాస్తూండేది, ఇక ఇతరులెవ్వరినీ అతని గది దరిదాపులకి రానిచ్చేది కాదు. దానికోసమనే ప్రత్యేకంగా అతడు తన గదితలుపుకొక కన్నం కోశాడు; ఒక్క గెరాసిమ్ గదిలోనే తప్ప మరెక్కడా కూడా తన అధికారమూ ఆటలూ సాగవని దానికి తెలిసి, ఆ గదిలోకి అది వెళ్లగానే అతని మంచం మీదకి దూకి, కొండ అందుకున్నట్టే ముఖం పెట్టేది. అసలు రాత్రి పూట అది నిద్రపోయేదేకాదు, అయినప్పటికీ — ఏ ఉబుసూ పోకుండా వెనుకకాళ్లమీద కూచుని ముట్టె ఎత్తి ఆకాశాన వున్న నక్షత్రాలకేసి గుడ్లు మిటకరించి అరిచే ఆ అరవడమైనా ఒక్కమారుకాదు, కీచుగొంతెత్తి వరుసగా మూడుసార్లు అరచే, తెలివిమాలిన ఊరకుక్కల్లా కాకుండా — అనవసరంగా మొరిగేదికాదు — ఎన్నడూ అనవసరంగా మొరిగేదికాదు! అకారణంగా అది ఎన్నడూ అరచేదికాదు. పరాయివాడెవడైనా కంచె పక్కనుండి నడచినా, ఏదో ఒక మూల అనుమానాస్పదంగా చప్పుడైనా, ఆకులు కదలినట్టు అలికిడి అయినా — కేవలం అప్పుడు మాత్రమే మొరిగేది. ఒక్కమాటలో చెప్పాలంటే, అది భోష్మైన కావలికుక్క. ఇదే కాకుండా ఇంటి ముంగిట మరొక కుక్క — మసురు రంగు మచ్చలున్న లేబసిమి ముసలి కుక్క వాల్చోక్ — కూడా వుండిన మాట నిజమే. దానిని రాత్రిళ్లు ఎల్లప్పుడూ గొలుసుతో కట్టేసే వుంచేవారు, అదిప్పుడు ఎంత ముసలిదైపోయిందంటే, ఇక అది స్వేచ్ఛ కోరుకోకుండా, ఇంటి ముంగిట తన దొడ్డిలో

వాళ్ళ చుట్ట చుట్టుకుని పడుకునే వుండి, ఎప్పుడైనా ఒకసారి తాను కూడా వున్నాను సుమా అని తెలియజేప్పేందుకని, ఇంచుమించు ఎవ్వరికీ విన బడని అరుపు అరచి, తన నిరర్థకతను తాను ఎరిగినట్టు, తన అరుపును వెంటనే దిగమింగేసు కొనేది. జమీందారిణిగారు వుండే భవంతిలోకి మూమూ ఎన్నడూ వెళ్ళేదికాదు; కట్టెలు మోసుకుని గెరాసిమ్ ఆ భవంతిలోకి వెళ్ళి నప్పుడు, అది ఎప్పుడూ మెట్లమీదే ఆగిపోయి, అతని రాకకోసం చెవులు నిక్కపొడుచుకుని, ఆ భవంతి ఏ మూలనుండైనా సరే చీమ చిటుక్కు మన్నంత చప్పుడయేసరికి, తన తలకాయను ఒకసారి ఇటూ ఒకసారి అటూ తిప్పుతూ అతి ఆత్రతతో ఆలా కూచునేది...

ఈ విధంగా మరొక ఏడు గడచిపోయింది. గెరాసిమ్ గేటుజవాను గానే పనిచేస్తూ వచ్చాడు; తన జీవితంతో సంతుష్టిపడి తన మనుగడను కులాసాగానే సాగించుకుంటూ వస్తూండగా, ఎన్నడూ అనుకోనటువంటి ఘటన ఒకటి అకస్మాత్తుగా సంభవించింది... అది ఏమిటంటే: మంచి రమణీయమైన వేసవిరోజు ఒకనాడు, జమీందారిణిగారు తన చెలికత్తెలతో కలసి డ్రాయింగురూములో ఇటూ అటూ పచారు చేస్తూంది. ఆమె మంచి హుషారుగా సరదాగా వుండి నవ్వుతూ పరిహాసాలు చేస్తూ వేళాకోళాలు ఆడుతూంది. చెలికత్తెలకు మాత్రం వారి మనస్సులో ఏమీ హుషారుగానూ సరదాగానూ లేకపోయినప్పటికీ, తమ యజమానురాలితో కలిసి వారు కూడా విధిలేక నవ్వుతూ పరిహాసాలు చేస్తూ వేళాకోళాలు ఆడుతున్నారు. జమీం దారిణి ఈలాగు తటాలున ఇంత ఉత్సాహంగా వుండడం ఆమె పరి వారానికి ప్రమాదమే; ఇందుకు కారణం: మొదటిది, తనకు ఉత్సాహంగా వుందికదా అని చెప్పి, ఇక ఏమైనా సరే అందరూ కూడా తక్షణమే ఆడుతూ

పాడుతూ నవ్వుతూ అతి హుషారుగా ఉత్సాహంగా వుండాలని ఆమె ఫర్మానా జారిచేసి, ఎవరి ముఖంలోనైనా సరే ఆనందోత్సాహాలు రవంత లోపించి వున్నట్టు తనకు తోచినట్టాయెనా, ఇక ఆమె మండిపడిపోయేది; రెండవ కార్ణణం, సాధారణంగా ఆమెలో ఈ ఉత్సాహమంతా క్షణభంగు రమే; అది ఇట్టే మాయమైపోయి, దాని బదులు ఆమె చిరచిరలాడుతూ అందరి మీదనూ కస్సుబుస్సుమంటూ, గంటల తరబడి అందరినీ కాల్చుకు తినేది. ఆ రోజు ఉదయం ఆమెకు శుభశకునం అవుపడడంచేత, ఆమె మంచి కళలో వుంది: ఆమె పొద్దున్న లేచి చీట్లపేక ముక్కలు తీసి చూసుకునే సరికి వరుసగా నాలుగు జాకీలూ వచ్చాయి (ప్రతిదినం ఉదయమూ శకు నం కోసమని ఆమె చీట్లపేక ముక్కలు చూసుకొనేది), ఆ దినం ఆమెకు ఇష్టసిద్ధి లభిస్తుందని దీని సూచన; ఆనాటి ఉదయం టీ ఆమెకు మామూలు కంటే ఎంతో రుచిగా వున్నట్టనిపించింది; ఫలితంగా ఆమె టీ తయారు చేసిన పనికత్తెను మంచి మాటలతో సంతోష పరచడమే కాకుండా, పది కోపెక్కుల కాసు కూడా ఇనాముగా ముట్టజెప్పింది. ముడుతలు పడిపోయిన ఆమె పెదవులపై కరుణారసం ఉట్టిపడుతూన్న మందహాసం తాండ వించగా, ఆమె డ్రాయింగురూములో పచారుచేస్తూ, కిటికీ దగ్గరకు వెళ్ళింది. కిటికీకి ఎదురుగా పువ్వులతోట వేసి వుంది. పువ్వులతోట మధ్యమడిలో వున్న గులాబీపొద కింద కూచుని అదే పనిగా ముమూ ఎముక ఒకదానిని కొరుకుతూంది. ఆ కుక్కని చూసింది జమీందారిణి.

“ఆరె, భగవంతుడా!” అని ఒక్క కేక వేసి, “ఎవరిదా కుక్క?” అని ఆశ్చర్యపోయి అడిగిందామె.

ఏ చెలికత్తెనైతే జమీందారిణి ఈ ప్రశ్నవేసిందో ఆమె, తన పై అధికారి ఆశ్చర్యార్థకాన్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలో తెలుసుకోలేక తబ్బిబ్బయి తలకిందులు పడుతూన్న గుమాస్తాలా, గాభరా పడిపోయింది.

''నా—నా—కు తె—తె—లీయ దండి. మూ--గ—వా—డి—దేమోనండి...'' అంటూ ఆమె సణిగేసింది.

''ఆరె, భగవంతుడా!'' అని జమీందారిణి తన చెలికత్తె మాటకు అడ్డుపడి, ''ఎంత ముద్దొస్తూన్న కుక్కపిల్లో! దాన్నిలా నాదగ్గరకు తీసుకురమ్మని చెప్పండి. అతగాడి దగ్గర చాలా కాలమయే వుందేమిటి ఈ కుక్కపిల్ల? నేనిన్నాళ్ళూ దీనిని చూడలేదేం మరి?.. దాన్నిలా తీసుకురమ్మనండి'' అంది ఆమె.

ఆ చెలికత్తె దబ్బున వసారాలోకి పరుగెత్తుకుని వెళ్ళింది.

''ఎవరక్కడ? ముమూను ఇలా తీసుకురమ్మనమని చెప్పండి! పువ్వుల తోటలో వుందది'' అని ఆమె కేకవేసింది.

''అయితే, దాని పేరు 'ముమూ'వా? ఎంత ముద్దొస్తూందో పేరు!'' అంది జమీందారిణి.

''ముద్దొస్తూన్న పేరండి'' అంటూ చెలికత్తె వంతపాడింది. ''త్వరగా తీసుకురావోయ్ దానిని, స్తెపాన్!''

స్తెపాన్ తైనాతీ భృత్యుడు. మంచి వస్తాదు. స్తెపాన్ అమాంతంగా ఒక్క పరుగున తోటలోకి వెళ్ళి, ముమూను చటుక్కున పట్టుకోబోయాడు; అది మాత్రం మంచి చాకచక్యంగా స్తెపాన్ చేతిలోనుంచి తప్పించుకుని, శాయశక్తులా పరుగెత్తుకుని వెళ్ళి, అంత దూరాన వున్న గెరాసిమ్ దగ్గరకు చేరుకుని, దాని యజమాని కాళ్లసందులో దూరిపోయింది.—

ఆ సమయంలో గెరాసిమ్, తన చేతిలో వున్నది చిన్నపిల్లలు ఆడుకునే బొజా అన్నట్టుగా, నీళ్లపీపాను సునాయాసంగా ఎతి, దానిలోనుండి నీళ్లను బయటికి వొంపుతున్నాడు. కుక్కవెంటే స్తెపాన్ పరుగెత్తుకుని వెళ్లి, దానిని పట్టుకొందుకు ప్రయత్నించాడు. కాని అది చకచకా గంతు లేసుకుంటూ అతగాడి పట్టు వదలించేసుకుంటూంది. ఇదంతా చూసి నవ్వు కుంటున్నాడు గెరాసిమ్. చివరికి దానిని పట్టుకోలేక, స్తెపానుకు ప్రాణం విసిగి, జమీందారిణిగారు తన దగ్గరకు కుక్కను తీసుకు రమ్మనమంటు న్నారని ఆదరా బాదరా సంజ్ఞలు చేసి చెప్పాడు గెరాసిమ్‌తో. మొదట గెరా సిమ్ కొంత ఆశ్చర్యపడ్డాడు, కాని తరువాత ముమూను పిలచి, దానిని తన చేతితో పట్టుకుని పైకెత్తి స్తెపాన్ చేతిలో పెట్టాడు. దానిని తన చేతు లలో పెట్టుకుని స్తెపాన్ డ్రాయింగురూములోకి తీసుకెళ్లి చెక్కపేర్పు గచ్చుమీద దింపాడు. జమీందారిణి ఆప్యాయంగా దానిని తన దగ్గరకు పిలిచింది. తాను పుట్టినప్పటినుండీ ఇంత శోభస్కరమైన పరిసరాలను ఎన్నడూ చూచి ఎరుగని ముమూ, ఇదంతా చూచి హడలిపోయి పరుగెత్తి వెళ్లి తలుపు దగ్గర నక్కిపోయింది. జమీందారిణిగారి దయ సంపాదించడమే పరమార్థంగా ఎంచుకున్న స్తెపాన్ దానిని ఆమె దిశగా నెట్టే సరికి, అది గజగజ వణకుతూ గోడకు అంటిపెట్టుకుని అలా వుండిపోయింది.

"ముమూ, ముమూ! దా అమ్మా నాదగ్గరకి! నీ జమీందారిణిగారి దగ్గరకి దా, దా! ఓసి, పిచ్చిదానా, ఎందుకే అలా భయపడతావు? దా, దా!" అంటూ జమీందారిణి దానిని ముద్దుగా పిలిచింది.

''వెళ్లే, ముమూ, వెళ్లవే, జమీందారిణిగారి దగ్గరకే, వెళ్ళు!'' అంటూ చెలికత్తెలందరూ దానిని ప్రోత్సహించారు.

ముమూ మాత్రం నిస్పృహతో నాలుగు చెరగులూ కలియజూచి, ఉన్నచోటనే ఆలా అంటిపెట్టుకుని వుండిపోయిందేగాని, ఏమైనా కదలింది కాదు.

''దానికి తినడానికి ఏమైనా తీసుకురండి'' అంది జమీందారిణి. ''ఆసి, దీని బొడ్డుపొక్కా! ఎంత తెలివిమాలిన కుక్కో ఇది. దాని యజమానురాలి దగ్గరకే రానంటూందే! ఎవరిని చూసి దానికింత భయం?''

''తమరి దగ్గర అది ఇంకా కొత్తచేస్తూందండి!'' అంది ఒక చెలికత్తె, మాటలనుండి తేనె ఒలుకుతూ అతి వినయ విధేయతలతో.

చిన్న మూకుడులో పాలుపోసి తీసుకొచ్చి ముమూ ముందుంచాడు స్తెపాన్. కాని ముమూ పాలను అసలు తాగలేదు సరికదా, ససేమిరా వాసనైనా చూడక, ఆలా గజగజ వణకిపోతూ అదే వెనుకకు తిరిగి చూడడం మొదలుపెట్టింది.

''ఆసి, బడవకానా, ఎలాంటి దానవే నువ్వు!'' అంటూ జమీందారిణిగారు దానిని ముద్దుగా పిలిచి, దాని దగ్గరకు వెళ్లి చేతితో దువ్వబోయింది. కాని ముమూ చటుక్కున ఆమెకేసి ముఖం తిప్పి గుర్రుమంటూ పళ్లిగిలించింది. జమీందారిణి చప్పున తన చేయి లాగేసుకుంది...

ఒక్క క్షణమాత్రం అంతా నిశ్శబ్దం. వెంటనే ముమూ దీనంగా కుంయ్యుమంది, తన ప్రవర్తనకు పశ్చాత్తాపాన్ని తెలియజేస్తూన్నట్టుగా... జమీందారిణి ముఖం చిట్లించుకుంటూ అక్కడనుండి వెళ్లిపోయింది.

''అయ్యో, అయ్యో!'' అని ఐక్యకంఠంతో కేక వేశారు చెలికత్తె లందరూ, ''తమరిని అది కరవలేదు కద? ఆరె, భగవంతుడా!'' (అసలు దాని జన్మలో ఎవ్వరినీ కరవలేదు ముమూ) ''అయ్యో, అయ్యో!''

''తీసుకుపొండి, దాన్నిక్కడ నుండి, తీసుకుపొండి!'' అంది ముసలామె గద్గదస్వరంతో. ''నన్ను కరవబోయింది, వెధవ కుక్క!''

ఆమె మెల్లగా వెనుకకు తిరిగి తన కచేరీగదిలోకి వెళ్ళిపోయింది. చెలి కత్తెలందరూ దిగాల్పడి ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని, ఆమెవెంట వెళ్ళబోయే సరికి, ఆమె చటుక్కున ఆగి వాళ్ళకేసి కఠినంగా చూసి; ''ఎం దుకు మీరు నావెంట? మిమ్మల్ని నేను రమ్మనలేదే!'' అనేసి తన గదిలోకి వెళ్ళిపోయింది.

దిగ్భ్రాంతితో చెలికత్తెలు అక్కడున్న స్తెపాన్ కేసి వెళ్ళిపొమ్మని చేతులు వూపుతూ సంజ్ఞలు చేశారు; నేలకి అంటుకొనిపోయున్న ముమూను అతడు తీసి, బయట కాచుకుని నిలబడున్న గెరాసిమ్ పాదాల దగ్గరకు దానిని గిరవాటు వేశాడు. మరొక అరగంట వరకూ ఆ ఇంట్లో ప్రగాఢమైన నిశ్శబ్దం అలముకొంది — ఉరుములు ఉరిసే కారుమబ్బులు కంటెనూ ధుమధుమలాడుతూన్న ముఖంతో ఆ ముసలి జమీందారిణి తన సోఫాలో ఒక్కర్తే ఆలా కూచుంది.

ఎంతటి స్వల్ప ఘటనలు మనిషిని గందరగోళ పరచేసి పూర్తిగా తల కిందులు చేసివేయగలవో తల్చుకుంటే నిజంగా ఆశ్చర్యమే వేస్తుంది!

ఇక ఆరోజంతా జమీందారిణి ఆలా ముఖం గంటుపెట్టుకునే కూచుంది, ఎవ్వరితోనూ మాట్లాడిందికాదు, చీట్లపేక ముట్టుకుందికాదు, రాత్రి అంతా జాగరం చేసింది. ఆ రోజు చెలికత్తెలు తనకిచ్చిన ఉ-డు-

కొలోన్ మామూలుగా తనకిచ్చే ఉ-డు-కొలోన్‌లా ఎంత మాత్రమూ లేదని వాళ్లని మారాము పెట్టింది, తాను పడుకున్న తలగడ గలేబు సబ్బువాసన కొడుతూందని కోపగించుకుంది — కోపగించుకోవడంతో సరిపోక, మేట్రన్నుని పిలిపించి, బీరువాలో వున్న దుప్పట్లూ, తలగడ గలేబులూ వాసన చూడమని అవన్నీ సబ్బు వాసన కొడుతున్నాయని చెప్పేదాకా ఆ మేట్రన్ ప్రాణం తీసింది; ఒక్కమాటలో చెప్పాలంటే — మనిషి ఊరకనే ఉద్రేక పడిపోయి, "తాపం" ఎత్తిపోయింది. మరునాడు ఉదయం, గవ్రీలొను తన దగ్గరకు మామూలుకంటె పెందలాడే రమ్మనమని కబురుచేసింది. ఏదో కొంప మునిగిందని లోలోన భయపడుతూనే హెడ్‌బట్లరు ఆమె కచేరీగదిలోకి అడుగు పెట్టే సరికి:

"రాత్రి అంతా మన వాకిట్లో అదేపనిగా అరచిన కుక్క ఎవరిదో ఏమిటో దయచేసి చెప్పండి. రాత్రి నాకు ఒక్కమాట్లైనా కన్ను మూతపడనిచ్చింది కాదు!" అంది ఆమె.

"కుక్క అండి? ఎవరిదో... మూగాడి కుక్క అండి, తమరు సెల విస్తూన్నది?" అన్నాడు అతగాడు గొంతు వణకుతూనూ.

"మూగవాడిదో ముక్కిడివాడిదో నాకేంతెలుసునయ్యా? నాకు తెలిసినదంతా — రాత్రి తెల్లవార్లూ రెప్ప మూతపడనీయకుండా అరిచి నన్ను చంపింది — అదొక్కటే నాకు తెలుసు. ఈ కుక్కల సంత అంతా మనకెందుకో నాకేమీ అర్థం కావడంలేదు — మీకు అర్థమవుతే చెప్పవయ్యా! ఇంటి కాపలాకి మనకోకుక్క వుండనే వుందిగా?"

"చిత్తం, అవునండి! వాల్చోక్ వుందండి మనకి!"

''అయితే ఇకనేం, మళ్ళీమరో కుక్క ఎందుకయ్యా? వాకిలంతా తిన్‌తార్ చేసి వదిలిపెట్టడానికి గాని? యజమాని అంటూ ఈ ఇంట్లో లేకపోవడాన్ని — ఎవడి ఇష్టం వాడిదైపోయింది ఈ కొంపలో — అదీ అసలు విషయం; లేకుంటే — మూగివాడికి కుక్క ఎందుకు? నా వాకిట్లో కుక్కని పెంచడానికి వాడికెవడిచ్చాడయ్యా అధికారం? నిన్న కిటికీలోనుండి చూస్తిని — పువ్వుల మడిలో హాయిగా కూచుని ఎక్కడనుండి ఎత్తు కొచ్చిన ఏ చండాలాన్నో కొరుకుతూంది — ఎక్కడో కాదు మళ్ళీనీ, నా గులాబీలు ఎక్కడైతే పాతించానో, ఎంచి ఎంచి సరిగ్గా అక్కడే... ఇక్కడా అక్కడా కాదు మళ్ళీ, తెలిసిందా?..''

జమీందారిణి ఒక్క క్షణం పూరుకుని:

''ఈవేళనుండి అది ఇక్కడ ఉండడానికి వీల్లేదు — నేనన్నమాట వినబడిందా?''

''చిత్తం!''

''ఈవేళ అంటే ఈవేళే, రేపుకాదు, తెలిసిందా? ఇక మీరు వెళ్ళొచ్చు. నివేదిక వినడానికి తరువాత కబురు చేస్తా.''

గవ్రీలా నిష్క్రమించాడు.

డ్రాయింగురూములో నుండి వెళ్ళుతూ, అక్కడ ఒక బల్లమీద చేతిగంట వుండడం చూచి, దానిని అక్కడనుండి తీసి, ఏ వస్తువు ఉండవలసిన స్థలంలో ఆ వస్తువు వుండాలని చెప్పి, దానిని మరొక బల్లపైన వుంచి, తన బాతుముక్కును జాగ్రత్తగా చీదుకుని, వసారాలోకి వెళ్ళిపోయాడు.

—

యుద్ధభూమి చిత్రణలలో చిత్రించబడినట్టి రణరంగంలో శత్రు ఖడ్గంచే బలిగొనబడి నేలకొరిగిన వీరాగ్రేసురునిలా, స్తెపాన్ తన కోటును బూర్నీసులా మీాదపడేసుకుని, జోళ్ళులేని తన వుత్తకాళ్లను పైకి చాపుకొని, వెల్లకిలా పడుకుని హాయిగా కిటికీ బల్లమీాద పడుకుని నిద్రపోతున్నాడు. అతడిని బట్లరు ఒక కుదుపు కుదిపి లేపి, సగం సగం గొంతుతో అతడికొక పని పురమాయించాడు. ఆ ఆజ్ఞను విని, అందుకు ప్రత్యుత్తరంగా స్తెపాన్ సగం సగం ఆవులింత ఆవులించి, సగం సగం నవ్వు నవ్వాడు. తన దగ్గర నుండి బట్లరు వెళ్లిపోగానే స్తెపాన్ చెంగున లేచి, కోటు తొడుక్కొని, కాళ్లకు బూడ్సు తగిలించుకుని, వసారాలోకి వెళ్లినిలబడ్డాడు. అతడు అలా నిలుచుని ఐదు నిమిషాలైందో లేనేలేదో, ఇంతట్లో బ్రహ్మాండమైన కట్టెల మోపును వీపుపై మోసుకుని గెరాసిమ్ ఆ దారిని వెళ్లాడు. (తన పడక గదిలోనూ కచేరీగదిలోనూ ఎల్లప్పుడూ ఎండకాలంలో సహితమూ పొయ్యి గూళ్లు నిరంతరం ముండుతూనే వుండాలని జమీాందారిణిగారి హుకుం.) సర్వకాల సర్వావస్థలందూ అతనిని అంటిపెట్టుకునే వుండే ముమూ యథా ప్రకారం తన యజమాని వెంటే పరివారం తీర్చి పరుగెడుతూంది. వసారాలో తలుపు దగ్గర ఓరగా నిలబడి, తన బుజంతో తలుపు తోసుకుని, వీపుపై కట్టెలమోపు మోస్తూనే ఇంటిలోపలికి వెళ్లిపోయాడు గెరాసిమ్. దాని అలవాటు ప్రకారం ముమూ ముంగిట్లో తలుపు దగ్గర ఆగి, తన యజమాని రాకకై కనిపెట్టుకుని కూచుంది. ఆకాశంలో ఎగురుతూన్నడేగ ఏలాగైతే చర్రున కిందకి ఎగిరి వచ్చి నేలమీాదనున్న కోడిపిల్లను తన్నుకు పోతుందో, ఆలాగు స్తెపాన్ సరైన సమయం కనిపెట్టి, చప్పున ముమూాను లంకించు కుని చంకను పెట్టుకుని, టోపీనైనా పెట్టుకోకుండా, ముంగిలి ద్వారంలో

నుండి వీధిలోకి పరుగెత్తి వెళ్లి, వీధివెంట వెళ్లుతూన్న ఖాళీగుర్రపుబండి తనకు అగపడీ అగపడడంతో చెంగున దానిలోకి దుమికి, అహోత్ని ర్యాద్ దిశగా మాయమైపోయాడు. అక్కడ ఆ మార్కెట్టులో అతడు ఆ కుక్కను అమ్మజూపి, దానిని కొనుక్కునేందుకు ఒక మనిషి రాగా, కుక్కను ఇంటి నుండి బయటకు పోనివ్వకుండా అథమం ఒక వారం రోజులపాటు దానిని గొలుసుతో కట్టి వుంచాలని కేవలం ఒక్క షరతు మాత్రమే పెట్టి, ఏభై కోపెక్కులకు దానిని అతడికి అమ్మివేసి, వెంటనే బండి ఎక్కి తిరిగి ఇంటికి వచ్చేశాడు. ఇల్లు ఇంకా ఆమాత్రం దూరంలో వుందనగానే బండి దిగిపోయి, పెరటిదారిని వున్న పుంతలో నుండి నడిచి, కంచె గెంతి వాకిట్లోకి వచ్చేశాడు. వీధిగుమ్మంలో నుండే గనుక ఇంట్లోకి వెళ్లితే ఒకవేళ తానెక్కడ గెరాసిమ్ కంటబడతానో అని అతగాడి భయం.

కాని అతడు భయపడ నవసరమే లేకపోయింది: అసలు గెరాసిమ్ వాకిట్లో లేనేలేడు. ఇంట్లో కట్టెలు పడవేసి గెరాసిమ్ బయటకు వచ్చీ రావడంతోనే ముమూ అక్కడ లేదని గ్రహించుకున్నాడు. తాను ఇంటిలో నుండి వచ్చేసరికల్లా ముమూ తనకోసం కనిపెట్టుకుని వుండకపోవడమంటూ ఇదివరలో ఎన్నడైనా జరిగినట్టు అతడికి జ్ఞాపకమే లేదు — అసలు ఆలా ఎన్నడూ జరగనే లేదు. ఇక దానికోసమని ఇటూ అటూ పరుగెత్తాడు, ఇల్లంతా గాలించేశాడు. తన మూగ గొంతుతో దానిని పేరుపెట్టి పిలిచే విధంగా ఊరకే పదే పదే పిలిచాడు... తన కొట్టులోకి వెళ్లి చూశాడు. ఎండు కసవు మేటు వేసిన మిద్దెమీదకి వెళ్లి అక్కడంతా వెతికాడు. గేటు దగ్గరకు వెళ్లి — ఇటు తిరిగాడు, అటు తిరిగాడు... అయ్యో, అది ఎక్కడో దారి తప్పి పోయిందే అనుకున్నాడు. తనకు అగపడ్డ తోటినౌకర్లందర్నీ దగ్గరకూ

వెళ్ళి, నేలనుండి జానడెత్తు చూపించి, తన చేతులతో దాని ఆకారం సూచించుతూ, నిరాశా నిస్పృహలతో కూడిన సంజ్ఞలు చేస్తూ, ఒక్కొక్కరినే ప్రశ్నించాడు. ముమూ గురించి కొంత మందికి నిజంగానే తెలియక పోవ డంచేత, తమకు తెలియదని వారు కేవలం తల వూపారు; నిజంగా తెలిసిన వారందరూ జబాబు చెప్పడం మానివేసి, అందుకు బదులు పక్కుమని నవ్వేసి వూరుకున్నారు; ఇక బట్లరు స్వయం ప్రాముఖ్యతా సూచకంగా గంభీ రముద్ర వహించి, కోచిమేన్లను చివాట్లు పెట్టసాగాడు. ఇంట్లో వున్న వాళ్లను అడిగి లాభంలేదని నిశ్చయించుకుని, ఇక అప్పుడు వీధిలోకి పరుగెత్తాడు గెరాసిమ్.

తిరిగి తిరిగి, ఇక చీకటి పడుతూండనగా అప్పుడు ఇంటికి వచ్చాడు. కళకాంతులులేని ముఖమూ, తూలిపోతూన్న నడకా, దుమ్ముపట్టిన దుస్తులూ, వీటన్నిటినిబట్టి అతడు మాస్కో మార్గాన సగం దూరం వరకూ పరుగెత్తి వచ్చాడన్న సంగతి తెలుస్తూనే వుంది. జమీందారిణిగారి గది కిటికీ ఎదుట అతడు నిలబడి, ఇంటి ఎదుటి వసారాలో ఏడెనమండుగురు నౌకర్లు గుమికూడి వుండగా ఆ వసారాకేసి ఒక్క క్షణం తన దృష్టిని సారించి, తిరిగి తన చూపును జమీందారిణిగారి గదికిటికీవైపే మళ్లించి, మళ్లీమళ్లీ ''ముమూ'' అని అరిచాడు. ముమూ నుండి ప్రత్యుత్తరం లేదు. అక్కడ నుండి ఇక అతడు వెళ్లిపోయాడు. అతడు వెళ్లిపోతూంటే అందరి చూపులూ అతని వెంటే వున్నాయి, కాని ఎవ్వరూ నవ్వలేదు, ఒక్క పలుకైనా పలుకలేదు... ఆ రాత్రంతా మూగవాడు ఒక్కటే మూలుగు మూలిగాడని జిజ్ఞాసువైన అంతీప్కా మరునాడు ఉదయం వంటగదిలో అందరితోనూ చెప్పాడు.

ఆ మరుచటి రోజంతా గెరాసిమ్ తన గదిలోనే వుండిపోయి బయటకు రానేలేదు. అందుచేత అతని బదులు, గుర్రపాడు పొతాప్ ఏటినుండి నీళ్లు తీసుకురావాల్సి వచ్చింది. ఈ పని అంటే అతడికి పరమ అసహ్యం, కాని చేయక తప్పింది కాదాతడికి. తాను జారీచేసిన ఫర్మానా అమలు జరిపారా లేదా అని జమీందారిణి గవ్రీలొను ప్రశ్నించింది. అమలు జరిపామని గవ్రీలొ జబాబుచెప్పాడు. ఆ మరునాడు గెరాసిమ్ తన గదిలోనుండి బయటికి వచ్చి, మామూలుగా తన పనులు చేసుకున్నాడు. మధ్యాహ్నం భోజనాల వేళప్పుడు, అతడు భోజనానికి వచ్చి, భోజనం చేసుకుని, ఎవ్వరకీ నమస్కారం చేయకుండానే లేచి వెళ్లిపోయాడు. అసలు మామూలుగా చెవిటిమూగవారందరి ముఖాల్లోనూ జీవకళే వుండదు, అటువంటిది ఆనాడు గెరాసిమ్ ముఖం అచ్చంగా రాతిలో మలిచినట్టే నిర్జీవంగా వుంది. భోజనం అయాక అతడు వీధిలోకి వెళ్లి, మళ్లీ కాస్సేపట్లోనే తిరిగివచ్చేసి, ఎండు కసవు మేటువేసిన మిద్దెమీదకు వెళ్లాడు. రాత్రి అయింది. పండు వెన్నెల. అంతా ప్రశాంతంగా వుంది. గెరాసిమ్ నిట్టూర్పు విడుస్తూ, విరామం ఎరుగకుండా కసవు తిరగవేస్తూ, ఒక్క క్షణం సాగిలబడే సరికి, తన కబ్బాను పట్టుకుని ఎవరో గుంజినట్టు అనిపించింది, కాని అతడు తలెత్తకుండా కనుబొమలు ముడిపెట్టుకునే వుండిపోయాడు. మళ్లీమరొకసారి కబ్బా పట్టుకుని గుంజినట్టనిపించింది. అతడు చెంగున ఒక్క గంతేశాడు... గంతు లేసుకుంటూ, తోక ఆడించుకుంటూ, మెడపట్టెకి కట్టివున్న తాడు వేలాడుతూ ముమూ తన ఎదుట ప్రత్యక్షమైంది. మూగవోయిన అతని హృదయతంత్రులనుండి ఆనందభరితమై సుదీర్ఘమైన కేకరింత ఒకటి ధ్వనించింది. అతడు ముమూను తన చేతులతో చేరదీసి, హృదయానికి

హత్తుకున్నాడు. తక్షణమే అది అతడి ముక్కునూ, కళ్లనూ, మీసాన్నీ, గడ్డాన్నీ నాకడం మొదలుపెట్టింది... ఒక్క క్షణం అతడు ఊరకే నిలబడి, తన ఆలోచనలను కూడదీసుకుని, కసవు మిద్దెమీదనుండి, జాగ్రత్తగా ఏమాత్రమూ చప్పుడు చేయకుండా దిగిపోయి, నాలుగు చెరగులా కలియ జూచి, తనను ఎవ్వరూ కనిపెట్టడం లేదని నిశ్చయించుకుని, ఎట్టి అవాం తరమూ లేకుండానే తన గది చేరుకున్నాడు. కుక్క ఎంత మాత్రమూ దారి తప్పిపోలేదనీ, జమీందారిణిగారి ఆజ్ఞ అనుసరించే దానిని ఎవరో ఎత్తుకు పోయి వుండడం తథ్యమనీ అతడప్పుడే గ్రహించేసుకున్నాడు; జమీందారిణి గారిని చూసి ముమూ గుర్రుమని పళ్లిగిలించిందని తోటినౌకర్లు సంజ్ఞలు చేసి అతనితో ఆనాడే చెప్పారు, అందుచేత తన జాగ్రత్తమీద తాను వుండ డం మంచిదని అతడు నిశ్చయించుకున్నాడు. మొట్టమొదట దానికి తిన డానికి రొట్టె ఇచ్చి, తరువాత దానిని వాత్సల్యంతో దువ్వి, నిద్రపెట్టి, ఇక అటుతరువాత, ఇతరుల కంటబడకుండా దానిని ఏలాగు దాచివుంచడమా అని, రాత్రి అంతా దీర్ఘంగా ఆలోచించాడు. పగలంతా దానిని తన గది లోనే వుంచేయాలనీ, అప్పుడప్పుడు మాత్రం వచ్చి దానిని చూస్తూ వుండ వచ్చుననీ, రాత్రిపూట దానిని బయటకు తీసుకు వెళ్లవచ్చుననీ నిర్ణయించు కున్నాడు. తానిదివరలో తలుపు అడుగున కోసిన కన్నంలో పాత ఓవర్‌కోటును కుక్కి, ఆవిధంగా కన్నం పూడ్చేశాడు. తెల్లవారగానే ముంగిలి లోకి వెళ్లి తన మామూలు పనులు చేసుకుంటూ, ఏమీ జరగనట్టుగా వెనుకటిలాగానే (సత్యకాలపువాళ్ల గడుసుదనం!) ముఖం ముడిచిపెట్టు కునే వున్నాడు. ముమూ దాని అరుపువల్ల అదే బయటపడిపోతుందన్న సంగతి పాపం నిర్భాగ్యుడు ఆ పుట్టుచెవిటివానికి అసలు తోచనైనా తోచ

లేదు. మూగవాని కుక్క తిరిగివచ్చేసిందనీ, అతడు దానిని తన గదిలో పెట్టి తాళంవేసి వుంచుతున్నాడనీ ఇంటిల్లిపాదికీ అసలు వెంటనే తెలిసిపోయింది. అయినప్పటికీ, బహుశా ఆ కుక్క పైనా, దాని యజమాని పైనా తోటి నౌకర్లకు కలిగిన జాలివల్ల కొంతవరకూ, దాని యజమాని పట్ల వారికున్న భయంవల్ల కొంతవరకూ, అతడి రహస్యం బయట పడిపోయినట్టు వారు అతనికి తెలియనివ్వలేదు. బట్లరు ఒక్కడు మాత్రమే నెత్తి వెనుక గోక్కుంటూ: ''దేవుడు రక్షించి, జమీాందారిణిగారికి తెలియనంత కాలమూ, మరేం ఫరవా లేదులే!'' అన్నట్టుగా చేయి వూపాడు. ఆనాడు మూగవాడు తన పని పాటులను చేసినంత దీక్షగా ఇదివరకెన్నడూ పనిచేయలేదు: వాకిటిలో ఏ చెత్తచెదారమూ లేకుండా, శుభ్రంచేసి ఊడ్చేశాడు. ఎక్కడా ఒక్క దుబ్బు అయినా లేకుండా గడ్డినంతనూ చెక్కేసి, వాకిలంతా అద్దంలా చేసేశాడు; పువ్వుల తోట చుట్టూ వున్న పొట్టికంచె గుంజలన్నీ దృఢంగా వున్నాయో లేదో చూడడానికని, ఒక్కొక్క గుంజనీ తానే పైకి ఊడబెరికి, దానిని తరువాత మళ్ళీ దృఢంగా క్రసుత్తితో దిగగొట్టాడు — మొత్తంమీద ఆ రోజు అతడి హడావుడీ అతడి పట్టుదలా ఎంత దీక్షతో సాగాయంటే, చివరకి అదంతా జమీాందారిణి కంటబడక తప్పిందికాదు. ఆరోజంతా ఆలా పనిచేస్తూనే, పని మధ్య రెండు మూడు సార్లు ఏదో ఒక విధంగా అక్కడనుండి జారుకుని తన ఏకాంతవాసజీవిని చూసి, మళ్ళీ పనిలోకి వచ్చేసే వాడు. రాత్రిపూట, కసవుమిద్దెమీాద కాకుండా తన కొట్టులోనే దానిని తన పక్కలో పెట్టుకునే పడుకుని, ఒంటి గంట కొట్టిన తరువాత మాత్రమే లేచి, దానిని చల్లగాలిలో షికారు తీసుకెళ్ళాడు. హాయిగా ఇంటినుండి బాగా దూరంగా షికారెళ్ళి, ఇక ఇంటికి తిరిగి వచ్చేయ్యాలను కుంటూండే

సరికి, కంచె దగ్గరగా ఇంటి వెనుకనున్న పుంతలో చెట్లకొమ్మలు కదలినట్లు ఏదో అలికిడి అయింది. ముమూ చెవులు నిక్కబొడుచుకుని, గుర్రుమంటూ కంచె దగ్గరకే వెళ్లి, వాసనచూసి, గట్టిగా కీచుగొంతుతో మొరగడం మొదలు పెట్టింది. ఎవడో తప్పతాగిన మనిషి అక్కడ హాయిగా పడుకుని ఆ రాత్రి గడిపేయదల్చుకుని, కంచెనానుకుని వాళ్లెరగకుండా కైపెక్కి తురీయావ స్థలో వున్నాడు. రాత్రంతా "నరాల దెబ్బతో" బాధపడి బాధపడి — ఈ దెబ్బ ఆమె కెప్పుడూ రాత్రి మృష్టాన్న భోజనం తరువాతే కలిగేది — జమీందా రిణికి అచ్చంగా అదేక్షణంలో కాస్త కన్ను మూత పడుతూంది; ఇంతట్లో ఈ హఠాత్తు మొరుగులు చెవిని పడి ఆమెకి మెలకువ వచ్చి: "ఒసేవ్! ఒసేవ్! ఎక్కడున్నారే మీరు? రారేమే?" అంటూ ఆమె బిగ్గరగా మూలిగింది. నిరాశతో చేతులు ఎగరేస్తూ: "అయ్యో, అయ్యో! ప్రాణం పోతూందే!" అని కేకేసింది ఆమె. "అదిగో, మళ్లీ ఆ కుక్కే!.. మళ్లీ ఆ కుక్కే! పరుగెత్తుకెళ్లి డాక్టరుని తీసుకురండర్రా! నన్ను చంపేయాలను కుంటు న్నారే వీళ్లు!.. అదుగో, అదుగో, మళ్లీ ఆ కుక్కే... ఆ కుక్కే, అయ్యో, అయ్యో!" అని ఆపసోపాలు పడిపోతూ — తాను మూర్ఛపడిపోతూన్నట్లు వాళ్లు అనుకోవాలని — తలకాయ వెనక్కి వాల్చేసింది. డాక్టరు — అనగా ఇంటి వైద్యుడు, అతగాడి పేరు హరితోన్ — కోసమని అందరూ లగు దోలారు. మెత్తని తోలు అట్టల బూడ్సు తొడుక్కొని నడవడంలోనూ, మిక్కి నాజూకుగా రోగి చేయి పట్టుకుని నాడి పరీక్షించడంలోనూ, తన ప్రావీణ్యాన్ని చూపుతూ, రోజుకు పద్నాల్గు గంటలు నిద్రపోతూ, కడమ కాలమంతా దీర్ఘంగా నిట్టూర్పు విడుస్తూండడంలోనూ నిరంతరమూ జమీందారిణిగారికి కర్పూరపు అరకు చుక్కలు ఇవ్వడంలోనూ గడపు

తూంటాడు ఈ డాక్టరు. డాక్టరు వెంటనే పరుగెత్తుకుని వచ్చి జమీందారిణిగారి మంచం సమీపించి, మొదట ఒక కట్ట పక్షి ఈకలను కాల్చి ధూపం వేశాడు. ఆ ధూపం ఘాటుకు జమీందారిణి కళ్ళు తెరిచింది. ఆమె కళ్ళు తెరవగానే, అమోఘమైన ఆ కర్పూరపు అరకు చుక్కలను ఒక గాజుగళాసులో పోసి, ఆ గాజుగళాసును ఒకవెండి పళ్ళెంలో పెట్టి, ఆమెకు ఇచ్చి ఆమెచే గుటకవేయించాడు. ఆ ఔషధాన్ని జమీందారిణి సేవించి, వెంటనే అశ్రుకణములు రాల్చుతూ గద్గదస్వరంతో, ఆ కుక్క గురించీ, గ్రవీలో గురించీ, తన ఖర్మ గురించీ మొరపెట్టుకుంటూ, తనను, నిర్భాగ్యురాలూ ఏకాకిజీవీ అయిన వృద్ధస్త్రీని, తన అవసానదశలో తన వాళ్ళందరూ వదలిపెట్టేశారనీ, తనను దిక్కుమాలిన అక్కుపక్షిని చేసేసి, తన గురించి ఎవ్వరూ కనుక్కోవడం లేదనీ, తన చావుకోసమే అందరూ నిరీక్షిస్తున్నారనీ సొద చెప్పుకోవడం మొదలుపెట్టింది. ఈ లోపుగా దురదృష్టవంతురాలు ముమూ అలా అరుస్తూనే వుంది. దానిని కంచె దగ్గరనుండి తీసుకుపోవడానికి గెరాసిమ్ ఎంత ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. "అదిగో... బాబోయ్!.. అదిగో... బాబోయ్!.. మళ్ళీ ఆ కుక్కే!.." అంటూ జమీందారిణి సోకన్నాలు పెట్టి, మళ్ళీ మరొకసారి తన గుడ్లు తేలిపోతూన్నట్టే పైకి ఎగజూసింది. అక్కడున్న చెలికత్తె చెవిలో డాక్టరు ఏదో వూదాడు. ఆ అమ్మాయి పరుగెత్తుకెళ్ళి తైనాతీ నౌకరు స్తెపాన్‌ని లేపింది; స్తెపాన్ లేచి ఒక్కపరుగున వెళ్ళి గ్రవీలోని లేపాడు; గ్రవీలో లేచి ఆ నిమిషంలో ఏమి చేసేందుకూ తోచక గాభరా పడిపోయి, ఇంటిల్లిపాదినీ లేపమన్నాడు.

వీధిలో వున్న గెరాసిమ్ తలెత్తి చూసేసరికి, ఇంటి కిటికీలలో తళుకు తళుకు మంటూన్న దీపాలూ, అటూ ఇటూ కదుల్తూన్న కీనీడలూ అత



45—1

డికి కనబడ్డాయి. అదంతా చూసి, ఏదో కీడు మూడబోతూందని అతడికి తోచి, ముమూను లంకించుకుని, దానిని చంకనిదుకుని, పరుగున తన గది చేరుకుని తలుపు గడియ పెట్టేసుకున్నాడు. మరో గడియకల్లా ఐదుగురు మనుషులు అక్కడకు వచ్చి, గది తలుపు తోసుకుని గదిలో ప్రవేశించేందుకు ప్రయత్నించారు. కాని వారు ఎంత ప్రయత్నించినా గడియ లొంగక పోవడం కనిపెట్టి, ఆ ప్రయత్నం మానుకున్నారు. గవ్రీలొకి ఏమి చేసేందుకూ పాలుపోక, వెర్రెత్తినట్టయిపోయి, వారినందరినీ తెల్లవారే వరకూ అక్కడే వుండి ఆ తలుపు దగ్గర కాపలా వుండాల్సిందని ఆజ్ఞాపించి, తాను పరుగున వెళ్ళి, నౌకర్లగది చేరుకుని, జమీందారిణి పెద్దచెలికత్తె అయి నట్టీ, తేయాకు, చక్కెర, వగైరా విలువైన సంభారపు ద్రవ్యాలను పంచు కోవడంలోనూ, తదుపరి వాటి నిల్వజాబితా తయారుచేసి సర్దుబాటు చేయడంలోనూ తన కుడిబుజమూ ప్రధాన భాగస్థురాలూ అయినట్టీ లూబోవ్ లూబీమొవ్‌న పరంగా, ఆ కుక్క దురదృష్టవశాత్తూ తిరిగి వచ్చేసిందనీ, కాని ఏమైనాసరే, రేపటితో దాని బతుకు తీరిపోతుందనీ, జమీందారిణిగారు తమపై కటాక్షించి ఆగ్రహం వహించవలదనీ, దయ యుంచి ఆమె శాంతించవలసిందనీ మనవిచేసుకున్నాడు. ఇక ఎవరు ఎంత మనవి చేసుకున్నా ఆమె బహుశా శాంతించకపోయి వుండేదే — కాని డాక్టరు తన తొందలో కర్పూరపు అరకు పన్నెండు చుక్కలు ఇవ్వడం బదులు, తప్పుగా లెక్కపెట్టడంవల్ల నలభై చుక్కలు ఇచ్చాడు: బలమైన మోతాదు పడడంచేత మందు అమోఘంగా పనిచేసింది — ఒక్క పావుగంటలో జమీం దారిణికి ప్రశాంతమైన గాఢన్నిద పట్టిపోయింది. గెరాసిమ్‌కి ముఖంలో

రక్తంలేక, ముమూ మూతిని నొక్కి పట్టుకుని మంచంమీద అలా పడు కున్నాడు.

మరుచటినాడు ఉదయం జమీందారిణి బాగా పొద్దెక్కి లేచింది. గెరాసిమ్ కోటపై నిర్ణయాత్మకమైన దాడి చేసేందుకు తాను ఆజ్ఞ జారీ చేసేముందు, యజమానురాలితో సంప్రతించాలనే ఉద్దేశంతో గవ్రీలా ఆమె నిద్ర లేచేవరకు కాచుకొని, ఈలోపుగా ఉరుములూ మెరుపుల గాలి వానను ఎదుర్కొందుకు ఆయత్త పడుతూ మనసు గట్టి చేసుకుంటు న్నాడు. కాని ఉరుములూ లేవు, మెరుపులూ లేవు – అసలు గాలివానే లేక పోయింది. జమీందారిణి తాను పడుకునున్న మంచం వద్దకు తన పెద్ద చెలికత్తెను, రప్పించింది.

"లూబోవ్ లూబీమొవ్న!" అంటూ బలహీనమైన కంఠంతో మెల్లగా ప్రారంభించిందామె; తనను అందరూ అష్టకష్టాలూ పెట్టేస్తూ న్నట్టూ, తానొక దిక్కులేని నికృష్టజీవి అయినట్టూ తన్నుతాను చిత్రించు కుని జాలిపడడమంటే అప్పుడప్పుడు ఆమెకెంతో సరదా; అటువంటి సమయాల్లో ఆమె పరివారంలో వున్న ప్రతివారూ ఎంతో అంత చికాకు పడిపోయేవారని వేరే చెప్పనక్కరలేదు. "లూబోవ్ లూబీమొవ్న! నేనెంత బాధపడిపోతున్నానో, నా స్థితి ఎలా వుందో మీరు చూస్తూనే వున్నారు కదా! గవ్రీలా అంద్రేయిచ్ దగ్గరకెళ్లి: 'ఏమయ్యా! నీ జమీందారిణిగారి మనస్తిమితం కంటెనూ, ఆమె ప్రాణంకంటెనూ ఆ వెధవ కుక్కే నీకు ఎక్కువటయ్యా?' అని అడిగి, మీరేనా అతగాడికి బుద్ధిచెప్పండి. నిజంగా అతగాడాలా అనుకుంటాడని తల్చుకుంటేనే నాకెంతో దుఃఖం కలుగు

తూంది. మీరంటూ నాపాలిటి దైవంలా నాకు దొరికారు. మీరు వెళ్ళి గ్రవీలా అంద్రేయిచ్‌తో మాట్లాడండి'' అని చెప్పింది.

లూబోవ్ లూబీమొవ్‌న గ్రవీలాను చూడడానికని అతని గదికి వెళ్ళింది. వాళ్ళిందరూ నికరంగా ఏమి సంప్రతించుకున్నారో మరి, ఆ సంగతి ఇతరులకెవ్వరికీ తెలియదుగాని, మరి కొద్ది సేపటికల్లా భృత్యువర్గమంతా ఒక గుంపుగా కూడి, ముంగిలి దాటి గెరాసిమ్ గది వైపు వెళ్లారు. గాలి ఏమీ లేకపోయినప్పటికీ తన తలపైనున్న టోపీని చేతితో అదిమిపట్టుకుని గ్రవీలా ఆ గుంపుకి నాయకత్వం వహించాడు; అతడి వెనుక నడుస్తున్నారు తైనాతీ నౌకర్లూ, వంటవాళ్లానూ. ''తోకపీకుడు మామ'' కిటికీలోంచి చూస్తూ ఉత్తరువులు జారీచేస్తున్నాడు, అనగా మరేమీ లేదు — వూరకనే చేతులు హడావుడిగా ఎగరేస్తున్నాడన్నమాట. ఇక ఆ గుంపులో చివరనున్నవారు ఇటూ అటూ పరుగెడుతూ కేరింతలు కొడుతూన్న అల్లరి చిల్లరి కుర్రవాళ్లు, వీరిలో చాలామంది పరాయి వాళ్లే. గెరాసిమ్ గదికి ఎదురుగా వున్న ఇరుకుమెట్లమీద కావలిజవాను ఒకడు కూచునున్నాడు, కర్రలు పట్టుకుని తలుపు దగ్గర నిలబడి కాపలా కాస్తూ మరొక ఇద్దరు జవాన్లు వున్నారు. ఆ గుంపు అంతా మెట్లమీద నిలబడి, కిందనుండి మీదవరకూ మెట్లన్నీ ఆక్రమించుకుంది. గ్రవీలా తలుపు దగ్గరకెళ్లి, తన పిడికిలితో తలుపు గుద్దుతూ పెద్దగా కేకపెట్టాడు:

''తలుపుతీయ్!''

గదిలోనుండి సగం పగం అణచివేసిన మొరుగు మాత్రం వినబడింది. అంతకు మించి మరే ప్రత్యుత్తరమూ లేదు.

''తలుపు తీస్తావా తియ్యవా?'' అని మళ్లీ కేకేశాడు గ్రవీలా.

''అరె! గొంతు చించుకుని ఎందుకలా అరుస్తావయ్యా, గ్రవీలా అం ద్రేయిచ్? చెవిటాడికి వినబడునా, పొడా?'' అన్నాడు స్తెపాన్ అట్టడుగు మెట్టునుండి.

అందరూ పక్కున నవ్వారు.

''అయితేమరి, ఏంచెయ్యమంటావ్?'' అని అడిగాడు గ్రవీలా పై మెట్టు మీద నిలబడి.

''తలుపుకి అట్టడుగున కన్నం ఒకటి వుందిగా'' అని స్తెపాన్ బదులు చెప్పాడు. ''దాంట్లో కర్ర ఒకటి దూర్చి, ఆ కర్ర ఆడిస్తే సరి.''

గ్రవీలా నేలకేసి వంగి చూశాడు.

''తలుపు కన్నంలో ఓవర్‌కోటు పెట్టి పూడ్చేశాడు'' అని అరిచాడు గ్రవీలా.

''ఆ కోటును లోపలికి పొడిచేవయ్యా!''

గదిలోంచి మళ్లీ మరొకసారి 'భౌ' మని మొరుగు వినబడింది.

''అదిగో వినండి, అదే బయలుపడిపోతూంది'' అన్నాడెవడో ఆ గుంపులోనుండి. అందరూ గొల్లుమని నవ్వారు.

గ్రవీలా చెవివెనుక గోక్కొని:

''ఆ కోటును లోపలికి పొడవడం నావల్లకాదు. అంతగా కావాలంటే అదేదో నువ్వేవచ్చి పొడువు!'' అన్నాడు గ్రవీలా చివరికి.

''నేపొడుస్తానయ్యా, నాకేం భయం!'' అన్నాడు స్తెపాన్.

అలా అంటూ, స్తెపాన్ మెట్లెక్కి, కర్ర పుచ్చుకుని ఆ కోటును గదిలోకి పొడిచి, కర్రను ఆ కన్నంలో ఇటూ అటూ ఆడించుతూ:

"బయటికి రా, బయటికి రా!" అని పిలిచాడు.

అతడింకా కర్రను ఆడిస్తూండగానే, గభీమని తలుపు తెరుచుకునే సరికి, అందరూ తొక్కటుకుంటూ మెట్లమీదనుండి దొర్లి కింద పడ్డారు — అందరికంటే ముందు పడ్డాడు గవ్రీలొ. "తోకపీకుడు మామ" వెంటనే తన కిటికీ దభీమని మూసేసుకున్నాడు.

"ఏయ్, ఏయ్, ఏయ్!" అని కేకేశాడు గవ్రీలొ వాకిటిలోనుండి. "ఖబడ్దార్!" అని అరిచాడు.

శిలావిగ్రహంలా గది గుమ్మంలో నిలబడున్నాడు గెరాసిమ్. జనమంతా గుమికూడి మెట్లకింద నిలబడ్డారు. జర్మన్ ఫాషన్‌లో కుట్టిన కోట్లు తొడుక్కుని ఈసురోమంటూ వామనుల్లా వున్న వారందరికేసి నిర్లక్ష్యంగా చూశాడు గెరాసిమ్, చేతులు రెండూ పార్శ్వాలంట వొంపుగా పెట్టుకుని; తన ఎరుపు పల్లెపట్టు జుబ్బా తొడుగుకుని అతడా మెట్లమీద నిలబడి, కళ్లు వాల్చి వీరందరికేసీ చూస్తూంటే, వీళ్లముందు అతడొక మహా బలుడులా, బ్రహ్మాండమైన వ్యక్తిలా కానొచ్చాడు. గవ్రీలొ ఒక అడుగు ముందుకు వేసి:

"ఓయ్, జాగ్రత్త సుమా! వెధవ వేషాలేవీ నాదగ్గర పనికిరావు!" అన్నాడు.

అలా అని, జమీందారిణిగారు గెరాసిమ్ కుక్కని తక్షణమే ఇచ్చేయ మంటున్నారనీ, ఆమె ఆజ్ఞను శిరసావహించని పక్షమందు అతనికి కీడు మూడు తుందనీ, సంజ్ఞలు చేసి గెరాసిమ్‌కి తెలియపరచాడు.

గెరాసిమ్ అతడికేసి చూసి, తన కుక్కవైపు వేలుపెట్టి చూపించి, పీకకు జారుముడి వేసి బిగించుతూన్నట్టు చేతులతో సంజ్ఞచేసి, తరువాత ప్రశ్నార్థకంగా బట్లరుకేసి చూశాడు.

''అవును, అదే అదే'' అని బట్లరు జవాబు చెబుతూ తల పంకించి, ''అవును, అదే'' అన్నాడు.

గెరాసిమ్ తన చూపులను దించి, తటాలున వాళ్లు విరుచుకుని, ఏ పాపమూ ఎరగకుండా తోక ఆడించుతూ, ఏమిటి జరుగుతూందో తెలుసుకుందామనే జిజ్ఞాసతో చెవులు నిక్కించుకుని, ఇది జరుగుతూన్నంతసేపూ తనపక్కనే నిలబడున్న ముమూకేసి మరొకసారి వేలుపెట్టి చూపి, పీక నొక్కేసుకుంటూన్నట్టు మరొకసారి సంజ్ఞచేసి, తనంతట తానే ముమూను చంపివేస్తాననే ఉద్దేశ్యం కనబర్చుతూ అర్థవంతంగా తన గుండె చరచుకున్నాడు.

''నువ్వు అలా అంటావేగాని, తరువాత దగా చేస్తావు!'' అని గవ్రీలొ జవాబు చెబుతూ, ఆ మాట గెరాసిమ్‌కి అర్థమయేటట్టు సంజ్ఞచేసి చెప్పాడు.

గెరాసిమ్ అతడికేసి తీక్ష్ణంగా చూసి, తృణీకారంగా చిరునవ్వు నవ్వి, మళ్లీ మరొకసారి తన గుండె చరచి, తన గదిలోకి వెళ్లిపోయి తలుపు మూసేసుకున్నాడు.

అందరూ నిశ్శబ్దంగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

''ఏమిటి వాడి ఉద్దేశ్యం?'' అంటూ గవ్రీలొ మాటాడడం మొదలుపెట్టాడు. ''గదిలోకి వెళ్లిపోయి తలుపు బిడాయించేసుకున్నాడే!''

''ఇదిగో, గవ్రీలొ అంద్రేయిచ్, వాడినేమీ అనకు నువ్వు'' అన్నాడు

స్తెపాన్: ''వాడు మాట ఇచ్చాడంటే అది శిలాక్షరమే అనుకో. వాడి తత్వమే అంత... ఖరారు చేస్తే ఇక అది ఖాయమే, అన్నంత పనీ చేసి తీరుతాడు. మన బోటిగాళ్లల్లా కాదు వాడు. నామాట నిజమనుకో, ముమ్మాటికీ నిజం.''

''అవును, అవును'' అని తలలు పంకించుతూ కడమవారందరూ ఆ మాటే అన్నారు: ''నిజమే, నిజమే!''

''తోకపీకుడు మామ'' కిటికీ తలుపు తెరచి:

''అవును, అవును'' అన్నాడు అతడు కూడా.

''సరేలెండి, చూతాంగా'' అన్నాడు గవ్రీలా: ''ఏమైనప్పటికీ, మనం కాపలా కాయడం మంచిది. వోయ్, ఎరోష్కా!'' అని, తాను తోట మాలినని చెప్పుకొని కాలక్షేపం చేసుకొంటూ, బుట్టగాగరాలాంటి పసుప్పచ్చ అంగీ తొడుగుకొని, పాలిపోయిన ముఖంతో అక్కడ ఒక మనిషి వుంటే అతడిని పిలిచి: ''నీకెలాగా పనీపాటూ లేదు! ఓ కఱ్ఱ పచ్చుకుని ఇక్కడ కూచో, తెలిసిందా? ఏదైనా జరిగిందంటే మాత్రం లగుదోలుకొచ్చి నాతో చెప్పు!'' అని ఆ మనిషికి పని ఫర్మాయించాడు.

కఱ్ఱ ఒకటి చేతబుచ్చుకుని ఎరోష్కా అట్టడుగు మెట్టుమీద కూచున్నాడు. జనం అంతా ఎవరి మానాన వారు వెళ్లిపోయారు. ఎవరో పనిలేని సోమరిపోతులూ, కుఱ్ఱవాళ్లు కొందరూ మాత్రమే అక్కడ మిగిలారు. గవ్రీలా ఇంటికి వెళ్లిపోయి, లూబోవ్ లూబీమొవ్న పరంగా జమీందారిణిగారికి విన్నవించుకున్నాడు, ఆమె ఆజ్ఞ ప్రకారం అంతా జరిపించానని. ఎందుకైనా మంచిదని, గవ్రీలా గుఱ్ఱపుబండి సవారును పిలిచి, అతడిచేత బీటు పోలీసు వాడికి కబురుచేయించాడు. జమీందారిణి తన

చేతిరుమాలు ముడివేసి, ముడిపై ఉ-డు-కొలోన్ పోసి, దానిని వాసన చూసి, కణతలకు రాసుకుని, టీ సేవించి, ఆ కర్పూరపు అరకు గుణం ఇంకా నిల్చి వుండడంచేత, మళ్లీ నిద్రపోయింది.

సద్దు మణిగిన ఒక గంట తరువాత, తన గదితలుపు తీసుకుని గెరాసిమ్ బయటకొచ్చాడు. తనకున్న జుబ్బాల్లోకల్లా మంచి జుబ్బా తొడుక్కొని, ముమూ మెడకు తాడుకట్టి, తాడు చేతబుచ్చుకుని దానిని నడిపించుతూ మెట్లుదిగాడు. కిందిమెట్టుమీద కూచునున్న ఎరోష్కా అక్కడనుండి లేచి తప్పుకున్నాడు. గెరాసిమ్ గేటుకేసి నడిచాడు. అక్కడ చేరిన కుర్ర వాళ్ళూ, ఆ క్షణంలో వాకిట్లో వున్నవాళ్ళూ అందరూ మౌనంగా అతడివైపు తమ దృక్కులు సారించారు. అతడు ఒక్కసారైనా వెనక్కి తిరిగి చూడ లేదు. గేటు దాటి వీధిలో అడుగుపెట్టిన తరువాత మాత్రమే టోపీ పెట్టు కున్నాడు. గెరాసిమ్ ఎక్కడకు వెళ్ళుతున్నాడో ఏమి చేయనున్నాడో కని పెట్టేందుకని అతడి వెంట వెళ్ళమని గవ్రీలా ఎరోష్కాను నియమించాడు. కుక్కను నడిపించుకుంటూ గెరాసిమ్ ఒక పానశాలలోకి వెళ్ళడం దూరంనుండే ఎరోష్కా చూసి, గెరాసిమ్ బయటికొచ్చేవరకూ అక్కడే నిలబడ్డాడు.

పానశాల పరిచారికులందరికీ గెరాసిమ్‌ను తెలుసును; అతని సంజ్ఞలు వారు అర్థంచేసుకునేవారు. మాంసపు ముక్కలువేసి కాచిన కాబేజీ 'సూప్' పురమాయించి, అది తెచ్చేవరకూ బల్లపై చేతులనానుకుని కూచున్నాడు గెరాసిమ్. అతడు కూచున్న కుర్చీ పక్కనే ఆ తెలివైన కళ్లతో ప్రశాం తంగా అతనికేసి చూస్తూ ముమూ నిలబడింది. దాని బొచ్చు నున్నగా నిగ నిగ మెరుస్తూంది: అప్పుడే శుభ్రంగా దువ్వినట్టు ప్రత్యక్షంగా కనబడు

తూనే వుంది. 'సూప్' తీసుకొచ్చి గెరాసిమ్ బల్లమీద పెట్టారు. అతడు రొట్టెను ముక్కలకింద చిదిపి, వాటిని 'సూప్'లో వేశాడు. మాంసపు ముక్కలను కత్తితో సన్నగా కోసి, పళ్లెన్ని కిందపెట్టాడు. తన మామూలు నాజూకుతనంతో, మూతికి ఆహారం అంటీ అంటకుండా, 'సూప్' తినడం ఆరంభించింది ముమూ. అది 'సూప్' తింటూన్నంత సేపూ దానికేసి తదేకధ్యాన్నంతో చూస్తూనే వున్నాడు గెరాసిమ్; ఆలా చూస్తూండగా అతని కళ్లనుండి రెండు కన్నీటి చుక్కలు జారి, ఒకటి ఆ కుక్క గుండ్రని శిరస్సుపైన పడింది; రెండవది అది తింటూన్న 'సూప్'లో రాలింది. గెరాసిమ్ తన ముఖాన్ని చేతితో కప్పేసుకున్నాడు. 'సూప్' సగమే తిని ముమూ అక్కడనుండి కాస్త దూరంగా వెళ్లి మూతి నాక్కుంటూ కూచుంది. గెరాసిమ్ లేచి, ఆ భక్ష్యానికి డబ్బు చెల్లించి బయటకు వెళ్లిపోయాడు. పరిచారకుడు ఆశ్చర్యంతో అతని వెంట ఆలా చూస్తూ నిలబడిపోయాడు. గెరాసిమ్ బయటకు రావడం చూసి, అతనిని వీధి మలుపు తిరగనిచ్చి, అతని వెంట వెళ్లాడు ఎరోష్కా.

గెరాసిమ్ ముమూను తాడుపట్టుకుని నడిపించుకుంటూ, సావకాశంగా అడుగులు వేసుకుంటూ నడిచాడు. వీధి మలుపు చేరుకుని, మనస్సు గట్టిచేసుకుందుకు ప్రయత్నించుతున్నట్టుగా అక్కడ అతడు ఒక గడియ ఆగి, అక్కనుండి త్వరత్వరగా క్రిమ్స్కి రేవు దిశగా నడిచాడు. దారిలో ఒక ఇల్లుకనబడింది. ఆ ఇంటికి కొత్తగా మరొక భవంతి కడుతున్నారు. గెరాసిమ్ ఆ కొత్తగా కడుతూన్న భవంతిలోకెళ్లి, రెండు ఇటుకలు చంకబెట్టుకు వచ్చాడు. క్రిమ్స్కి రేవు దగ్గర మలుపు తిరిగి, నది గట్టు నడచి రెండు తెడ్డు పడవలు వున్న చోటకు వచ్చాడు. పడవతెడ్లు ఒక

కొయ్యకి తగిలించి వున్నాయి — ఈ పడవలు అక్కడుండడం ఇంతకు ముం దొకనాడు అతడు చూశాడు. ముమూను తీసుకుని గెరాసిమ్ ఒక పడవలోకి చెంగున గెంతాడు. అక్కడున్న కూరగాయ మడిలో ఒక మూలనున్న చిన్న పాకలోనుండి కుంటి ముసలివాడొకడు బయటకొచ్చి, గెరాసిమ్‌ని కేకే శాడు. గెరాసిమ్ ఆ ముసలివాడిని చూసి తలవూపి, తెడ్లమీద ఒరిగి, ఎంత త్వరగా పడవను పోనిచ్చాడంటే, ప్రవాహం ఎదురుగా వున్నప్పటికీ, ఒక్క గడియలో పడవ రెండు వందల గజాలు ఏటి ఎగువకు వెళ్లిపోయింది. ఆ ముసలాడు గట్టుమీద ఒక్క క్షణం తచ్చాడి, మొదట ఎడమచేతితో వీపు గోక్కొని, తరువాత కుడిచేతితో గోక్కొని, కుంటుకుంటూ పాకలోకి వెళ్లిపోయాడు.

బారుమీద బారు, ఆలా తెడ్లు వేస్తూనే వున్నాడు గెరాసిమ్. ఆపా టికి అప్పుడే మాస్కో పొలిమేర దాటి చాలా ఎగువకే వెళ్లింది పడవ. ఏటి వొడ్డున పచ్చిక బయళ్లు, కూరగాయ మళ్లు, పొలాలు, తోటలు, గుడిసెలు అవుపడ్డాయి. చుట్టుపక్కల పరిసరాలకు అంతకంతకు పల్లెపట్టు రూపు వచ్చేస్తూంది. ఇక తెడ్లు వెయ్యడం ఆపి, పడవలో తనకు ఎదురుగా పొడిగా వున్న బల్లపై — పడవ అడుగున నీళ్లున్నాయి — కూచున్న ముమూతలపై తన శిరస్సు వాల్చి, తన బలమైన బాహువులను కుక్కవీపుపై వుంచి, నిశ్చే ష్టుడై ఆలా వుండిపోయాడు. నదీప్రవాహం పడవను మెల్లగా పట్నం దిశగా తీసుకొని పోతూంది. చివరికి గెరాసిమ్ వీపు విరుచుకుని, ఎంతో బాధపడిపోతూ, విషాదపూరిత వదనంతో ఆదరా బాదరా ఒక తాడు చెరి కొనకు చెరొక ఇటుకనూ కట్టి, తాడు మధ్య జారుముడి వేసి, ఆ జారు ముడిలో ముమూ మెడదూర్చి, తన చేతితో ముమూను నీటిపైన గాలిలోకి

ఎత్తి పట్టుకుని, కడపటిసారి దాని కేసి చూశాడు... అమిత విశ్వాసంతో నిర్భయంగా ఆనందంతో తోక ఆడించుతూ అది అతడివైపు చూసింది. దాని చూపులను భరించలేక, గెరాసిమ్ కళ్ళు గట్టిగా మూసుకుని తన పట్టు వదిలేశాడు... గెరాసిమ్‌కి ఏమీ వినబడలేదు — ముమూ పడిపోతూన్నప్పుడు కెవ్వుమని దాని కేకగాని, నీటిని తాకినప్పుడు దుబ్బుమన్న ధ్వనిగాని అతడి వినబడనే లేదు; ప్రగాఢమై అమిత ప్రశాంతమైన రాత్రి మనకు ఎంత నిశ్శబ్దంగా వుంటుందో, అంతకంటెనూ అమిత నిశ్శబ్దంగా అమిత ప్రశాంతంగా వుంటుంది అత్యంత రణగణ ధ్వనితో నిండిన పగటిపూట అతనికి. అతడు తిరిగి కన్నులు తెరిచి చూచేటప్పటికి , ఏటి నీళ్ళపై తేలి తూన్న పిల్ల అలలు ఎప్పటిలాగానే ఒకదాని నొకటి వెన్నాడుతూ పరుగు లెడుతున్నాయి. నావ పార్శ్వాన్ని చక్రుమని చరచి, తుళ్ళి, ప్రక్షాళనం చేస్తూ, అతని వెనుక ఎంతో దూరాన కేవలం ఏటి ఒడ్డుకు దగ్గరగా మాత్రమే ఒకదానికంటె ఒకటి నిరంతరాయంగా విస్తృతములవుతూ, నీటి వలయాలు ఒకదానినుండి ఒకటి అనంతంగా చెదిరిపోతూన్నాయి.

ఇక గెరాసిమ్ నదికెదురుగా నావలో వెళ్ళిపోతూండగా ఎరోష్కాకి దృష్టి ఆనక ఇంటికి తిరిగి వెళ్ళిపోయి, తాను చూచిన సంగతులనన్నిటినీ ఇంట్లోవాళ్ళతో చెప్పాడు.

''నాకు తెలుసుగా'' అన్నాడు స్తెపాన్, ''వాడు దానిని తప్పకుండా ఏటిలో ముంచేస్తాడని. అందుకేమీ సందేహంలేదు. ఒకసారి మాట ఇచ్చాడూ అంటే...''

గెరాసిమ్ ఆనాడు ఎవ్వరికీ అగపడలేదు. భోజనానికి రాలేదు. సాయం కాలం అయింది. రాత్రి భోజనానికి అతడుతప్ప అందరూ వచ్చారు.

“ఎక్కడో చిత్రమైన మనిషిలా వున్నాడు ఈ గెరాసిమ్!” అంది వలం షటి చాకలి మనిషి. “దిక్కుమాలిన వెధవ కుక్క గురించి అంత మనసు పాడుచేసుకోవడమా! ఇంత విడ్డూరపు మనిషిని నేనెక్కడా చూడలేదు, నిజంగా!”

“నాకిక్కడ అగపడ్డాడే, గెరాసిమ్” అన్నాడు స్తెపాన్, ఆశ్చర్యంతో, చెమ్చాతో అంబలి తాగుతూనూ.

“అరె, ఎప్పుడు చూశావు?”

“రెండు గంటలక్రితం చూశానయ్యా గేటు దగ్గర, అతడు మళ్లీ వీధిలోకి వెళ్లుతూండగా నాకు ఎదురయాడు. కుక్క గురించి అడుగుదా మనుకున్నాను గాని, చూడబోతే మనిషి చికాకుగా వున్నాడు. చేతితో ఒక్క నెట్టు నెట్టాడు నన్ను — దారిలో నుండి తప్పుకోమనే వాడి ఉద్దేశ్యం, అంతకు మించి మరేంకాదు. కాని సరిగ్గా వెన్నుమీద నెట్టాడు. వోరె, వోరె, వోరె! వీడి తస్సా దియ్యా!” అంటూ స్తెపాన్ అప్రయత్నంగా నవ్వి తలకాయ గోక్కున్నాడు. “అవునయ్యా, బాబూ, వాడి చేతులు రాక్షసి చేతులు!” అన్నాడు.

స్తెపాన్ భంగపాటు చూసి అందరూ విరగబడి నవ్వారు. అందరూ భోజనం చేసి, ఇక పడుకుందుకు ఎవరిమాన వారు వెళ్లిపోయారు.

సరిగా ఆక్షణమప్పుడే బ్రహ్మాండమైన మనిషి ఒకడు వీపున మూట పెట్టుకుని, చేత కర్ర బుచ్చుకుని, ఎక్కడా ఆగకుండా తొందరగా అడు గులు వేసుకుంటూ తి... ట్రంకు రోడ్డుమీద నడిచి వెళ్లుతున్నాడు. ఆ మనిషి మరెవ్వడూ కాదు గెరాసిమే. తాను అంత త్వరగా, దిక్కులు

చూడకుండా తిన్నగా సరాసరి ముక్కు సూటిగా వెళ్లుతూన్నది మరెక్కడకూ కాదు — తన స్వగ్రామానికే, తాను పుట్టిన స్వస్థలానికే. పాపం ముమూను ఏట్లో ముంచేసిన తరువాత, అతడు తన గదిలోకి పరుగెత్తుకుని వెళ్లి, ఆదరా బాదరా తన నాలుగు వస్తువులనూ ఒక పాత గుర్రపు కంబళిలో మూటకట్టుకుని, మూట బుజాన వేసుకుని, రెండవవాడి కంట బడకుండా అక్కడనుండి వెళ్లిపోయాడు. తనను మాస్కోకి తీసుకు వచ్చినప్పుడే, కొండగుర్తులన్నీ పెట్టుకుని ఆ రోడ్డు బాగా జ్ఞాపకం పెట్టుకున్నాడు; తన స్వగ్రామం, ఏ గ్రామంనుండైతే తన బానిసయజమానైన జమీందారిణి జారీచేసిన హుకుం తనను మాస్కో రప్పించిందో, ఆ గ్రామం ట్రంకురోడ్డుకు సుమారు పదిహేను మైళ్ల ఆవలనుంది. అదొక విధమైన మొండి ధైర్యంతో, నిరాశాజనితమై, అదే సమయంలో ఆనందప్రదమైన నిశ్చలచిత్తంతో అడుగులు వేసుకుంటూ అతడు నడుస్తున్నాడు. నడిచాడు, నడిచాడు, ఆలా నడుస్తూనే వున్నాడు; స్వేచ్ఛా వాయువును తనవితీరా పీల్చుతున్నాడు; రెప్ప వాల్చకుండా నిదానంగా సరాసరి ఎదురుగా తెరిచూస్తున్నాయి అతడి కళ్లు. ఏ దూరదేశపు యాత్రనుండో, ఏ చిత్రవిచిత్రమైన ప్రజల నడుమనుండో తన స్వస్థలానికి తిరిగి వస్తూండగా, కాటికి కాళ్లు చాపుకొని తన రాకకై ఎదురుచూస్తూన్న కన్నతల్లి స్వాగతాన్ని అందుకుందుకో అన్నట్టుగా... అతడు తొందర తొందరగా నడుస్తున్నాడు. ఒక్క గడియక్రితం ప్రశాంతమైన వెచ్చని వేసవిరాత్రి మొదలైంది; ఇటు సూర్యుడు అస్తమించిన దిక్కున ఆకాశం అంచు ఇంకా వెలుగ్గానే వుండి, నిష్క్రమించుతూన్న దినం తుది ఛాయలతో ఇంకా కొద్దిగా జేవురించే వుంది; అటు లేత ధూసర నీలివర్ణపు సందె నీడలు అప్పుడే

అలముకుంటున్నాయి. అటువైపునే దూరాననుండి రాత్రి ఎదురవుతూంది. చెవులు చిల్లులు పడేటట్టు వందలాది కోలంకి పిట్టలు గోలచేస్తున్నాయి, కొంగలు కూతపెట్టి ఎడతెరిపిలేకుండా ఒకదానినొకటి పిల్చుకుంటు న్నాయి... ఆ ఇనుపకాళ్లతో వడివడిగా అంగలు వేసుకుంటూ గెరాసిమ్ వాటి పక్కనుండే నడచి వెళ్లిపోతూంటే అతనికి ఏ కలకలారావమూ విన బడనే లేదు — రాత్రిపూట చెట్టుచేమల రహస్య సల్లాపాలూ అతనికి విన బడలేదు; నలుపుకొడి చేలలో ముదురుతూన్న 'రై'ధాన్యపు కంకులు విర జిమ్ముతూన్న సుపరిచిత పరిమళం మాత్రం అతడు ఆఘ్రాణించగల్గాడు. తనపై విజృంభించుతూన్న పిల్లగాలిని, తన ముఖాన్ని చుంబించుతూన్న తన జన్మస్థానపు మలయమారుతాన్ని అతడు స్పృశించగల్గాడు; తనకెదు రుగా సాగిపోతూ, లీలామాత్రంగా అగపడుతూన్న పథాన్ని, తన ఇంటికి దారి చూపుతూన్న మార్గాన్ని అతడు చూశాడు; తన బాటకు వెలుగు చూపు తూన్న నక్షత్రకోటిని అతడు వీక్షించి, సింహంలా శక్తిమంతంగానూ, ఆనందంతోనూ అతడా పథాన అడుగు వేశాడు; ఇక అప్పుడే ఉదయించు తూన్న బాలసూర్యుని ఆర్ద్రారుణ కిరణాలు ఆజానుబాహు ఆ బాట సారి మూఖాన్ని వెలుగొందించి నప్పటికే, అతడికీ మాస్కోకీ నడుమ పాతిక మైళ్ల బాట విస్తరించింది...

రెండు రోజులు తరువాత అతడు స్వగ్రామం చేరుకుని, తన సొంత గుడి సెలో అడుగు పెట్టాడు — అతడా ఇల్లు వదలిపెట్టి వెళ్లిపోయిన తరు వాత, ఆ ఇంట్లో ప్రవేశపెట్టబడిన ఒక సైనికుని భార్య, ఇతడు ఇంట్లోకి రావడం చూసి నివ్వెరపోయింది. దేవుడి చిత్రపటాల ఎదుట అతడు ప్రార్థన చేసుకున్న తరువాత, గ్రామపెద్దను చూసేందుకని వెళ్ళాడు. గ్రామపెద్ద

అతడిని చూసి కొంత ఆశ్చర్యపడిన మాట నిజమే. కాని అది కసవు ఎండ బెట్టే కాలం అవడాన్నీ, పనులు ముమ్మరంగా సాగుతూండడం చేతనూ, గెరాసిమ్ భేషైన పనిమంతుడని అందరికి తెలిసి వుండడం చేతనూ, వెంటనే అతనికి చేతికొడవలి నొకదానినిచ్చి, అతడికి పని పురమాయించారు; కాగా అతడు పూర్వకాలపు పద్ధతిలో గడ్డికోత ప్రారంభించేసరికి, అతడు తనచేతనున్న చేతికొడవలిని ఝళిపించడం చూసి, రైతులందరూ దిగ్భ్రాంతులైపోయారు...

ఇక మాస్కోలో, గెరాసిమ్ వెళ్లిపోయిన మరుచటి రోజున అతడు గైరుహాజరును నౌకర్లందరూ గమనించారు. అతడి గదిలోకి వెళ్లి గది సోదాచేసి, అతడులేడన్న సంగతి గవ్రీలాతో చెప్పారు. గవ్రీలా కూడా స్వయంగా ఆ కొట్టోకి వెళ్లి, నలుమూలలా తనిఖీచేసి, బుజాలు ఎగరేసి, మూగవాడు ఎక్కడికో పరారైవుంటాడో, అదీకాకుంటే ఆ వెధవ కుక్కతోపాటు వాడూ ఏటిలో మునిగి చచ్చి వుంటాడో అని నిశ్చయించుకుని, గెరాసిమ్ ఐపూ జాడా లేకుండా కనబడడం లేదని పోలీసులకి తెలియపర్చాడు; కాగా జమీందారిణికి కూడా నివేదించుకున్నాడు. ఆ సంగతి విని జమీందారిణి మండిపడిపోయింది, భోరున ఏడ్చింది, ఏమైనా సరే ఎంత డబ్బు ఖర్చుచేసైనా సరే అతడెక్కడ వున్నదీ తెలుసుకొనవలిసిందని ఫర్మానా మంజూరు చేసింది. కుక్కను చంపించివేయమని తానెన్నడూ ఉత్తరువు చేయలేదని ఘంటాపథంగా ఉద్ఘాటించింది; చివరకు గవ్రీలాని ఎంత తీవ్రంగా ముప్పచివాట్లు పెట్టిందంటే, ఇక ఆ రోజంతా అతగాడు తల పంకించుతూ, 'సరే, మరి' అనే ఆ ఒక్క ముక్క తప్ప మరొకమాట

అతగాడి నోటంట పెకిలిందికాదు; చివరికి ''తోకపీకుడు మామ'' అతగాడిని చూసి, 'సరే, మరి!' అని వెక్కిరించే సరికి అప్పుడతగాడికి మతి కుదుట పడి, నోటిలో నాలుక ఆడింది. కొసకి ఏలాగైతేనేమి, గెరాసిమ్ తన స్వగ్రామం సురక్షితంగా చేరుకున్న సంగతి మాస్కోలో తెలిసింది; ఆ వార్త విని జమీందారిణి శాంతించింది. ఆ కబురు ఆమె చెవినిబడగానే ఆ ఉద్రేకపు జోరులో గెరాసిమ్‌ను మాస్కోకు తిరిగి తీసుకువచ్చేయ వలసిందని ఆమె హుకుం జారీచేసింది, కాని ఇంత కృతఘ్నుడైన మనిషి తనకు అవసరం లేదంటూ మళ్ళీ ఉత్తరక్షణమే తన హుకుమును రద్దు చేసేసింది. ఇదంతా జరిగిన కొద్దిరోజులకి ఆమె చనిపోయింది; ఆమె వారసులకు చేతినిండా ఇతర వ్యాపకాలు వుండడంచేత, గెరాసిమ్ గురించి వారేమీ పట్టించుకోనే లేదు; అంతేకాదు వారి తల్లిని కనిపెట్టుకుని ఆమెకు సేవచేసిన బానిస సేవకులు విడుదల శిస్తు చెల్లించుకునే పద్ధతిమీద వారినందరినీ వారివారి పనులు చేసుకోమని వారు పంపించేశారు.

ఈనాటికి కూడా గెరాసిమ్ తనసొంత గుడిసెలోనే ఒక్కడూ ఒంటరిగానే తన జీవితం గుడుపుకొంటున్నాడు. మనిషి నిండు ఆరోగ్యంలో వుంటూ, నలుగురు మనుషుల పని తానొక్కడే అవలీలగా చేస్తాడు; వెను కటిలాగానే ఎంతో హుందాతనంతో నెమ్మదిగా వుంటాడు. కాని అతడు మాస్కో నుండి తిరిగి వచ్చినప్పటినుండి ఆడంగులంటే అతడికి సుతరామూ గిట్టదనీ, వాళ్ల జోలికిగానీ వాళ్ల సొంటికిగానీ అతడు పోడనీ, వాళ్లకేసి కన్నెత్తి అయినా చూడడనీ, కుక్కలంటే అసలు ఇష్టంలేదనీ అతడి ఇరుగు పొరుగు వారందరూ అంటారు. ''అదీ మంచిదే'' అంటారు పల్లె

టూరి రైతులు వాళ్లల్లో వారు మాట్లాడుకునేటప్పుడు, "ఆడం గులతో నిమిత్తం లేకుండానే అతడు కాలం వెళ్లబుచ్చుకో గల్గినప్పుడు, అతడికి మరీ మంచిది; ఇక కుక్క విషయమా — అతడికి కుక్క ఎందుకు? అతడు తన ఇంటికి పీటవేసి పిల్చినారాడు దొంగాడు!" అంటారు.

ఆ మూగవాని ప్రచండ బలానికి అంత ప్రఖ్యాతి!



“ఇది మంచి, ఇది చెడ్డ అని మనిషి తనంతట తాను నిర్ణయించ లేడనీ, అంతా నిర్ణయించేది పరిసరాలేననీ, పరిసరాల చెప్పుచేతల్లో వున్న కీలుబొమ్మ తప్ప మనిషి మరొకటి కాదనీ మీరు అంటారు కదూ. నేను మాత్రం అంతా ఘటనాఫలితం అంటాను నేను. నా కథే తీసుకోండి...”

అలా అన్నాడు మా మిత్రుడు ఇవాన్ వసీలియెవిచ్, మనుషుల్లో మార్పు తీసుకువచ్చే ముందు మనుషులు జీవించే పరిస్థులలో మార్పు

తీసుకురావడం అవసరమనే విషయం గురించి మేము జరుపుతూన్న చర్చను ముగిస్తూనూ. అతనంటే మాకందరకూ అమిత గౌరవం. మంచి చెడ్డలను మనిషి తనంతట తాను నిర్ణయించలేడని, నిజానికి మేమెవ్వరమూ అనలేదు; అయితేనేమి, చర్చ కారణంగా తన మనస్సులో మెదలే ఆలోచనలకు తానే సమాధానం చెప్పడమూ, ఈ ఆలోచనలు తన స్మృతిపథంలోకి తీసుకువచ్చి నిలబెట్టిన తన జీవితకథలోని ఘటనలను మాకు వివరించడమూ ఇవాన్ వసీలియెవిచ్‌కి అలవాటే. తాను చెబుతూన్న కథాధోరణిలో అతడెంతగా పడిపోయేవాడంటే — అందులోనూ ముఖ్యంగా అతడు తీవ్ర ఉద్వేగంతోనూ, అతి మనః పూర్వకంగానూ చెప్పేవాడేమో — ఆ కథ తాను ఎందుకు చెబుతూన్నదీ ఆ కారణం సహితమూ అతడు తరుచు మరచిపోయేవాడు.

ఈసారి కూడా సరిగా అలాగే అయింది.

"నాగురించి మాత్రం నేను నిస్సంశయంగా చెప్పగలను. నాజీవితం అంతా కూడా ఒక్క ఘటనవల్లనే మారిపోయింది గాని, పరిస్థితులవల్లనూ కాదు, మరిదేనివల్లనూ కాదు."

"ఏమిటా ఘటన?" అని మేము అడిగాం.

"అదొక పెద్ద భారతంలెండి. అది మీకు సరిగా అర్థం అవాలంటే, చాలా చెప్పాల్సొస్తుంది."

"అలాగే చెప్పండి."

ఇవాన్ వసీలియెవిచ్ ఒక్క క్షణం ఆలోచించి తల పంకించాడు.

"సరే. ఆ ఒక్క రాత్రి, నిజంగా చెప్పాల్సొస్తే, ఆ తెల్లవారుజాము నా జీవితాన్నంతనీ మార్చి పారేసింది" అన్నాడు.

"ఏమి జరిగింది కదా?"

"ఏమి జరిగిందంటే — నేను వొళ్లెరగకుండా ప్రేమలో పడిపోయాను. అదివరకు అనేకసార్లు నేను ప్రేమించా ననుకోండి. అయినా ఇంత ప్రగాఢంగా నేనెప్పుడూ ప్రేమించి ఎరగను. ఇది జరిగి ఎన్నో సంవత్సరాలైంది; ఆ అమ్మాయి కూతుళ్లందరికీ ఇప్పుడు పెళ్లిళ్లయిపోయాయి. ఆమె పేరు బి— వారెంక బి—," అంటూ ఇవాన్ వసీలియెవిచ్ ఆమె ఇంటిపేరు చెప్పాడు. "ఏభైయ్యేళ్ల వయస్సులో కూడా ఆమెది అద్భుతమైన సౌందర్యమే; ఇక ఆమె యవ్వనంలో, పద్దెనిమిదేళ్ల ప్రాయమప్పుడు ఆమె అందాన్ని చూస్తే కళ్లు తిరిగిపోయేవి: పొడుగ్గా, సన్నంగా, వొయ్యారంగా — ఆముఖంలో రాజతేజస్సే! ఎల్లప్పుడూ నిటారుగా నిలబడేది — వంగడమంటేనే ఆమెకు అసలు చేతకాదేమో అన్నట్టుగా — ఎక్కడా రవంతైనా వంగకుండా — ఒక్కరవ్వ శిరస్సు వెనుకకు వాల్చి — మసిలేది. ఆ వర్చస్సుకు తగిన అందమూ పొడుగూ తోడయేసరికి — ఎముకలు పైకొస్తూ కొద్దిగా చీపురుపుల్లలా అవుపడినప్పటికీ కూడా — మనిషిని చూసేసరికి భయమే వేసేది, ఆ విగ్రహం నుండి ఉట్టిపడుతూన్న కరుణారసమూ, నిరంతరమూ మందహాసం చేస్తూండే ఆ వదనమూ, అద్భుతంగా దేదీప్యమానంగా వెలిగిపోతూన్న ఆ కళ్ళూ, యవ్వనాన్ని పుణికి పుచ్చుకున్న ఆమె మూర్తీ, వీటి వల్లనే గాని — లేకుంటే ఆ మహారాణి ఠీవి చూసి భయసంభ్రమాలు పుట్టుకొచ్చేవి."

"మరీ గాఢమైన రంగులతో చిత్రిస్తున్నాడే ఇవాన్ వసీలియెవిచ్!"

"ఇంత గాఢమైన రంగులే కాదుకదా, ఇంతకంటెనూ గాఢమైన రంగులతోనే ఆమెను చిత్రించాలన్న మాట, ఆమె నిజంగా ఎంత అందంగా

వుందో మీరు గ్రహించాలంటే! సరే, ఆమె అందం మాట అలా వుంచండి; నేనిప్పుడు చెప్పబోయే కథ 1840లలో జరిగింది.

"ఆ రోజుల్లో నేను ఒక రాజధాన్యేతర విశ్వవిద్యాలయంలో చదువు కుంటూండేవాడిని. ఏది మంచిదో ఏది మంచిదికాదో నాకు తెల్లియదుగాని, మా రోజుల్లో మా విశ్వవిద్యాలయంలో మేము ఏ సమితులూ సమాజాలూ ఎరగం, ఏ సిద్ధాంతాలూ రాద్ధాంతాలూ ఎరగం; ఎంతసేపూ యువకులం మేము ఆడుతూ పాడుతూ హాయిగా యువకుల్లా కాలం గడపేవాళ్ళం – చదువూ చదువుకునేవాళ్ళం, రంగుగా తిరగనూ తిరిగేవాళ్ళం. నేనెల్లప్పుడూ అమిత ఉల్లాసంగానూ అతి నీటుగానూ తయారయేవాడిని; అసలే కుర్ర తనం, ఇక దానికి సాయం కుప్పతిప్పలుగా వుండేది డబ్బు. నాదగ్గర మంచి చురుకైన తేజి వుండేది, గొప్ప ఇంటి అమ్మాయిలను స్లెయ్‌మీద కూచో పెట్టుకుని కొండమీదనుండి కిందకి జారేవాణ్ణి. (స్కేటింగు అప్పటికింకా ఫాషన్‌లోకి రాలేదు). స్నేహితులందరం కలిసి జల్సా చేసుకునేవాళ్ళం (ఆ రోజుల్లో మేం షాంపేన్ తప్ప మరొకదానివ్మీద వేలైనా వేసేవాళ్ళం కాం; జేబులో డబ్బు నిండుకుంటే, అసలు తాగడమే మానుకునేవాళ్ళం, అంతేగాని, ఈకాలం వాళ్ళ వొడ్కా తాగినట్టు కాకుండా, వొడ్కాకీ మాకు సగం ఎరుక). నాకన్నిటికంటే హెచ్చు సరదా – విందులకీ డాన్సింగు పార్టీ లకీ వెళ్ళడం. నేను బాగా డాన్సు చేసేవాడిని, ఏమంత కురూపిని కాదు కూడానూ."

"ఓస్సి! మరీ అంత నమ్రత వద్దయ్యా, బాబూ!" అన్నాడు అక్కడ చేరిన స్నేహితులలో ఒకతను. "ఆ రోజుల్లో మీరు తీయించుకున్న ఫోటోగ్రాఫు ఒకటి మేం చూడలే దనుకుంటున్నారేమో, మేం

చూశాంలెండి. అందుచేత అంత బిడియం వద్దు. మీది సాక్షాత్తూ మన్మధస్వరూపమే!''

''అయితే అయుండొచ్చేమో, దానికేంలెండి; నేను చెప్పదల్చుకున్నది అదికాదు. నేను చెప్పదల్చుకున్న దేమిటంటే, ఇక నేనా మోహంలో పడిపోయి, ఆ మోహం అత్యుచ్చదశలో వున్న రోజుల్లో ఒకనాడు, ష్రోవ్ టైడ్ పండగ ఆఖరి రోజున కులీనవర్గపు ప్రధానాధికారి — యోగ్యుడూ వృద్ధుడూ, విందులు చేయడమంటే ఇంతా అంతా సరదాకాదు ఆయ నకి, దానికి తోడు భాగ్యవంతుడు, చక్రవర్తిగారి ఆంతరంగిక పరివారం మనిషి — గొప్ప విందు చేశాడు. ఆయనలాగే మంచి కలుపుగోలు మనిషి ఆయన భార్య ఆయన పక్కనే నిలబడి అతిథులకు స్వాగతం చెబుతూంది. జేగురురంగు ముఖమల్ గౌను తొడుక్కొని, తలలో వజ్రాల తురాయి పెట్టు కుంది, బొద్దుగా తెల్లగా వార్ధక్యాన్ని సూచిస్తూన్న భుజాలూ, వక్షమూ చక్రవర్తిని ఎలిజవేత పెత్రోవ్న బొమ్మల్లో వున్నట్టుగా వివస్త్రంగానే వున్నాయి. అద్భుతంగా వుంది విందు: పాటకులమేళానికై నిర్మించబడిన బాల్కనీ వున్న డాన్సు మందిరం బహు రమణీయంగా వుంది; సంగీత ప్రియుడైన ఒకానొక భూస్వామి ఆస్థానంలో వుంటూండిన బానిసరైతుల గాయకబృందం భేషుగ్గా వుంది; కుప్పతిప్పలుగా వున్నాయి భక్ష్యాలు, పొంగు మీద వున్న ఏరులా ప్రవహించింది షాంపేను. షాంపేనంటే చెవికోసు కుంటాను నేను, అటువంటిది ఆనాడు నేను షాంపేన్ ముట్టుకోలేదు; అందుకు కారణం, ఏ మద్యమూ అవసరం లేకుండానే మోహంతోనే నేను పరవశుడనై వున్నాను. అయితేనేం, ఇక అలసిపోయి, ఉఫ్ మని వూదితే కింద పడిపోయే వరకూ — క్వాడ్రిల్లులూ, వాల్జులూ, పోల్కాలూ ఒకటేమిటి

సమస్తమూనూ — అలా డాన్సు చేస్తునే వున్నాను; వాటిలో వీలైనంత వరకూ అన్నిటినీ వారెంకతో కలిసే డాన్సు చేశానని ఇక నేను వేరే చెప్పనవసరమే లేదనుకోండి, మీరూహించి వుంటారాసంగతి. ఆమె తెల్లగౌను వేసుకుని, రోజారంగు పటకా పెట్టుకుని, సన్నంగా కొనతేలిన మోచేతుల వరకూ బొటాబొటీగా వస్తూన్న తెల్లని మేకతోలు గ్లౌవ్స్ వేసుకుని, తెల్లని ముఖమల్ పట్టు చెప్పుజోళ్లు తొడుక్కుంది. మొదటి మజూర్కా డాన్సు నాకు దొరికిందికాదు. ఆమె బాల్‌రూములో అడుగు పెట్టీ పెట్టడంతోనే, ఆమెకోసం కాచుకొని కూచున్న నాస్పర్థాళువు, ఇంజినీరు అనీసిమొవ్ మొదటి మజూర్కాడాన్సు తనతో చేయమని ఆమెను ఆహ్వానించేసరికి ఆ అవకాశం నాకు దక్కకుండా చేసేశాడు. నేనేమో గ్లౌవ్స్ కొనుక్కుందామని హెయిర్‌డ్రెస్సర్ వద్దకు వెళ్లడంలో నాకు ఆలస్యమైపోయింది. అందుకు అనీసిమొవ్‌ను క్షమించడం నాటికీ నేటికీ మరెన్నటికీ కూడా నా తరంగాదు. ఆమెతో డాన్సు చేయాల్సిన ఆ మజూర్కా మరొక అమ్మాయితో — ఆమె జర్మన్ అమ్మాయి లెండి, అంతకు ముందు కొన్నాళ్ల పాటు ఆమెవెంట నేను వెర్రిగా తిరిగాననుకోండి — డాన్సు చేశాను మరి, ఏం జేయను? మొట్టమొదటి డాన్సు ఆ జర్మన్ అమ్మాయితో చేశానేగాని, పాపం ఆ సాయంకాలమంతా ఆమె గురించి నేను పిసరంతైనా మరి పట్టించుకో లేదు, ఆమెతో మాట్లాడనైనా మాట్లాడలేదు సరికదా ఆమెకేసి చూడనైనా చూడలేదు — నా కళ్లన్నీ సన్నంగా పొడుగ్గా కోమలంగా, తెల్లని గౌను వేసుకుని, రోజారంగు పటకా పెట్టుకుని, చిన్న లొత్తపడిన చెక్కిళ్లుండి ఉజ్వలంగా మెరుస్తూ, ఎర్రగా జేవురించి వున్న ఆ ముఖానికే, ప్రేమాతిశయంతో దయారసంతో తొణికిసలాడుతూన్న చూపులతో ప్రకాశి

స్తూన్న ఆ ముఖానికే అప్పగించేశాను. నా ఒక్కడి చూపులే కాదు ఆమెపై లగ్నమై వున్నది, ఆమెకేసి చూడనివారూ, ఆమె అందాన్ని మెచ్చుకోని వారూ — పురుషులు ఒక్కరే కాదు, సౌందర్యంలో తమను మించిపోతూన్న ప్పటికీ స్త్రీలు సహితమూ — అక్కడున్నవారిలో ఒక్కరు కూడా లేరు. ఆమెను చూసి మెచ్చుకొనకుండా వుండడం ఎవరి తరం గనుక!.

''నాట్యశాస్త్ర రీత్యా, ఆ మజూర్కా డాన్సులో నేనామె జత కాక పోయినప్పటికీ, వాస్తవానికి ఆ మజూర్కా — సాంతమూ కాకపోయినా అధిక భాగం — నేనే ఆమెతో డాన్సు చేశాను. రవంతైనా తటపటాయించకుండా, నాట్యమందిరం ఈ కొసనుండి ఆ కొసకి డాన్సు చేసుకుంటూ నేనున్న స్థలానికి ఆమె వచ్చేసరికి, ఆమె ఆహ్వానించనప్పటికీ కూడా, చెంగున నేను ఆమెను సమీపించే సరికి, ఆమె మనస్సులో వున్న కోర్కెను నేను గ్రహించి నందుకు కృతజ్ఞతా సూచకంగా ఆమె మందహాసం చేసింది. డాన్సులో మేము ఆమెను సమీపించాల్సి వచ్చినప్పుడు, ఆమె నా మనస్సులో నేనను కున్న సాంకేతిక పదాన్ని గ్రహించలేకపోయి, సన్నంగా వున్న తన బుజాలు కొద్దిగా ఎగరేసి, తన చేతిని ఇంకొకరికి అందిచ్చి, తన అనుతాపాన్నీ సాను భూతినీ సూచించేందుకు చిరునవ్వు నవ్వింది.

''మజూర్కా డాన్సులో అడుగులు వాల్జ్‌లోకి మారగానే, ఆమెతో కలిసి నేను చాలా సేపువరకూ డాన్సు చేశాను. అప్పుడామె రోజుకుంటూ రొప్పు కుంటూ ఎంతో సంతోషంతో చిరునవ్వు నవ్వి, మెల్లగా చెవిలో 'encore'*

---

*ఫ్రెంచి భాషలో: ''మరొక సారి'' — అనువాదకుడు.

అంది. ఇకదానితో నేను ఆమెతో ఒకసారి కాదు, రెండు సార్లు కాదు, లెక్క లేనన్ని సార్లు డాన్సు చేశాను. ఆలా ఆమెతో డాన్సు చేస్తూంటే, నాకొక శరీరం అంటూ ఉన్నట్టే అనిపించలేదు.''

''శరీరం ఉన్నట్టే అనిపించలేదట! ఏమ్మాటలయ్యా? ఆమె నడుము పట్టుకున్నప్పుడు, మీకొక శరీరం వున్నట్టూ, ఆమెకు కూడా ఒక శరీరం వున్నట్టూ తప్పకుండా అనిపించే వుంటుంది!'' అన్నాడు అక్కడున్న అతిథులలో ఒకతడు.

ఆ మాటలు విని ఇవాన్ వసీలియెవిచ్ ముఖం ఎర్రబారి, కొంచెం కోపంగానే పెద్దగా అన్నాడు:

''అవును, ఈకాలపు యువకులకు తప్పకుండా అలాగే అనిపిస్తుంది. అవునయ్యా, శరీరంతప్ప ఇంకొకటి మీ కంటికి అవుపించదే మరి! మా రోజుల్లో అలాక్కాదు. ఒక అమ్మాయిని నేను ఎంత అధికంగా ప్రేమించుతే అంత అశరీరంగా కనబడేది ఆమె నాకు. ఈనాడు మీకు కాళ్లూ, చీల మండలూ, ఇంకా ఇతరములూ — ఇవే కనబడుతాయి. మీరు ప్రేమించే స్త్రీలను వివస్త్రలను చేస్తేనేగాని మీకు ఉండబట్టదు. నాకు అలా కాదు. ఆల్ఫాన్సే కార్ చెప్పినట్టు — అతనేమంత తక్కువ రచయిత కాదు కూడానూ — నేను ప్రేమించిన స్త్రీ ధరించినవి కంచు వస్త్రాలు. వివస్త్రలను చేసే బదులు, నోవా సుపుత్రునివలె, నగ్నశరీరాన్ని మరుగు పరచడానికే మేం ప్రయత్నించే వాళ్లం. ఈకాలపు వాళ్లకు మీకు ఇదంతా బోధపడదు లెండి...''

''అతని మాటలకేంగాని, కథ కానిద్దురూ. తరువాత ఏమైంది?'' అని అడిగాడు మరొకతను.

"తరువాతా? తరువాత చాలాసేపు నేను డాన్సు చేశాను, ముఖ్యంగా ఆమెతోనే — ఆ డాన్సు చేయడంలో ఎంత వేళైందో ఎన్ని గంటలు కొట్టారో చూసుకోకుండా అలా డాన్సు చేస్తూనే వున్నాను. ఆ వాద్యగాళ్లు అలసిపోయి నిస్త్రాణ పడిపోతూనే — విందు ఆఖరు అవుతూన్నప్పుడు ఎలా వుంటుందో మీకు తెలుసుగా — విధివిరామమంటూ లేకుండా మజూర్కా అలా వాయిస్తూనే వున్నారు; డ్రాయింగు రూములో మాతాపితలందరూ చీట్ల పేకాట బల్లలనుండిలేచి 'సప్పర్' కోసం ఎదురుచూస్తూ ఒక్కొక్కరే తాపీగా తయారవుతున్నారు. వడ్డన నౌకర్లందరూ ఇవీ అవీ పట్టుకుని హడావుడి పడుతూ ఇటూ అటూ పరుగెడుతున్నారు. మూడు గంటలు కావస్తూంది. ఇక ఆ వున్న కొద్ది గడియలు కూడా ఉపయోగించుకోకుండా వదలిపెట్టేయడ మేమని చెప్పి, మరొకమాటు ఆమెను డాన్సుకు ఆహ్వానించి, నాట్యమందిరం ఈ చివరనుండి ఆ చివర వరకూ నూరో సారి ఆమెతో డాన్సు చేశాను.

" 'సప్పర్' అయాక మీతో క్వాడ్రిల్ డాన్సు చేసే అవకాశం నాకిప్పిస్తారు కదూ?" అని ఆమెను అడిగాను, మజూర్కా పూర్తి అయిన తరువాత ఆమెను ఆమె స్థలానికి తీసుకు వెళ్తూ.

" 'తప్పకుండా, ఆలోపుగా మా నాన్నగారు నన్ను ఇంటికి తీసుకు వెళ్లిపోకుండా వుంటేనూ' అంది ఆమె నవ్వుతూనూ.

" 'నేను తీసుకువెళ్లనిస్తే కద!' అన్నాను నేను.

" 'నా విసనకర్ర ఇలా అందివ్వండి' అని అడిగిందామె.

" 'మీకు దానిని తిరిగి ఇచ్చివేయడానికి నా మనస్సు ఒప్పడంలేదు'

అన్నాను నేను, ఆమె తెల్లని చౌకరకం విసనకర్రను ఆమెకు తిరిగి ఇచ్చేస్తూ.

" 'మీకంత మనస్సు ఒప్పకపోతే, ఇదిగో ఇది పుచ్చుకోండి' అంటూ ఆ విసనకర్రలో వున్న తూలిక నొకదానిని పైకితీసి నాకిచ్చింది.

"ఆ తూలిక నందుకొని నా మహదానందాన్నీ కృతజ్ఞతనూ కేవలం నా చూపుల్లోనే తెలియజేయగల్గాను. సంతోషమూ సంతుష్టి — ఈ రెండింటితోనూ నా మనస్సు నిండిపోవడమే కాకుండా, సంబరంతో పొంగి పొరలిపోతూ, జన్మం తరించినట్టే అనిపించింది నాకు. నాలో సర్వమాన వాళి పట్ల కరుణారసం పుట్టుకొచ్చి, నేనొక నూతనజన్మ ఎత్తినట్టూ, నేనీ ప్రపంచంలోని మనిషినే కానట్టూ, చెడుపూ అపకారమూ అంటే ఏమిటో నేను ఎరగనే ఎరగనట్టూ, ఎంతసేపూ మంచి తలచడమే ఉపకారం చేయడమే నేను ఎరిగినట్టూ నాకనిపించింది.

"ఆ తూలికను నా గ్లౌవ్‌లో దోపేసుకుని, ఆమె దగ్గరనుండి కదల డానికి నాకు శక్తిలేక అలా అక్కడే నిలబడిపోయాను.

" 'అదిగో అలా చూడండి, నాన్నగారిని డాన్సు చేయమని ఎలా బల వంత పెడుతున్నారో' అందామె నాతో, కర్నలు హోదాను సూచించే వెండి భుజకీర్తులు పెట్టుకుని, పొడుగ్గా, మంచి ఠీవిగా హాలు గుమ్మంలో నిల బడి ఆ ఇంటి యిల్లాలితోనూ మరికొందరు స్త్రీలతోనూ బాతాఖానీ కొడు తూన్న తన తండ్రిని చూపించుతూ.

" 'వారెంక, ఇలా రామ్మా!' అని వజ్రాల తురాయి పెట్టుకున్న ఆ ఇంటి యిల్లాలు ఆమెను పిలిచింది.

“వారెంక గుమ్మంవైపు వెళ్ళింది. నేనూ ఆమెవెంట వెళ్ళాను.

“ ‘ఇదిగో చూడమ్మా, నీతో డాన్సు చేయమని మా నాన్నగారిని ఒప్పించుదూ, ma chére!* ఇక కానివ్వండి ప్యోత్ర్ వ్లడిస్లావిచ్!’ అంది ఆ ఇంటి యిల్లాలు కర్నల్‌తో.

“వారెంక తండ్రి మంచి పొడగరి, సుస్ఫురద్రూపి, ఠీవిగా వుంటాడు, ముసలివాడైనా యవ్వనంలో వున్నట్టే అవుపడతాడు. గీసిన కందగడ్డలా ఎర్రని ముఖం, మొదటి నికోలస్‌లా కొమ్ములు తిరిగిన గరిమీసాలు, ఆ మీసాలతో కలిసిపోతూన్న తెల్లని బుగ్గమీసాలు, కణతలమీద పడేటట్టుగా దువ్వుకున్న జుట్టు. అతడు నవ్వినప్పుడు కూడా, అచ్చంగా అతని కుమార్తె నవ్వినట్టే, కళ్ళు మెరసి, పెదవులపై ఆ మందహాసమే తాండవించేది. మనిషి పహిల్వాన్‌లా వుంటాడు; కండలు తిరిగిన వెడల్పాటి మిలిటరీ ఛాతి, ఆ ఛాతిమీద తగుమాత్రంగా ప్రదర్శించబడిన మిలిటరీ అలంకరణాలు; బలీయమైన భుజస్కంధాలు, నిడుపుగా తీరుగావున్న కాళ్ళు. అతనిదంతా నికోలస్ పంథాలో తర్ఫీదైన పాతకాలపు మిలిటరీ ఆఫీసరు రకం.

“మేము గుమ్మం దగ్గరకు వెళ్ళేసరికి, తాను డాన్స్ చేసి ఏకాలమో అయిందనీ, ఇప్పుడు అదంతా తాను మరచిపోయాననీ అంటూ కర్నల్ తన అనిష్టాన్ని సూచించుతున్నాడు. ఆలా సూచించాడే గాని, చిరునవ్వు నవ్వుతూ, తన చేతిని నడుము దగ్గరకు పోనిచ్చి, తన పట్టాకత్తిని ఒరలోనుండి తీసి, ఆయననుండి మెహర్బానీపొందడానికి తయారుగా ఆ పక్కనే నిలబడున్న యువకుడికి దానినిచ్చి, కుడిచేతికి తెల్లని షామోయ్

---

* ఫ్రెంచి భాషలో ప్రేమ సూచకమగు సంబోధన — అనువాదకుడు.

గ్లోవ్ తొడుక్కుని – 'ఏపని చేసినా అంతా సరిగ్గా యథావిధిగా చెయ్యాలి,' అన్నాడాయన నవ్వుతూనూ – తన కూతురి చేయి పట్టుకుని, పరిభ్రమణంలో నాల్గవ అడుగువేసి, డాన్సు ప్రారంభించేందుకు లయ అందుకందుకని సిద్ధంగా నిలబడ్డాడు.

"వాద్యసంగీతంలో మజూర్కా స్వరకల్పన మొదలుకాగానే, అతడు ఒక కాలు నేలను కొట్టి, రెండవకాలు గిర్రున తిప్పి, అంతటి ఆజానుబాహువూ ఒక కాలితో రెండవ కాలును తట్టుతూ, లయ ప్రకారం అడుగులు వేస్తూ, తుపాను మాదిరిగా హాలుచుట్టూ నాట్యం చేయడం ప్రారంభించాడు. ఒయ్యారం ఒలుకుతూన్న విగ్రహం గాలిలో తేలిపోతూందేమో అన్నట్టు వారెంక ఆయనతో కూడా కంటికి అగపడకుండా మెరుపులా, ఎక్కడా ఏమాత్రమూ లయతప్పకుండా, ఆయన అడుగులతో సమంగా తెల్లని ముఖమల్ పట్టుజోళ్లు ధరించిన పాదాలతో, ఈ క్షణం పెద్ద అడుగు వేస్తూ, రెండవ క్షణం చిన్న అడుగు వేస్తూ హలు చుట్టూ నాట్యంచేసింది.

"హాలులో వున్నవారందరూ ఆ జంట ప్రతీ చలనాన్నీ గమనిస్తూ అలా నిలబడిపోయారు. వారందరి లాగానే నేనూ నిలబడి వారినిద్దరనూ చూస్తూన్నానేగాని, నా మనస్సులో వున్నది కేవలం మెప్పుకోలే కాదు, ఆనందపరవశంతో మైమరచిన అనుభూతిని చవులూర రుచిచూచాను. కర్నల్ తొడుగుకున్న బూడ్సు జోళ్లను చూసి నా మనస్సు చివుక్కుమంది. అవి మేలు రకం దూడ చర్మంతో కుట్టినవే అయినప్పటికీ, అవి మడమలులేని రకం, అంతేకాకుండా, వాటి మునివేళ్ల మొనలు ఫాషనబుల్‌గా కొనతేలి వుండడం

బదులు, మొద్దుగా వున్నాయి. అవి పటాలపు గోడారివాడు తయారుచేసిన సరుకని వాటి ముఖంమీదే రాసి వుంది. తన ముద్దుకూతురికి ఏ లోపమూ లేకుండా ఆమె చక్కని దుస్తులు వేసుకొని తానామెను ఘరానా శ్రేణిలో తిప్పేందుకని తాను ఫాషనబుల్ బూడ్సు కొనుక్కోవడం బదులు, పాపం అతడు మామూలు నాటు బూడ్సుజోళ్లే కుట్టించుకుని కాలక్షేపం చేస్తున్నాడే, అని నేనూహించుకుని ఆయన వేసుకొన్న ఆ మొద్దు బూడ్సు జోళ్లను చూసి నా మనస్సు మరింతగా కరిగిపోయింది. వెనుకటి రోజులలో ఆయన చక్కగా డాన్సు చేసేవాడన్న సంగతి ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది; కాని ఆయనది దృఢకాయం అవడం చేతనూ, ఆయన వార్ధక్యంలో వుండడం కారణంగానూ అడుగులు భారంగా పడుతూ, తాను ప్రయత్నించిన అన్ని నాజూకు మెలుకువలకూ భంగిమలకూ తగినంత చురుకుగా ఆయన కాళ్లు లాఘవంగా సాగడంలేదిప్పుడు. అయినప్పటికీ చక్కగానే రెండుసార్లు హాలు చుట్టూ నాట్యం చేసి, చటుక్కున రెండు కాళ్లూ నేలపై చాపి, తిరిగి లేచి, రెండుకాళ్ల మడమలు ఒకదానితో ఒకటి టక్కుమని చరిచి, తటాలున, రవంత అవకరంగానే వున్నప్పటికీ, ఒంటికాలుపై మోకరించే సరికి, ఆయన కాళ్లలో పడిన గౌనును ఆమె సరిచేసుకుని, చిరునవ్వు నవ్వి, ఆయన చూట్టూ ఒకసారి తిరిగి, ఆకాశంలో మేఘం తేలిపోతూన్నట్టు అతి వొయ్యారంగా నాట్యం చేసేసరికి అందరూ హర్షధ్వానాలు చేశారు. ఈలోపున మోకరించినవాడల్లా ఆయన మళ్లీ లేచి నిలబడి ఎంతో వాత్స ల్యంతో తన కుమార్తె శిరస్సును రెండు చేతులతోనూ పట్టుకుని నుదిటిపై ముద్దుపెట్టుకుని, ఆమెను నేను నిలబడి వున్న చోటకు తీసుకువచ్చి,

డాన్సులో నేనే ఆమె జత అని ఆయన భావించి, ఆమెతో డ్యాన్సు చేయమని ఆమె చేయి నాకు అందివ్వబోయాడు. డాన్సులో నేనామె జత కావని నేను చెప్పాను.

" 'అయితే నేమి? మరేమీ ఫరవా లేదు, మీరామెతో డాన్సు చెయ్యవచ్చు!' అన్నాడాయన, ఆప్యాయంగా చిరునవ్వు నవ్వి, తన పట్టాకత్తిని తిరిగి ఒరలో దోపుకుంటూనూ.

"సీసాలోని ద్రావకాన్ని గిన్నెలో పోసినప్పుడు మొట్టమొదట ఒక్క చుక్కే సీసాలోనుండి పడుతూ, ఆ చుక్క తన వెనువెంటే కడమ ద్రావకాన్నంతనూ ఏవిధంగానైతే ఒక ధారగా బయటకు తోడ్కొని వెడలుతుందో, ఆవిధంగా వారెంక యెడల నాకున్న ప్రేమ, నా హృదయాంతరాళంలో వున్న ప్రేమనంతనూ కట్లు తెంచుకుని ప్రవహించేటట్లు చేసింది. ఆ సమయంలో నాలో వున్న ప్రేమ అంతటితోనూ సర్వప్రపంచాన్నీ నేను నా హృదయానికి హత్తుకున్నాను. మాకు ఆతిథ్యమిస్తూండినట్టి వజ్రాల కిరీటం పెట్టుకున్న ఆ ఇంటి యిల్లాలినీ, ఆమె పెనిమిటినీ, ఆమె అతిథులనూ, ఆమె భృత్యువర్గాన్నీ, చివరకు, నేనంటే మండిపడిపోతూ తన క్రోధాన్ని పైకి ప్రత్యక్షంగానే కనబరుస్తూన్న ఆ అనీసిమొవ్‌ను సహితమూ — అందరనూ ఆ నిమిషంలో నేను మనోవాక్కాయకర్మలా ప్రేమించాను. ఆమె చిరునవ్వు నవ్వితే ఎంత ముచ్చటగా వుంటుందో అచ్చంగా ఆవిధంగానే చిరునవ్వు నవ్వేటట్టి ఆ మొద్దు మొనల బూడ్సుజోళ్లు తొడుగుకొన్న ఆమె తండ్రి యెడల — చెప్పేదేముంది, ప్రేమాతిశయంతో నా నిండు హృదయాన్నే అయనకు అంకితం మిచ్చేశాను!

—

ఆ మజూర్కా ఆఖరైపోయింది. అతిథిసతీపతులు మమ్మలినందరినీ 'సప్పర్'కు ఆహ్వానించారు. కాని కర్నల్ బి-- మాత్రం, ఉదయమే తనకు తొందరు పనులున్నాయనీ, అందుచేత తాను 'సప్పర్' వరకూ ఉండ వీలు లేదనీ అన్నాడు. వారెంకను తండ్రి తనతో కూడా తీసుకు వెళ్లిపోతాడెమో నని నేను భయపడ్డాను గాని, ఆమె తల్లితో కూడా 'సప్పర్'కు వుండి పోయింది.

''సప్పర్ అయాక ఆమె అంతకు ముందు వాగ్దానం చేసినట్లుగా ఆమెతో కలిసి నేను క్వాడ్రిల్ డాన్సు చేశాను. నా హృదయకలశ మంతా ప్రేమతో నిండిపోయున్నప్పటికీ, ఆ ప్రేమ ఇంకా పెరిగి ఇంకా ఆలా అధిక మవుతూనే వుంది. మేము అదీ ఇదీ మాట్లాడుకున్నామేగాని ప్రేమ వూసే ఎత్తలేదు. నన్నామె ప్రేమిస్తూందా అని నేను ఆమెను అడగనే లేదు సరి కదా, నాలో నేనైనా ఆ ప్రశ్నను వేసుకోలేదు. నేనామెను ప్రేమించడమే చాలు, అంతకంటె నాకిక కావలసినదేముంది ఈ ప్రపంచంలో, అని పించింది నాకు. స్వల్పఘటన ఏదో ఒకటి సంభవించి నా ఆనందానికి ఎక్కడ అంతరాయం కలుగుతుందో అనే భయం మాత్రం ఒకటి నన్ను పట్టు కొని వేధించ సాగింది.

''నేను ఇంటికి చేరుకుని బట్టలు మార్చుకుని, పడుకుందా మను కున్నాను; ఎలాగూ నిద్ర పట్టదు కదా అని నిశ్చయం చేసుకుని. ఆమె తన విసనకర్రనుండి తీసి ఇచ్చిన తూలికనూ, ఆమెనూ ఆమె తల్లినీ సాగనంపి వారిని వారి బగ్గీలో కూచోబెట్టి వారికి వీడ్కోలు చెప్పేటప్పుడు నాకు కానుకగా ఆమె ఇచ్చిన తన గ్లౌవ్స్‌లో ఒకదానినీ చేతబుచ్చుకుని, ఒక్క గడియ అయినా కళ్లు మూసుకోకుండా వాటిని తదేకంగా పరికించి, — తనతో నాట్యం

చేసినందుకు ఇద్దరి భాగస్థులలోనూ ఒకరిని ఎంచుకున్నప్పుడు, ఆమె నా మనస్సులోని సాంకేతిక పదాన్ని గ్రహించి, మధురస్వరంతో: 'గర్వం, కదూ?' అని అంటూ ఆనందంతో తన చేయి నాకు అందివ్వడమూ; 'సప్పర్' ఆర గించుతూన్నప్పుడు ఆమె షాంపేన్ చప్పరించుతూ తన గళాసు అంచుల మీదుగా ప్రేమవీక్షణాలను నాకేసి ప్రసరించడమూ, ఈ దృశ్యాలు నా కళ్లముందు ప్రత్యక్షమయాయి. కాని ఆమె తన తండ్రివెంట ఎంతో అంత వొయ్యారంతో మలయమారుతంలా తేలిపోతూ డాన్సు చేస్తూన్నప్పుడు, తన మట్టుకు తానే కాకుండా తన తండ్రి పక్షాన్ని కూడా సగర్వంగానూ ఉల్లాసకరంగానూ తమ మెప్పుకోలును వెలిబుచ్చుతూన్న ప్రేక్షకులను ఆమె తిలకించడమూ — ఈ దృశ్యమే నాకన్నిటికంటె ప్రియతమ మని పించింది. నా మనోవీథిలో ఈ దృశ్యాలన్నీ ప్రగాఢ కరుణారస భరితమైన అనుభూతితో ఐక్యమైపోయాయి.

"దివంగతుడైన నా సోదరుడూ నేనూ ఆ రోజుల్లో కలిసి వుండే వాళ్లం. విందులూ, పార్టీలూ ఆ వూసే పట్టించుకునేవాడుకాడు మా అన్న, అసలు ఘరానా సమాజంలో తిరగడమంటేనే గిట్టేదికాదతనికి. క్యాండి డేటు పట్టపరీక్ష ఇవ్వడానికి తయారవుతూ, ఎట్టి నెరసులూ ఎన్నడానికి వీలులేని జీవితం నెరపుతున్నాడు మా అన్న. నేను ఇల్లు చేరుకునేప్పటికి అతడు గాఢనిద్రలో వున్నాడు. మెత్తని తలగడలో శిరస్సు కూరుకుపోయి, బూర్నీసుతో సగం ముసుగు పెట్టుకుని వున్న అతని శిరస్సును చూసి, అతడు ఆనందమంటే ఏమిటో ఎరగనందుకూ, నా ఆనందంలో అతను పాలు పంచుకొననందుకూ నాకెంతో జాలివేసింది. నేను ఇంట్లో అడుగు పెట్ట

డంతోనే మా పరిచారకుడు పె(్రతూష కొవ్వొత్తి వెలిగించి, నేను బట్టలు మార్చుకునేటప్పుడు నాకు సాయం చేయడానికి నాదగ్గరకు వచ్చాడు, గాని అవసరం లేదని నేనతనితో చెప్పి, అతనిని పోయి పడుకోమన్నాను. పాపం అతని ని(్రదమత్తు ముఖాన్నీ, రేగిన జుట్టునూ చూచి నాకు కనికరమే వేసింది. మునివేళ్లమీద నడుస్తూ నా గదిలోకి వెళ్లిపోయి, మంచం మీద కూచున్నాను. నా హృదయమంతా ఆనందంతో నిండి పొరలి పోతూంది. ఇక ని(్రదకు అవకాశమే లేదు. గదిలో వేడిగా వున్నట్టనిపించి, ఇక యూనిఫారం కోటు తీసేయకుండానే, మెల్లగా హాల్లోకి వెళ్లి నా ఓవర్‌కోటు తొడుక్కొని, వీధిగుమ్మం తలుపు తీసుకొని వీధిలోకి వెళ్లాను.

విందునుండి ఇంటికి వచ్చేసరికి దగ్గరదగ్గర ఐదుగంటలైంది, ఇంటికొచ్చి రెండు గంటలు దాటుతూంది; నేను వీధిలోకి వెళ్లేసరికి అప్పుడే తెల్లవారుతూంది. అది అచ్చంగా మార్చి నెల వాతావరణమే — పొగమంచు దట్టంగా కమ్మేసింది, రోడ్డుపైనున్న తడిమంచు కరుగుతూంది, ఇంటి కప్పుల మీదనుండి నీటిబొట్లు రాలుతున్నాయి. ఆ రోజుల్లో బి— కుటుంబం వూరికి ఆవలగా వున్న ఒక ఇంట్లో వుండేవారు. ఆ ఇంటికి ఇటువైపు కంచెలులేని పొలాల అంచులు తగిలి వున్నాయి. పొలాలకు ఇటువైపు ఆడపిల్లల కాలేజీ వుంది, అటువైపు షికారు వెళ్లేందుకు మైదానం వుంది. (ప్రశాంతంగా వున్న మా సందు దాటి పెద్దవీధిలోకి వెళ్లాను. వీధిలో జనం నడుస్తున్నారు. స్లెయ్‌బళ్ల నిండా కలప ఎక్కించుకుని, బళ్లు తోలుకు పోతున్న బళ్లవాళ్లు ఎదురుపడ్డారు. స్లెయ్‌బళ్ల కమాను క(్రలు రోడ్డు మీద పడి వున్న మంచులో దగబడి రోడ్డు చపటాను రాసుకుని సాగి

పోతున్నాయి. లక్కపూసిన జీనులకింద, లయవేస్తూన్నట్టుగా తలలు పైకెత్తుతూ దించుతూ నడుస్తున్నాయి స్లెయ్‌బళ్ల గుర్రాలు, నారపట్టాలను కప్పుకుని బ్రహ్మాండమైన బూడ్సులు తొడుక్కొని మంచు మయమై వున్న రొంపిలో అడుగుతీసి అడుగు వేసుకుంటూ తమ బళ్ల పక్కనే నడుస్తున్నారు బళ్లవాళ్లు. వీధికి ఇరుపక్కలా నిటారుగా నిలబడి, ఆ పొగమంచు తెరలో నుండి లీలగా కనబడుతూన్న ఇళ్లూ — ఇదంతా క్షూడా, ఈ సర్వమూ నాకెంతో ప్రియతమంగానూ భావగర్భితంగానూ అవుపడింది.

"వారి ఇంటిని అంటిపెట్టుకున్న పొలం దగ్గరకు నేను చేరుకునే సరికి, పొలానికి ఆవలి చివరనున్న షికారు మైదానం వైపు పెద్దగానూ నల్లగానూ ఏదో వున్నట్టు అవుపడింది నాకు. పిల్లనగ్రోవి సంగీతమూ భేరీ ధ్వనీ మైదానం నుండి వస్తూన్నట్టుగా వినబడింది. అంతవరకూ నా హృదయం ఆనందభరితమైన సంగీతాన్ని పాడుకుంటూంది; అప్పటప్పట మజూర్కా రాగాలాపన నా చెవిలో ప్రతిధ్వనిస్తూంది. కాని ఇప్పుడు నా చెవిని బడిన ఈ సంగీతం — ఇదేమిటో మరొక మోస్తరుగా, అతి కఠినంగా, భీతావహంగా వినవస్తూంది.

" 'ఇదేమిటిది?' అని నేను ఆశ్చర్యపడుతూ, ఆ పొలంలో అడ్డంగా జారుజారుగా వున్న బండిదారంట పడి ఆ సంగీతం వినవస్తూన్న దిశగా వెళ్లాను. డెబ్భై ఎనభై గజాలు వెళ్లేసరికి, జనం గుమికూడి వున్నట్టు ఆ పొగమంచులో నుండి అవుపడింది. మరి నాలుగడుగులు వేసే సరికి ఆ జనమంతా సాయుధ సైనికుల్లా కనబడ్డారు. కవాతు చేస్తున్నారు కాబోలు ననుకున్నాను. నూనె మరకలతో డాగులు కట్టిన ముందుగుడ్డ ఒకటి కట్టుకుని పెద్ద మూట ఒకటి మోసుకుంటూ ఆ దారివెంటే నడుస్తూన్న కమ్మ

రితో కలిసి వెళ్లాను. నల్లని యూనిఫారాలు తొడుక్కొని వున్న సైనికులు తమ ఎడమపక్కను తుపాకులు నిలబెట్టుకొని, ముఖాముఖీ రెండు వరుసలు బారలుతీర్చి స్తంభాల్లా చలనం లేకుండా నిలబడున్నారు. వారి వెనుక భేరీమోగించే కుర్రవాడొకడూ, ఇందాకలా నేను విన్న ఆ కీచుస్వరమే పిల్లనగ్రోవితో పదేపదే వాయించుతూన్న వాద్యగాడొకడూ నిలబడున్నారు.

" 'ఏమిటి చేస్తున్నారు ఆ సైనికులు?' అని నా పక్కను నిలబడి వున్న కమ్మరిని అడిగాను.

" 'పటాలం నుండి పరారైనందుకు తార్తారుని శిక్షిస్తున్నారు,' అని కమ్మరి కోపంతో జబాబు చెప్పాడు, ఆ సైనికుల వరుసల ఆవలి చివరకేసి చూస్తూ.

"నేను కూడా అటుకేసే చూడసాగాను. ఆ రెండు వరుసల సైనికుల మధ్యనుండీ ఘోరంగా కనబడుతూన్నట్టిది ఏదో ఒకటి నా దిశగా వస్తూండడం అవుపడింది. నడుము వరకూ నగ్నంగా వున్న మనిషి నొకనిని చేతులు రెండూ ఒక తుపాకి వెనుకకు విరిచికట్టి, ఆ తుపాకి చెరి ఒక కొననూ చెరి ఒక సైనికుడూ పట్టుకుని ఆ మనిషిని ముందుకు నెట్టుతూ నడిపిస్తున్నారు. పెద్ద ఓవర్‌కోటు తొడుక్కొని, గుడ్డటోపీ పెట్టుకుని పొడుగ్గా వున్న ఆఫీసరు ఒకడు ఆ మనిషి వెనువెంటనే పక్కగా నడుస్తున్నాడు. ఆ ఆఫీసరు ఎవడోగాని నేను ఎరిగిన మనిషిలాగే కనబడ్డాడు. ఆ మనిషి శరీరమంతా గజగజ వణకిపోతూ చుట్టుకుపోతూంది. సగంసగం కరుగుతూన్న మంచులో తుప్‌తుప్ మంటూ అడుగులు వేసుకుంటూ ముందుకు నడుస్తున్నాడా మనిషి. ఆలా నడుస్తూండగా, ఇటూ అటూ వరుసలు తీర్చి

నిలబడి వున్న సైనికులు ఆ మనిషిని కొరడాలతో గొడ్డును బాదుతూన్నట్టు బాదుతున్నారు. జడివానలో చినుకుల్లా పడుతున్నాయి కొరడా దెబ్బలు ఆ మనిషి వొంటి మీద. ఇటు పక్కనుండీ అటు పక్కనుండీ పడుతూన్న దెబ్బలు కాచుకుందుకు ఆ ఖైదీ ఇటూ అటూ వంగే సరికల్లా, అతడి చేతులు తుపాకికి విరిచికట్టి ముందుకు తోస్తూ అతడిని నడిపించుతూన్న సార్జెంట్లు ఇద్దరూ, దెబ్బలు అతడిపై బాగా పడేటట్టు అతడిని ఇటూ అటూ లాగుతున్నారు. దెబ్బల ధాటికి అతడు తూలిపోయి, కాళ్లు తొట్రుకునే సరికి, అతడు కింద పడిపోకుండా వెనుకనుండి అతడిని గుంజుతూ ముందుకు నెట్టుకుంటూ అతడిని నడిపించుతున్నారు ఆ సార్జెంట్లు ఇద్దరూనూ. ఆ మనిషి వెనువెంటనే అడుగు తప్పిపోకుండా దృఢంగా నిటారుగా ఠీవిగా నడుస్తున్నాడు ఆ ఆఫీసరు. ఎర్రని ముఖమూ, తెల్లగా నెరసిన మీసమూ బుగ్గమీసాలూ -- ఆ ఆఫీసరు మరెవ్వడూ కాదు ఆమె తండ్రే.

''దెబ్బ పడినప్పుడల్లా, దెబ్బ ఏ వరుసనుండి వస్తూందో ఆ వరుసకేసి పాపం ఆ ఖైదీ ఆశ్చర్యపడుతూన్నట్టుగా, బాధతో కొంకర్లతో నులి తిరిగిపోతూన్న తన ముఖం తిప్పి, తెల్లని పల్వరుసనుండి ఏవో మాటలు అలా పలుకుతూనే వున్నాడు. అతడు దూరంగా వుండడంచేత ఆ మాటలు నాకు మొదట సరిగా వినబడలేదు. కాని అతడు దగ్గరకు వచ్చేసరికి ఆ మాటలేమిటో నాకు స్పష్టంగా వినబడ్డాయి. పాపం, అవి మాటలుకావు, ఏడుపే. 'సోదరులారా, నామీద దయ చూపండి! సోదరులారా, నా మీద దయ చూపండి!' కాని ఆ సోదరులకి దయ వుంటేకద? వాళ్లకి దయ లేకపోయింది. ఆ ఖైదీ, అతని నెట్టుకుని వస్తూన్న ఇద్దరు సార్జెంట్లూ, పక్కను వెను

కనే నడుస్తూన్న ఆఫీసరూ — వీరందరూ సరిగా నా ఎదుటనుండి సాగి పోతూన్న క్షణంలో, ఆ వరుసలో నిలబడున్న సైనికుడొకడు దృఢంగా ఒక అడుగు ముందుకు వేసి, తన కొరడాతో ఆ తార్తారుని ఎంత జోరుగా కొట్టా డంటే, 'హుస్' మంటూన్న ఆ కొరడా శబ్దం స్పష్టంగా వినబడింది నాకు. ఆ దెబ్బకి ఆ తార్తారు మనిషి ముందుకు తూలిపోయాడు. కాని ఆ తూలిపోతూన్న మనిషిని పడిపోకుండా వెనుకనున్న సార్జెంట్లు చటుక్కున పైకి గుంజి నిలబెట్టించే సరికి, అటు వైపు వరుసనుండి మరో కొరడా దెబ్బ పడింది, మళ్లీ ఇటు వైపు వరుసనుండి మరొకటి, మళ్లీ అటువైపు వరుసనుండి మరొకటి, ఆ కొరడా దెబ్బలు అలా పడుతూనే వున్నాయి. కర్నల్ ఒకసారి తన పాదాలవైపు, ఒకసారి ఆ ఖైదీవైపు తన చూపు సారిస్తూ, దీర్ఘంగా ఊపిరి తీసి, బుగ్గలు బూరెలులా పొంగించి, బిగబట్టిన పెదవుల నుండి మెల్లగా గాలి వదలుతూ ఆ ఖైదీ వెనుకనే నడుస్తున్నాడు. నేను నిలబడి వున్న చోటకు ఎదురుగా ఆ ఊరేగింపు కదలీ కదలడంతో, సైనికుల వరుస సందునుండి ఆ ఖైదీ వీపు నాకు కనబడింది. వీపంతా తట్లు తేరిపోయి, చెమ్మగిలి పోయి, ఎర్రగా కమిలిపోయి, ఎంత ఘోరంగా వుందంటే, నిజంగా అదొక మనిషి శరీరమే అని నమ్మడానికే నాకు సాధ్యం కాకపోయింది.

" 'అయ్యో, భగవంతుడా!' అని గొణుగుకున్నాడు నాపక్కను నిల బడున్న కమ్మరి.

"ఆ జనశ్రేణి ముందుకు నడిచింది. బాధతో చుట్టుకొని పోతూ జోగిపోతూ కిందపడిపోతూన్న ఆ మనిషి మీద ఇరువైపులనుండి కొరడా దెబ్బలు అలా పడుతూనే వున్నాయి. భేరీ మోగుతూనే వుంది. పిల్లనగ్రోవి

కీచుగా పాడుతూనే వుంది. పొడుగ్గా ఠీవిగా వున్న ఆ కర్నల్ విగ్రహం ఆ ఖైదీ వెనువెంట పక్కగా అలా నడుస్తూనే వుంది. అలా నడుస్తూన్నవాడల్లా ఆ కర్నల్ తటాలున ఆగిపోయి, ఒక సైనికుడి దగ్గరకువెళ్లి:

' "గురి తప్పతావేమి? గురి తప్పతావా? గురి తప్పినందుకు – ఇదీ నీకు! ఇదీ నీకు!" అంటూ, చర్మం చిట్లిపోయి ఎర్రబడిపోయిన ఆ తార్తారు వాడి వీపుమీద ఈ సైనికుని కొరడా దెబ్బ ఇంకా గట్టిగా పడలేదని చెప్పి, రౌద్రుడై పోయి గర్జించుతూ, మెత్తని షామోయ్ గ్లౌవేసుకొని వున్న తన బలమైన చేయి సాగతీసి, పాపం అసలే కాస్త అర్భకుడూ బలహీనుడూ అయి వుండి, అందులోనూ హడిలిపోయి గజగజ వణకిపోతూన్న ఈ సైనికుడిని ఫెడీ ఫెడీమని ముఖం మీద కొట్టాడు.

" 'కొరడాలు కొత్తవి తెప్పించండ్రా!' అని కర్నల్ ఒక్క రంకె వేశాడు. అలాగు అతడు రంకెవేసి తన ముఖం ఇటు తిప్పేసరికి ఆయనకు నేను అగపడ్డాను. కాని ఆయన నన్ను చూడనట్టు నటించి, ముఖం గంటుపెట్టుకుని భయంకరములూ విషపూరితములూ అయిన కోరచూపులు చూస్తూ, చటుక్కున తన ముఖం అటు తిప్పేసుకున్నాడు. నేనేదో దొంగపని చేస్తూ పట్టుబడిపోయినట్టు నాకనిపించి, ఎంతో లజ్జపడిపోయి, ఎటుకేసి చూసేందుకూ నాకు పాలుపోయిందికాదు. ముఖం వేలేసుకుని ఆదరా బాదరా ఇంటికి వెళ్లిపోయాను. ఇంటికి వెళ్లుతూన్నంత సేపూ, ఆ భేరీ మోత, కీచుమని ఆ పిల్లనగ్రోవి పాట, 'సోదరులారా, నా మీద దయ చూపండి!' అనే మాటలు, మండిపడిపోతూన్న గొంతుతో నిబ్బరంతో: 'గురి తప్పతావేమి? గురి తప్పతావా? గురి తప్పినందుకు – నీకిదీ! ఇదీ నీకు!' అని కర్నల్ గర్జన – ఇవన్నీ నా చెవుల్లో అలా వినబడుతూనే వున్నాయి. నా హృదయ

వేదన ఎంత తీవ్రంగా వుండెనంటే ఇక గుండెల్లో నొప్పి పుట్టుకొచ్చి, కడుపులో చెయ్యిపెట్టి కెలికేస్తున్నట్టు తిప్పపట్టుకుని, దారిలో నాలుగైదు సార్లు ఆగుతేనేగాని ఇక ముందుకు అడుగు పెట్టలేకపోయి, ఈ దృశ్యం కళ్ళబడడం కారణంగా నన్నావహించిన ఘోరాతి ఘోరమైన భయాన్నంతనూ అక్కడికక్కడే వాంతి చేసుకుని కక్కేస్తేనేగాని ఇక నేను బతకలేనేమో అన్నంత బాధ పడిపోయాను. నెనెలా ఇల్లు చేరుకున్నానో నాకే తెలియదు. ఇల్లు చేరుకుని, పక్కమీద నడుమువాల్చి పడుకున్నాను. పడుకుని కన్ను మూతపడిందో లేనేలేదో, మళ్ళీ అదంతా నా కళ్ళముందు ప్రత్యక్షమై, నా చెవుల్లో ప్రతిధ్వనించింది.

''ఆయన గ్రహించినదీ, నేను గ్రహించనిదీ ఏదో ఒక విషయం తప్పక వుండి తీరాలి, అని కర్నల్ గురించి ఆలా తలపోస్తూ నాలో నేనుకున్నాను. 'ఆయన గ్రహించిన విషయమే నేను కూడా గ్రహించుకున్నట్టాయెనా, నాకిదంతా అర్థమై, నాకింత బాధ కలిగేదికాదు.' కాని ఎంతదీర్ఘంగా ఆలోచించినా, కర్నల్ గ్రహించిన దేమిటో, నేను అర్థం చేసుకోలేకపోయాను. ఇక ఆ పూటంతా మరి కన్ను మూతపడిందికాదు. చివరకి ఒక స్నేహితుని ఇంటికెళ్ళి, అదంతా మరచిపోవడానికని ఇక వొళ్ళు తెలియకుండా తప్పతాగి, అప్పుడు ఆ మైకంలో నిద్రపట్టిపోయింది నాకు.

''నేను చూసినది ఒక ఘోరమైన దురాగతమని నేను నిశ్చయించుకున్నానని మీరు అనుకుంటారేమో? అబ్బే, అదేమీ కాదు. నేను అనుకున్నదల్లా ఒక్కటే: 'నేను చూసినదంతా, అంత నిబ్బరంతో జరిపించి, అదంతా కూడా — తు.చ అవసరమేనని అందరి చేతనూ అంగీకరించబడి

నప్పుడు — వారందరూ గ్రహించిన విషయం నేను గ్రహించలేకుండా వున్నానన్నమాట'. అదీ నేననుకున్నది. అదేమిటో తెలుసుకుందామని ఎంతో బుర్ర కొట్టుకున్నాను. ఎంత ప్రయత్నించినా నేను తెలుసుకో లేకపోయాను. అంతకు ముందు నేను మిలిటరీ ఉద్యోగంలో చేరుదామనే నిశ్చయించుకున్నాను. కాని ఆ విషయమేమిటో తెలుసుకొన లేకపోవడం కారణంగా, ఇక ఏమైనా సరే నేను మరి మిలిటరీ ఉద్యోగంలో చేరలేకపోయాను. ఒక్క మిలిటరీలోనే కాదుకదా, ఇక ఈ ఉద్యోగం కాదు, ఆ ఉద్యోగం కాదు, ఏ ఉద్యోగంలోనూ సద్యోగంలోనూ నేను చేరలేకపోయి — ఇక మీకు తెలియనిదేముంది గనుక — ఎందుకూ పనికిరాకుండా పోయాను.''

''మీరెంత పనికి రాకుండా పోయినదీ మాకందరకూ తెలుసును లెండి'' అన్నాడు అతిథులలో ఒకతను. ''అసలు నిజం చెప్పాల్సొస్తే, మీరు అంటూ ఉండబట్టే కదా, లేకుంటే ఎంతమంది పనికిరాకుండా పోయే వారో? ఆ సంగతీ చెప్పండి!''

''అబ్బే, అది వుత్త పిచ్చిమాట'' అన్నాడు ఇవాన్ వసీలియెవిచ్, నిజంగా చికాకుపడుతూ.

''సరే గాని, ప్రణయగాథ ఏమైంది?'' అని అడిగాం.

''ప్రణయగాథా? ఆనాటినుండి ప్రణయం క్రమేణా హరించిపోయింది. ఆమెతో నేను కలిసి వున్నప్పుడు, ఆలోచనలో నిమగ్నయైన ఆమె వదనంపై ఆమె అలవాటు ప్రకారం మందహాసం తాండవించే సరికల్లా, ఆనాడు ఆ మైదానంలో నేను చూసిన ఆ కర్నలు విగ్రహమే నాకు మళ్లీ వెంటనే జ్ఞాపకం వచ్చేది. ఆ దృశ్యం గుర్తుకు రావడంతో నాకేమిటో బాధగానూ

మతిపోయినట్టూ అనిపించేది. దానితో రానురాను ఆమె ఇంటికి వెళ్లడం మానుకున్నాను. ప్రణయమంతా క్రమేణా నీళ్లుకారిపోయింది.

"చెప్పవచ్చే దేమిటంటే, ఒక్కొక్కప్పుడు, ఇలాగే జరుగుతూంటుంది, ఇలాటి ఘటనలే మనిషి జీవితాన్నంతనీ తలకిందులు చేసేసి, జీవిత పథాన్నే మరొక దిశగా మళ్లించి వేస్తుంది. ఇక, మీారేమో అదీ ఇదీ అంటారు..." అని అనేశాడు.



L. van Beethoven. 2. Son.
(op. 2. No. 2)
Largo Appassionato

ఆగస్టు నెల మధ్యరోజుల్లో, అమావాస్య నేడో రేపో అనగా, ఇతర ప్రాంతాలకు కొత్తగా అవుపించినా నల్ల సముద్రం ఉత్తర తీరానికి మాత్రం మాషూలే అయిన దేశముసురు హఠాత్తుగా మొదలుపెట్టింది — ఒకనాడు సముద్రమూ, భూమీ ఏకం జేసేస్తూ పొగమంచు దట్టంగా కమ్మేసింది; దీపస్తంభంలో వున్న సైరెను అచ్చువేసి విడిచిన ఆబోతులా రాత్రింబగళ్లూ

కణేలు కణేలుమని రంకెవేస్తూంది. మరోనాడు పొగమంచు తేలిపోగానే తుషారంలా సన్నని చినుకు పొద్దున్నే మొదలెట్టి మరునాటి పొద్దున్న వరకు విధివిరామం లేకుండా కురిసింది. రేగడి బురద మడుగులు కట్టి రోడ్లనూ బాటలనూ రొంపిదుక్కి దున్నిన పొలంకింద తయారు చేసేసింది. బళ్ళూ బగ్గీలూ బురదలో కూరుకుపోయి బయట పడేందుకు యమయాతన పాలయేవి. మళ్ళీ ఆ మరునాడు, వాయవ్యపు స్తెప్‌మైదానం నుండి తుపాను పుట్టు కొచ్చి ఎంత భయంకరంగా వీచిందంటే, తుపానుకి ఉయాల ఊగుతూన్న సముద్రపు కెరటాల్లా వృక్షశిఖరాలు ఆ గాలికి అల్లల్లాడిపోయాయి. ఇంటి కప్పులకు తొడుగువేసిన ఇనప రేకులమీద ఉక్కుపాదాలతో ఎవరో నడుస్తూన్నట్టు రాత్రిపూట ఆ రేకులు ఫెళఫెళ చప్పుడయాయి, కిటికీలు గజగజ వణికాయి, తలుపులు దభీదభీమని కొట్టుకున్నాయి, పొయ్యిగూటి పొగ గొట్టంలో నుంచి గాలి మొర్రోమని మోత పెట్టింది. ఆ పెనుగాలికి ఎన్నో బెస్త పడవలు సముద్రంలో దారీ తెన్నూ తెలియక తోవ తప్పిపోయాయి, రెండు పడవలు తిరిగి ఒడ్డు చేరుకోనే లేదు; ఒక వారం రోజులు పోయాక ఆ బెస్తల జీర్ణకళేబరాలు ఒడ్డుకు కొట్టుకొచ్చాయి.

సముద్రతీర నగర శివార్లకు సెలవలు గడిపేందుకు వచ్చిన పట్టణ ప్రజ — వీరిలో అధికసంఖ్యాకులు, అందరి దాక్షిణాత్యుల్లాగానే జీవితాసక్తులూ విపరీత భయస్థులూ అయినట్టి గ్రీకులూ, యూదులూనూ — తిరిగి పట్టణానికి ఆదరా బాదరా వెళ్లిపోతున్నారు. బురద కాల్వలాగున్న ఆ రాజమార్గంమీద పరుపు చుట్టలూ, సోఫాలూ, బట్టల బీరువాలూ, కుర్చీలూ, బేసిను స్టాండులూ, సమొవార్లూ వగైరా గృహోపకరణాలతో మేటలు పేర్చిన సామానుబళ్లు మొదలూ కొసాలేని ఊరేగింపులా ఎడతెరిపి లేకుండా

బారులుతీర్చి నడుస్తున్నాయి. సన్నని వలగుడ్డ తెరలా వున్న ఆ పుష్పవర్షంలో దరిద్రం వోడుతూ అఘోరిస్తూన్న ఆ సంసారపు చీకిరిబాకిరి సామాన్లూ, బళ్లమీద కెక్కించిన ఆ సామానుపై పరచి వర్షానికి నానిపోయున్న టార్పాలిన్ గుడ్డలమీద, తట్టలూ, బుట్టలూ, ఇస్త్రీ పెట్టెలూ, ముంతలూ మూకుళ్లూ పట్టుకుని కూచున్న దాసీలూ, వంటలక్కలూ; మోకాళ్లు వణుకుతూ ముక్కలనుండి ఆవిరి పొగర్లు చిమ్ముతూ రొజు కుంటూ రొప్పుకుంటూ నాలుగు అడుగులు వేసేసరికల్లా ఒకసారి ఆగి పోతూన్న ఆ గుర్రాలూ; ఆ వర్షానికి జమ్ముగూడలా గోనెపట్టాలను కప్పు కుని గుర్రాలను బొంగురు గొంతుకతో నోటినిండా తిడుతూన్న ఆ బళ్ల వాళ్లూ — ఆ దృశ్యమంతా కళకాంతులులేని — చౌకబారు పగటి భాగోతంలా వెలవెలబోతూ ఏడుస్తూంది. అంతకంటె ముఱ్ఱో మంటున్నాయి — సిగరెట్టు పీకెలూ, చించి పారేసిన కాగితపుముక్కలూ, విరిగిపోయిన పింగాణీ గిన్నెల పెంకులూ, నలిపి పారేసిన అట్టపెట్టెలూ, వగైరా చెత్తచెదారం విరజల్లి, పువ్వులు పీకేసి మోడుపోయిన పువ్వులచెట్ల మళ్ల మధ్య యజమాన్లులేని కుక్కలు విచ్చలవిడిగా తిరుగుతూ, కిటికీ అద్దాలు విరిగిపోయి నిర్మానుష్యమై సామాన్లులేకుండా ఖాళీగా పడున్న ఆ విశాలమైన ఇళ్లు.

ఆగస్టు చివరి రోజుల్లో గాలి హఠాత్తుగా మారిపోయింది. మేఘం అన్నది లేకుండా, జూలైకంటెనూ ఎండగా వెచ్చగా శమనగా హాయిగా ప్రశాంతంగా వున్న దినాలు ఆరంభమయాయి. ఎండిన పొలాల్లో వుండిపోయి పచ్చబడిన దుబ్బుల మీదనున్న సాలెపట్లు ఆ ఆగస్టు సూర్య రశ్మిలో కాకిబంగారంలా తళుకులు విరజిమ్ముతున్నాయి. తమ తొల్లిటి

నెమ్మదిని తిరిగి అనుభవించుతూన్న చెట్లు మెల్లగా పండుటాకులు రాల్చుకుంటున్నాయి.

కులీనవంశ శ్రేణి ప్రధానాధికారి భార్య రాజకుమారి వేర నికొలాయెవ్‌న షేయిన, పట్నంలోని తమ ఇంటి మరమ్మతులు ఇంకా పూర్తికాని కారణాన గ్రామంలోనున్న తమ బంగాళాలోనే మరికొన్నాళ్లు వుండిపోవాల్సి వచ్చింది. శోభాయమానమైన ఆ దినాలు, ప్రశాంతమైన ఏకాంతత, స్వచ్ఛమైన గాలి, తమ దాక్షిణాత్య ప్రస్థానానికి ఎగిరిపోయే ముందు టెలిగ్రాఫు తీగెలపై సమావేశమై కలకలారావం గావించుతూన్న వానకోవెలలు, లాలించుతూ పాలించుతూ నెమ్మదిగా సముద్రం మీద నుండి వీస్తూన్న ఉప్పునీటి గాలి, వీటితో ఆమె మనస్సు ఆనందంతో ఉప్పొంగిపోయింది.

## 2

ఇంతేకాదు, ఆ రోజు — సెప్టెంబరు పదిహేడు — ఆమె పుట్టిన దినం కూడానూ. పుట్టిన దినం అంటే ఆమెకెంతో సరదా. ఆ రోజున, ఏనాడో గడచిపోయిన తన చిన్ననాటి దివ్యస్మృతులు తల్చుకుని, తనకు ఆనందమూ శుభమూ చేకూర్చే అద్భుతవిషయ మేదైనా ఆ రోజున తప్పకుండా జరిగి తీరుతుందనే ఆమె ప్రతీ సారీ అనుకునేది. ఆనాడు ఉదయమే ఆమె పెనిమిటి తొందర పని మీద పట్నం వెళ్లాల్సి వుండి, తాను వెళ్లే ముందు ఆమెకోసమని దేదీప్యమానంగా మెరసిపోతూ బేరీపండు ఆకృతి నున్న ముత్యాల లోలక్కుల జత ముఖమలు పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను

ఆమె మంచం దగ్గరనున్న చిన్నబల్లపై వుంచి వెళ్లిపోయాడు. ఆ కానుకతో ఆమె ఆనందం కొండందుకుంది.

ఇంట్లో ఎవ్వరూ లేరు, ఆమె ఒక్కర్తే వుంది. అవివాహితుడుగా వుండిపోయి, సాధారణంగా వాళ్లింట్లోనే వాళ్లతోనే కలిసి వుంటూన్న ఆమె సోదరుడు, అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు, నికొలాయ్ ఆ రోజున కచేరీలో కేసు విచారణ ఏదో వుండడంచేత అతడు కూడా పట్నం వెళ్లాడు. మధ్యాహ్నం భోజనానికి తమ ముఖ్యస్నేహితులను కొద్దిమందినే తప్ప ఇంకెవ్వరినీ తీసుకురానని ఆమె పెనిమిటి ఖరారు చేశాడు. వేసవి హడావుడి రోజుల్లోనే తన పుట్టినదినం పడడం కూడా అదృష్టమే. ఎందుచేతంటే ప్రతీ వేసవికీ వారిద్దరూ బంగాళాకే వచ్చేస్తారు. అదే, పట్నంలోనే గనుక వుండిపోయుంటే బోలెడు డబ్బు ఖర్చుపెట్టి భారీ ఎత్తున విందు చేయక తప్పేదికాదు. విందుతో తీరిపోతే పోనీ అనుకోవచ్చు – బ్రహ్మాండమైన 'బాల్' చెయ్యక తప్పేదా! పల్లెపట్టున వుండడంచేత ఈ ఖర్చు ఎంత వరకు తగ్గించేందుకు వీలుంటుందో అంతవరకూ తగ్గించేసుకోవచ్చు. కులీన శ్రేణిలో తనకు ప్రముఖ స్థానమే వున్నప్పటికీ – బహుశా వున్న కారణంగానేమో కూడా – రాజకుమారుడు షేయిన్‌కి జమాఖర్చులు సరిపెట్టుకోవడం కష్టంగానే వుండేది. వంశపారంపర్యా తనకు సంక్రమించిన జమీ, పేరుకు బ్రహ్మాండమైనదే అయినా, పేరు గొప్ప వూరు దిబ్బ కింద తయారైంది; తన హోదా నిలబెట్టుకునేందుకు – విందులే ఇవ్వడమా, దానధర్మాలే చేయడమా, చక్కగా ముస్తాబే కావడమా, జోడుగుర్రాల బగ్గీనీ స్వారిగుర్రాలనే వుంచడమా, ఒకటేమిటి, వీటన్నిటికీ – రాబడికి మించిన ఖర్చు చేయక వీల్లేదాయె. పెళ్లి చేసుకున్న తొలి యేళ్లలో రాజకుమారి వేరకు

పెనిమిటంటే వల్లమాలిన మోహమూ ప్రేమాసూ. వెనకటి మోహా తిశయమూ ప్రేమోద్రేకమూ ఏనాడో చల్లారి, ఇప్పుడు భర్త అంటే ఆమెలో యథార్థమూ శాశ్వతమూ అయిన స్నేహం నెలకొంది. తలకు మించిన ఖర్చులు ఏకంగా దివాళాకే దారితీయకుండా వుండేటట్టు, పెనిమిటికి తెలియకుండానే తన అవసరాల నెన్నిటినో తగ్గించేసుకుని అతి గోప్యంగా గుట్టుగా సంసారం చక్కబెట్టు కొస్తూంది ఆమె.

భోజనపు బల్లను అలంకరించేందుకని, ఆమె తోటలో తిరుగుతూ పువ్వులను బహు జాగ్రత్తగా కత్తిరిస్తూంది. ఇంచుమించు పువ్వులన్నిటినీ ఏరుకున్న తరువాత పూలచెట్లు అనాథల్లా కానొచ్చాయి. రకరకాల రంగు రంగుల ముద్ద కార్నేషన్లు అప్పుడే చరమస్థాయికి వచ్చేశాయి. అంత తీసి కట్టుగానూ వున్నాయి స్టాకులు – పువ్వుల్లోసగం ఇంకా పూతలో వుండగా, సగం అప్పుడే సన్నని బొట్లలు కట్టి కేబేజీ వాసన వేస్తున్నాయి; ఆ వేసవిలో మూడో తడవ పుష్పించిన గులాబి పొదల్లో కొన్ని పువ్వులు పూస్తున్నా కొన్ని మాత్రం ఇంకా మొగ్గలనే తొడుగుతున్నాయి. కాని డాహ్లియాలూ, పియొనీలూ, చీనా చేమంతులూ తమ సౌందర్యాన్ని అహంకారంతో కొట్టచ్చినట్టు ప్రదర్శించుతూ, ఆ నిశ్చల వాతావరణాన్ని పచ్చిక వాసనతో మిళితమైన శరత్కాలపు వ్యాకులపూరిత పరిమళంతో నింపేశాయి. భోగలాలసమైన ప్రణయ జీవితాన్నీ, ఫలప్రదమైన మాతృత్వాన్నీ రుతుమాత్రపు వ్యవధిలో తనివి తీరా చవిగొని ఇక జీవితాన్ని చాలించుతూన్న ఇతర పుష్పాలు అసంఖ్యాకము లగు భవిష్యత్ జీవిత బీజాలను నిరాడంబరంగా రాల్చుతున్నాయి.

చేరువనున్న రోడ్డునుండి మూడు స్వరాల మోటారు హారను ఒకటి మోగి, రాజకుమారి వేర చెల్లెలు అన్న నికొలాయెవ్న ప్రిన్సెస్ వస్తూందని

చాటింపు వేసినట్టు వేరకు వినబడింది. తాను ముందుగానే పెందలాడే వచ్చి, అతిథులను మర్యాదచేసి లోపలికి తీసుకువచ్చేందుకు తాను కూడా సహాయం చేస్తానని పొద్దున్నే అక్కకు ఆమె టెలిఫోను చేసింది.

అవును, వేరకు సరిగానే వినబడింది. ఆ వస్తున్నామెను కలుసుకోవడానికి ఆమె గేటు గుమ్మంలోకి వెళ్ళింది. మరో క్షణానికల్లా అందమైన సిడాన్‌కారు ఒకటి గేటు ముందు ఒక చక్కరుకొట్టి ఆగింది; కారు డ్రైవరు నీటుగా తన సీటులోనుండి చెంగున దిగి, చిటికలో కారు తలుపు బారుగా తెరచాడు.

అక్కచెల్లెళ్లిద్దరూ అతి సంతోషంతో ఒకరినొకరు ముద్దుపెట్టుకున్నారు. చిన్ననాటినుండీ వారిద్దరి మధ్యనూ చక్కని అనురాగమూ ఆపేక్షా వుంటూ ఎంతో సన్నిహితంగా వుంటున్నారు. అదేమిటో చిత్రం — మళ్ళీ రూపురేఖల్లో వాళ్ళిద్దరికీ ఎంతో అంత భేదం! అక్క వేరది తల్లి పోలిక. తల్లి ఇంగ్లీషు స్త్రీ, అందకత్తె, వేర సన్నంగా పొడుగ్గా ఉక్కుచువ్వలా వుంటుంది. నాజూకైన ముఖమే అయినా, ఆ ముఖంలో మాత్రం రవంత కాఠిన్యం, అహం కనబడుతుంది. తీరైన చేతులు, కాని ఒక్కపిసరు పెద్దవేమో అనిపిస్తుంది. పూర్వపు సూక్ష్మ చిత్రాల్లో బొమ్మలకుమల్లె వాయ్యారంగా జాలువారుతూన్న బుజాలు. చెల్లెలు ఆన్నదంతా అచ్చంగా తండ్రి పోలిక. తండ్రి ఒక తార్తార్ రాజకుమారుడు. అతడి వంశకర్తలు తామర్లేన్ సంతతివారు. ఈ సంగతి గురించి వారి తండ్రి చెప్పినప్పుడల్లా, మహామహుడు ఆ హంతకుడిని ''లంగ్ తెమిూర్'' అని తాతార్ భాష పేరుతోనే సగర్వంగా అనేవాడు. అతని పూర్వీకులు నిన్నమొన్నటి వరకూ క్రిస్టియన్ మతం పుచ్చుకోనేలేదు. క్రిస్టియనులలో చేరినది అతని తాతే.

అదైనా పందొమ్మిదో శతాబ్ది తొలి సంవత్సరాల్లో. అక్కకంటె చెల్లెలు కొద్దిగా పొట్టి, అక్క బుజాల దగ్గరకొస్తుంది. వెడల్పాటి భుజస్కంధాలు. చురుకైన మనిషి. ఎప్పుడూ నవ్వుతూ ఏవో గమ్మత్తులు చేస్తూవుంటుంది. ఒకరిని హాస్యమాడడమంటే ఆమెకు భలేసరదా. ఆమె ముఖమంతా మంగోలు తీరు — ఉబ్బెత్తుగా వున్న బుగ్గ ఎముకలు. అసలే వాలుకళ్ళు, అందులోనూ హ్రస్వదృష్టేమో, తరుచు కళ్ళు చీకురించుకుని చూస్తుంది, విషయలోలత్వం వ్యక్తపరుస్తూ, ఉద్ధతి ద్యోతకమవుతూన్న చిన్న మూతి, కించిత్తు పైకి తోసుకొస్తూ నిండైన అడుగు పెదవి. అయినప్పటికీ ఆమె మందహాసమో, స్త్రీత్వాన్ని పుణికి పుచ్చుకున్న ఆమె రూపురేఖలో, అదొక చిత్రంగా మనసు కవ్వించే వలపు హాస్యమో చెప్పలేంగాని, ఆ ముఖం చూసే సరికల్లా ఎదుటివాడి మనస్సులో పట్టుదొరకనట్టే ఇదమిద్ధమని నిర్వచించ వీల్లేనట్టే ఆకర్షణ ఒకటి పుట్టించి, అతణ్ణి మంత్రముగ్ధుణ్ణి చేసేస్తుంది. అక్కలో వున్న గర్వసహితమైన లావణ్యంకంటె చెల్లెల్లోవున్న అందము కొరవడిన వొయ్యారమే పురుషులను మరింత తరుచుగా మరింత తీవ్రంగా ఉద్రేకపరచి ఆకర్షించేది.

కోకొల్లలుగా డబ్బూ అంతంత మాత్రమే తెలివితేటలూ వున్న ఒకతనికి ఆమెనిచ్చి పెళ్ళిచేశారు. పేరుకు ఏదో ఒక ధర్మసంస్థ తాలూకు కార్యనిర్వాహక వర్గంలో సభ్యుడుగా వుంటూ, ''జంటిల్‌మన్ ఆఫ్ ది బెడ్ చేంబర్'' అనే బిరుదు వున్నప్పటికీ, ఇతగాడికి పనిపాటులంటూ ఏవీ లేవు. పెనిమిటంటే ఈమెకు పరమ అసహ్యం, అయినా ఇద్దరు పిల్లల తల్లి అయింది — ఒక కొడుకూ ఒక కూతురూ; ఇక మరి పిల్లలను కనకూడదని ఆమె నిశ్చయించుకుంది. పిల్లలంటే చెవికోసుకుంటుంది వేర — ఒకరూ

ఇద్దరూ కాదు, తన కడుపున ఎందరు పుట్టినా ఇంకా పుడితే బాగుండు ననే ఆమెకుంటుంది. కాని అదేమి కర్మమో — ఆమెకు అసలు కాన్పే లేదు. అందుచేత చెల్లెలు పిల్లలవిూదే ఆమె పంచప్రాణాలూనూ. పిల్లలిద్దరూ ముద్దొస్తూ నాజుగ్గానూ నీర్సంగానూ వుండేవారు. పాలిపోయి కొద్దిగా ఎండి పోయిన ముఖాలు, బొమ్మలకున్నట్టు వాళ్లది నారరంగు వుంగరాల జుట్టు. వినయవిధేయతలతో ఎప్పుడూ బుద్ధిగా చెప్పిన మాట వింటూ వుండే వారు. వాళ్లంటే వేరకు వెర్రి వ్యామోహమే.

అన్న ఎప్పుడు చూసినా నవ్వుతూ గడబడచేస్తూ గాభరాగా వుంటుంది. మళ్లీ ఒక్కొక్కప్పుడు అర్థంపర్థం లేకుండా వైరుధ్యాలున్న స్వభా వం కూడానూ. యూరప్‌లోని అన్ని రాజధానీ నగరాల్లోనూ, అన్ని ఆరోగ్య విహార కేంద్రాల్లోనూ తనకు నచ్చిన మొగాళ్లతో ఇక ముందువెనుకలూ మంచిచెడ్డలూ ఆలోచించకుండా శృంగార సంభాషణలూ సరససల్లాపాలూ అతిగా సాగించేది. అయినప్పటికీ పెనిమిటిని ఏన్నడూ దగాచేసి ఎరగదు. కాని అతడిని మాత్రం, అతడి ముఖమ్మీదా అతని వెనకాతలా కూడా అత డిని ఈసడిస్తూ తాటాకులు కట్టడం మానేదికాదు. డబ్బంటే నీళ్లలాగే ఖర్చుపెట్టేది. జూదమన్నా, డాన్సింగన్నా, కొత్త అనుభూతులన్నా, ఉద్రే కంరెచ్చగొట్టే దృశ్యాలన్నా చెవికోసుకునేది; విదేశాల్లో పర్యటించుతూన్నప్పుడు, పేరు ప్రతిష్ఠలను శంకించాల్సిన కేఫేలకు తరుచూ వెళ్తూండేది. అయిన ప్పటికీ ఒకరికి పెట్టడమన్నా సాయం చేయడమన్నా ఆమెది భారీ చెయ్యే, దానధర్మాలు చేస్తే తణుకు బెణుకులు లేకుండా చేసేయడమే. ప్రగాఢమూ త్రికరణశుద్ధీ అయిన దైవభక్తి ఆమెది — ఆ దైవభక్తి ఎంతవరకూ కుదిరి పోయిందంటే, రహస్యంగా ఆమె కేతలిక్కు మతంలో చేరిపోయింది. ఆమె

వీపు, వక్షము, భుజస్కంధాలు అపూర్వసౌందర్యాన్ని గుత్తకుపుచ్చుకున్నాయి. పెద్ద 'బాల్' విందులకు ఆమె వెళ్లేటప్పుడు, సభా ఔచిత్యమూ ఫాషను రివాజూ విధించిన పరిమితులను గాలికి వదిలేసి ముస్తాబయేది. బాగా కిందకే కత్తిరింపు వున్న దుస్తులనే వేసుకున్నా, అందుకు పాపపరిహారార్థం ప్రాయశ్చిత్తం కోసమని వాటి అడుగున వొంటెమీద గొంగడి రవికే ఆమె ఎల్లప్పుడూ తొడుక్కునేదని చెప్పుకునేవారు.

అటు, మర్యాదలనూ కట్టుబాట్లనూ లాంఛనంగా యథావిధిగానూ తు.చ తప్పకుండా సిసలుగా పాటించేది వేర. తన దర్జాకి ఏ మాత్రమూ లోటు రాకుండానే అందరి పట్లా కలుపుకోలుతనంగా, మళ్లీ అదే సమయంలో కాస్త దూరం దూరంగానే ఎడం ఎడంగానే వుండి, పట్టపు మహాదేవిలా ముక్తసరుగానే వుంటుంది ఆమె.

3

''ఆహా, ఎంత బాగుందో ఇక్కడ! ఎంత హాయిగా వుందో!'' అంది ఆన్న, త్వరత్వరగా చిట్టి చిట్టి అడుగులు వేసుకుని, అక్క పక్కనే ఆ బాట మీద నడుస్తూనూ. ''నీకేమీ అంత తొందర పనులు లేకపోతే ఈ కొండ చరియ అంచునున్న ఆ బెంచీ మీద ఒక్క క్షణం కూచుందాం, ఏం? నేను సముద్రం చూసి యేళ్లే అయిందో యుగాలే అయిందో! అబ్బ, ఎంత మనోహరంగా వుందో గాలి! ఈ గాలి పీల్చుతేనే చాలు పంచప్రాణాలూ లేచొస్తాయి! కిందటేడు క్రిమియా వెళ్లేం. అక్కడ మిస్ఖోర్‌లో ఒక అద్భుతమైన విషయం కనిపెట్టాను, ఏమనుకున్నావో గాని! సముద్రపు నీరు ఏం వాసన

వేస్తుందో చెప్పుకో, చూదాం? అచ్చంగా మిన్యోనెట్ పరిమళమే, ఏమను కున్నావో గాని!''

వేర ఆపేక్షగా మందహాసం చేసింది:

''నీదంతా ఒక మిథ్యాజగత్తేనే, ఒసేవ్!'' అంది వేర.

''అబ్బబ్బే, ఎంత మాత్రం కాదు. నాకు బాగా గుర్తుంది, ఒకసారి నేను అన్నాను — వెన్నెట్లో అదొక విధమైన పాటలవర్ణపు ఛాయ వుంటుందని. అలా అనేసరికి అందరూ ఫక్కున నవ్వారు. మొన్నను బొరీత్స్‌కీ — నా బొమ్మ వేస్తున్న చిత్రకారుదులే — ఏమన్నాడో తెల్సా? నేను చెప్పినది అక్షరాలా నిజమేనని ఒప్పుకుంటూ, ఇది చిత్రకారులకు సుపరిచితమైన సంగతేనన్నాడు.

''చిత్రకారుడంటున్నావు — నీ సరికొత్త ఆరాధకుడా, ఏమిటి బాబూ?''

''ఎందుకొచ్చిన ఊహాగానమే, పోనిస్తూ!'' అని ఆన్న నవ్వి, గబగబా అడుగులేసుకుంటూ, సరాసరి అట్టడుగుననున్న సముద్రంలోకే నిటారుగా దిగిపోతూన్న ఆ అగాధం అంచు దగ్గరకే వెళ్లి, కిందకు మెడవంచి సముద్రంలోకి చూచి, ఆపాళంగా హడలెత్తిపోయి, గంటుపెడితే రక్తం లేకుండా వెలవెల బోయిన ముఖంతో కెవ్వుమని ఒక్క కేకేసింది.

''ఆయ్ బాబోయ్! ఎంత లోతో, కళ్లు తిరిగిపోతున్నాయి!'' అని కేకవేసిందే కాని, ఆ కంఠంలో శక్తిలేక గాద్గదికంగా వినబడింది. ''ఇంత ఎత్తునుండి కిందకి చూసేటప్పటికల్లా, నాకేమిటో ముచ్చెమటలూ పోసిపోయి, గుండెల్లో ఏదో పేలిపోయినట్టయి, ముంగాలి బొటనవేళ్లలో సలుపు పుట్టు కొస్తూంది... అయినా, మరదేమిటో — అదే చూడాలని బుద్ధి...''

ఆన్న మళ్లీ ఆ అగాధంలోకే చూడబోయింది, కాని అక్క ఆమె చెయ్యి పట్టుకు వెనక్కి లాగేసింది.

"ఒసేవ్, అన్న! నీ యిల్లు బంగారంగానూ, చూడకే, నా తల్లీ! నువ్వాలా కిందకి చూస్తూంటేనే నాకు తల తిరిగిపోతూందే. నిన్ను బతిమాలుకుంటానే, కూచోవే!" అంది వేర.

"అలాగేనే, మరేమీ ఫరవాలేదే. పోనీ కూచుంటాన్లే... కాని చూడవే, ఎంత అందంగా వుందో, ఎంత ఆనందంగా వుందో — చూసినకొద్దీ ఇంకా చూడాలనే వుంది! ఎంత చూసినా తనివి తీరదుకదా! ఇన్ని మహాద్భుతాలను మనకోసమని సృష్టించినందుకు దేవుడి పట్ల నా హృదయం కృతజ్ఞతతో ఎంతగా పొంగి పొరలిపోతూందో నీతో ఏమని చెప్పగలను!"

ఒక్క క్షణమాత్రం అలాగు ఇద్దరూ ఆలోచనలో మునిగిపోయారు. కొండ చరియ అట్టడున ఆ అగాధం కింద సముద్రం దరీ దాపూలేకుండా అలా విస్తరించివుంది. ఆ బెంచిమీద కూచుని చూస్తే వారికి ఒడ్డు కనబడక పోవడం చేత, సముద్రం అనంతంగా ఆవరించి వుందన్న అనుభూతి మరింత దృఢంగా వారి మనస్సులో నాటుకుపోయింది. నున్నగా సాగిపోతూన్న అంతర్వాహినీ ప్రవాహాలున్న చోట్ల అయిమూలగానున్న లేతనీలి కాంతుల చారలతో తప్ప, ప్రేమపూరిత ప్రశాంతతో నవ్వులు మూటకడుతూ శ్యామలవర్ణంతో వెలిగిపోతూన్న ఆ సముద్రజలం దిగ్మండలం అంచున మాత్రం కృష్ణనీలంలోకి మారిపోయింది.

నలుసులులాగ వుండి ఎంతో కష్టం మీదగాని కంటికగపడని జాలరి పడవలు నిగనిగలాడుతూ గచ్చులా నున్నగావున్న ఆ సముద్రంపై ఒడ్డుకు కాసింత దూరంలో కదలకుండా కునుకు తీస్తున్నాయి. మరికొంత దూరానున్న మూడు కొయ్యల నావ ఒకటి, ఆనప త్తుంబల్లా గాలికి ఉబ్బిపోయిన

తెల్లని తెరచాపల ఉడుపులతో నఖశిఖ పర్యంతం సింగారించుకుని నిశ్చలంగా ఆకాశంలో తేలిపోతూన్నట్టే అగపడింది.

"నువ్వు చెప్పినది నా కర్థమైందిలే" అంది అక్క దీర్ఘంగా ఆలోచించుతూనూ, "అయినా మరే కారణంచేతో నేను చెప్పలేను గాని, నీకు అనిపించుతూన్నట్టు నా కనిపించడం లేదు. ఎంతకాలమయో సముద్రాన్ని చూడక, మళ్లీ చూసినప్పుడు నా కదోవిధమైన ఉద్రేకమూ సంతోషమూ కలుగుతుంది — మళ్లీ దిగ్భ్రాంతీ కలుగుతుంది. బ్రహ్మాండమూ గంభీరమూ అయిన ఒక మహాద్భుతాన్ని తొలిసారి చూసినట్టు అనిపిస్తుంది. అయితేనేం, తరువాత మళ్లీ ఆ దృశ్యానికి అలవాటు పడిపోయాక చూసినట్టాయనా, ఎక్కడా ఎగుడు దిగుడు లేకుండా చదునుగా వున్న ఈ ప్రశాంత సముద్రపు శూన్యత నన్ను క్రుంగదీసేస్తున్నట్టే వుంటుంది... చూస్తూన్న కొద్దీ విసుగెత్తి, ఇక మరి చూడాలని వుండదు నాకు, అలసట అనిపిస్తుంది."

ఆన్న చిరునవ్వు నవ్వింది.

"ఏం నవ్వుతున్నావు?" అని అడిగింది అక్క.

"కిందటి వేసవిలో" అంటూ ఆన్న కొంటెగా చెప్పకొచ్చింది, "మేమందరం గుర్రాలమీద స్వారి చేసుకుంటూ పెద్ద జట్టుగా యాల్టానుండి ఉచ్-కోష్‌కి బయల్దేరాం. జలపాతానికి ఇంకా ఎగువను ఫారెస్టు రేంజరు బంగాళా వుంది. అది బాగా దాటిపోయాకే మొదట మేఘం ఒకటి మమ్మల్ని చుట్టేసింది. అంతా చెమ్మాచిత్తడీ చీకటీ. కంటికేమీ కనబడ్డం లేదు. అయినా అలాగే ఆ మేఘంలోంచే, ఆ దేవదారు చెట్ల మధ్యనుండే, ఇరుకుగా మోకాలు పర్వతంలా వున్న బాటల్లో కొండమీదికెక్కాం. అడవి ఆఖరై

పోయీ ఆఖరై పోవడంలో మేఘంలోంచి మేం బయటపడ్డాం. అంత వరకూ ఏటవాలుగా వున్న కొండ చరియ అంచున బండ వుంటే, అదే ఒక మెట్టులాగ, దానిమీద జాగ్రత్తగా ఆనుకుని నిలబడి కిందకి చూశావే అనుకో — నీ కాళ్లకింద పెద్ద అగాధం. ఆ అగాధం అడుగునున్న పల్లెటూరు. ఇళ్లు అచ్చంగా అగ్గిపెట్టెలంతలేసి వున్నాయి. అడవులూ తోటలూ జానెడు బెత్తెడు ఎదిగిన గడ్డిచెట్లల్లా కనపడ్డాయి. ఆ ప్రకృతి దృశ్యమంతా నేలమీద పరచిన భూగోళశాస్త్ర పటంలా వుంది. అల్లంత దూరాన — సముద్రం! పెద్ద చాప పరచినట్టు ఐదారు ఆమడల వరకూ అలా విస్తరించి వుంది. గాలిలో ఎగిరి పోతాను కాబోలు అనిపించింది నాకు. అబ్బ, ఆ ప్రకృతి సౌందర్యం — ఇకనే చెప్పలేను! గాలిబుడగలా వాళ్లు తేలిపోయిందంటే నమ్మూ! వెనక్కి తిరిగి, వెంటనున్న గైడ్‌తో అన్నాను మహదానందంతో: 'ఆహా, సైయద్ ఒగ్లూ! ఈ దృశ్యం అద్భుతంగా లేదూ?' అన్నాను. 'ఏమిటోనండి, అమ్మగారూ! నాకు విసుగెత్తుకొస్తూంది సుమండీ. ప్రతి రోజూ ఇదే చూడ్డమంటే మెహంమొత్తి — తలనొప్పి!' '' అన్నాడు.

''సాదృశ్యానికి ధన్యవాదం!'' అంది వేర నవ్వుతూనూ. ''కాని, సముద్రం అందచందాలను ఉత్తరాదివాళ్లం మనం సరిగా అర్థం చేసుకోలేమేమో అనుకుంటాను. నాకెంత సేపూ అడవులమీదే మోజు. మన యెగోరొవ్‌స్కాయె అడవి నీకు జ్ఞాపకంవుందా?.. ఆ అడవితో విసుగెత్తి పోవడమంటూ ఎప్పుడైనా కద్దా? ఆ దేవదార్లు!.. ఆ నాచు... ఆ సింధూరవర్ణపు కుక్కగొడుగులు — తెల్లని పూసలతో పువ్వులు కుట్టిన ఎర్రని ఖుఖమల్ బాలీసులే అచ్చంగా! ఆ నిశ్శబ్దం... ఆ చల్లదనం!''

''అదేమిటి, ఇదేమిటి -- నాకన్నీ ఒకటే, నాకన్నీ ఇష్టమే సుమీ'' అంది ఆన్న. ''అన్నిటికంటే నాకు మరీ ఇష్టం — నా చిట్టి అక్కయ్య, తెలివైన నా వేర అక్కయ్య! ఈ మహాప్రపంచంలో మనం ఇద్దరమే — నీకు నేనూ, నాకు నువ్వూ!'' అంది ఆన్న.

అంటూ అక్కను కౌగలించుకుని, చెక్కిళ్ళు రాసుకునేటట్లు హత్తుకుని కూచుంది ఆన్న. ఆలా కూచుని కూచుని, గభాలున ఏదో జ్ఞాపకం తెచ్చుకుని:

''ఆసి, నా తెలివి తెల్లవారా! నవలలో పాత్రలులాగు మనమిద్దరం ఇక్కడ కూచుని ప్రకృతి గురించి కబుర్లు చెప్పుకుంటున్నాం, నేనేమో నీ పుట్టిన దినం కోసమని తెచ్చిన కానుక మాట పూర్తిగా మరచిపోతినాయె. ఇదిగో చూడు, నీకు నచ్చదేమోనని నాకు భయంగా వుంది'' అంది ఆన్న.

ఆమె తన చేతిసంచీలోనుంచి అదొక చోద్యంగా బైండుచేసి వున్న చిన్న నోటుబుక్కును పైకి తీసింది: బహుకాలపు వాడుకతో ధూసరవర్ణం కింద వెలిసిపోయిన పురాతనపు నీలిరంగు ముఖమల్ మీద గజిబిజిగా చిక్కులుపడిన అల్లిక నమూనా బంగారంలో చెక్కివుంది — ఎంతో ఓపికతో బహుదీక్షగా ఎవరో మంచి చతురుడైన విశ్వకర్మ కృషి అయివుండాలి తప్పకుండానూ. నోటుబుక్కుకి నూలుపోగంత సన్నమైన బంగారపు గొలుసు తగిలించి వుంది. నోటుబుక్కులో మునుపుండిన కాగితాలు బదులు ఇప్పుడు దంతపు పలకలున్నాయి.

''ఎంత అందంగా వుందో! ముద్దులు మూటకడుతూందే! ఆహాహా!'' అంటూ వేర చెల్లెలిని ముద్దుపెట్టుకుంది. ''ధన్యవాదం. ఈ నిక్షేపం ఎక్కడ దొరికిందే నీకు?''

—

"ఒక పురావస్తువు షాపులో కనబడింది నాకు. పాత చెత్త కెలకడ మంటే నాకు ఎంత సరదావో నీకు తెలుసుగా. ఈ ప్రార్థనపుస్తకం ఒక షాపులో జతపడింది. చూద్దూ, ఇలా చూస్తే ఇది శిలువ రూపంలో వున్నట్టు అవుపడుతుంది, ఏం? అసలు నాకు దొరికినది బైండింగు ఒక్కటే. కడమ దంతా — కాగితాలు బదులు దంతపు పలకలూ, బందులూ, కొక్కేలూ, పెన్సిలూ, అన్నీ నేనే ఎంతో జాగ్రత్తగా ఊహించి పురమాయించాను. ఎంతో కష్టపడి ఓపికగా మొల్లీనేకి బోధపర్చాను — ఎంత బుర్రకొట్టుకు నేది అతగాడికి అర్థమైందికాదు. ఈ బందులూ కొక్కేలూ అసలు మొత్తం నమూనాతో నప్పేటట్టు మెరుగుపెట్టని పాత బంగారంలో సన్నగా చెక్కి వుండాల్సింది — మరి అతగాడేంచేసిందీ ఆ దేవుడికే తెలియాలి. గొలుసు మాత్రం సిసలైన వెనిస్ కంసాలి పని, బహుపురాతనం."

రమణీయతతో తొణికిసలాడుతూన్న ఆ బైండింగును ఎంతో ఆప్యా యంగా నిమిరింది వేర.

"ఎంతటి పూర్వకాలమైన వస్తువో కదా!.. ఈ నోటుబుక్కు ఏనా టిదై వుంటుందో?" అని అడిగింది వేర.

"ఇదమిద్ధంగా చెప్పలేను గాని, పదిహేడో శతాబ్ది అంత్యానిదో, పద్దె నిమిది మధ్యదో అయివుంటుందని నా అంచనా."

"ఏం చిత్రమో!" అంది వేర, ఆలోచనలో మునిగి చిరునవ్వుతో. "ఏ మార్క్విసె డి పాంపెడోర్, ఏ మేరీ ఆంట్వొనెట్ హస్తాలో స్పృశించిన వస్తువు నా చేతిలో వుందికదా ఇప్పుడు. నువ్వేమిటో ప్రార్థనపుస్తకాన్ని ఆడ దాని నోటుబుక్కు కింద మార్చేశావాయె. ఈ పనికి అచ్చంగా నువ్వే తగు



27—2

దువే, అన్న! అవునుగాని, ఇంట్లో ఏంజేస్తున్నారో వెళ్లి చూడొద్దా మరి? వెళ్దాం పద.''

రాతిపలకలతో చపటా చేసిన చప్పరం. చప్పరానికి అన్ని వైపులా చెక్కబద్దల అల్లిక వున్న పందిర. పందిరిమీాద పాకి వుంది ''ఇసబెల్లా'' ద్రాక్షతీగె. ఆ చప్పరంమీాద నడుచుకుంటూ ఇంట్లోకి వెళ్లారు. లీలగా స్ట్రాబెర్రీలలాగు పరిమళించుతూన్న నల్లని ఆ పెద్ద పెద్ద గుత్తులు కారు పసరు రాశి మధ్యనుండి వేలాడుతూండగా, అక్కడక్కడ దూసుకుని వస్తూన్న సూర్యకాంతి వాటిని బంగారంతో మలామా చేస్తున్నాయి. పచ్చని కను చీకటి ఆ చప్పరాన్ని ముంచెత్తి, ఇద్దరి స్త్రీల ముఖాలపైనా లేతగా ప్రతి బింబిస్తూంది.

''ఇక్కడ ఏర్పాటు చేశావా భోజనం?'' అని అడిగింది అన్న.

''ఇక్కడే చేద్దామనుకున్నాను మొదట... కాని సంజవేళకల్లా ఇప్పుడు బాగా చలేస్తూంది. అందుకని భోజనాలగదిలోనే మంచిదనిపించింది నాకు. మొగాళ్లు ఇక్కడకొచ్చి పొగతాగొచ్చు.''

''అచ్చటైన వాళ్లూ ముచ్చటైన వాళ్లూ ఎవరేనా వస్తున్నారా?''

''ఎవరొస్తున్నారో నాకింకా తెలీదు. కాని మన తాతగారు మాత్రం వస్తున్నారు, అంతమటుకు నేను నిశ్చయంగా చెప్పగలను.''

''ఏమిటి, తాతగారే? భళిభళీ!'' అంటూ ఒక్కకేక వేసింది అన్న. ''ఆయన్ని చూసి ఏ పుష్కరమో అయింది!''

''వాస్య అక్కగారు వస్తూంది. ప్రొఫెసర్ స్నేప్నికొవ్ కూడా వస్తా న్నటే వుంది. వీళ్లిద్దరూ వస్తున్నారని తెలిసి నాకు నిన్నటినుండీ మతి పోయిందంటే నమ్ము, ఒసేవ్, అన్న! నీకు తెలుసుగా వాళ్లిద్దరూ — తాత

గారూ, ప్రొఫెసరూ — భోజనప్రియులని. ఈ పల్లెటూరులోనూ, పొరుగూరిలోనూ ఎంత డబ్బు కుమ్మరించినా ఏవీా దొరకవు గదా. అతగాడి పుణ్యమా అంటూ లూక ఎక్కడనుండో కోలంకి పిట్టల్ని సంపాదించాడు — అతడికి తెలిసిన షికారి నెవడినో పురమాయించి, ఇప్పుడు తన పాకవిద్య నంతా వాటిమీద చూపిస్తున్నాడు. ఇక్కడ దొరికే మాంసం ఏమంత బాగుండదని చెప్పేందుకు వీల్లేదుగాని — అదేమి ఖర్మమో, మరా రోస్టు బీఫ్ తప్పదుకదా! గాజురొయ్యలు మాత్రం చక్కనివి దొరికాయి.''

''ఇక దీనికేం లోటొచ్చింది? బాగానే వుందే. దీని గురించి నువ్వేం బెంగపెట్టుకో నక్కర్లేదు. అయినా, మనలో మాట, నీకూ అన్ని రుచులూ కావాలి! ఒప్పుకో మరి?''

''దానికేంగాని — మరీ వేళ ప్రత్యేకంగా భేషైనది ఏదో ఒకటుండాలిగా. ఈవేళ ఉదయాన్నే జాలరి మాకోసమని సముద్రపు పెట్టనొక దానిని తీసుకొచ్చాడు. నేను చూశాను దాన్ని. అబ్బో, ఏకంగా బ్రహ్మరాక్షసే. చూస్తేనే హడలెత్తుకొస్తూంది.''

ఈ వస్తువుతో తనకు నిమిత్తం వుంది, ఈ వస్తువుతో తనకు నిమిత్తం లేదు అనే వివక్షత లేకుండా, అన్నిటి గురించీ కావాలంటుంది ఆన్న. ఆమె తత్వమే అంత. తానూ ఆ చేపను చూస్తాను, వెంటనే తెప్పించమంది.

నిడుపువాటుగా వున్న తెల్లని బేసిన్‌లో ఆ చేపను వుంచి, శుభ్రంగా కడిగి మైనపు రంగుతో మెరుగుపెట్టిన చెక్కకూర్పు నేలమీద నీళ్లు తొణకుండా అతి జాగ్రత్తగా అతి కష్టంతో బేసిన్‌ను చెవులతో పట్టుకుని, లూక ప్రత్యక్షమయాడు. లూక మంచి పొడగరి. మీసం గడ్డం లేదు. బోడిగుండు. పాలిపోయి పచ్చబారిన ముఖం.

"పన్నెండున్నర పౌన్లుందండీ, దేవరవారు చిత్తగిస్తే" అంటూ వంటవాళ్లకు ప్రత్యేకమైన సహజగర్వంతో చెప్పాడు లూక. "ఇందాకలా మేం తూచామండి."

బేసిన్ కంటె చేప పెద్దదవడంచేత, అది బేసిన్‌లో ఇమడక, తోక చుట్టుకునుంది. పొలుసులపైన బుటేదారీ జరీ కింఖాబులాగున బంగారపు చుక్కలు తళతళ మెరుస్తున్నాయి. వాజములు కారుఎరుపుగా ప్రకాశిస్తున్నాయి. విసనికర్రలా వున్న పొడుగాటి నీలిఛాయ రెక్కలు రెండూ క్రూరంగా కానొస్తూన్న ఆ బ్రహ్మాండమైన తలకాయకు రెండు వైపులా నిక్కపొడుచుకున్నాయి. చేప ఇంకా బతికే వుంది, మొప్పలు చకచకా పనిచేస్తున్నాయి.

చెల్లి జాగ్రత్తగా చేతితో చేప తలమీద తట్టింది. చేతి స్పర్శ తగలగానే చేప టఫీమని తోకతో ఒక్క చరుపు చరిచింది. దానితో ఒక్క కేక పెడుతూ ఆన్న తన చెయ్యి లాగేసుకుంది.

"దేవరవారి చిత్తమండి, తమరేమీ బెంగపడ నవసరం లేదండి. తమకి ఏమీ మాట రాకుండా అన్నీ భేషుగ్గా చేస్తామండి, చిత్తం" అన్నాడు వంటవాడు, వేర పడుతూన్న ఆందోళనను గ్రహించి. "బల్గేరియావాడొకడు బొప్పాసులంటూ ఏవో రెండు అనాసల్లాంటివి ఇప్పుడే ఇచ్చి వెళ్లాడండి. చూడ్డానికి కర్బూజాల్లా వున్నా, చక్కని వాసనేస్తున్నాయండి. దేవరవారు చిత్తగిస్తే, చేపతో వడ్డించడానికి, తార్తార్ పులుసా, పోలిష్ పులుసా, ఏ పులుసు కాచమని సెలవండి? లేకుంటే మామూలుగా వెన్నతో వేయించిన రస్కా పొడా అండి?"

"మీకేది బాగుంటుందని తోస్తే ఆదే చేయించండి. ఇక వెళ్లి మీ పని చూసుకోండి!" అంది రాజకుమారిక.

# 4

సాయంకాలం ఐదుగంటల తరువాతనుండి అతిథులు ఒక్కొక్కరే రావడం మొదలైంది. రాజకుమారుడు వసీలి ల్వోవిచ్ తన తలచెడ్డ తోబుట్టువును తీసుకొని వచ్చాడు. లూద్మిల ల్వోవ్‌న దురాసావది స్థూలకాయం. సాధుస్వభావం. మితభాషి. వసుచోక్ అనే మరొకతనిని కూడా రాజకుమారుడు వెంటేసుకొచ్చాడు. ఇతడు డబ్బుతో నీలుగుతూ పైలేపచ్చీసులో వున్న మనిషి. రంగేలా పురుషుడు. ఉత్త పెంకె ఘటం. పోకిరీ. పట్నంలో వాళ్లందరూ అతన్ని 'వసుచోక్' అని ముద్దుపేరుపెట్టే పిలిచేవాళ్లే. చక్కగా పాడగలడు, పద్యాలు భేషుగ్గా వల్లిస్తాడు, భాగోతాలు కట్టిస్తాడు, నాటకాలు వేయిస్తాడు. ధర్మకార్యాలకోసం మేలాలు ఏర్పాటు చేయగలడు. మంచి కలుపుకోలు మనిషి. ఇతగాడు లేనిదే పట్నంలో ఏ విందూ, ఏ కార్యమూ ఎవ్వరూ తలపెట్టరు. రాజకుమారుడు మరొకామెను కూడా తీసుకొచ్చాడు. ఆమె పేరు జెన్నీ రెయ్‌టర్. ప్రఖ్యాత పియానిస్టు. రాజకుమారిక వేర చిన్ననాటి స్నేహితురాలు. చిన్నప్పుడు ఇద్దరూ కలిసి స్మోల్నీ స్త్రీకళాశాలలో చదువుకున్నారు. వసీలితో కలిసే వచ్చాడు అతని బావమరది, నికొలాయ్ నికొలాయెవిచ్. వీరు వచ్చిన తరువాత తన మోటారుకారు వేసుకుని వచ్చాడు అన్న పెనిమిటి. ఇతని కారులోనే బొండాంలాంటి గుండూ, గున్నఏనుగులాంటి శరీరమూ, అడవి మనిషిలాంటి రూపురేఖలూ వున్న ప్రొఫెసర్ స్పెష్నికొవ్, స్థానిక వైస్‌గవర్నరు ఫన్ జెక్, వీరిద్దరూ వచ్చారు. వీరందరూ వచ్చిన తరువాత, ఇక ఆఖరున చక్కని అద్దె లాండో గుర్రపుబగ్గీలో వచ్చాడు జనరల్ అనోసొవ్. ఈయనతో కలిసి మరో యిద్దరు మిలిటరీ

ఆఫీసర్లు: వయసుకు మించి వృద్ధుడుగా కనబడుతూ బక్కపలచగా, తలకు మించిన గుమాస్తాగిరీ బండపనితో తెమల్లేక గింజుకుని చిర్రు బుస్సుమను కుంటూన్న స్టాఫ్ కర్నల్ పొనమరేవ్, పీటర్స్‌బర్గ్‌లో కల్లా మంచి నర్తకుడూ, క్రీడాలాంఛన సూత్రధారుడూ అని పేరుమోసిన గార్డ్సు లెఫ్టినెంట్ బహ్తీన్‌స్కి వచ్చారు.

మంచి పొడగరి, వెండికొండలా నెలసిన శిరస్సు, స్థూలకాయుడు అయిన జనరల్ అనోసొవ్, ఒకచేతితో కోచ్‌మేన్ పెట్టుకున్న గ్రాదిని ఆనుకుని, రెండో చేతితో బండి వెనకాలతట్టు పట్టుకొని బండి మెట్టుమీద నుండి నేలపై భారంగా అడుగుపెట్టి దిగాడు. అతని ఎడమచేతిలో చెవి గొట్టం వుంది, కుడిచేతిలో రబ్బరు పొన్ను తొడిగిన మలాకా చేతికర్ర వుంది. ఎర్రగా మోటుగా పెద్ద ముఖం. పొన్నకాయలా పెద్ద ముక్కు. కళ్లు ముడి పెట్టుకుని చూస్తాడు. ఆలా చూసినప్పుడు, ప్రాణాపాయాన్ని లక్ష్యం చేయక మృత్యు దేవతనే తరుచు ముఖాముఖీ సవాలు చేసిన ధైర్యవంతులైన సామాన్యపు మనుషులకు సహజమైన హుందాతనమూ, వెటకారంతో మేళవించిన ఉల్లాసమూ ఆ ముఖంలో తాండవిస్తూంటాయి.

అక్కచెల్లెళ్లిద్దరూ ఆయనను దూరంనుండే పోల్చుకుని, పరుగెత్తుకుని వెళ్లి, ఆయన బండి దిగుతూండగా ఇద్దరూ చెరొక రెక్క పట్టుకుని సగం వేళాకోళంగా సాయంచేస్తూ ఆయనను బండినుండి దింపారు.

''జగద్గురు వుగారికి... బ్రహ్మరథంలా, ఇదేమిటి? బాగుబాగు!'' అన్నాడాయన ఆపేక్షగా, బొంగురుపోయిన గొంతుకతో బొంయ్‌మంటూనూ.

''తాతగారూ! తాతగారూ! మామీద బొత్తిగా శీతకన్నేశారు. ఈవాళే వస్తారో రేపేవస్తారో అని మేం అనుకుంటూంటే, అసలు దర్శనమే

ఇవ్వడం మానేశారు, సిగ్గుబిడియాలు గాలికి వదిలేసి! అంది వేర నిష్ఠురం నటించుతూ.

"మన తాతయ్యగారు దక్షిణాదికి వచ్చి మర్యాదలకీ మొహమాటాలకీ తిలోదకాలిచ్చేశారు" అంది అన్న నవ్వుతూనూ. "అయ్యో తన అభిమాన పుత్రిక ఒక్కర్తే ఇక్కడుందే అన్నమాటే పరగడుపున పడిపోయిందాయనకి. ఇంతగా సిగ్గుసెరాలు వదలిపెట్టేసి రంగేలా పురుషులైపోయి మా మాటే మర్చిపోవడం మీకేమోనా బాగుందా చెప్పండి!"

రాజఠీవితో తన టోపిని తీసి, అక్కచెల్లెళ్లనిద్దరనూ మొదట చేతుల మీద ముద్దుపెట్టుకుని, తరువాత చెక్కిళ్లమీద ముద్దుపెట్టుకుని, మళ్లీ మరొక సారి వాళ్లిద్దరి చేతులూ ముద్దుపెట్టుకుని, అప్పుడన్నాడాయన:

"అమ్మాయిలూ!.. ఆగండాగండి, అంతలా కోప్పడితే ఎలాగుమరి?" ఆయనకు ఎంతకాలంగానో వున్న ఉబ్బసం కారణంగా గుక్క తిప్పుకోడానికని మాటకీ మాటకీ మధ్య ఆగుతూ ఇంకా ఇలా అన్నాడు. "నిజం చెబుతున్నా, నా మాట నమ్మండి... ఉత్తదౌర్భాగ్యులు ఈవైద్యులు... ఈ ఎండకాలమంతా వాతనొప్పులకని నాకు మందిచ్చారు. ఆ ముద్ద చూస్తేనే నాకు డోకొస్తుంది... చండాలపు వాసన... ఏదో లేహ్యమట... మీకో నమస్కారం, మీ మందుకో నమస్కారమర్రా అంటే నన్ను వదలాయెరి... మిమ్మల్ని చూడ్డానికే... ఇల్లు కదిలాను. చాలా సంతోషంగా వుంది... మిమ్మల్ని చూడ్డం... అంతా కుశలమే కద? ఏం వేరొచ్క, చిట్టితల్లి... అచ్చు మీ అమ్మలాగే వున్నావు సుమా... బారసాలకు ఎప్పుడు పిలుస్తావు?"

"మరీ జన్మకి అంత అదృష్టం లేదు తాతగారూ."

''అలాగంటే ఎలాగమ్మా! ఇంకా అంతా ముందుకే వుంది... దేవుడిని ప్రార్థించు... తెలిసిందికాదూ?.. నువ్వెలావున్నావ్ అన్న, చిట్టితల్లీ? పిసరంతైనా మారలేదు సుమా నువ్వు... నువ్వు షష్టిపూర్తి చేసుకున్నా సీతాకోకచిలుకవే! సరేకాని, ఈ ఆఫీసర్లను మీకు పరిచయం చేయనీయండి'' అన్నాడాయన.

''వారి పరిచయ భాగ్యం నాకు చాలా కాలంకిందటే లభించిందండి'' అన్నాడు కర్నల్ పొనమరేవ్, వంగి నమస్కారం చేస్తూ.

''రాజకుమారిగారి పరిచయం కల్గే అదృష్టం నాకు పీటర్స్‌బర్గ్‌లో లభించిందండి'' అన్నాడు హుజార్ లెఫ్టినెంట్.

''అయితే మరి, అన్న, చిట్టితల్లీ, ఈయను నీకు పరిచయం చేయనీయి. ఈయన లెఫ్టినెంట్ బహ్తీన్‌స్కి, నర్తకుడూ, ఆతతాయీ. భేషైన ఆశ్వికుడు. నాయనా, బహ్తీన్‌స్కి, బండిలోంచి ఆ వస్తువులు కాస్త తీయించు బాబూ! అమ్మాయిలూ, ఇక ఇంట్లోకి వెళ్దాం పదండి. వేర, తల్లీ, ఏమిటేమిటి చేయించావు వంటలు? ఈ వైద్యులు కాదుగాని, వాళ్ళు చెప్పిన పథ్యం చేసేసరికి జఠరాగ్ని ఆవురావురు మంటూ ఆకలి దహించుకుపోతూంది... బకాసురుడే మళ్ళీ నాకు పోటీ... ఏమనుకున్నావో!''

దివంగతుడు రాజకుమారుడు మిర్జా-బులాత్-తుగనోవ్‌స్కి, జనరల్ అనోసావ్ — ఇద్దరూ ప్రాణస్నేహితులు, అనేక యుద్ధాల్లో కలిసి పాల్గొన్నారు. తన నేస్తం చనిపోయిన తరువాత, తన నేస్తం మీద వుండే ప్రేమ అంతా అతని కుమార్తెల పట్ల అవ్యాజమైన పితృవాత్సల్యంగా మారిపోయింది. బొడ్డూడినప్పటి నుంచీ కూడా వాళ్ళిద్దరినీ తెలుసును ఆయనకి. అసలు అన్న ఆయన అభిమాన పుత్రిక. ఆరోజుల్లో — ఇప్పుడు కూడానూ —

ఆయన కై– నగరంలో వున్న పెద్ద కోటకి కమాండరు. అది బ్రహ్మాండ మైన కోటే అయినా, అప్పటినుండీ కూడా అది ఇంచుమించు ఖాళీగానే వుంటూంది. ఆ రోజుల్లో ఆయన తుగనోవ్‌స్కీగారి ఇంటికి ప్రతిదినమూ వస్తూండేవాడు. ఆయన దగ్గర పిల్లలిద్దరికీ ఇంతా అంతా చేరికకాదు, ఆయనంటే వాళ్లకి సాక్షాత్తూ దేవుడే. ఆయన కూడా వాళ్లను విపరీతంగా ముద్దుచేస్తూ, వాళ్లకి ఆయన ఎప్పుడూ – మిఠాయిలో, బహుమతులో – ఏదో ఒకటి అలా ఇస్తూనే వుండేవాడు; సర్కస్సులకీ, నాటకాలకీ వెళ్లమని బాక్సు టిక్కెట్లు ఇచ్చేవాడు; అంతేకాదు, వాళ్లతో కలిసి అన్ని ఆటలూ ఆడేవాడు; ఆయనలా వాళ్లతో ఆడుకోవడం మరెవ్వరికీ చేతన యేదికాదు. ఇక అన్నిటికంటే మించినదీ, అనోసావ్ అంటే వాళ్లకి చిన్నతనంలో అంతగా చనవు కుదిరిపోవడానికీ కారణమూ, ఈనాటికీ వాళ్ల మనస్సులో చిరాంకితమై నిలచిపోయినదీ, రణరంగాలూ, యుద్ధాలూ, కావలిగస్తీల గురించీ, జయాపజయాల గురించీ, చావులూ గాయాలూ మంచుతుపాన్ల గురించీ ఆయన చెప్పిన కథలు – హడావుడీ ఆర్భాటమూ లేకుండా, పురాణగాథల్లా ప్రశాంతంగా సాగిపోతూ అలంకారాలూ నగిషీలూ లేకుండా అమాయకమైన కథలు; సాయంకాలం ఫలహారానికీ, 'రాత్రి అయింది, ఇక పోయిపడుకోండి, పిల్లలూ' అనే కర్ణకఠోరమైన ఆజ్ఞకీ మధ్యనున్న వ్యవధిలో చెప్పిన కథలు.

ఈనాటి పరిస్థితుల్లో, పాతకాలపు అవశేషంలా కనబడే ఈ వ్యక్తి ఏతైలవర్ణచిత్రంలోనుండో చిత్రమైన ఆజానుబాహువు ఒకడు అమాంతమూ సజీవుడై బయటికి వచ్చేసి ఈ భూమిమీద సంచరిస్తున్నాడా అనిపించుతుంది. ఈనాటికి సైతమూ సామాన్యపు సోల్జర్లలోనేతప్ప ఆఫీ

సర్లలో అవుపడని లక్షణాలు, నిరాడంబరములే అయినప్పటికీ పై పై మెరుగుల్లా కాకుండా మనిషిలో లోతుగా వేరూని మనసును కరిగించే గుణాలు, కేవలం రష్యన్ పల్లెపట్టు రైతుకుండే గుణాలు, వేటి మేళవింపు వల్లనైతే మన సోల్జరుని అజేయునిగానే కాకుండా ప్రాణత్యాగిగా త్యాగధనునిగా, సాక్షాత్తూ పావనభక్తునిగా పరివర్తన చేసివేస్తున్నాయో అట్టి గుణాలు — కల్లకపటం ఎరగని, ఒక విధమైన సత్యకాలపు భయభక్తులతో జీవితం పట్ల స్పష్టమూ ఆనందదాయకమూ అయిన వైఖరిని అవలంబించుతూ, వెర్రిమొర్రి దుందుడుకుతనమేదీ ప్రదర్శించకుండా నెమ్మదిగా నిత్యకృత్యంలాంటి ధైర్యసాహసమూ, మృత్యుసమక్షమందు సహితమూ నమ్రత, అద్భుత శారీరక నైతిక పటుత్వం — ఈ గుణాలు ఆయనలో మూర్తిభవించాయి.

పోలెండు యుద్ధం మొదలు, ఒక్క జపాను యుద్ధం మినహా, ఈ నాటివరకూ జరిగిన అన్ని యుద్ధాల్లోనూ అనోసావ్ పాల్గొన్నాడు. జపాను యుద్ధంలోకి కూడా ఎట్టి తటపటాయింపూ లేకుండా అతడు తప్పక వెళ్లి వుండేవాడే, కాని యుద్ధంలోకి వచ్చి చేరమని అతనికి ఆర్డరు రాలేదు. అతడు తన జీవితంలో, నిరాడంబరమే అయినప్పటికీ మహత్తరమైన నియమం ఒకటి పెట్టుకున్నాడు: 'శ్రీముఖం అందనిదే మృత్యు దర్శనానికి వెళ్లకు' అని. సైన్యంలో తాను ఎన్ని సంవత్సరాలైతే పని చేశాడో అన్ని సంవత్సరాల్లోనూ కూడా తన మనుషులను ఒక్కసారైనా కొరడాతో కొట్టించలేదు సరేకదా, వాళ్ల వంటిమీద వేలైనా వెయ్యలేదు. పోలెండులో తిరుగుబాటు జరిగినప్పుడు, ఒకసారి కొంతమంది పోలిష్ ఖైదీలను తుపాకి కాల్పులకు ఆహుతి చేయాల్సిందని రెజిమెంటు కమాండరే స్వయంగా అతనిని ఆజ్ఞాపించినప్పటికీ, తానా పని చెయ్యను పొమ్మన్నాడు: "గూఢచారులైతే

చెప్పండి, ఒకరిచేత చంపించడమెందుకు, మీా ఆజ్ఞ అయితే నా చేతులతో నేనే వాళ్లను కాల్చి పారేస్తాను. కాని వీళ్లనా? వీళ్లనా ఖైదీలు, వీళ్లను నేను చంపించలేను'' అని చెప్పేశాడు. ఆ చెప్పడం కూడా డాబూ దర్పమూ, ప్రగల్భమూ డాంబికమూ రవంతైనా లేకుండా, అతి గౌరవంగా అతి అణకువతో తన పై అధికారికేసి సరాసరి చూస్తూ ఎట్టి తణుకూ బెణుకూ లేకుండా చెప్పాడేమో, ఆజ్ఞను ధిక్కరించినందుకు అతనికి మరణశిక్ష విధించడం బదులు, ఏమీా అనకుండా వూరుకున్నారు.

1877–1879 యుద్ధంలో అతనికి త్వరత్వరగా ప్రమోషను దొరికి – అతను పెద్ద చదువేదీ చదువుకోనప్పటికీ కూడా, అతనే అనేవాడు, నేను కేవలం ఒక్క 'ఎలుగ్గొడ్డు కాలేజీనే పూర్తిచేశాన'ని – కర్నలు హోదా అందుకున్నాడు. ఆ యుద్ధంలో డాన్యూబ్ నదీ, బాల్కన్ పర్వతాలూ దాటడంలో అతను పాల్గొన్నాడు; షీప్క కనుమలో శీతకాలమంతా దండు విడిశాడు; ప్లేవ్న దుర్గంపై జరిగిన ఆఖరి దాడిలో తానూ పోరాడాడు; ఐదుసార్లు గాయపడ్డాడు, నాలుగు సార్లు తేలికైన గాయాలే తగిలాయి గాని, ఐదవ సారి మాత్రం చేతిబాంబు వొంట్ల దుసూకుపోయి షెల్‌షాక్ తగిలింది. జనరల్ రదేత్స్కి, జనరల్ స్కోబెలెవ్‌లు ఇద్దరూ అతనిని ఎరిగినవారే. అతనంటే వారిద్దరికీ అతి గౌరవం. ''నాకంటే ధైర్యవంతుడైన ఆఫీసరుని నేనెరుగుదును. అతని పేరు మేజర్ అనోసొవ్'' అని స్కోబెలెవ్ ఇతన్ని గురించే అన్నాడు.

యుద్ధం నుండి తిరిగి వచ్చేయడంలో ఆ చేతిబాంబు తునకలవల్ల తగిలిన షెల్‌షాక్ ఫలితంగా చెవులు రెండూ పూర్తిగా ఘడియలు పడిపోయి బ్రహ్మచెవుడు వచ్చేసిందతనికి; బాల్కన్ దేశాల్లోకి సైన్యాలను నడిపించు

కుంటూ వెళ్లడంలో ఆ శీతలానికి కాళ్లు కొరడుబారిపోగా, ఒక పాదానికి మూడు వేళ్లు తీసెయ్యాల్సొచ్చింది. ఇక షీప్క కనుమలో దండువిడిసినప్పుడు తీవ్రంగా వాతం ముంచుకొచ్చి, ఆ వాతం అలా శాశ్వతంగా వుండిపోయింది. యుద్ధం అయిపోయాక రెండేళ్లపాటు మామూలు శాంతికాలపు సర్వీసు చేశాక ఇక అతనికి పింఛనిచ్చేద్దామని అనుకున్నారు, కాని ససేమిరా ఏమాత్రమూ అతను ఒప్పుకోక, మొండికేసి సర్వీసులోనే వుండిపోయాడు. డాన్యూబ్ నది దాటినప్పుడు అనోసావ్ ప్రదర్శించిన అచంచల పరాక్రమాన్ని ఆ రాష్ట్రపు గవర్నరు స్వయంగా చూసినవాడవడంచేత, సరిగా సరైన తరుణంలో గవర్నరు జోక్యం కలుగజేసుకుని, తన పలుకుబడిని ఉపయోగించాడు. ఫలితంగా పీటర్స్‌బర్గ్‌లో అధికారవర్గం కూడా ప్రఖ్యాతి వడసిన ఆ కర్నల్ మనస్సుకు కష్టం కల్గించడం భావ్యం కాదని తెలుసుకుని, దేశక్షేమానికి ఆవశ్యకం కంటె గౌరవమే అధికంగా కలిగినట్టి కె– కోట గవర్నరు పదవికి అతనిని యావజ్జీవమూ నియమించేశారు.

ఆయనంటే వూళ్లోవున్న ఆబాలగోపాలనికీ తెలుసు. ఆయనలో వుండే చిన్నచిన్న లోపాలనూ ఆయన తమాషా తమాషా అలవాట్లనూ ఆయన దుస్తుల తీరూ చూసి ఆయననందరూ సరదాగా వేళాకోళం చేస్తూంటారు. వీధిలోకి వెళ్లేటప్పుడు ఆయన ఎన్నడూ కత్తికటార్లు ధరించేవాడుకాదు. ఏనాడో ఫాషన్‌లోనుండి పోయిన పొడుగు కోటు తొడుక్కొని, ఎత్తుగా సరాసరి ముందుకు తోసుకొస్తూ అంచు వున్న మిలిటరీ టోపీ పెట్టుకుని, ఎడమ చేతిలో చెవి గొట్టమూ కుడి చేతిలో మలాకా బెత్తమూ పట్టుకుని బయల్దేరేవాడు. ఆయన వెంట బద్ధకం బలిసిపోయి దుక్కతన్ని జాలుతో కట్టేసిన మూతులలో నుండి నాలుకలు వేలాడించుకుంటూ గుర్రుగుర్రుమని

మొరుగుతూన్న చిన్న కుక్కలు రెండు ఎప్పుడూ వుంటూంటాయి. ఉదయం షికారు వెళ్ళేటప్పుడు దారిలో పరిచయస్థు లెవరైనా ఆయనకు తారసి ల్లినట్టాయెనా, ఆయన గొంతు బద్దలుచేసుకుంటూ మాట్లాడడమూ, ఆ గాత్రానికి వంత పాడుతూ ఆ రెండు కుక్కల అరుపులూ దారంట పోతూ వీధి చివరనున్న వాళ్లకి కూడా వినబడుతూంటుంది.

చాలామంది చెవిటివాళ్ల మల్లేనే ఆయన కూడా సంగీత నాటకాలంటే చేవికోసుకుంటాడు. నాటకంలో నాయకీ నాయకులు యుగళగీతం పాడుతూ మంచి రసకందాయం సమయంలో, బొంయ్‌మంటూ రణరంగంమీద ఉత్త రవులను ఇస్తూన్న కంఠంతో ఆయన వ్యాఖ్యానం నాటకశాలలో ప్రతి ధ్వనించేది: ''ఆరె, వీడి తస్సా దియ్యా! ఏమి రాగం విసిరాడండీ, అహాహా! చెక్కి పారేశాడు కదూ!'' ముసిముసి నవ్వులతో నాటకశాలంతా నిండి పోయేది. పక్కనున్నవాడి చెవిలో చిదంబర రహస్యం వూదాననే అనుకుని ఆయన మాత్రం నిశ్చితంగా చెక్కు చెదరకుండా కూచునేవాడు.

ఆయన అధికారవిధులలో ఒకటి — కోటలో వున్న ఖైదీలను తనిఖీ చేయడం. అరెస్టులో వున్న మిలిటరీ ఆఫీసర్లను ఈ కోటలో వున్న గార్డ రూమ్‌లో వుంచేవారు. ఈ ఖైదును ఆయన తరుచు తనిఖీ చేస్తూండే వాడు. తనిఖీమీద అక్కడకు వెళ్లినప్పుడు కూడా విధివిరామం లేకుండా గుర్రుగుర్రుమని మొరుగుతూన్న కుక్కలు ఆయన వెంటే వుండేవి. అరె స్టులో వున్న ఆఫీసర్లు మిలిటరీ విధులనుండి తాత్కాలిక విరామం అను భవించుతూ, టీ కప్పులలోనూ చీట్లపేకాటల్లోనూ మునిగితేలుతూ, కబుర్లూ కథలూ చెప్పుకుంటూ హాయిగా కాలక్షేపం చేస్తూండేవారు. తనిఖీమీద వెళ్లినప్పుడు, ఆయన వాళ్లను ఒక్కొక్కరినే నిదానంగా: ''మీ పేరు?

ఇంటి పేరు? మిమ్మల్ని ఎవరు అరెస్టు చేశారు? అరెస్టు శిక్ష ఎంతకాలం? ఎందుకని?'' అని ఓపికగా అడిగేవాడు. ఆ ఆఫీసరు చేసిన పని చట్టవిరుద్ధమే అయి వుండినప్పటికీ, ఒక రేమనుకుంటారో అని లెక్కచేయకుండా బిగ్గరగానే అతని పరాక్రమాన్ని ఆయన మెచ్చుకునేవాడు ఒక్కొక్కప్పుడు. ఒక్కొక్కప్పుడు అంత బిగ్గరగానూ ఆఫీసరు చేసిన పనికి, నలుగురికీ వినబడుతుందన్న సంగతి లెక్కచేయకుండా, చివాట్లు పెట్టేవాడు. చివాట్లు పెట్టడం అయిపోయీ అయిపోవడంతో, వెంటనే అడిగేవాడు, ఆ ఆఫీసరు ఎక్కడనుండి భోజనం తెప్పించుకు తింటున్నాడో, అందుకు అతనికి ఎంత డబ్బు ఖర్చు అవుతూందో అన్నీ అడిగేవాడు. గార్డ్ రూములు ఏర్పాటులేని ఏ మారుమూల కోటనుండో ఏ సెకండ్ లెఫ్టినెంటునో శిక్ష అనుభవించడం కోసం ఈ కోటకు పంపడం తటస్థపడేది. ఒకమాటు ఇలాగే సెకండ్ లెఫ్టినెంట్ ఒకడు ఏదో తప్పుచేసి దీర్ఘకాలపు అరెస్టుమీద ఈ కోటకు వచ్చాడు. ఆ లెఫ్టినెంటుకి డబ్బులేక, మామూలు సోల్జర్ల కందాలోనే భోజనం చేస్తూన్నట్టు ఆయన ఎదుట ఒప్పుకున్నాడు. ఆ ఖైదుకు నూరు గజాల దూరంలోనే వున్న తన భవనంనుండే ఆ లెఫ్టినెంటుకి రోజూ భోజనం పంపించేటట్టు ఆయన తక్షణమే హుకుం జారీచేశాడు. ఇలా ఒకసారి కాదు, అనేక సార్లు జరిగింది.

ఆయనకీ తుగనోవ్‌స్కీ కుటుంబానికీ స్నేహం కుదిరిపోవడం కె—వ్వూరిలోనే. ఆ పిల్లలకీ ఆయనకీ ఎంత సన్నిహితమైపోయిందంటే, వెళ్ళి వాళ్లను రోజూ చూస్తేనేగాని ఆయనకి ఆ రోజు గడిచేదికాదన్న మాటే. ఎప్పుడైనా గనుక రాజకుమారికలు ఇద్దరూ మరెక్కడికైనా వెళ్ళినా, లేకుంటే ఆయనకే అత్యవసర కార్యాలుండి ఆనాడు తాను వారింటికి వెళ్లేందుకు

వీలుపడకపోయినా, ఇక ఆ రోజంతా బ్రహ్మాండమైన ఆ రాజభవనంలో విశాలమైన ఆ గదుల్లో తాను ఒక్కడూ గడపడం ఆయనకేమిటో ఒంటరిగా వున్నట్టనిపించి, విచారంతో మతిపోయినట్టే అయిపోయేది ఆయనకి. ప్రతి వేసవికీ ఆయన సెలవు పుచ్చుకుని, కె— నగరానికి నలభై మైళ్లలో వున్న తుగనోవ్స్కి కుటుంబంవారి ఎస్టేటు, యెగోరొవ్స్కాయె గ్రామానికి వెళ్లి నెలరోజులపాటు అక్కడ గడిపేవాడు.

తన హృదయాంతరాళంలో మాటుమణగిపోయి నిగూఢంగా వుండిపోయిన ప్రేమానురాగాలూ, వాత్సల్యాభిమానాలూ అన్నీ ఆ పిల్లలకు, అందులోనూ ముఖ్యంగా ఇద్దరు ఆడపిల్లలకూ ఆయన అర్పించేశాడు. ఎన్నాళ్ల కిందటో ఆయనకు పెళ్లి అయింది. అది జరిగి ఏ ఇక్ష్వాకుల నాటి కాలమే అయిందో. తనకు ఒకప్పుడు వివాహమైందన్న సంగతే ఆయన మరిచిపోయాడు. అది యుద్ధం పూర్వంనాటి సంగతి. ఊరూర తిరిగే నాటకం కంపెనీలో వేషగాడిని ఒకడిని చూసి, అతగాడు వేసుకున్న ముఖమల్ కోటుకీ లేసు అంచులకీ ఆయన పెళ్లాం కళ్లు చెదిరిపోయి, వాడితో లేచిపోయింది. పెళ్లాం బతికున్నంత కాలమూ ఆమెకి మనువర్తి పంపించేవాడు అనోసొవ్. ఆమె పశ్చాత్తాపపడి నెత్తీ నోరుకొంటుకుంటూ అతని కాళ్లు పట్టుకుని ఎంత బతిమాలుకున్నా, ప్రాధేయపడినా, ఏడుస్తూ అఘోరిస్తూ ఎన్ని వుత్తరాలు రాసినా ఆమెను మాత్రం మరి తన దగ్గరకు రానివ్వలేదు, తన ఇంట్లో అడుగు పెట్టనివ్వలేదు. వారికి సంతానం కలగలేదు.

# 5

ఆ రోజు వర్షమే పడుతుందో తుపానే పెడుతుందో అనుకున్నారు. కాని అలాగు కాకుండా ప్రశాంతంగా వెచ్చగా వుంది. చప్పరంపైనా భోజనాల గదిలోనూ వెలిగించిన కొవ్వొత్తులు నిశ్చలమైన జ్వాలలతో వెలిగాయి. భోజనాల దగ్గర రాజకుమారుడు వసీలి ల్వోవిచ్ కబుర్లు చెబుతూ అందరినీ నవ్వుల్లో ముంచెత్తాడు. కథలు చెప్పడంలో అతనికి అద్భుతమైన నేర్పుండేది. అది నిజంగా అతని సొత్తే. విందుకు వచ్చినవారిలో ఏ ఒకరికి సంబంధించిగానీ, వారందరకూ పరిచితులైన వారెవరికైనా సంబంధించిగానీ, ఏదైనా సంగతి ఒకటి జరిగితే, ఆ సంగతి ఎత్తుకుని, దానికి వన్నెలూ చిన్నెలూ చేర్చి, చిలకలూ పలవలూ కల్పించి, ఎంత స్వతస్సిద్ధంగా చెప్పేవాడంటే, ఇక అక్కడున్న వారందరూ డొక్కలు చెక్కలయ్యేట్టు నవ్వేవారు. ధనికురాలైనట్టీ సౌందర్యరాశి అయినట్టీ ఒకామెను నికొలాయ్ మోహించి తనను పెళ్లాడమని ఆమెను కాళ్లా వేళ్లా పడడం గురించి కథ ఒకటి చెప్పడం మొదలెట్టాడు రాజకుమారుడు వసీలి. అసలా ఉదంతం అంతటిలోనూ వున్న యథార్థమంతా ఎంతవరకంటే, ఒకామెను అతడు ప్రేమించడమూ ఆమె పెనిమిటి ఆమెకు విడాకులివ్వడానికి నిరాకరించడమూ, అంతవరకే. కడమదంతా కల్పనే. అయితే యథార్థమూ కల్పనా ఎంతో అంత నేర్పుగా అల్లేడు రాజకుమారుడు వసీలి. అభిజాతమూ గాంభీర్యమూ నరనరాలా పట్టిపోయున్న నికొలాయ్, అర్ధరాత్రి మేజోళ్ల కాళ్లతో బూడ్సులు చంకలో పెట్టుకుని నడివీధిలోనుండి పరుగెత్తుతున్నాడుట. ఈ యువకుడు వీధిమలుపు చేరుకునే టప్పటికల్లా, పోలీసువాడు ఎదురయాడుట.

—

ఈ పరుగెత్తుతూన్న యువకుడిని చూసి అనుమానం వేసి పోలీసువాడికి పట్టు కున్నాడుట. తాను దొంగనుకాననీ, తాను అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరుననీ, ఆ పోలీసువాడికి నచ్చచెప్పేసరికి బ్రహ్మరుద్రాదులు దిగివచ్చినంత పనైందిట. ఎలాగైతేనేం, పెళ్లి అంతా నిశ్చయమై — కథ ప్రకారం — ఇక జరగబోయే క్షణంలో, ఈ వ్యవహార మంతటిలోనూ మొదటినుండీ జోక్యం వున్న కూటసాకుల జట్టు విడాకుల కేసులో మరికాస్త లంచం ముట్టజెపుతేనేగాని దొంగ సాక్ష్యం పలకమని సమ్మెచేశారుట. నికొలాయ్ అసలే పిసనారి — అందులో కించిత్తు వాస్తవం లేకపోలేదు — అందులోనూ ఎటువంటి సమ్మె అయినా సరే సమ్మె అంటే అతనికి సూత్రప్రాయంగా అసలు గిట్టదుట. ఏమైనా సరే అంతకు మించి ఇక హెచ్చు లంచం ఇవ్వను గాక ఇవ్వనంటూ, ఏ చట్టంలోనో ఎక్కడో ఏ మూలనో చెప్పిన క్లాజు ఒకటి ఉదాహరించుతూ, ఆ క్లాజును సమర్థించుతూ అప్పీలు కోర్టు తీర్పు ఇచ్చిందని చెబుతూ నికొలాయ్ భీష్మించుకు్కూ చున్నాడుట. ఇక రిజిస్ట్రారు ఆఫీసులో లాంఛనప్రాయంగా రిజిస్ట్రారు అడగాల్సిన ప్రశ్న: ''వీరిద్దరికీ చట్ట సమ్మతంగా వివాహం జరగడానికి ఏదైనా ప్రతిబంధకం వున్నట్టు ఇక్కడ హాజరైన వారెవరికైనా తెలుసునా?'' అని ఆయన అడిగేటప్పటికల్లా, అక్కడ కూచునున్న కూటసాక్షుల జట్టు జట్టంతా ఒక్కగొంతుతో: ''అవును, మాకు తెలుసు. వెనుక మేము కోర్టులో ప్రమాణంచేసి చెప్పినదంతా వుత్త అబద్ధం. ప్రాసిక్యూటరుగారు బలాత్కారంచేసి మమ్మల్ని అక్రమంగా జడిపించడం కారణంగా మేము అబద్ధపు సాక్ష్యం చెప్పాల్సొచ్చింది. మాకు స్వయంగా తెలిసినంత వరకూ ఈ స్త్రీ పెనిమిటి బహుయోగ్యుడు, ఆయన ఏకపత్నీవ్రత దీక్ష గురించి చెప్పాలంటే ఈయన పేరుచెప్పి శ్రీరా

ములవారి పేరు చెప్పాల్సిందే. ఇక ఆయన శీలమా? ఆయన తరువాతే ధర్మ రాజు'' అన్నారట!

పెళ్లికథలు చెప్పడం ఆరంభించాక, అన్నపెనిమిటి గుస్తావ్ ఇవానొవిచ్ గ్రీస్సెని సహితమూ వసీలి విడిచిపెట్టలేదు. పెళ్లి అయి ఆమె పెనిమిటింకి వచ్చిన మరుచటి దినం, అన్న తన పుట్టింటికి వెళ్లగా, పుట్టింటిలో వుండేందుకు ఆమెకు చట్టసమ్మతమైన పాస్‌పోర్టు లేనందున, ఆమెను కన్నవారి ఇంటినుండి వెళ్లగొట్టి, చట్టసమ్మతంగా వివాహమాడిన తన ఇంటికి ఆమెను తెచ్చి తనకు ఒప్పగించాల్సిందని అతడు పోలీసువాళ్ల సహాయం అర్థించాడట. వాళ్ల వివాహమైన తొలిరోజుల్లో, ఆమె తల్లికి జబ్బుచేయగా, వేర దక్షిణాదికి వెళ్లివుండడం కారణాన, తల్లి సంరక్షణకై అన్న పుట్టింటికి వెళ్లింది. పాపం ఇతగాడు విరహతాపం భరించలేక తహ తహ లాడిపోయాడు — అసలు ఇదీ ఆ కథలో వున్న ఆవగింజంత సత్యమూనూ.

ఆ కథ విని ఆందరూ నవ్వారు. తన అర్ధనిమీలిత నేత్రాలతో అన్న కూడా చిరునవ్వు నవ్వింది. గుస్తావ్ ఇవానొవిచ్ పరమానందంతో బిగ్గరగా నవ్వాడు. అతడాలా నవ్వినప్పుడు, నిగనిగ మెరుస్తూన్న అతని ముఖం ఎముకలమీద బిగుతుగా సాగదీసి పాలిపోయిన చర్మంతో బక్కచిక్కిన ఆ ముఖమూ, జాగ్రత్తగా నున్నగా కిందకి దువ్వుకుని పీచు అంటించినట్టున్న ఆ పలుచని జుట్టూ, లోతుగా గుంటల్లా వున్న ఆ కళ్లూ చూసినవాళ్లకి, పుచ్చిపోయిన పళ్లు ఇకలించుతూ వికృతానందంతో మందహాసం చేస్తూన్న మనిషి పుర్రే గుర్తుకొస్తుంది. పెళ్లి అయిననాడు అతడు అన్నని ఏలా పువ్వుల్లో పెట్టి పూజించాడో, నేటికీ ఆవిధంగానే అతడామెను—తన ఆరాధ్య

దేవతగా పూజిస్తున్నాడు. ఆమె చెంతనే కూచోవడానికీ, ఆమెను రహస్యంగా స్పృశించడానికీ అతడు నిరంతరమూ యాతనపడుతూంటాడు. ఆమె అడుగులకు మడుగులొత్తుతూన్న అతని వెర్రిమోహం చూసి, ఆ చూసినవారికే అతనిపై తరుచు జాలిపుట్టి బాధాకరంగా వుండేది.

భోజనమై లేచేముందు, బల్లదగ్గర కూచునున్న అతిథులను లెక్కపెట్టింది వేర నికొలాయెవ్న. పదముగ్గురున్నారు. ఆమెకు మూఢనమ్మకాలు ఎక్కువ. అందుచేత ఆమె అనుకుంది: ''ఇదేమీ బాగుండలేదు! ఆ లెక్కపెట్టినదేదో ముందే లెక్కపెట్టుంటే తీరిపోయేది. ఆ మాట తోచింది కాదు నాకు. ఇంతకీ తప్పు అంతా నాస్యదే. ఎందరు వస్తూన్నదీ టెలిఫోనులో ఏమీ చెప్పాదు కాదాయె!''

షేయిన్ ఇంట్లోగానీ, ఫ్రీస్సె ఇంటో గానీ స్నేహితులందరూ చేరినప్పుడు భోజనం అయాక పోకర్ ఆడడం పరిపాటి. ఎందుచేతనంటే, చీట్ల పేకతో జూదమాడడమంటే అక్కచెల్లెళ్లిద్దరకూ వల్లమాలిన ఆసక్తి. ఆ వెర్రి సరదా చూస్తే నవ్వేవస్తుంది. ఆ రెండిళ్లలోనూ కూడా శిలాశాసనం ఒకటి ఏర్పడిపోయింది: ఆట ఆడే ప్రతీ వారికీ సమానంగా లెక్కపెట్టి కొన్ని దంతపు బిళ్లలు పంచిపెట్టి ఇచ్చేవారు. ఇక్కొక్క బిళ్ల నిర్దిష్టమైన కొంత డబ్బుతో సమానం. అన్ని బిళ్లలూ ఎవరో ఒకరు గెల్చుకునే వరకూ ఆట సాగుతుంది. ఇక మళ్లీ కొత్తగా బిళ్లలు పుచ్చుకోవడానికి ఎంత మాత్రమూ వీల్లేదు. ఆ చేతికి బిళ్లలు మరంతే. ఎవ్వరెంత దేబిరించినా సరే మరారోజుకి ఆట సరి. అక్కచెల్లెళ్లిద్దరూ ఎంత వాళ్లూ పై తెలివిలేకుండా ఆడేవారంటే, ఇలాంటి కఠిననిబంధనలు లేనిదే ఇక రాత్రి అనక పగలనక

వాళ్లిద్దరూ అలా ఆడుతూండాల్సిందే. అందుచేత అనుభవంమీద అమలు లోకి వచ్చాయి ఈ నిబంధనలు. ఇందువల్ల, ఎవ్వరు ఎంత నష్టపోయినా నష్టమంతా కలిపి వెరసి రెండు వందల రూబుళ్లకు సాధారణంగా మించేదికాదు.

మామూలులాగానే ఈసారి కూడా పోకర్ ఆటకు కూచున్నారు. టీ కోసమని చప్పరంమీద బల్ల సర్దిస్తూ ఏర్పాట్లు చేయిస్తూండడంచేత వేర ఆటలో చేరలేదు. ఈ పనిలో ఆమె మునగి వుండగా దాసీమనిషి ఆమెను డ్రాయింగురూము నుండి ఆదరా బాదరా పిలిచింది.

"దాష! ఏమిటా వెర్రి పిలుపు?" అని వేర చీకాకుగా అడిగింది, పడక గది పక్కనే వున్న తన చిన్న అధ్యయనపు గదిలోకి వెళ్తూనూ. "నీకేమేనా మతిపోయిందా ఏమిటి, నాకేసి ఏమిటా పిచ్చి చూపులు? ఆ చేతిలో వున్నది ఏమిటి?"

నలుచదరంగా వున్న చిన్న ప్యాకెట్టు ఒకదానిని బల్లమీద పెట్టింది దాష. ప్యాకెట్టు తెల్లకాగితంలో నీటుగా చుట్టి, గులాబీ రంగు రిబ్బనుతో కట్టి వుంది.

"దేవుడి మీద వొట్టేసి చెబుతున్నాను, అటుపైన దేవరవారి చిత్తం, నాతప్పేంలేదు. వాడొచ్చి అన్నాడు..." అంటూ, చివాట్లు తిన్నందుకు కష్టం తోచి జేవురించిన ముఖంతో మాటలు సాగతీస్తూ దాష చెప్ప కొచ్చింది.

"ఎవడా వాడు?" అని అడిగింది వేర.

"ఎర్ర టోపీ పెట్టుకున్నాడండి, అమ్మయ్యగారూ... బంట్రోతు కుర్రా డండి."

''అయితే?''

''వంటగదిలోకి వచ్చాడండి. వచ్చి దీనినేమో బల్లమీద పెట్టి, 'దీనిని మీ అమ్మగారికి ఇచ్చేయి' అన్నాడండి వాడు. 'ఎవరు పంపించారు?' అని నేనడిగానండి. వాడు అన్నాడండి, 'దీనిమీద రాసివుంది' అనేశాడండి. ఆ ముక్క ఒక్కటే అనేసి లగుదీశాడండి.''

''వెళ్ళి, వాడిని లాక్కొస్తే సరి!''

''చిత్తం, అమ్మయ్యగారు! అది కుదరదండి. తమరందరూ భోజనాలు చేస్తూండగా వచ్చాడండి వాడు, అమ్మయ్యగారు. అప్పుడు తమరితో మనవి చేయడానికి ధైర్యం చాలిందికాదండి. అరగంట క్రితం అండి, అటుపైన దేవరవారి చిత్తమండి.''

''సరే, వెళ్ళి పని చూసుకోండి.''

ఆ రిబ్బనుని కత్తెరతో కత్తిరించి, తన పేరూ చిరునామా వున్న పైకాగితంతో కూడా ఆ రిబ్బనుని చిత్తుకాగితాల బుట్టలో పారేసిందామె. కాగితంలో చుట్టి వున్నది నగలవ్యాపారులు సాధారణంగా సరుకులను వుంచే చిన్న పెట్టె. ఎర్రముఖమల్‌తో చేసి వుంది. చూడగా సరికొత్తగా ఆక్షణమే షాపులో నుండి తెచ్చినట్టు అవుపడుతూంది. పెట్టెమూత తీసి చూసింది వేర. పెట్టె మూతకు లేత నీలిరంగు పట్టుగుడ్డ అస్తరు వేసి వుంది. పెట్టెలో నల్లని ముఖమల్ తక్కుకున్న గాడిలో పెట్టివుంది — కోడిగుడ్డు ఆకారంలో వున్న బంగారపు కంకణం. గుల్లగా వున్న ఆ కంకణంలో బహు జాగ్రత్తగా అష్టాస్రంగా మడతపెట్టిన చీటి ఒకటి ఆమెకు అవుపడింది. చప్పున ఆ చీటి మడతవిప్పి చూసింది. తనకు పరిచితి అయిన దస్తూరీలా కానొచ్చింది. ఎలాగైనా స్త్రీహృదయం కాబట్టి, ఆ చీటిని

తరువాత చదువుదామని అట్టేపెట్టి, మొదట ఆ కంకణం ఎలాంటిదో చూద్దామని దాన్ని తీసింది.

తక్కువ వన్నె బంగారంతో చేసి వుంది కంకణం. బాగా వలంగా వుంది. కాని గుల్లగా వుంది. కంకణంపైన బాగా తక్కువగా మెరుగు పెట్టిన పాతకాలపు కెంపులు చిన్నచిన్నవి పొదిగించి వున్నాయి. కాని కంకణం మధ్య మాత్రం చిన్న కొత్తరకం పచ్చరాయి ఒకదాని చుట్టూ కోత కోయక మెరుగుపెట్టని కెంపులు బటాణీ గింజలంతవి ఐదు ఉబ్బెత్తుగా పొదిగించి వున్నాయి. విద్యుద్దీపం కింద ఆ కంకణాన్ని ఇటూ అటూ తిప్పుతూ వేర చూసిందేమో, నున్నగా అండాకృతి గల్గిన ఆ కెంపులపై దీపం వెల్తురు పడి, ప్రత్యేకంగా ఒక కోణంలో అగ్నిజ్వాలల్లా ఎర్రని కాంతులు తళుకులెత్తాయి.

"అచ్చు రక్తంలానే!" అనుకుంది వేర తటాలున భయంతో వొళ్లు పులకరించి.

అప్పటికిగాని గుర్తుకు రాలేదు ఆ చీటి సంగతి. చక్కగా ముత్యాల కోవలా వున్న దస్తూరీతో రాసిన ఆ వుత్తరం చదువుకుంది వేర. మొదటి పంక్తుల్లో ఇలా వుంది:

"జాజ్వల్యమాన కీర్తిసంపన్నులైన
అత్యంత ఘనతవహించిన రాజకుమారిక
వేర నికొలాయెవ్న!

"ఆనందదాయకమూ సుఖప్రదమూ అయిన నేటి మీ జన్మదినాన మీకు నా శుభాకాంక్షలను గౌరవపురస్సరంగా అందజేస్తూ తృణప్రాయమైన ఈ చిన్ని కానుకను వినమ్రుడనై సమర్పించ సాహసించుచున్నాను."

''ఓహో, ఇతడా!'' అనుకుంది వేర చికాకుతో. అయినా పుత్తరం కడవెళ్లా చదువుకుంది...

''నా మనస్సులో వున్న కానుకను మీకు సమరిఎంచేంతటి స్వేచ్ఛ నాకు లేదని నేను ఎరిగే వున్నాను, ఎందుచేతనంటే అంతటి హక్కూ నాకు లేదు, అంతటి నాజూకైన అభిరుచీ నాకులేదు — నిజం చెప్పాలంటే అంతటి డబ్బూ నాకులేదు. అన్నిటికంటే మించిన కారణం — ఈ ప్రపంచంలో మీరు ధరించదగిన ఆభరణమే లేదని నానమ్మకం.

''కాని ఈ కంకణం మాముత్తవ్వది; దీనిని కడపట ధరించినది మా అమ్మ. ఆమె చనిపోయిన తరువాత మరెవ్వరూ దీనిని ధరించలేదు. ఈ కంకణం మధ్య, పెద్ద కెంపుల నడుమనున్న పచ్చరాయి మిక్కిలి అరుదైనది — అది పచ్చ కెంపు. దీనిని ధరించిన స్త్రీలకు అది భవిష్యత్ జ్ఞానం ప్రసాదించుతుందనీ, విషాదకరములైన ఆలోచనలు కలుగకుండా వారిని కాపాడుతుందనీ, వారి మగవారిని దుర్మరణాలనుండి రక్షించుతుందనీ మా కుటుంబ సాంప్రదాయం.

''మునుపటి పాత వెండి కంకణానికి వుండిన ఈ రాళ్లను ఆ కంకణం నుండి బహుజాగ్రత్తగా మార్పించి ఈ కంకణంలో పొదిగించడమైంది. కాగా దీనిని ధరించితే మీరే ధరించాలిగాని, మరెవ్వరూ దీనిని ఇదివరకు ధరించి వుండలేదని మాత్రం మీరు నిశ్చయంగా నమ్మవచ్చు.

''ఇదేమిటే పిచ్చి కంకణమని చెప్పి మీరు దీనిని తక్షణమే పారవేసినా పారవేయవచ్చు, మీకు తోచిన వారికెవరికైనా సరే బహుమతిగా ఇచ్చివేసినా ఇచ్చివేయవచ్చు; దానిని మీ కరములు స్పృశించితే చాలు, అదే నాకు పదివేలని ఆనందిస్తాను.

—

"నాపై కినుక వహించవలదని నా ప్రార్థన. ఏడేళ్ళక్రితం మీరు అవివాహితగా వున్నప్పుడు ప్రణయోన్మాదంతో వెర్రిమొర్రి ప్రేమలేఖలు మీపేర రాయడమే కాకుండా, మీవద్దనుండి వాటికి ప్రత్యుత్తరం వస్తుందనే నిబ్బరంతో అందుకై నిరీక్షించ సాహసించాను కూడా. భృత్యుని భయసంభ్రమాలు, శాశ్వత భక్తి ఆరాధనలు, వినమ్రతాసేవ — ఇవే ఈనాడు నేను మీకు అర్పించగల్గుతున్నాను. మీకు శాశ్వత శుభము ఒనగూరు గాక అనీ, మీరు సర్వసౌఖ్యములను అనుభవించెదరు గాక అనీ ఆకాంక్షించడము — ఇదొక్కటే నాకు మిగిలినది. మీరు కూర్చునే కుర్చీలూ సోఫాలు, మీరు మెట్టే నేల, మీరు షికారు వెళ్ళేప్పుడు మీరు స్పృశించే చెట్లు చేమలు, మీరు సంభాషించే భృత్యుకోటి — వీటన్నిటి ఎదుట నా మనస్సులో నేను సాష్టాంగప్రణామము లాచరిస్తూంటాను. ఈ జనమూ ఈ వస్తువుల పట్ల అసూయ చెందడానికి సహితమూ నేనిప్పుడు సాహసించడంలేదు.

"సుదీర్ఘమూ అనవసరమూ అయిన ఈ లేఖతో మీ మనస్సును కలతపరచినందుకు క్షమించమని మిమ్మలను మరొకసారి ప్రార్థించుతున్నాను.

"ఇట్లు విన్నవించు భవదీయ ఆమరణాంత,
మరణాత్పర సేవకుడు, గె.ఎస్.జె."

"ఈ వుత్తరం వాస్యకి చూపడమా, మానడమా? చూపుతే ఎప్పుడు చూపడం? ఇప్పుడేనా, అందరూ వెళ్ళిపోయకా? అబ్బే, ఇప్పుడొద్దు — తరువాతే మంచిది, ఇప్పుడు చూపిస్తే, ఈ దౌర్భాగ్యుడిలాగానే నాకూ మతి పోయిందను కోగలడు."

ఈ విధంగా తనలో తాను గుంజాయించు కుంటూన్నంత సేపూ కూడా ఆమె కళ్ళు ఆ ఐదు కెంపుల గర్భంలోనూ రక్తకాంతులతో మండు తూన్న జ్యోతులమీదనే వున్నాయి.

## 6

కర్నల్ పానమరేవ్ చేత పోకర్ ఆడించడానికి విశ్వప్రయత్నమే చేయా ల్సొచ్చింది. ఆ ఆటంటే ఏమిటో తనకు తెలియదనీ, డబ్బేసి ఆడనని తను ఒట్టు పెట్టుకున్నాననీ, హాస్యానికైతేనేమి వేళాకోళాని కైతేనేమి తానెప్పుడూ పందెం వెయ్యననీ, తనకు కాస్త సరదా అయిన ఆట, కాస్త తెలిసిన ఆట క్లియరెన్స్ అటే అనీ మారాం పెట్టాడు. చివరకి ఏలాగైతేనేమి ఒప్పు కున్నాడు.

మొదట్లో అతనికి ఆట ఆడడం నేర్పి అతనిచే కొంతసేపటి వరకూ ఆడిపించాల్సి వచ్చింది. కాని ఒక అరగంటలోపునే ఆటలో మెలకువలూ కిటుకులూ నేర్చేసుకుని, అన్ని బిళ్లలనూ తానే గెల్చేసుకుని తన ముందు కుప్పపోసుకుని కూచున్నాడు.

''అబ్బే, ఇంతవేగం ఆట ముగించేయడం మీకేమీ న్యాయంగా లేదు సుమండీ! మాకు పురెక్కించడానికేనా మీరు మరికాస్సేపు ఆడి వుండాల్సింది!'' అంది అన్న తెచ్చిపెట్టుకున్న కోపంతో.

స్పెష్నికొవూ, కర్నలూ, చాదస్తుడూ ముసలి మందమతీ అయిన ప్పటికీ మంచి మర్యాదస్థుడే అయిన జర్మన్ వైస్‌గవర్నరూ – ఈ ముగ్గురు అతిథులకూ ఎలా వ్యాసంగం కల్పించడమో వేరకి ఏమీ పాలుపోయిందికాదు.

నాలుగు చేతుల మీద క్లియరెన్స్ ఆటవేసి, గుస్తావ్ ఇవానొవిచ్‌ని రమ్మన మని నాలుగో చేయి అతనికిచ్చింది. అందుకు అన్న కన్నుగీటుతూ తన కృత జ్ఞతను వెలిబుచ్చగా వేర తన చెల్లెలిని అర్థం చేసుకుంది. చీట్లపేకాటవేసి గుస్తావ్ ఇవానొవిచ్‌కి కాలక్షేపం కల్పిస్తేనేగాని, ఆ కపాళంలో వున్న తన పుప్పి పళ్లను ఇగిలించుకుంటూ అంటింతకాయిలా పెళ్లాం కొంగుపట్టు కునే ఆ సాయంకాలమంతా తిరుగుతూ ఆమె మనసు పాడుచేస్తాడని లోకాని కంతకూ తెలిసినదే.

ఇక ఇప్పుడంతా సానుకూలంగా, ఏ నిమిషానికి ఏం జరుగుతుందో అన్న దిగులు లేకుండా హాయిగా మంచి సరదాగా గడిచిపోయింది. జెన్నీ రెయ్‌టర్ పక్కవాద్యం వాయించగా, ఇటాలియన్ జానపద నృత్య గేయా లనూ, రూబిన్‌స్టైన్ ప్రాచ్యకృతులనూ వసుచోక్ మెల్లగా పాడుతూంటే, చిన్నదైనా మార్దవమైన అతని గాత్రం మంచి వొడుపులతో అన్ని మెట్లూ అందుకుంటూంది. ఆ గొంతులో జీరన్న మాటే లేదు. జెన్నీ రెయ్‌టర్‌ది అతి శాస్త్రోక్తమైన వాద్యం. పాటగానిలో ఏ మాత్రం అపస్వరం వచ్చినా ఆమె సహించదు. అటువంటిది వసుచోక్ పాడుతూంటే వాయించేందుకు ఆమె ఎల్లప్పుడూ సిద్ధమే. అయితే మరి, ఎంత వరకూ నిజమో చెప్పలేముగాని — అతడామెను పెళ్లాడదామని తాపత్రయపడుతున్నాడని జనశ్రుతి.

మూలనున్న సోఫాలో కూర్చుని ఆ హుజార్ ఆఫీసరుతో జంకూ గొంకూ లేకుండా అన్న సరససల్లాపం సాగిస్తూంది. మందహాసంతో వేర వాళ్ల దగ్గరకెళ్లి వాళ్లేమిటి మాట్లాడుకుంటున్నారో వింటూంది.

''అబ్బా! మీరలా నవ్వుతే నేనేం చెప్పగలను?'' అంది అన్న అంద మైన తన పెంకె తాతార్ కళ్లను చీపిగా పెడుతూ ఆఫీసరు కేసి చూసి. ''ఆశ్వికదళానికి నాయకత్వం వహించుతూ వాయువేగ మనోవేగాలతో దూసుకుపోవడమూ, గుర్రప్పందేల్లో అడ్డంకులు దాటుకుంటూ స్వారి చేయడమూ కష్టమైన కార్యాలని మీరు అనుకుంటె అనుకుందురుగాక. మేం చేస్తున్న అద్భుతకార్యాలను చూడరేమంటా? నిన్ననే మేమొక లాటరీ మేళా జరిపాం. అదీ ఒక పనేనా అని మీరనుకుంటారేమో? ఆరె, మీ ఇల్లు బంగారంగానూ! ఆ జనమూ, ఆ చుట్టపొగా, ఆ కూలాళ్ళూ, ఆ బళ్లవాళ్ళూ, ఆ దేవుడికే ఎరికె, నానా అడ్డమైనవాళ్ళూ — మరి నేను చెప్పలేను... తనకి కూలి ముట్టలేదనీ, తనకి బాడుగ అందలేదనీ, తనకి అన్యాయం జరిగిందనీ ఒకటే గొడవ, ఒకటే ఫిర్యాదులు... ఇక ఆ రోజంతా అలా నిలబడే వున్నాను, కాళ్లకి రక్తాలు దిగిపోయాయి. పోతే, ఇక ముందు కుంది, చితికిపోయిన మేధావి స్త్రీకార్మికుల సహాయార్థం కాన్సర్ట్, అది అయిన తరువాత మరినాల్గు రోజులకే ధర్మకార్యాలకోసం 'బాల్' ''...

'' 'బాల్'లో మాత్రం మీతో మజూర్కా డాన్సు కోసం నేను ఇప్పుడే ముందుగా దరఖాస్తు దాఖలు చేసుకుంటున్నాను. నామనవి తప్పక చెల్లిం చాలి సుమండీ!'' అంటూ బహ్తిన్స్కి తాను కూచునున్న కుర్చీకింద తన బూటుకాళ్ల స్పారిములుకులతో టక్కుమని నేలమీద కదం కొట్టాడు.

''ధన్యవాదం... కాని అన్నిటికంటే విచారకరమైనది మా బాలనికే తనం. మేం స్థాపించిన దుష్టబాలల నికేతనం మీకు తెలుసుగా!''

''ఓహో, తెలుసే. అదేదో మంచి గమ్మత్తుగానే వుండాలి కదండీ?''

''చాలుచాలు! ఇలాంటి విషయాల గురించి వేళాకోళం చెయ్యడానికి

సిగ్గు లేకపోతే సరి! అసలు దురదృష్టమంతా ఎక్కడొచ్చి పడిందో తెల్సా? పుట్టుకవల్లా దుష్టసహవాసం వల్లా అంతరాత్మలు చెడిపోయిన ఈ దుర దృష్టపు పిల్లలకి ఒక నికేతనమంటూ ఏర్పాటు చెయాలని మా సంకల్పం. అలా చేస్తే వాళ్లకి కాస్తేనా హాయీ ఆనందమూ కల్పించుదామని మా ఉద్దేశ్యం..."

"అవును మరి!.."

"నైతికంగా వాళ్లను పైకి లేవనెత్తి, విధులూ విధాయకాలూ అంటే ఏమిటో వాళ్ల మనస్సుల్లో నాటేటట్టు చేయాలిని... మీకు అర్థ మైందిగా? మాదగ్గరకి రోజూవందలూ వేలూ పిల్లల్ని తీసుకొస్తున్నారు — అయితేయేం — వాళ్లలో దుష్ట పిల్లలంటూ ఒక్కరైనా కనబడలేదు మాకు! మీ పిల్లలు నిజంగా దుష్ట పిల్లలేనా అని మేం తల్లితండ్రుల నడిగితే వాళ్లకి కోపం వస్తుందాయె — మరెలాగో మీరే చెప్పండి! ఇక ఏం చెయ్యడమో మాకు తెలియడంలేదు. నికేతనమేమో అన్ని ఏర్పాట్ల తోనూ అన్ని హంగులతోనూ సిద్ధంచేసి తెరిచామాయె — ఇంత వరకూ ఒక్క పిల్లడు — వేలు మడిచి లెక్కపెడదామంటే ఒక్క పిల్లడు — రాలేదాయె! దుష్టబాలలు అనిచెప్పి తీసుకొచ్చిన ప్రతి పిల్లడికీ బహుమానం ఇవ్వాలనుకుంటాను — అంతకుతప్ప మరి గత్యంతరం కనబడ్డంలేదు."

"ఆన్న నికొలాయెవ్న!" అంటూ ఆ హుజార్ ఆఫీసరు గంభీరంగా ముఖం పెట్టి ఆమె మాటలకు అడ్డువచ్చాడు. "బహుమతి ఇవ్వడందేనికి? ఏ బహుమతీ అవసరంలేదు — నన్ను తీసుకోండి. నామాట నమ్మండి — నాకంటే దుష్టు పిల్లడు మీకు దొరకడు."

''చాల్లేవయ్యా! మీతో గంభీరంగా ఏ సంగతి మాట్లాడ్డానికీ వీల్లేదుకదా'' అంది ఆమె ఫక్కున నవ్వి, సోఫాలో చేరగిలబడిపోయింది కళ్లు మెరుస్తూనూ.

పెద్ద గుండ్రని బల్ల దగ్గర కూచుని, రాజకుమారుడు వసీలి, తన కుటుంబంవాళ్ల గురించి తాను చిత్రించిన వ్యంగ్యచిత్రాల ఆల్బమ్‌ను తన సోదరికీ, అనోసావ్‌కీ, తన బావమరదికీ చూపిస్తున్నాడు. పొట్ట చెక్కలయేటట్టు నలుగురూ నవ్వుతున్నారు. చీట్లపేకాటలో నిమగ్నులుకాని కడమ అతిథులందరూ క్రమేణా అక్కడకు చేరుకున్నారు.

రాజకుమారుడు వసీలి కూర్చిన హాస్యపు కథలకు రెండవ సంపుటి అన్నమాట ఈ ఆల్బమ్ — ఈ చిత్రపట సంకలనం. మనిషి ఎక్కడా చెక్కు చెదరకుండా గంభీర ముద్రతో చూపిస్తూ రాజకుమారుడు వసీలి ఇలా చెబుతున్నాడు: ''టర్కీ, బల్గేరియా, తదితర దేశాల్లో పరాక్రమశాలి జనరల్ అనోసావ్ కావించిన సాహసిక ప్రణయ గాథ,'' ''మాంటి కార్లోలో షాకేలా రాజకుమారుడు నికొల్యా బులాత్-తుగనోవ్‌స్కి సాహస కృత్యం,'' ఇంకా ఇలాంటివే వగైరా వగైరాలు.

''సభాసదులారా! నా ప్రియసోదరి లూద్మిల ల్వోవ్‌న సంగ్రహ చరిత్ర మీ కెరింగించెద'' అంటూ తన తోబుట్టువకేసి వెటకారపు చూపుతో ఆరంభించాడు. ''ప్రథమ భాగం: బాల్యం. బాలిక దినదిన ప్రవర్ధమానమై విరాజిల్లుచున్నది. ఆమెకు లీమ అని నామకరణం చేశారు.''

ఆల్బమ్‌లో వున్న చిన్న బాలిక బొమ్మ అచ్చంగా చిన్నపిల్లలు గీసే బొమ్మ లాగే వుంది. ముఖం పార్శ్వ దృశ్యంలో చిత్రించబడినా, రెండు కళ్లూ కూడా

వున్నాయి బొమ్మకి; పావడలోనుంచి తోసుకొస్తూ గీసిన రెండు గీతలూ రెండు కాళ్లన్నమాట, రెండు చేతులవేళ్ళూ వెడల్పుగా చాచివున్నాయి.

"నన్నెవ్వరూ లీమ అని పిలవందే" అంది యాద్మీల ల్యోవ్న నవ్వుతూ.

"రెండవ భాగం: ప్రథమ ప్రణయం. ఆశ్వసైనిక ఆఫీసరువిద్యార్థి బలాకుమారి లీమ ఎదుట మోకాళ్లపై బడి తన స్వకపోలకల్పితమైన కవిత్వాన్ని ఆమెకు అర్పించుచున్నాడు. ఆ కవిత్వంలోని అమూల్యమైన పద్యములకిది ఒక మచ్చుతునక:

"అసమాన సుందరతరమగు నీ కాలు
భూలోకమున లేదు దాని పోలు!"

"ఆ కాలు సౌందర్యాన్ని చిత్రించుతూంది ఈ బొమ్మ.

"తన కన్నవారి ఇంటినుండి లీమను ఆ ఆఫీసరు విద్యార్థి తనతో కూడా లేచిపొమ్మని ప్రోత్సహించుటలో విజయోపేతుడయాడు. ఇదిగో ఆ గాంధర్వ పలాయన దృశ్యమును చూపు చిత్రపటము!

"సంక్షోభ పూరిత క్షణం ఇదిగో తిలకించెదరు గాక: ఆగ్రహావేశపరుడైన జనకుడు పలాయితులను అందుకున్నాడు. భీరకుడైన ఆ యువయోధుడు సాధ్వియైన లీమను అక్కడక్కడనే వదలిపెట్టి పలాయనం చిత్తగించుచూ ఇవ్విధమున వాక్రుచ్చె:

"నీమోమున దండిగ పూసుకొన్న పౌడరు నేల్రాలె,
ఆ జాడలబడి మనవెంబడి నీ తండ్రి వెడలె,
ఆతని నిలువరింప తగుదు వీవె మగువ,
నా తల్లి కడకు నే పోయెద పర్వున."

''బాలా కుమారి లీవు'' కథ పూర్తి అయిన తరువాత, ''రాజకుమారి వేర, మరియు ఆమెను మోహించిన టెలిగ్రాఫ్ సిగ్నలర్'' మొదలైంది.

''పాషాణ హృదయమును సహితం ద్రవింపజేసే ఈ పద్యకావ్యము ఇంతవరకు చిత్రపటముల రూపముననే ప్రదర్శించ బడనున్నది. వాచకమింకను తయారీలో నున్నది'' అంటూ వసీలి ల్వోవిచ్ గంభీరంగా చెప్పుకొచ్చాడు.

''ఇదేదో కొత్తదిలా వుందే. నేనింత వరకూ దీనిని చూడనే లేదే'' అన్నాడు అనోసావ్.

''తాజా ప్రచురణం, తొలి కూర్పు, నేడే వెలువడింది.''

వసీలి బుజాన్ని వేర మెల్లగా తట్టి:

''వొద్దు, వొద్దు'' అంది.

ఆ మాటలు వసీలికి వినబడ లేదో, వినబడినా వాటిన అంతగా పట్టించుకో లేదో, మరి అతడు మాత్రం తన కథనాన్ని ప్రారంభించాడు.

''ఈ కథ చరిత్ర పూర్వయుగం నుండి ప్రారంభమగుచున్నది. సుందరమైన మే మాసమందు రమణీయమైన ఒకానొక దినాన వేర అను నామధేయము గల్గిన ఒకానొక కన్య ఒక లేఖను బడయును. ఆ లేఖ ప్రథమ పత్రముపై ముద్దుపెట్టుకొనుచు నున్న చిలుక గోరింకలు చిత్రించివున్నవి. ఇదిగో ఆ లేఖ, ఇదిగో ఆ చిలుక, గోరింక!

''మరుబాధ కోర్వలేని ఫలితంగా వ్రాసిన ఆ ప్రణయలేఖ అక్షరక్రమ నియమముల బాధను సహితము ఓర్వ నిరాకరించింది. లేఖ ఆరంభమును చిత్తగింపుడు: 'ఓ ధవళ సిరోజా సుందర వదనీ! నా హృదయాం బుద్ధిని మృంగి భాష్పపటలంజేసే భఢభాగ్గి! కాళ విసష్ర్పము మాడ్చి నీ చూడ్పులు ఛిత్రవేధననుభవించు నా హాత్మను ధఘించి వేయుచున్నవి' అంటూ

ఇలాగుననే సాగిపోతుంది. లేఖ ఈ విధముగా అతినమ్రతతో సమాప్తమగు చున్నది: 'ఎర్రని ఏగాడి లేని నేనొక దౌర్భాగ్యపు టెలిగ్రాఫ్ సిగ్నలర్నే అయి నప్పటికీ, నా యీ ప్రేమ లార్డ్ జార్జి ప్రేమకు విషమంతైనసూ తీసి కుట్టుకాదు. నాపూర్తి నామదేయం మీకు ఎరకపరుచ ధైర్యము నాకు లేదు — ఆపేరు వినుటకే అశిలీలముగా వుంటుంది. తత్ష్కారనంగా పొడి అక్షరాలతో నేను దస్కత్ చేయుచున్నాను. కరుణాకరించి తమ ప్రత్యుత్త రీయమును కేర్ ఆఫ్ పోష్టాఫీస్ భట్వాడా పై విళాశమునకు వ్రాయ ప్రార్థించుచున్నాను: ఇట్లు పె.పె.షె.' సభాసదులారా! నల్ల మసిబొగ్గు తోనూ తెల్ల సుద్ద కణికతోనూ అత్యంత కళాకౌశలముతో చిత్రించిన ఈ టెలిగ్రాఫ్ సిగ్నలర్ తస్వీరును ఇదిగో తిలకించెదరు గాక!

''వేర హృదయమును మన్మథబాణము దూసుకొని పోయినది. (చిత్ర మును చూడుడు — ఇదిగో ఆ హృదయము, ఇదిగో ఆ బాణము!) కాని బుద్ధి శాలి, శీలవతి, రూపవతి అయిన గౌరీకుమారి వేర ఆ లేఖను పూజ్యులగు తన జననీజనకులకుసూ, తన చిరుతప్రాయపు మిత్రుడూ స్ఫూర్తగూపి, తన భవిష్యత్ భర్త యగు వసీలి షేయిన్‌కున్నూ జూపెను. ఈ దృశ్య మును చూపు చిత్రపటమును తిలకింపుడు. కాలక్రమేణా ఈ చిత్రపట ములను పద్యరూప వివరణలతో సహా వలయువారలకు సరఫరా చేయగల వారము.

''వాస్య షేయిన్ వెక్కివెక్కి ఏడ్చుచూ ప్రధానపు టుంగరమును వేరకు తిరిగి ఇచ్చివేసి: 'నీ ఆనందమయ జీవితపథాన నేనొక అవరోధముగా నుండుట నా మతము గాదు, తత్రాపి తొందరపాటున నేకార్యముం జేయ జనదని నినునే వేడుకొనియెద. తిరుగులేని అంతిమనిర్ణయ మార్గాన నీవు

అడుగిడుపూర్వము యాతని మనమును పరీక్షింపుము — నీ హృదయమును పరిశోధించుకొనుము. ఓ బాలికా! జీవితమననేమో నీ వెరుంగవు. దానం జేసి దీపంబుచే నాకర్షితంబగు శలభంపునూడ్కి నీవు అగ్నిగుండంబున నురుక నాయత్త పడుచున్నదానవు. అయ్యో, కదు క్రూరంబై వంచన పూరితంబైన యీ జీవితమననేమో నా దురదృష్టంబుచే నేనెరింగినవాడ. అట్టి ఈ దుష్టప్రపంచంబున పెలిగ్రాఫు సిగ్నలర్లు మన్మథస్వరూపులయ్యు గోముఖవ్యాఘ్రంబులు జుమీ. తమ సగర్వ సౌందర్య రూపంబునూ, మృషా ప్రేమనూ వినియోగించి మాయమర్మంబులు, పాపపుణ్యంబులన నెమో యెరుంగని బలిజీవిని మోసగించి దయదాక్షిణ్యంబుల నెరుంగని పాషాణ హృదయంబుతో పదంపడి యా యబలను తిరస్కరించుట వారికి వర్ణనా తీతంబగు అపార యానందంబు నొసంగును' అని యాతడు రోదించెను.

"ఆరు నెలలు కాలగర్భమునం దదృశమాయె. ఈ నిరంతర జీవిత నృత్యమందు నిమగ్నయైన వేర తన ప్రేమికుని విస్మరించి, నవయవ్వన సుందరాంగుడగు వాస్యను పరిణయమాడె. తత్రాపి ఆ టెలిగ్రాఫు సిగ్న లరు మాత్రము యాపెను విస్మరింపని వాడాయె. ఒక్కనాడాతండు గృహ ముల పొగకంబములను పరిశుభ్రముజేయు కార్మికునివలె ప్రచ్ఛన్నవేషంబు దాల్చి, ఒడలంతయు మసిపూసికొని, రాకొమరిత వేర వసియించు నాంత రంగిక శయ్యాగృహంబునం బ్రవేశించు నవకాశంబు గల్పించుకొనియె. ఆ గృహంబునం దెల్లెడలనూ — కాశ్మీరశాల్వలపైననూ, తలగడ దిండ్ల పైననూ, కుడ్యంబుల నలకరించు కాగిదంబులపైననూ, నేలపై సయి తమూ — ఆతండు తన పంచాంగుళముల, అధరముల ముద్రలను వైచి

వెడలిన జాడలను మీరే స్వయముగ గుర్తింపగల్గుదురు. అందులకు తార్కాణంబున ఇవిగో వీటిని జూడుడు!

"పదంపడి యాతడు పల్లెటూరి పడుచు వేషంబు ధరియించి, మదీయ పాకశాలయందు మలిన పాత్రంబుల శుభ్రముజేయు కృత్యంబుల నిర్వర్తించుచుండె. కాని యా దాసి నిజరూపంబు దెలియనివాడైన మా పాచకుండు లుకా వైచిన మృదుమధుర మన్మథవీక్షణ బాణంబుల ధాటికి తాళజాలక యాతండు తన బిక్కలకుం బుద్ధిజెప్పె.

"ఆతడు వ్యాకులచిత్తుడై మతి గోల్పోయి, ఎట్టకేలకు ఉన్మాదితుల నిర్బంధ గృహంబున శరణుజొచ్చె. తదుపరి యాతడు విరాగియై బైరాగులం జేరె. ఇదిగో, సన్యాసాశ్రమము స్వీకరించిన యాతని చిత్రముందిలకింపుడు! ఏమైననేమి, క్రమంబుదప్పక ప్రతిదినంబును యీ విరాగి మదనోన్మాద పూరితంబులగు ప్రణయలేఖలను వేర సమఖాన కంపెడివాడు. ఆ లేఖలు వ్రాయు సమయంబులందు ఆతని అశ్రుధారలు ఆ లేఖాపత్రంబులపై వ్రాలిన స్థలంబులయం దక్కరంబుల సిరా, మడుగులై ప్రవహించె.

"చిట్టచివర కాతడు ప్రాణంబులు వీడె. కాని కడపటి గడియలు గడవకముందే, తన మరణశాసనమును లిఖించి, టెలిగ్రాఫు కార్యాలయ సేవకుల యూనిఫారం దుస్తులకుండు బొత్తాముల రెండింటినీ, తన యశ్రుకణములతో నిండిన అత్తరు బుడ్డినీ తన చిరస్మరణార్థము వేరకు ప్రసాదించి, మరి తన యసువుల బాసె."

"టీకి వేళైంది, దయ చేయరూ?" అని వేర నికొలాయెవ్న వారిని ఆహ్వానించింది.

---

7

సుదీర్ఘమగు శరత్ సంధ్య అంతమవుతూంది. నీలమేఘాలూ భూమీ ఏకమయే చోట, దిగ్మండలం అంచు బీటవారి ఆ బీటనుండి సన్నగా దేదీప్యమానంగా ప్రకాశిస్తూన్న తేజస్సు మెల్లగా అంతర్థాన మవుతూంది. భూమ్యాకాశాలూ చెట్టుచేమలూ ఇక కంటికి కానరావడంలేదు. గగన మార్గాన మాత్రం నిర్మలతారలు తమ కనుబొమల నడుమనుండి కాలరాత్రి చీకటిలో తళుకులు విరజల్లుతున్నాయి. దీపపుస్తంభం ప్రసరిస్తూన్న నీలకాంతిపుంజం బాణంలా పైకి దూసుకొనిపోయి ఆకాశాన్ని తాకి, ఆ తాకిడికి ఒక తేజోవలయంగా ద్రవించిపోతూంది. క్రొవ్వొత్తి దీపాల చిమ్నీల చుట్టూ వలయాలు తిరుగుతూన్న శలభాలు గాజును ఢీకొట్టుకుంటున్నాయి. ఇంటి ప్రాంగణపు తోటలోవున్న పొగాకు మొక్కల తెల్లని నక్షత్ర పుష్పాలు ఆ చిరుచలి చీకటిలో ఘాటుగా పరిమళిస్తున్నాయి.

స్పేష్నికొవ్, వైస్ గవర్నరూ, కర్నల్ పొనమరేవ్‌లు ముగ్గురూ చాలా కాలం కిందటే బగ్గీమీద వెళ్ళిపోయారు. బగ్గీమీద తన ఇంటికి వెళ్లి పోయేందుకు జనరల్‌కి ఏవిధంగానూ ఆటంకం కలగకుండా వుండేలాగున, ట్రాము స్టేషను దగ్గర తాము దిగిపోయి, వెంటనే బగ్గీని పంపించివేస్తా మని వారు మాటయిచ్చారు. కడమ అతిథులందరూ చప్పరంపై కూచు న్నారు. ఆయన ఎంతమాత్రమూ వద్దంటూన్నప్పటికీ ఆయన అభ్యంత రాలను లెక్కచేయకుండానే, తన పెద్ద ఓవర్‌కోటును తొడుగుకునేటట్టు జనరల్ అనోసొవ్‌ను వారు బలవంతంచేసి, ఆయన కాళ్ళ చుట్టూ వెచ్చని కంబళిని కప్పారు. వేర అన్నలు చెరొక వైపునా కూచోగా వారి మధ్య ఆయన,

తన కెదురుగా తనకు అత్యంత ఇష్టమైన పోమ్మర్డ్ క్లారెట్ సీసా పెట్టు కుని కూచున్నాడు. పలుచగా వున్న ఆ వైన్‌గ్లాసులో చిక్కగా బరువుగా వున్న ఆ మద్యం నింపుతూ, అగ్గిపెట్టెను ఆయనకు అందించుతూ, చీజ్‌ను కోసి తునుకలను ఆయన ముందుంచుతూ, ఇలాగు ఆయ నకు సేవచేస్తూండగా, ఆ ముసలాయన, ముద్దుగా నిమిరిన పిల్లిగా అపరిమితానందం అనుభవిస్తున్నాడు. కొవ్వొత్తి దీపాలకేసి చూస్తూ, ఆలోచనలలో మునిగి తల పంకించుతూ ఆయన అన్నాడు:

''అవును. శరత్తు శరత్తు శరత్తని అనుకుంటూంటే, అప్పుడే శరత్తు రానే వచ్చేసింది. ఇక నేను సామాన్లు సర్దుకోవాలి. అయ్యో, మరొక్క నాల్గు రోజులు యీ సముద్రపొడ్డు దగ్గర గడుపుతే ఎంత హాయిగానో ఎంత ప్రశాంతంగానో వుందును కదా!''

''అయితే మించిపోయిందేముంది? మరో నాల్గు రోజులుండండి తాతగారూ'' అంది వేర.

''వీల్లేదు, తల్లీ, వీల్లేదు. వెయ్యిగొంతుకలతో పిలుస్తున్నాయి తొందర పనులు. సెలవు అయిపోయింది... నాల్గు రోజులుండాలనే నాకూ వుంది... గులాబీలు ఎంత చక్కగా వాసనేస్తున్నాయో కదా! వాటి వాసన నాకిక్కడకు వేస్తూంది. అదేమిటోగాని, ఎండకాలంలో పువ్వులంతగా వాసనే వెయ్యలేదు — ఒక్క తెల్లమల్లే వాసనేసింది — అదేనా పిప్పరమెంటు వాసన'' అన్నాడాయన.

చిన్న వాజులో వున్న గులాబీలలో నుండి ఒక పాటలవర్ణపు పుష్పాన్నీ, ఒక కారు ఎరుపు పువ్వునూ తీసి జనరల్ తొడుక్కున్న ఓవర్‌కోటు బొత్తాం రంధ్రంలో అమర్చింది వేర.

''ధన్యవాదం, వేర, చిట్టితల్లీ!'' అంటూ ముసలాయన తల వంచి గులాబీలను వాసనచూసి, ముసలాళ్లు ఆనందాతిశయంతో నవ్వుతారే ఆలాగున వాత్సల్యంతో నవ్వాడు.

''బుకారెస్టులో ప్రవేశించి మేం బసలు ఏర్పరచుకోవడమే నాకు జ్ఞాపకం వస్తూంది. ఒకనాడు నేను వీధిలో వెళ్తున్నాను. గుప్పుమని గులాబీల వాసన కొట్టింది. నడుస్తున్నవాణ్ణల్లా ఆగి చూశాను. చూడగా ఒక చక్కని లష్కరు గాజు అత్తరు జాడీ చేతపట్టుకుని ఇద్దరు సోల్జర్లు నిలబడున్నారు. ఆ అత్తరు నూనెతో వాళ్లు బూడ్సులను పదునుచేసుకుని, నూనె బదులు అత్తరునే రైఫిళ్లకి పట్టించారు. 'మీ చేతిలో వున్నది ఏమిటి?' అని అడిగాను వాళ్లని. 'ప్రభువు వారి చిత్తమండి, అదేదో నూనెలా వుందండి. పులుసులో తిరగమోతకి వేసుకున్నామండి. నోటికి దురద పట్టుకుందండి. వాసన మాత్రం బాగుందండి' అన్నారు వాళ్లు. వాళ్ల కొక రూబులు ఇచ్చి వాళ్లదగ్గరనుండి నేనాసీసా తీసుకున్నాను, వాళ్లెంతో సంతోషించారు. సీసాసగం ఖాళీగా వుంది. అయినప్పటికీ దాని నాణ్యం బట్టి చూస్తే, ఆ సగం సీసా ఎంతలేదన్నా రెండువందల రూబుళ్లు చేస్తుంది. నేనిచ్చిన రూబులుకే వాళ్లెంతో ఆనందపడిపోయి, ఇంకా ఇలా అన్నారు: 'ప్రభువువారి చిత్తమండి, ఇవేమిటో తురక బటాణీలల్లే వున్నాయండి... బటాణీలే కదా పులుసు కాచుకుందామని ఉడకబెట్టుకునే సరికి ఈ వెధవ గింజలు ఎంతకీ ఉడికాయి కావండి.' అవి బటాణీలుకావు, కాఫీ గింజలు. అలాగని వాళ్లతో చెప్పాను: 'ఇదేదో ఆ టర్కీవాళ్లకే సరిపోతుంది, సోల్జర్లం మనకొద్దు' అన్నాను. వాళ్ల పుణ్యమా అంటూ నల్లమందు

మాత్రం వాళ్ల నోట్లో వేసుకోలేదు. అక్కడ నేను చూశాను, సల్లమందు అచ్చులు బురదలో తొక్కేసి వుండడం.''

''తాతగారూ! నిజంగా చెప్పండి, మంచి నడి యుద్ధంలో వున్నప్పుడు మీకెప్పుడేనా భయం వేసిందా?'' అని అడిగింది అన్న.

''అదేమిటలా అడుగుతున్నావ్, అన్న, చిట్టిపిల్లా, భయం వేస్తుందా, భయం వెయ్యదా అని? భయమే వేసింది నాకు. యుద్ధమంటే తమకేమీ భయమే వెయ్యలేదనీ, జంయ్ జంయ్‌మని తోటాలు దూసుకుపోతూంటే, అది తమకొక మధురాతిమధుర సంగీతమే అనిపించిందనీ ఎవరైనా అంటే, ఆ కబుర్లను ఒక్కనాటికైనా సరే నమ్మవద్దు. అలా చెప్పేవారు పిచ్చి వాళ్లేనా అయివుండాలి, బడాయి ఖోరులేనా అయివుండాలి. అందరికీ భయం వేస్తుంది. అయితే ఒక్కటి — కొందరికి భయంతో కాళ్లూ చేతులూ చల్ల బడిపోతాయి. కొందరికి భయం వేసినా, తమాయించుకుంటారు. మరొక విషయం కూడా వుంది; అదేమిటంటావా: ప్రతీ సారీ భయమే వేసినా, ధైర్యం చిక్కబట్టడమనేది సాధనవల్ల అంతకంతకు మరింత అధికమవు తుంది. తత్ఫలితంగా తయారవుతారు ధైర్యవంతులూ, వీరులూనూ. అదీసంగతి. నాకు ఒకసారి చచ్చినంత భయం వేసింది''.

''అదెలా జరిగిందో చెప్పండి తాతగారూ'' అని అక్కచెల్లెళ్లిద్దరూ ఒక్కసారే అడిగారు.

చిన్నప్పుడు అనోసావ్ కథలు ఎంత సరదాగానూ ఎంత పరవశులై వినేవారో, ఇప్పటికీ అలాగే వింటారు వాళ్లిద్దరూ. అచ్చు చిన్నపిల్లల్లాగానే, బల్లమీద తన రెండు మోచేతులూ నిలిపి, అరచేతుల్లో బుగ్గలు ఆను కుని కూచుంది అన్న. ఆయన ఆ కథలు తాపీగా హడావుడీ హంగామా లేకుండా

చెప్పుకుపోతూంటే, అదేదో మందుచల్లినట్టు, వాటిలో ఒక మోస్తరు హాయైన మాధుర్యమూ మనోజ్ఞమూ వుండేది. ఆ యుద్ధ స్మృతులను చెప్పడంలో ఒక్కొక్కప్పుడు ఆయన మాటలూ ఉపమానాలూ పుస్తకాల్లో వున్నట్టుగా అదేమిటో కొత్తగానూ కొంత కృతకంగానూ వుండి, ఏ పురాతన కథకునిలాగో తానూ చెప్పాలని ప్రయత్నిస్తూన్నట్టనిపించేది.

''అదొక చిన్నకథే'' అంటూ అనోసావ్ మొదలెట్టాడు. ''నాకు షెల్ షాక్ తగిలిన తరువాత, షీప్క కనుమలో, చలికాలంలో జరుగుతా. మా కందక సొరంగంలో నలుగురం వున్నాం. అప్పుడు సంభవించింది ఘోర ప్రమాదం. ఒకనాడు పొద్దున్న పక్కమీదనుండి లేచేప్పటికల్లా, నేను యాకొవ్‌ను కాను, నేను నికొలాయ్‌ని అనిపించింది నాకు. ఇదేమిటి నేనీలా మోసపోతున్నా ననుకుని ఆ భ్రమలోంచి బయట పడదామని ఎంత ప్రయత్నించినా ఆ భ్రమ మరింత అధికమైపోతూంది. నాకు మతి చెడిపోతూందని గ్రహించుకుని, నీళ్లు తెండర్రా అని కేకేసి, ఆపాళంగా తలమీద నీళ్లు దిమ్మరించుకునేప్పటికల్లా మతి స్థిరపడింది.''

''అక్కడ మీరు యుద్ధాలు జయించడంతోపాటు స్త్రీ హృదయాల నెన్నింటిని మీరు జయించారో నేనూహించుకోగలను, యాకొవ్ మిహైలొవిచ్!'' అంది జెన్నీ రెయ్‌టర్. ''యవ్వనంలో మీరు మంచి అందంగానే వుండుండాలి.''

''అదేమిటది? ఇప్పటికి కూడా మా తాతగారు అందగాడే!'' అంది ఆన్న వెంటనే.

''అబ్బే, నాకు అందంలేదు పాడులేదు'' అని ఆయన నవ్వుతూ ప్రశాంతంగా జబాబు చెప్పాడు. ''కాని అలాగని నన్ను దగ్గరకు—

చేరనిచ్చేవారుకారనీ నేననను. బుకారెస్టులో ఒకమాటు మనస్సు నీరైపోయే ఉదంతం ఒకటి జరిగింది. మా సేనలతో మేం పట్నంలోకి ప్రవేశించాం. మాకు స్వాగతం చెప్పడానికని నగరం నడిచౌకులో ఫిరంగులు పేల్చారు. ఆ శబ్దం జోరుకి ఇళ్ల కిటికీ అద్దాలు అనేకం విరిగిపోయాయి. కాని కిటికీ గడపలలో గళాసులతో నీళ్ళుంచిన కిటికీల అద్దాలకు మాత్రం ఏమీ కాలేదు. ఆ సంగతి నాకెలా తెలిసిందంటారేమో? చెబుతా వినండి. ఏ ఇంట్లోనైతే నాకు బస ఏర్పాటైందో ఆ ఇంటికి నేను వెళ్లేసరికి, ఆ ఇంటి కిటికీ గడపలో పొట్టి పంజరం ఒకటీ, ఆ పంజరంమీద పెద్ద లష్టరుగాజు సీసా ఒకటీ, ఆ సీసాలో తేటైన నీళ్ళూ, ఆ నీటిలో ఈదుతూన్న బంగారపు చేపలూ వున్నాయి. ఆ చేపలమధ్యను కెనరీపిట్ట ఒకటి వాలి వుంది. కెనరీ పిట్ట నీళ్లలో వుండడమేమిటి! నాకు చాలా చిత్రమనిపించింది. కాని తీరా దగ్గరకెళ్లి నిదానంగా పరీక్షించి చూచేటప్పటికల్లా, ఆ కిటుకు తెలిసి పోయింది. ఆ సీసాకున్న వెడల్పాటి అడుగున పెద్ద బొడ్డు ఒకటుంది. ఆ బొడ్డులోకి సుళువుగా ఎగిరిపోయి కూచుంటుంది కెనరీపిట్ట. అప్పుడేమో నీళ్లల్లో వాలినట్టే కనబడుతుందది.

''నేనా ఇంట్లోకెళ్లే సరికి చక్కని బల్గేరియన్ అమ్మాయి ఒకామె నాకళ్ళబడింది. నా దగ్గరున్న చీటి ఆమెకు చూపించాను. అప్పుడామెను అడిగాను, ఫిరంగుల పేలుడులకి ఆ ఇంటి కిటికీ అద్దాలు చెక్కుచెదరకుండా వుండడానికి కారణమేమిటని. కిటికీగడపలో నీళ్ళు వుంచడంచేత అని ఆమె చెప్పింది. కెనరీపిట్ట కిటుకు కూడా ఆమే చెప్పింది: ఎంత మందమతినో కదా నేను అనిపించింది! మేమలా మాట్లాడుతూన్నప్పుడు మా చూపులు కలిశాయి. ఆ క్షణంలో విద్యుత్ విస్ఫులింగం ఒకటి మా మధ్య ప్రవ

హించింది. ఇక నేను నిలుచున్న పాటునా తిరుగులేకుండా మోహంలో పడి పోయానని నాకు దాంతో తెలిసిపోయింది.''

ముసలాయన ఒక్క క్షణం ఆగి, నల్లని ఆ ద్రాక్షరసాన్ని మెల్లగా పెదవులతో చప్పరించుతూ ఒక్క పిసరు రుచిచూశాడు.

''ఆమాట ఆ అమ్మాయితో తరువాత చెప్పారు కదా మీరు?'' అని అడిగింది పియానో పాటకురాలు.

''ఆఁ, చెప్పకేం, చెప్పానే – మాటల అవసరం లేకుండానే. అదెలా జరిగిందంటే...''

''అదేమిటో విని మేం సిగ్గుపడాల్సొస్తుందా ఏమిటి, తాతగారూ?'' అంది అన్న పెంకెగా నవ్వుతూ.

''అబ్బెబ్బే, అదేమక్కర్లేదు. కథంతా చాలా మర్యాదాగానే జరిగింది. మేము మకాం చేసిన కొన్ని చోట్ల వూరివాళ్లు మాతో కలసిమెలసి వుంటూన్నా, మరి కొన్ని చోట్ల, మాత్రం మమల్ని ఎడంఎడంగానే చూసేవారు. అయితే మొత్తంమీద బుకారెస్టు పట్నంవాళ్లు భాయిభాయి అంటూ దోస్తీ మనుషులే అవడంచేత, ఒకనాడు నేను వయోలిన్ వాయించడం ప్రారంభించగానే అక్కడున్న అమ్మాయిలందరూ ముస్తాబులై వచ్చి డాన్సు చేయడం మొదలెట్టారు. ఇక దాంతో ప్రతిరోజూ అదొక పారిపాటై పోయింది.

''ఒకనాడు, ఆనాడు వెన్నెలరాత్రి, ఇలా డాన్సు జరుగుతూండగా, నాప్రియురాలు బల్గేరియన్ అమ్మాయి ఆ ఇంటిమధ్యనున్న వసారాలోకి వెళ్లి పోయింది. కాస్సేపటికి నేనూ వెళ్లాను. ఆ అమ్మాయి అక్కడ – గులాబీ రేకులు బస్తాలలో ఏరడం అక్కడ మామూలు పనే అనుకోండి – బస్తాలతో

వున్న గులాబీ రేకులు తిరగవేస్తూన్నట్టు నటించింది. నేనామెను కౌగలించుకుని పదేపదే ముద్దెట్టుకున్నాను.

''ఆ రోజుమొదలు ప్రతిరాత్రీ ఆకాశమంతా చంద్రునితోనూ నక్షత్రాలతోనూ వెలిగిపోతూండగా ఎంతో ఆరాటంతో నేనామెను కలుసుకుని ఆమె సమక్షంలో వున్నంతసేపూ ఆనాటి దైనందినపు చికాకుల నన్నింటినీ మరచిపోయేవాణ్ని. ఇక మా సేన ఆ వూరు విడిచిపెట్టి వెళ్లిపోయే దినంనాడు, ఆచంద్రతారార్కమూ ఒకరినొకరం ప్రేమించుకుంటామని ఒట్టువేసుకుని విడిపోయాం — శాశ్వతంగా.''

''ఇంతేనా?'' అని అడిగింది లూద్మిల ల్వోవ్న ఎంతో ఆశాభంగంతో.

''ఇంతేకాకపోతే ఇంకేమిటి కావాలి మీకు?'' అన్నాడు జనరల్.

''యాకొవ్ మిహైలొవిచ్, నన్ను క్షమించండిగాని, ఇది మాత్రం అచ్చమైన ప్రేమకాదు. దండువిడిసిన రోజుల్లో ప్రతీ ఆఫీసరూ చేసే సాహసకృత్యమే తప్ప మరేమీ కాదిది.''

''మీరేమన్నా సరే, అది ప్రేమో, మరే చిత్తవికారమో, దైవసాక్షిగా నేను చెప్పలే...''

''ఇంతకీ, అసలైన ప్రేమను మీరెప్పుడైనా అనుభవించారా అని నేనడుతున్నా. అంటే ఏమిటనుకున్నారు?.. పవిత్ర ప్రేమ, స్వచ్ఛమూ శాశ్వతమూ అయిన ప్రేమ... స్వర్గతుల్యమైన ప్రేమ. అటువంటి ప్రేమ మీరెప్పుడైనా అనుభవించారా?''

''నిజం చెప్పాలంటే మీ ప్రశ్న కేంజబాబు చెప్పడమో నాకు తెలీదు'' అంటూ ఆయన కూచున్న పడకకుర్చీ నుండి లేచాడు. ''అలాంటి ప్రేమ నాకు తెలియదేమో. తొలి రోజుల్లో కుర్రతనం, అల్లరి, చీట్లపేక, యుద్ధం

— వీటితోనే తీరిపోయింది కాలమంతానూ. యవ్వనమూ ఆరోగ్యమూ శాశ్వతమనే అనుకున్నాం. ఇక తరువాత... అప్పుడు కాస్త వెనక్కి తిరిగి చూసుకునే సరికి — ఇకనేముంది, అప్పటికే మనం శిథిలమై పోయాంరా అని తెలిసిపోయింది... దానికేంగాని, తల్లీ, వేరా, ఇక నువ్వు కోప్పడకపోతే మేం బయల్దేరుతాం. అందరకూ నమస్కారం. హుజార్!'' అంటూ బహ్తీన్స్కీని పిలిచి: ''రాత్రిపూట వెచ్చగా వుందయ్యా, మనం నాలు గడుగులు ముందేస్తే సగం దారిలో బండి మనకి ఎదురవుతుంది. మనం బయల్దేరుదాం!'' అన్నాడాయన.

''అంతవరకూ నేనూ మీతో వస్తా, తాతగారూ!'' అంది వేర.

''నేనూ వస్తా'' అంది అన్న.

ఆయనతో కలిసి బయల్దేరే ముందు వేర తన పెనిమిటి దగ్గరకెళ్లి, అతనితో మెల్లగా అంది:

''నా డ్రాయరు సొరుగులో ఎర్ర మొహమల్ పెట్టె ఒకటుంది. దాల్లో ఉత్తరం వుంది. ఆ వుత్తరం చదువు.''

## 8

అన్న, బహ్తీన్స్కీ లిద్దరూ ముందు నడుస్తున్నారు. వీరికి ఒక ఇరవై గజాలు వెనుకగా చేతిలో చెయ్యి వేసుకుని జనరలూ వేరా వస్తున్నారు. రాత్రి ఎంత చిమ్మచీకటిగా వుందంటే, ఆ చీకటికి వాళ్ల కళ్లు అలవాటుపడక, కొద్ది నిమిషాలవరకూ వాళ్లు రోడ్డుమీద కాళ్లతో తడుముకుంటూనే నడవాల్సి వచ్చిందన్నమాట. తాను పెద్దవాడై పోయినా తన దృష్టి ఏ మాత్రమూ

చెక్కుచెదరలేదనే సగర్వంగా చెప్పుకునే అనోసావ్ వేరని చెయ్యిపట్టుకుని నడిపించుతేనేగాని ఆమె ఆ చీకటిలో నడవలేకపోయింది. ఓవర్‌కోటు తొడుక్కున్న తన మోచేతిలో తేలికగా చెయ్యివేసుకుని వున్న వేర హస్తాన్ని, చల్లగా వున్న తన పెద్ద చేతితో జనరల్ వుండివుండి వాత్సల్యంతో నిమురుతూ, కాస్సేపయాక:

''ఆ లూద్మిల ల్వోవ్‌న చిత్రమైన మనిషిలా వుంది'' అన్నాడాయన, తటాలున తన మనసులో మసులుతూన్న ఆలోచనలను బిగ్గరగా నెమరు వేసుకుంటూన్నట్టు. ''ఏభయ్యో పడి దాటిన స్త్రీ, పెళ్లికానిదైనా సరే, విధవరాలైనా సరే, ఇతరుల ప్రణయజీవితంలో తాను మునిగిపోవాలని ప్రయత్నిస్తుంది — చాటుమాటున వుండి వాళ్ల శృంగారాలను కనిపెడుతూనో, వాళ్ల అనుభావాలలో తాను పాలు పంచుకుని పరవశం చెందుతూనో, అదే పనిగా వాళ్ల ప్రణయగాథ గురించే మాట్లాడుతూనో, ఎదుటి మనిషి సుఖజీవితానికి ఎక్కడా లోటురాకుండా తాను చూస్తానని హామీ ఇచ్చో, ప్రేమగురించి, సర్వోత్కృష్టమైన ప్రేమగురించి తేనె పలుకులు ఏకరవు పెడుతూండడం నాజీవితంలో నేననేకసార్లు కనిపెట్టాను కదూ. ప్రేమ అంటే ఏమిటో మునపటివాళ్లకి తెలిసినట్టు ఇప్పటివాళ్లకి తెలీదనే నేను ఘట్టిగా చెప్పగలను. యథార్థమైన ప్రేమ అనేది ఇప్పుడెక్కడా నాకు అవుపించడంలేదు — మా రోజుల్లోనూ అవుపించలేదు నాకు!''

''అదేమిటి తాతగారూ, అలా అంటున్నారూ?'' అని వేర అడ్డు తగిలింది, ఆయన చేయి మృదువుగా నొక్కుతూనూ. ''ఇంతోటి అభాండమే? మీరూ వివాహం చేసుకొన్నారాయె, అంటే మీరూ యథార్థమైన ప్రేమను అనుభవించే వుండాలి. ఏం, నిజమేనా మరి?''

"అంతమాత్రాన యథార్థమైన ప్రేమ అంటే ఏమిటో నాకు తెలుసునని చెప్పడానికి వీల్లేదమ్మా, నేరా. నేను పెళ్ళాడ్డం ఏలా సంభవించిందో చెప్పమన్నావా? చెబుతా విను. అప్పుడే విడిన పూవులా, నా పక్కనే కూచునేది ఆ పిల్ల. ఆలా నా చెంత కూచుని ఊపిరి తీస్తూంటే, ఆ బ్లౌజులో నుండి కిందకూ మీదకూ చలించుతూన్న వక్షోజాల తూగు కనబడుతూండేది. అందంగా నిడివిగా తీర్చిదిద్దిన కనుబొమ్మలను ఎత్తి, తటాలున తన ముఖాన్ని బిడియంతో జేవురించుకునేది. ఆమె చెక్కిళ్ళు ఎంత నాజూకుగా వుండేవో, మెడ పాలతెలుపుతో ఎంత నిష్కపటంగా వుండేదో, ఆ చేతులు ఎంత మృదువుగానూ, వాటి స్పర్శ ఎంత శవనగానూ వుండేదో ఇక చెప్పేదేముంది! ఆరె, వాళ్ల తప్పా చెక్కా! ఆ పిల్ల తల్లీ తండ్రీ మా వెంట పడుతూ, తలుపు చాటునుండి మా మాటలు వింటూ, యజమానికేసి కుక్క చూస్తుందే అలాగే ఆ కళ్ళు అప్పుజెప్పి నాకేసి దేబెరిస్తూ చూడ్డం మొదలెట్టారు. ఇక నేను ఇంటికి వెళ్ళిపోతూండేటప్పుడు తలుపు దగ్గిర, అంటీ అంటనట్టు తేలికగా ముద్దుపెట్టుకునేది ఆ పిల్లనన్ను... టీ పుచ్చుకునేటప్పుడు, బల్ల అడుగునుండి అప్రయత్నంగా తాకినట్టు ఆ పిల్ల పాదం నాకు తగిలేది... ఇంకేముంది?.. ఇక నా పని సరి! వాళ్లవలలో చిక్కుకున్నాను. "నికీత అంతోనొవిచ్! మీ అమ్మాయిని నేను వివాహం చేసుకోవడానికి మీరు అనుమతించాలి. ఆమె సాక్షాత్తూ దేవకన్యకే అంటే నమ్మండి..." నా నోటివెంట మాట ఇంకా పూర్తిగా వచ్చిందో లేనేలేదో, వెంటనే అతగాడి కళ్లు చెమ్మగిలి, ఇక నన్ను ముద్దుపెట్టుకోవడం మొదలెట్టి... "నాయనా! నేను మొదటి దగ్గరనుండీ అనుకుంటూనే వున్నానోయ్ ఇలా జరిగితీరుతుందని... దేవుడు నిన్ను ఆశీర్వదించుగాక!.. ఈ పెన్నిధిని మాత్రం వేయి

కళ్లతో కాపాడుకో...'' అన్నాడు. అంతా మూడు నెలలు తిరగనే లేదు ఆ దేవకన్యకా పెన్నిధీ చింకి పాతలు కట్టుకుని, వుత్తకాళ్లతో, చెప్పులు తొడుక్కుని, వూడిపోతూ వూడిపోతూ వున్న చింపిరి జుట్టును సరిగ్గా చిక్కు అయినా తీసుకోకుండా, గుడ్డపీలికలతో జడ ముడేసుకుని, వంట లక్కలాగు వూరూ వాడా తిరుగుతూ, కుర్రకారు ఆఫీసర్లతో సాని సరసాలా డుతూ ముద్దుపలుకులు పలుకుతూ, కళ్లుతిప్పుకుంటూ కుక్కలా వాళ్ల వెంటపడడం ఆరంభించింది. నలుగురు మధ్యనూ మేం వుండేటప్పుడు, మరే కారణం చేతనో, నన్ను ''జాక్'' అని పిలవడం మొదలెట్టింది. ఎలా గనుకున్నావ్? దీర్ఘంతీస్తూ మాట సాగదీసి ముక్కుతో ''జా-ఆ-ఆ-క్'' అంటూనూ. డబ్బు తగలెయ్యడం, మోసం చెయ్యడం, దొంగవేషాలు వెయ్యడం, వుత్త ఏబ్రాసితనం, వళ్లమాలిన ఆబ, మనిషికి తగని అత్యాశ — ఎన్ని వుండాలో అన్నీనీ. ఇకా కళ్ల చూపుల్లో అంతా కపటమే, అంతా అబద్ధమే, అంతా విషమే... అదంతా ఏనాటి మాటో, ఏ కాలం కిందే జరిగిపోయిందో, ఏనాడు సున్నచుట్టేసి స్వస్తి చెప్పడం అయిపోయిందో లే... ఆ నాటకం మనిషికి నా చర్మం చెప్పులు కుట్టి ఇచ్చినా నారుణం తీరదనుకో... దేవుడి ధర్మమూ అంటూ, పిల్లలు పుట్టలేదు...''

''వాళ్లమీద కోపం ఇప్పుడు చల్లారిపోయిందా, తాతగారూ?''

'' 'కోపం చల్లారిపోవడం' మాట కాదు, వేరా, చిట్టితల్లీ! మొదట్లో నాకు వెర్రెత్తిందే అనుకో. వాళ్లు నా కంటబడుంటే, నిజంగా వాళ్లను చంపేసే వుందును, అందుకేమీ సందేహంలేదు. తరువాతంటావా, క్రమేణా ఆ కోపం చల్లారిపోయిందనుకో. ఇక ఇప్పుడేంలేదు — ఏమేనా మిగుల్తే — అదొక మోస్తరు రోత, జుగుప్సనూ. అలా జరిగిపోవడమే మంచిదిలే.

దైవకటాక్షంవల్ల అనవసరంగా రక్తం చిందించడం తప్పింది. అదీగాక, అనేకమంది భర్తలకు పట్టినగతి నాకు తప్పింది — అదే సంతోషం. ఆ మాటకొస్తే — ఈ చండాలం జరక్కపోయుంటేనో? నేను నానాపాట్లూ — బరువులుమోసే ఏ బిడారి ఒంటెలాగో, వెధవ పనులు జరుగుతూంటే చచ్చుపెద్దమ్మలా చూడలేక, చెప్పుకోలేక, వాటిని కప్పుకొస్తూ, పాడి ఆవులా, ఒక తెరలా, సంసారంలో ఒక చేటా బుట్టా తట్టా లాగానే — పడి వుండాల్సిందే కదా... వొద్దొద్దు! జరిగిపోయిందేదో అంతా మంచికే జరిగింది, వేరా తల్లీ!''

''కాదుగాని, తాతగారూ, మీరు క్షమిస్తే నేనొక్కమాటంటాను... లేదని మీరు ఎంతన్నప్పటికీ కూడా, ఆ పాతదెబ్బ మీ మనస్సులో ఇంకా ఉన్నాననే అంటూంది... పోతే, మీరేమో మీ అనుభవాన్నే మానవాళి కంతటికీ వర్తింపజేస్తున్నారు. నేనూ వాస్య వున్నాం — మా మాటే తీసుకోండి. మేం హాయిగా మా సంసారం గడుపుకుంటున్నా మంటారా లేదా, చెప్పండి మరి?''

అనోసావ్ వెంటనే జబాబుచెప్పక, కాస్సేపు ఊరుకున్నాడు.

''సరే లే. కాని మీదొక మినహాయింపనే అందాం'' అన్నాడాయన కొంత అనిష్టంతోనే. ''కాని సాధారణంగా మనుషుల్లో నూటికి తొంభై తొమ్మందుగురు ఎందుకు పెళ్లిచేసుకుంటారంటావు? స్త్రీని తీసుకుందాం. తానొక్కర్తే పెళ్లికాకుండా అవివాహితగా వుండడం, అందులోనూ ముఖ్యంగా తన తోటివాళ్లందరికీ పెళ్లిళ్లయిపోయుంటే, తనకు సిగ్గుచేటనిపిస్తుంది. పుట్టింటి వారికి తాను బరువుచేటుగా వుండడం అత్యంత దుర్భరమనిపిస్తుంది. తన సంసారాన్ని తాను చక్కబెట్టుకుంటూ, తన

కుటుంబానికి తాను యజమానురాలుగా వుండి, తన ఇంట్లో తాను వుంటూ, స్వతంత్రంగా బతకాలని వుంటుంది... ఇంతేకాకుండా — కేవలం శారీరక వాంఛ — మాతృత్వపు కోర్కె — తన గూట్లో తాను దీపం పెట్టుకుందామనే మనసు వుండనే వుంటుంది. మొగాడి ఆలోచనలు మరో విధంగా వుంటాయి. మొట్టమొదటిది, బ్రహ్మచారిగా జీవితం వెళ్లబుచ్చడమూ, అద్దెకొంపలో ఒక గదిలో తన వస్తువులూ సామాన్లూ వరసావావీ లేకుండా నానా అడ్డదిడ్డగానూ వుండడమూ, పూటకూటింట భోజనమూ, శుచి శుభ్రం లేకపోవడమూ, ఎక్కడ చూసినా పెంటపోగులూ చిరిగిపోయి చీకిపోయి విజ్జోడుగావున్న పడక గుడ్డలూ, వూళ్లో అప్పులూ, మర్యాదా మంచీ లేని స్నేహితులూ సావాసమూ, ఇలాంటి లక్షాతొంభై ఇబ్బందులతో చికాకెత్తిపోతాడు. ఇక రెండోది, సంసారమంటూ ఒకటుంటే ఇంతోటి ఖర్చూ లేకుండా కూడికగా పొదుపుగా లాభసాటిగా జరిగిపోతుంది, దానికి తోడు ఆరోగ్యంగానూ వుంటుంది అనుకుంటాడు. ఇక మూడో ఆలోచన: తనకి కూడా పిల్లా జెల్లా అంటూ వుంటే తాను చచ్చిపోయినా తన తదనంతరం తన వంశమూ తన పేరూ శాశ్వతంగా లోకంలో వుండిపోతుంది కదా... అనే వెర్రి భ్రమ ఒకటి అతడికి పుడుతుంది. నాల్గోది, నా విషయంలో జరిగినట్టుగా మంచిచెడ్డలు, పాపపుణ్యాలు ఎరగని చిత్త చాపల్య మనోవికారాలు. ఒక్కొక్కప్పుడు వీటన్నిటితోపాటూ కట్నం ఆశ ఒకటి పుట్టుకొస్తుంది. ఇన్నోటి ఆలోచనల మధ్య ఇక ప్రేమకి, నిస్వార్థమూ త్యాగపూరితమూ నిష్కామమూ అయిన ప్రేమకి — "మృత్యువును జయించే ప్రేమ" అని అంటారే అటువంటి ప్రేమకి — తావెక్కడ? నేననేది ఎట్టి ప్రేమకోసమైతే ఎంతటి సాహసకార్యానికి ఒడగట్టమన్నా సరే, ప్రాణం

బలిపెట్టడమన్నాసరే, మృత్యువును స్వీకరించడమన్నా సరే అయత్నకృతంగా, కేవలం పరమానందదాయకమైన కర్మగా ఎంచే ప్రేమకి తావెక్కడ? ఆగు, ఆగు, వేర — నీ వాస్యగురించే మళ్లీ నువ్వు చెప్పాలనుకుంటున్నావు, నేను గ్రహించానులే, ఏం అంతేనా? నేను యథార్థంగా చెబుతున్నా —వాస్య అంటే నాకు చాలా ఇష్టం. వాస్య చాలా మంచివాడు, యోగ్యుడు. అయినా రేప్పొద్దున్న కూడా అతని ప్రేమ ఇంత ఉజ్వలంగానూ వుంటుందని, బహుశా ఉంటుందేమో కూడా, నిశ్చయంగా ఎవరేనా చెప్పగలరని మనమనుకోలేం. నేనెలాంటి ప్రేమ గురించి చెబుతున్నానో నువ్వు అర్థం చేసుకున్నావుగా. ప్రేమ ఒక విషాదాంత నాటకం. ప్రపంచంలోని పరమాతిపరమ రహస్యం. ఎంతటి జీవిత సౌఖ్యాలూ, ఎట్టి మదింపులూ లెక్కలూ, ఎటువంటి రాజీలూ సమాధానాలూ దానిని కళంకపరచడానికి వీల్లేదు.''

''అటువంటి ప్రేమను మీరెప్పుడైనా చూచారా, తాతగారూ?'' అని అడిగింది వేర నెమ్మదిగా.

''లేదు, నేను చూడలేదు'' అని ముసలాయన ఒక్క క్షణమైనా వెనకతీయకుండా జబాబు చెప్పాడు. ''నిజం చెప్పాలంటే, దానిని దగ్గరగా పోలిన రెండు దృష్టాంతాలు మాత్రం నాకు స్వయంగా తెలుసు. కాని అందులో ఒకటి కేవలం బుద్ధిహీనత ఫలితం. ఇక రెండోది... పుల్లటి పులుపు నాలికను కొరికేసినట్టు... జాలితో గుండె ఝుల్లుమనిపోతుంది... నీకు వినాలనుంటే చెబుతా. చేటభారమేమీ కాదులే.''

''చెప్పండి, తాతగారూ.''

''ఇదీ కథ. మా డివిజన్‌లోనే — మా రెజిమెంటులో మాత్రం కాదు — ఒక రెజిమెంటు కమాండర్ వుండేవాడు. అతనికో భార్య. ఆ పాడు

ముఖానికి రూపూ రేఖా లేదు — నామాట నమ్ము, వేర — కేవలం మామూలు ముఖమే సుమా. ఉత్త ఎముకలపోగు, ఎర్రని జుట్టు, ఎండిపోయి చీపురు పుల్లలా పొడుగ్గా మనిషి, బానలా పెద్ద మూతి... ముఖానికి పొత్తుగా రంగు మెత్తుకునేదేమో మాస్కోలో పాతయిళ్ల గోడలకి చౌడు రాలి పోతుందే అలా ఆ రంగు ఆ ముఖంనుండి పెచ్చురాలిపోయేది. అంతలా వున్నప్పటికీ కూడా — ఆమె అదొకమోస్తరు మెస్సలీన, శూర్పణఖ అనుకో — కావలసినంత అహం, అతిశయం, మనుషులంటే నిర్లక్ష్యం, వల్లమాలిన కామేచ్ఛ, అందులోనూ వైవిధ్యంకోసం తహతహ. ఇక ఇవన్నీ చాలనట్టు — మార్ఫియా దురలవాటు ఒకటీ.

''ఇలా వుండగా శరత్తులో ఒకనాడు వాళ్ల రెజిమెంటుకి ఒక సరికొత్త ఎన్‌సైన్‌న్ని పంపించారు. ఉత్తకుర్రాడు. బోడ్డూడని ఆ అమాయకపు అబ్బాయికి ప్రపంచమంటే ఏమిటో తెలియదు పాపం. మిలిటరీ స్కూలు నుండి అదే సరాసరి రావడం. నెలరోజులు తిరగకుండానే ఆ ముసలి రంకు టూలు వాడిని బుట్టలో వేసేసుకుంది. ఇక దాని చేతిలో వాడు వుత్త కీలు బొమ్మ అయిపోయాడు. తైనాతీ బంట్రోతు, జీతంనాతనంలేని నౌఖరు, ఆజన్మాంత భృత్యుడు, రాత్రిపూట శాశ్వతపు డాన్సుపార్ట్నరు; ఆమె విసనకర్రనూ శాలువనూ మోసేవాడు, వాళ్లు కొంకర్లుపోయో చలిలో సహా ఆ పలుచని యూనిఫారం కోటుతోనే వీధిలోకి పరుగెత్తుకొనెళ్లి ఆమె గుర్రపు బగ్గీ వచ్చిందో లేదో చూసొచ్చేవాడు. ప్రపంచాన్ని మొదలంటా తరచి చూచి అనుభవం గడించిన ఇలాంటి నంగనాచి డాకిని, వృద్ధజారిణి పాదాలకు ముక్కుపచ్చలారని ఆ కుర్రాడు తన ప్రథమప్రణయాన్ని అర్పిస్తున్న ఈ నాటకం చూస్తే ఇంత ఘోరం వుంటుందా అని గుండె బద్దలైపోతుంది!

కొసకి ఆ కుర్రాడు ఒకవేళ ప్రాణాలతో బయటపడినప్పటికీ కూడా, ఆ అబ్బి పని ఇక అంతే – అతగాడి సర్వనాశనం ఇక శాశ్వతంగా స్థిరపడిపోయినట్టే. యావజ్జీవమూ ఆ ముఖాన అది చిరాంకితమై వుండిపోతుంది, అంతే.

''క్రిస్టమస్ వచ్చేటప్పటికల్లా ఆ కుర్రాడితో ఆమెకు అవసరం తీరిపోయి వాడంటే ఆమెకి మొహం మొత్తిపోయింది. తన వెనుకటి విటుడు ఒకణ్ణి, అనుభవజ్ఞుడైన మిండగాడ్నొకణ్ణి మళ్లీ చేరదీసింది. కాని ఈ కుర్రాడు మాత్రం ఆమెను వదల్లేకపోయాడు. ఇక వెర్రిపేరులా ఆమె వెంటపడ్డాడు. మనిషి నీర్సపడిపోయి, పూచికపుల్లలా అయిపోయి, ముఖంలో కళపోయింది. గ్రంథాల్లో చెప్పినట్టుగా ''మృత్యురాత అతడి నొసట కనబడుతూంది''. ఆమె అంటే అపరిమితమైన అసూయ పడిపోయాడు. రాత్రంతా ఆమె ఇంటి ఎదుట అలా నిలబడే వుండేవాడని అందరూ అనేవారు.

''వసంత రుతువులో ఒకనాడు రెజిమెంటువాళ్లు వనభోజనం ఏర్పాటు చేశారు. నాకు వాళ్లిద్దరినీ స్వయంగా తెలుసు. కాని ఆనాడు ఆ ఉదంతం జరిగినప్పుడు మాత్రం నేనక్కడలేను. మామూలుగా అన్ని వనభోజనాల్లోలాగానే ఆనాడు కూడా అందరూ బాగా సారా తాగారు. చీకటి పడిన తరువాత అందరూ రైలుపట్టాల వెంట ఇంటిముఖం పట్టారు. గూడ్సు బండి ఒకటి ఎదురుగా వస్తూందని వాళ్లందరూ తటాలున చూశారు. రైలురోడ్డు బాగా ఎగుడుగా వుందేమో, మంచి జోరుతో ఎగుడు ఎక్కుతూంది రైలు. రైలు కూతపెట్టింది. రైలు ఇక దగ్గరకొచ్చేస్తూంది, వాళ్లు నడుస్తూన్న చోటుపై సెర్చిలైటు వచ్చి పడిందనగా, తటాలున ఆమె ఆ కుర్రాడి చెవిలో వూదింది: '' 'నిన్ను వలచాను, నిన్ను వలచాను' అని అస్తమానం అంటూంటావు నువ్వు నాతో. ఆరైలు కింద వెళ్లిపడు

అని నేనాజ్ఞాపించానంటే పడతావా? పడవే!'' ఆ కుఱ్ఱాడు మారు మాటాడలేదు. అమాంతంగా రైలు కిందకి ఉరికేశాడు, అంతే. సరిగ్గా ముందు చక్రాలూ వెనకచక్రాలూ తన మీదనుంచి వెళ్లిపోతే పీక సరిగా ఉత్తరించుకుపోయి, కళేబరం రెండు ముక్కలైపోయేటట్టే అంతా కొలిచి లెక్కకట్టే ఉరికి పట్టాలకి అడ్డంగా పడుకున్నాడు. కాని ఆ పక్కనున్న దరిద్రుడెవడో ఆ కుఱ్ఱాడిని వెనక్కి లాగేశాడు. ఆ లాగేడాయనికేనా ఆ దరిద్రుడికి బలంలేకపోయింది. ఆ కుఱ్ఱాడు కూడా రైలుపట్టాలను రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకున్నాడు. రైలువచ్చి చేతులమీదనుండి వెళ్లిపోయేసరికి రెండు ముక్కలు కింద తెగిపోయాయి చేతులు.''

''అయ్యో, అయ్యో, ఎంత ఘోరం!'' అంది వేర స్తంభించిపోయి.

''ఆ కుఱ్ఱాడికి మిలిటరీ నుండి రాజీనామా చెయ్యక తప్పిందికాదు. ఆ కుఱ్ఱాడిక ఆ వూళ్లో వుండలేకపోయాడు: ఆమెకూ ఆ రెజిమెంటు వాళ్లందరికీ ఆ కుఱ్ఱాడిని రోజూ చూడ్డానికి ముఖం చెల్లిందికాదు. రెజిమెంటులో వాళ్లందరూ డబ్బు పోగుచేసి ఆ కుఱ్ఱాడికి ఇచ్చి ఆ వూరునుంచి పంపించేశారు. ఇంకేముంది. ఆ కుఱ్ఱాడి కథ అక్కడితోసరి... బతుకంతా బగ్గం పాడైపోయింది... ముష్టెత్తుకుంటూనే అలా బతికి... చలికాలంలో పీటర్స్‌బర్గ్‌లో ఏ రేవుమీదో చలికి కొరదుబారిపోయి చచ్చిపోయాడు...

''రెండోది తల్చుకుంటే జాలే వేస్తుంది. ఈ స్త్రీ కూడా ఇందాక చెప్పిన మనిషిలాంటిదే. కాని మంచి వయస్సులో వుంది, అందాల బరిణె కూడానూ. ఆమె నడత చెప్పడానికిక వీల్లేదు — ఎంత పాడుగా వుండాలో అంత పాడుగానూ వుంది. గృహచ్ఛిద్రాలు నలుగురు నోట్లోనూ పడడమూ, ఎంతటి చండాలమైనా సరే చూసీ వినీ 'ఆఁ, పోనీలెద్దూ' అనేయడమూ

పరిపాటే అయిపోయిన మాకు సహితమూ, దీనిని చూసి మాత్రం పరి భరించలేకపోయాం. ఆ మగాడికా — అబ్బే, అతగాడికి చీమకుట్టినట్టేనా వుండేదికాదు. అన్నీ వింటూండేవాడు, అన్నీ చూస్తూండేవాడు. నోరు మూసుకుని వుండేవాడు. అతనికి అర్థమయేటట్టు స్నేహితులు అతనితో చూచాయగా చెప్పేవారు. 'పోనిస్తురూ... నాకెందుకు ఆ గొడవంతాను... నా ముద్దుల పెళ్ళాం లేన హాయిగా సరదాగా వుంటే నాకంతే చాలు!'' అంటూ వాళ్ల మాటలు తోసేసేవాడు. ఉత్త జడభరతుడు!

''చివరకి ఆ రెజిమెంటు కంపెనీలోనే వున్న చిన్న ఆఫీసరు, లెఫ్టి నెంట్ విష్న్యకోవ్‌తో పెద్ద లంపటా తగిలించుకుంది ఆమె. ఇక ముగ్గురూ కలిసి ఇద్దరు మొగుళ్ళూ ఒక పెళ్ళాం సంసారం సాగిస్తూ వచ్చారు — అక్కడి కదే అతి ధర్మసమ్మతమైన వివాహ సంబంధమైనట్టు. ఇలా వుంటూం డగా మా రెజిమెంటు యుద్ధరంగానికి బయల్దేరింది. రెజిమెంటులో వున్న స్త్రీలందరూ మాకు వీడ్కోలివ్వడానికి రైలుకొచ్చారు. ఆమె కూడా వచ్చింది. నిజంగా మాకందరికి కడుపులో అరటిపండు పిసుక్కున్నట్టే వుంది — తన మొగుడికేసి కన్నెత్తి చూడనైనా చూడలేదు కదా ఆ మనిషి — మనసులో లేకపోతే పోయె, లోకానికి వెరచైనా, మొగుడంటూ ఒకడు న్నాడు కదా అని లెక్కేనా చేయకుండా — ఊహూఁ, చింతచెట్టును పట్టు కుని కొరివిదయ్యం వదలనట్టు — ఎంతసేపూ తన లెఫ్టినెంటుని పెనవేసుకుపోయి క్షణం తీరిందికాదామెకు. ఇక అన్ని వీడ్కోళ్ళూ అయిపోయి, మేమందరం రైల్లో సర్దుకు కూచున్నాక, రైలు కదిలిపోయే సరికి, అప్పుడు మొగుడు మాట జ్ఞాపకం వచ్చింది కాబోలు, మొగుణ్ణి కేకేసి: 'వాలోద్యని జాగ్రత్తగా చూస్తూండేం! అతనికేమేనా అయిందంటే

— ఇక నీ ఇంటి గుమ్మం తొక్కను, నీ ముఖం చూడను, పిల్లల్ని కూడా నాతో తీసుకుపోయి, లేచిపోతాను సుమా!' అని ఒప్పగింతలు పెట్టింది ఆ భడవ!

"ఆ కెప్టెన్ ఏ చావాటి పెద్దమ్మో, చేవలేని ఏ చచ్చు జీలుగుబెండో, ఏ ఆడారి అచ్చమ్మో అనుకునేవు సుమా! అబ్బే, ముమ్మాటికీ కాదు. మంచి శూరుడు, పరాక్రమశాలి. జెలోన్నియె కొండ దగ్గరున్న టర్కిష్ దుర్గంపై తన దళంతో ఆరుసార్లు దాడిచేశాడు. దళంలోవున్న రెండువందలమంది లోనూ ఒక్క పధ్నాల్గురు తప్ప కడమవారందరూ చచ్చిపోయారు. ఆ యుద్ధంలో అతడు రెండు సార్లు గాయపడినా, ఆస్పత్రికి వెళ్లమంటే వెళ్లనంటూ మొరాయించి యుద్ధంచేస్తూనే వుండిపోయాడే గాని, బయిటకొచ్చాడుకాదు. అల్లాంటి మనిషి అతడు. అతడంటే సోల్జర్లకి దేవుడే, వాళ్లతనిని నెత్తిమీద పెట్టుకుని పూజించేవాళ్లనుకో.

"అయితే ఏం? తాను చేయాల్సిన పనేమిటో ఆమె చెప్పనే చెప్పిందిగా... తన ముద్దుల పెళ్లాం లేన చెప్పనే చెప్పింది!

"అందుచేతనే ఆ పిరికిపందా బద్ధకస్తుడూ విష్నేకోవ్‌ను, పనికి మాలిన ఆ సోమరిపోతును, ఎక్కడ కందిపోతాడో, ఎక్కడ అలసిపోతాడో అంటూ జీతమిచ్చి పెట్టిన దాదిలాగు, కన్న తల్లిలాగు, అలా కాపాడుకుంటూ వచ్చాడు. ఆ సోమరి ఏ కందకపు ప్రాకారంలోనో కూచుని హాయిగా కబుర్లు చెప్పుకుంటూనో, ఇంకెవరితోనో కలిసి ఏ మూడు ముక్కలాట ఆడుతూనో కాలక్షేపం చేస్తూంటే, వాడు అజమాయిషీ చేయాల్సిన ఆ కందకాలూ ప్రాకారంగాలూ తవ్వకం పనేదో ఇతగాడే చూసుకుంటూండేవాడు. రాత్రిళ్లు విష్నేకోవ్ బదులు తానే గస్తీచౌకీలను తనిఖీ చేస్తూండేవాడు. అదేనా

ఎటువంటి గడ్డుదినాల్లో అనుకున్నావు? యరొస్లావల్ ములసమ్మ తన పెరట్లో కేబేజీలను ఎలా కచ్‌కచ్‌మని కోసిపారేస్తుందో అలా ఆ రోజుల్లో టర్కిష్ లక్ష్కర్లు మన గస్తీచౌకీ సైనికుల పీకలను ఉత్తరించి పారేసేవారు, ఏమనుకున్నావో! ఆరె దేవుడా, ఇప్పుడు తల్చుకుంటే పాపమే వస్తుంది గాని, చెప్పకేమి, టైఫస్ జ్వరంతో విష్న్యకోవ్ ఆస్పత్రిలో చచ్చిపోయాడని తెలిసేప్పటికల్లా సంతోషించనివాడు లేడంటే నమ్ము!..''

''మరైతే, నిజంగా ప్రేమించిన స్త్రీలు మీకెప్పుడైనా తారసపడ్డారా, తాతగారూ?''

''తారసపడ పోవడవేమి, తల్లీ, తారసపడ్డారు. నేనొకటి చెబుతా విను: నూటికీ కోటికీ ఎక్కడో ఒకరు తప్ప ప్రేమలో మునిగిపోయిన ప్రతి స్త్రీ కూడా, అఖండత్యాగంచేయ సమర్థురాలే అని నేను ముమ్మాటికీ నమ్ముతాను. చూశావుకాదూ, తాను ముద్దుపెట్టుకున్నది మొదలు, కౌగలించుకుని తన శరీరాన్ని అర్పించేసిన క్షణం నుండి – తాను అప్పుడే మాతృమూర్తి అయేపోయింది. ఆమె యథార్థంగా ప్రేమించిదంటే మటుకు, తనకు మాత్రం ప్రేమే తన జీవితసర్వస్వమూ – తన సర్వజగత్తూ! కాని, ప్రేమ అనేది మనిషిలో కేవలం లాంఛనప్రాయమైన రూపం ధరించిందంటేనూ, సంసారపు నిత్యకర్మ కిందకి దగనాసిల్లి పోయిందంటేనూ, అదేదో ఒక చిన్న వినోదకాలక్షేపంగా క్షీణించిపోయిందంటేనూ, అందుకు తప్ప ఆమెది కానేకాదు. అందుకు తప్పంతా, పిట్ట శరీరంతో, చెవులపిల్లి గాంభీర్యంతో, అప్పుడే ఇరవైయ్యేళ్ల వయస్సుకే జీవితమాధుర్యం అనుభవించేసి సంతృప్తిచెందిపోయి, తీవ్రమైన వాంఛలకూ, వీరోచితకార్యాలకూ, కరుణారసానికీ అసమర్థుడై, ప్రేమను ఆరాధించే భాగ్యానికి నోచుకోని

మగవాడిదే. ఎప్పుడో ఒకానొకప్పుడు వెనకటి రోజుల్లో యథార్థమైన ప్రేమ వుండేదనే అంటారు మరి. నిజంగా లేకపోయే వుండినప్పటికీ కూడా, దీనిగురించే కదా ప్రపంచంలోని ఉత్కృష్ట మేధాసంపన్నులు, మహానుభావులు — కవులు, నవలారచయితలు, వాగ్గేయకారులు, కళాకారులు — అందరూ కలలుకన్నదీ, కోర్కెలు ఆశించినదీ దీనికోసమే కదా? నేనీ మధ్యనే మనోన్ లెస్కా, కెవలీయర్ డి'గ్రేయేల కథ చదివాను... నిజంగా కళ్లంట నీళ్లు తిరిగాయంటేనమ్ము... ప్రతి స్త్రీ కూడా ఇలాంటి ప్రేమ గురించి — ఏకాగ్రమైనట్టి, సర్వపాపాలను క్షమించేటట్టి, ఎట్టి కష్టాలనైనా సరే భరించ వెనుదీయనట్టి, నిరాడంబరమైనట్టి, సర్వత్యాగాలకూ సిద్ధమైనట్టి ప్రేమ గురించి — తన హృదయాంతరాళంలో కలలు కంటుందంటావా, లేదం వా, తల్లీ వేర, నువ్వే నిజంగా చెప్పు!''

''అందుకేమీ సందేహంలేదు, ముమ్మాటికీ సందేహంలేదు, తాతగారూ!''

''అటువంటి ప్రేమను అసలు తాను అనుభవించక పోవడంవల్లనే స్త్రీ తన పగతీర్చుకుంటుంది... మరొక ముప్పైనలభై య్యేళ్లు గడిచాయంటే... నేనప్పటికి బతికి వుండననుకో, నువ్వే తప్పకుండా చూస్తావు, తల్లీ, వేరా. నేనిప్పుడు నీతో చెబుతూన్న మాటలే జ్ఞాపకం వుంచుకో, మరొక ముప్పైనలభై య్యేళ్లకి, ఇదివరకెన్నడూ కనివినియెరుగనంతటి అధికారం చలాయిస్తారు స్త్రీలు. హిందూదేశపు దేవతావిగ్రహాల్లాగు ముస్తాబవుతారు. మమ్మల్ని, పురుషుల్ని, అడుగులకు మడుగులొత్తుతూ ఇచ్చకాలాడే తుచ్ఛులైన బానిసలుగా కాలికింద నలగదొక్కేసి అధఃపాతాళానికి అణగదొక్కేస్తారు. వాళ్ల వెర్రిమొర్రి పిచ్చిపిచ్చి కోర్కెలూ, క్షణ

భుంగురములైన చంచలచిత్తాలూ మాకు కర్కోటములైన శిలాశాసనాలుగా పరిణమిస్తాయి. ఇక పోతే, దీనికంతకూ కారణం, తరతరాల నుండీ మేము ప్రేమను ఆరాధించడానికి, ప్రేమ ఎదుట సాగిలబడి సాష్టాంగప్రణామాలు ఆచరించడానికి నోచుకోకపోవడమే. ఆ పగతీర్చుకోవడం కూడా ఇలా అలా వుండదు, మహా భయానకంగా వుంటుంది సుమా. భౌతికశాస్త్ర నియమం నీకు తెలుసుగా: క్రియ ప్రతిక్రియలు సరిసమానములూ విరుద్ధములూ.''

ఆయన ఒక గడియ ఆగి, తటాలున ప్రశ్నవేశాడు: ''ఒక్క విషయం నిన్నడుగుతాను: ఆ ప్రశ్న నీకు మరీ చికాకుగా వుంటే నువ్వు జబాబు చెప్ప నక్కర్లేదు, వేర, తల్లీ. ఇందాకలా నీగురించీ టెలిగ్రాఫ్ సిగ్నలర్ గురించీ రాజకుమారుడు వసీలి కథ చెప్పాడే, అందులో ఎంతవరకు నిజం, అతని అలవాటు ప్రకారం ఎంత వరకు కల్పన?''

''నిజంగా మీకు వినాలనే వుందా, తాతగారూ?''

''నీకు ఇష్టముంటేనే సుమా, వేర, నీకు మనస్ఫూర్తిగా ఇష్ట ముంటేనే. ఏ కారణంచేతేనా నీకిష్టం లేకపోతే...''

''అబ్బే, మీతో చెప్పేందుకు నాకిష్టం లేకపోవడమేమిటి! మీతో చెప్పడమంటే నాకిష్టమే.''

తనకింకా రెండేళ్లలో పెళ్లి అవుతుందనగా ఎవరో ఒకతను, పిచ్చి వాడో ఏమిటో తెలియదు మరి, తనను ప్రేమించానంటూ తన వెంటపడడం గురించి అంతా పూసగుచ్చినట్టు ఆమె జనరల్‌తో చెప్పింది.

ఆ మనిషిని తాను ఒక్కసారైనా చూడలేదు. అతడి పేరూ వూరూ కూడా ఆమెకు తెలియదు. అతడు వూరికే వుత్తరాలు మాత్రం రాస్తూండే

వాడు. ఆ వుత్తరాల్లో గె.ఎస్.జె. అనే ఎప్పుడూ పొడి అక్షరాల సంతకమే వుండేది. ఒకమాటెప్పుడో ఏ వుత్తరంలోనో, తానేదో ఒక ఆఫీసులో చిన్న ఉద్యోగినని మాత్రం రాశాడు, అంతే — టెలిగ్రాఫ్ ఆఫీసు గురించి ఒక్క ముక్క అయినా అతడు రాయలేదు. తాను ఎక్కడెక్కడకు వెళ్తాన్నదీ ఏమేమి చేస్తూన్నదీ అతడు అతి జాగ్రత్తగా కనిపెడుతూనే వుండివుండాలి, ఎందుచేతనంటే, ఫలానా ఫలానా రోజున తాను ఎవరింటికి వెళ్ళినదీ, ఆనాడు తాను ఎవరితో కలిసి వెళ్ళినదీ, తాను ఏమేమి దుస్తులు వేసుకున్నదీ ఇదంతా అతడు తన వుత్తరాల్లో తలవెంద్రుకవాసి తప్పకుండా తు.చ సరిగ్గా రాసే వాడు. మొదట్లో అతడి వుత్తరాలు మోరటు ప్రణయంతో నిండి, ఆ లాలస వాక్యాలు చదువుతూంటేనే నవ్వువచ్చేది. అయితే ఒకటి — మర్యాద అతిక్రమించినది పల్లెత్తుమాటైనా ఆ వుత్తరాల్లో వుండేదికాదు సుమండీ. ఒక్కమాటు మాత్రం తాను జబాబు రాసింది — ("తాతగారూ, ఈ విషయం మాత్రం ఎవ్వరికీ తెలియనీయకండి, మీా పుణ్యముండేను! నేను వుత్తరం రాశానన్న సంగతి ఇంతవరకూ పిట్ట మనిషికి కూడా తెలియదు. మీాతో గనక చెబుతున్నాను, తాతగారూ!'' అని వేర ఆయన్ని బతిమాలు కుంది.) — ఏమనంటారా, ఇకమీాదటనుండి తనపేర ఈ ప్రణయలేఖలు రాసి తనను చికాకుపరచవద్దని. ఆనాటినుండి అతడిక ప్రేమ గురించి రాయడమే మానేశాడు. ఎప్పుడైనా రాస్తే, ఈస్టరు పండుగకో, సంవత్స రాదికో, తన పుట్టినరోజునాడో రాసేవాడు. ఆనాడు అందిన బంగీ గురించి కూడా జనరల్‌తో రాజకుమారి వేర చెప్పి, తన గుప్తప్రేమికుడు రాసిన చిత్రమైన వుత్తరంలోని సంగతులు కూడా యథాతథంగా ఆయనకు తెలియ పరచింది.

''ఊఁ'' అని దీర్ఘంతీస్తూ అదంతా విన్నతరువాత చివరకి అన్నాడా యన. ''ఒకవేళ ఈ మనిషి ఏ విపరీతపు వ్యక్తో, ఏ పిచ్చివాడో సుమా – లేకుంటే, ఒకవేళ నీ జీవితపథంలో, స్త్రీలు కలలు కనేటట్టి, ఈనాడు పురుషులకు అతీతమైనట్టి ప్రేమ నీకు ఎదురైందేమో సుమా – ఎవరు చెప్పగలరు? ఇదిగో చూడూ, దూరంగా దీపాలు కనబడుతున్నాయి కాదూ? అవి నా బండి దీపాలే.''

సరిగ్గా ఆ క్షణంలోనే వాళ్లవెనకాలనుండి మోటారుకారు హారన్ వినబడింది. ఆ మోటారు దీపాల వెల్తురికి బళ్లచక్రాలకు చాళ్లు పడి పోయున్న రోడ్డు అసిటిలైన్ జ్వాలల ధవళకాంతితో మెరిసిపోతూంది. కారు ఆగింది. కారును నడుపుతూన్న గుస్తావ్ ఇవానొవిచ్ అన్నాడు:

''ఆనొచ్క! నీ వస్తువులన్నీ కారులో వున్నాయి. రా, మనం వెళ్దాం. తమరు కూడా దయచేయండి, ఇంటికి తీసుకెళ్లిదింపేస్తాను!''

''ధన్యవాదం. ఎందుకులే నాయనా, వొద్దొద్దు'' అన్నాడు జనరల్. ''ఈ మరబళ్లు అంటే నాకు రోత. వల్లమాలిన కుదుపు. దానికితోడు భరించలేనంత దుర్గంధం – ఎందుకొచ్చినది ఆ సుఖంలేని షికారు? ఇక నే వుంటాను, మీరు వెళ్లండి. వేర, అమ్మణ్ణీ! నేవెళ్లొద్దునా? మిమ్మల్ని చూడ్డానికి తరుచుగా వస్తూంటాన్లే'' అంటూ వేరని నుదిటిపైనా చేతులనూ ముద్దుపెట్టుకున్నాడు జనరల్.

అందరూ ఒకరితో ఒకరు వీడ్కోలు చెప్పుకున్నాక, కారు బయల్దే రింది. వేరను బంగాళా గేటు వరకూ దిగబెట్టి, అక్కడ రయ్‌మని కారుతో ఒక చక్కర్ కొట్టి కారు తిప్పుకుని, చుక్‌చుక్ మని చప్పుడుచేస్తూన్న తన కారుతో కూడా ఆ గాడాంధకారంలోకి మాయమైపోయాడు ఫ్రీస్సె.

## 9

మనసులో అదేమిటో ఒక విధమైన ఆవేదనతో బాధపడుతూ వేర బంగాళా ప్రాంగణం చప్పరంపై నడిచి ఇంట్లో అడుగుపెట్టింది. అడుగు పెట్టకముందే దూరంనుండి తన సోదరుడు నికొలాయ్ గొంతు బిగ్గరగా వినబడింది; పొడుగ్గా బక్కపలచగా వున్న అతని విగ్రహం గదిలో ఇటూ అటూ పచారు చేస్తూండడం ఆమెకు కనబడింది. వసీలి ల్వోవిచ్ చీట్ల పేకబల్ల దగ్గర కూచుని, క్రాపుచేసి వొత్తుగా వున్న నారరంగు జుట్టు శిరస్సును కిందగా వంచి పసుప్పచ్చని టేబిలుగుడ్డమీద సుద్దముక్కతో ఏవో పిచ్చిగీతలు గీస్తున్నాడు.

''నేనేనాడో దీని అంతు తేల్చేసుండేవాణ్ణి!'' అని అంటూ, తన నెత్తి మీదను ఏదో పైకి అగపడని బరువు వున్నట్టూ దానిని తాను తన చేతితో తీసి పారవేసినట్టూ తన కుడిచేతిని కిందకు విసరికొట్టుతూ నికొలాయ్ చిరాకుపడుతున్నాడు. ''నేనేనాడో అనుకున్నాను, ఈ వెర్రిమొర్రి వుత్తరాల అంతు తేల్చి వుండాల్సిందని. నువ్వూ వేరా ఇంకా పెళ్ళి చేసుకోక ముందే నేను మొత్తుకున్నానా లేదా, ఈ వుత్తరాలను చూసి వాటిలో ఏదో పరిహాసం వున్నట్టు చిన్నపిల్లల్లా నవ్వడంతో సరిపోదర్రా అని?.. ఇదిగో, వేర రానే వచ్చింది... నీ పిచ్చివాణ్ణి గురించే, నీ పె.పె.షె. గురించే వసీలి ల్వోవిచ్ నేనూ మాట్లాడుతున్నాం. వేర, అమ్మణ్ణీ! నన్నడుగుతే ఈ వుత్తర ప్రత్యుత్తరాలు అతి పెంకెగానూ అతి అసభ్యంగానూ వున్నాయనే అంటాను'' అన్నాడు.

''ఉత్తరప్రత్యుత్తరా లంటున్నావేమిటి? ప్రత్యుత్తర మంటూ ఒక్కటేనా లేనిదే!'' అంటూ అతని మాటలకు షేయిన్ అడ్డుపడ్డాడు. ''ఉత్తరాలు రాసిందంతా అతడే.''

ఆ మాట విని వేర ముఖం ఎర్రబడిపోయి, అక్కడ తొట్టెలో వున్న విసవక్ర ఆకుల గున్నతాటిచెట్టు ఛాయకింద సోఫాలో చతికిలబడింది.

''అయితే, నేనన్న మాటలకి క్షమాపణ చెప్పుకుంటున్నాను'' అన్నాడు నికొలాయ్, ఆ రహ్యాపు బరువును తన గుండెల్లోనుంచి పైకి లాగి పారేసుకున్నట్టు.

''ఆ మనిషి నెవడినో నేనేదో గుత్తకి కొన్నట్టు, 'నీ' అంటావెందుకూ?'' అంది వేర, తన పెనిమిటి తనను వెనకేసుకు రావడంతో ధైర్యం తెచ్చుకుని.

''అయితే సరే, మళ్లీ మరోమాటు క్షమాపణ చెప్పుకుంటున్నాను. నేనన్నమాట ఏమిటంటే, ఇతగాడి పిచ్చి చేష్టలకి మనం ఇక స్వస్తి చెప్పించాలి. ఇదొక నవ్వులాటలాగానూ దీనిమీద వ్యంగ్య చిత్రాలు గీస్తూ కూచుంటేనూ వ్యవహారం శ్రుతిమించి రాగాన బడుతూంది. నామాట నిజంగా నమ్మండి, నాకు పట్టుకున్న బాధా నన్ను పట్టుకు వేధించుతూన్న హింసా ఏమిటంటే — మీ ఇద్దరికీ, వేరకీ నీకూ, ఎక్కడ మాటొచ్చి పడుతుందో అనే, వసీలి ల్వోవిచ్'' అన్నాడు నికొలాయ్.

''గోరంతలు కొండంతలు చేస్తున్నావోయ్, కోల్య'' అన్నాడు షేయిన్.

''అయితే కావచ్చులే, అలాగే అనుకో పోనీ... రేప్పొద్దున్న నీ పేరు ప్రతిష్ఠలకి అతి సులభంగా మాటవచ్చే ప్రమాదం కనబడుతూనే వుందిగా.''

''నాకేమీ కనబడ్డంలేదు సుమా!'' అన్నాడు రాజకుమారుడు.

''ఈ పిచ్చి కంకణం వుందే, దీనిని'' అంటూ ఆ కంకణం వున్న పెట్టెను బల్లపైనుండి తీసి, చప్పన మళ్ళీ దాన్ని అసహ్యంతో అక్కడే పడేసి, ''ఈ చండాలపు వస్తువు మనింట్లోనే వుండిపోయిందే అనుకో, లేదాంటే దీనిని ఏ పెంటకుప్పమీదో పారేశామే అనుకో, అదీకాదంటావూ, 'నువ్వు తీసుకో' అని దాసీదానికి, దాషకి ఇచ్చేశామే అనుకో. అప్పుడు ఆదికి ముందుగా, ఆ పె.పె.షె. గాడే వెళ్ళి తనకు తెలిసినవాళ్ళతోనూ తనకి తెలియనివాళ్ళతోనూ, తాను కానుకగా యిచ్చిన నగా న్రటా రాజకుమారి వేర నికొలాయెవ్న పుచ్చుకుంటూందని బడాయిలు కొడతాడు. ఇక రెండోది, ఇంతటితో వూరుకోకుండా, మరీ బరితెగి ఈ ఘనకార్యాలను ఇంకా సాగిస్తూనే వుంటాడు. ఇక రేప్పొద్దున్న వ్రజపుటుంగరం, ఎల్లుండి ముత్యాల హారం, ఇలాగే — చూస్తూండు, చూస్తూండు — ఏ కన్నపుదొంగతనమో ఏ మోసమో బయలుపడి, ఇతగాడ్ని బోను ఎక్కిస్తే, ఇకేముంది, రాజకుమారుడు షేయిన్నీ రాజకుమారి షేయిన్నీ సాక్ష్యానికీ సంపన్నానికీ కోర్టుకి ఈడుస్తారు... అప్పుడు ఎంతో చక్కగా వుంటుందిగా!''

''అచ్చాచ్చా! ఏమేనా సరే ఈ కంకణాన్ని వాపసు పంపేయాల్సిందే!'' అన్నాడు వసీలి ల్వోవిచ్ పెద్దగా.

''నాకూ అదే మంచిదని తోస్తూంది'' అంది వేర, పెనిమిటితో ఏకీభవిస్తూ. ''అదిన్నీ ఎంత త్వరగా పంపేస్తే అంత మంచిది. అయితే ఒక్క చిక్కొచ్చిపడింది కద! దానిని పంపించడం ఎలాగు? అతగాడి పేరూ పైవిలాసమూ మనకి తెలీదే!''

''ఓస్, అదీ ఒక బ్రహ్మాండమే? అస్మదాదులు తల్చుకుంటే చిటికెలో అవుతుంది!'' అన్నాడు నికొలాయ్ నికొలాయెవిచ్ నిర్లక్ష్యంగానూ.

''పె.పె.షె. అనే పొడి అక్షరాల పేరు మనకి తెలుసుకదా... అదేకదూ, వేర, అతగాడి పేరు?''

''గె. ఎస్. జె.''

''భేషో. ఇందుకుతోడు అతగాడు ఏదో ఒక ఆఫీసులో పనిచేస్తున్నాడని కూడా మనకి తెలుసు. ఇదేచాలు, ఇంతకంటే మనకి కావాల్సిందేముంది గనక? రేప్పొద్దున్న నేను డైరెక్టరీ తిరగేసి చూస్తే ఈ పొడి అక్షరాల పేరుతో వున్న ఉద్యోగస్థుడి పేరో గుమాస్తాగాడి పేరో క్షణంలో బయలుపడు తుంది. అలాగా బయట పడదూ అంటే — ఏముంది, గుప్‌చప్‌గా పోలీసు డిటెక్టివ్‌కి ఈ పని ఒప్పజెప్పానంటే, నిమిషంలో ఆరా తీస్తాడు. ఇక అంతకీ ఏదేనా చిక్కు వచ్చిందంటే, అతగాడి దస్తూరీతోవున్న ఈ కాగితం నా చేతిలో వుందాయె. అంతెందుకు, రేపు మధ్యాన్నం రెండు గంటలు కొట్టే టప్పటికల్లా, అతగాడి పేరూ, ఇంటి పేరూ, తండ్రి పేరూ, పై విలాసమూ, సాకీనూ గీకీనూ, చివరకి ఎప్పుడు, ఎన్ని గంటలనుండి ఎన్ని గంటల వరకూ ఇంట్లో వుంటాడో సర్వమూ నాకు తెలిసిపోతాయి, ఏమనుకున్నారో! ఇకప్పుడు, అతగాడికి తన అమూల్యాభరణాన్ని రేపు మనం వాపసు ఇచ్చి వేయడమే కాకుండా, ఇక తానీ లోకంలో వున్నట్టే మనకు మళ్ళీ అత గాడు తన అయిపూ జాడా తెలియపర్చకుండా బందోబస్తు చేసేస్తాం.''

''ఏం చెయ్యా లనుకుంటున్నావోయ్?'' అనడిగాడు రాజకుమారుడు వసీలి.

''ఏమిటూ? గవర్నరుదగ్గెళ్లి చూస్తా...''

''అబ్బే, గవర్నరు దగ్గిరకెళ్ళొద్దు. మనకీ అతనికీ వున్న దోస్తీ నీకు తెలుసుగా... అతడు మనకి తాటాకులు కట్టేస్తాడు.''

''అయితే సరేలే. పోలీసు కమీషనర్ దగ్గిరకెళ్తాను. అతడు మా క్లబ్బు మెంబరే. అతడే ఈ రోమియోని పిలిపించి ఖబడ్దార్ అని భయ పెడుతాడ్లే. ఏం చేస్తాడో నీకు తెలియదులావుంది? ఏం చేస్తాడంటే, తన చూపుడువేలును నీ ముక్కు దగ్గరగా తీసుకొచ్చి, చెయ్యి కదపకుండా ఆ చూపుడువేలొక్కటే ఆడిస్తూ: 'ఈ వేషాలేవీ నా దగ్గర పనికిరావు, తెలి సిందా, అయ్యగారూ!' అని ఒక్కరంకె వేస్తాడు.''

''ఛీ, ఛీ! పోలీసువాడి దగ్గిరకా వెళ్లడం!'' అంది వేర ముఖం చిట్లిం చుతూ.

''అవును, వేర, నిజమే'' అని రాజకుమారుడు ఒప్పుకున్నాడు. ''ఈ వ్యవహారంలో మనం పైవాళ్లని కలుగజేసుకోమనడం మంచిదికాదు. పైవాళ్లు ఇందులో వేలుపెట్టగానే నానా గుసగుసలూ పుకార్లూ బయల్దేరుతాయి... లోకులు కాకులన్నారు, అందులోనూ మన వూరు సంగతి మనకి తెలీదా ఏమిటి, అందరు బతుకులూ బజార్లోనే!.. నేనే వెళ్లడం మంచిది... ఆ... ఆ... యువకుడి దగ్గరకి... ఇంతకీ ఆ దేవుడికే ఎరుక, ఆ వ్యక్తి యువకుడో అరవై య్యేళ్ల ముసలాడో ఏమిటో? కంకణం ఇచ్చేసి, ముప్పచీవాట్లూ పెట్టి చక్కావస్తా...''

''అలా అయితే నేనూ వస్తానీతో'' అన్నాడు రఫీమని నికొలాయ్. ''నువ్వు మరీ మెత్తనివాడివి. ఆ మాట్లాడేదేదో నన్నే మాట్లాడనీ... ఇక, మరి'' అంటూ, జేబులోనుండి గడియారం తీసి చూసుకుని, ''నేను నాగదిలోకి వెళ్తా. నేను చాలా అలసిపోయున్నాను. రెండు కేసుల తాలూకు కట్టలున్నాయి, ఎప్పుడు చదువుతానో ఏమిటో.'' అన్నాడు.

''ఎందుకో మరి, ఆ అదృష్టహీనుడిని తల్చుకుంటే నాకు జాలే వేస్తూంది'' అంది వేర తటపటాయిస్తూనూ.

''వాడిమీద జాలికుడానా? బాగు బాగు!'' అని తడుముకోకుండా వెంటనే అనేశాడు నికొలాయ్, గదిలోంచి వెళ్లిపోతూన్న వాడల్లా గుమ్మం లోంచి వెనక్కి తిరిగి. ''మనతో సమాన తాహతు గలవాడే గనక ఈ కంకణం పంపించీ, వుత్తరం రాసీ, బరితెగి ఇలాంటి స్వేచ్ఛ తీసుకుని వుంటే, ద్వంద్వయుద్ధానికి రమ్మనమని సవాలుచేస్తూ రాజకుమారుడు వసీలి వెంటనే కబురు పంపించి వుండేవాడే. అతడు పంపకపోతే, నాతో ద్వంద్వ యుద్ధానికి రమ్మనమని సవాలుచేస్తూ నేనే కబురు పంపించి వుండేవాణ్ణి. ఇదే వెనుకటి రోజుల్లో అయుంటే, వాడిని తీసికొచ్చి గుర్రపుసాలలో పెట్టి వీపు పెట్లి పోయేటట్టు కమ్చీతో ఛడామడా కొట్టించి వుండేవాణ్ణి. రేపు నీ ఆఫీసులో నా కోసం వుండు, వసీలి ల్వోవిచ్, నీకు టెలిఫోనుచేస్తాను.''

## 10

కుళ్లోడుతూన్న ఆ మేడమెట్లు ఎక్కుతూంటే చుంచెలుకలు పిల్లుల కంపు, కిరసనూనె వాసన, చాకిరేవు దుర్గంధమూనూ. ఐదో అంతస్తు చేరుకునే ముందు ఒక్కక్షణం ఆగాడు రాజకుమారుడు వసీలి ల్వోవిచ్.

''ఇక్కడ ఒక నిమిషం ఆగుదాం'' అన్నాడతడు బావగారితో. ''కాస్త ఆయాసం తీర్చుకోనీ. నిజంగా మనమిక్కడికి రాకపోవాల్సిందేమో సుమా, కోల్యా?..''

మరో వరస మెట్లెక్కారు. మేడమెట్లమీద ఎంత చీకటిగా వుందంటే, నికొలాయ్ నికొలాయెవిచ్ రెండుమాట్లు అగ్గిపుల్ల వెలిగిస్తేనేగాని ఆ ఫ్లాట్ నంబరు తెలుసుకో లేకపోయాడు.

తలుపుగంట అతడు మ్రోగించే సరికి, ఒకామె — స్థూలకాయం, నెరసిన జుట్టు, బూడిద వర్ణం కళ్ళు, కళ్లకు సులోచనాలు, బహుశా ఏదో జబ్బువల్లనే ముందుకు వంగి వున్న శరీరం — తలుపుతీసింది.

''జెల్తోవ్‌గారు ఇంట్లో వున్నారా?'' అని అడిగాడు నికొలాయ్ నికొలాయెవిచ్.

ఆమె కంగారు పడుతూ మొదట ఒక వ్యక్తి ముఖమూ తరువాత రెండవ వ్యక్తి ముఖమూ పరీక్షించి, మళ్లీ మరొకసారి మొదటి వ్యక్తి ముఖం పరీక్షించింది. ఇద్దరూ మర్యాదస్థులలాగానే కనబడుతున్నారుకదా, మరేమీ భయంలేదనుకుని ఆమె మనస్సు కాస్త కుదుటపడింది.

''ఇంట్లోనే వున్నారు, దయచేయండి'' అంటూ ఆమె తలుపు బారుగా తెరిచి, ''ఎడమచేతివైపు మొదటి గది'' అంది.

బులాత్-తుగనోవ్‌స్కి తలుపు మూడుసార్లు కొట్టాడు — టక్ టక్ టక్ మంటూ ఘట్టిగా. గదిలోపల ఏదో కదులుతూన్నట్టు మర్మర ధ్వని వినబడింది. మళ్లీ మరొకసారి తలుపు కొట్టాడు నికొలాయ్.

''లోపలికి దయచేయండి!'' అంటూ నీరసమైన గొంతు వినబడింది.

గది సరంబీ బాగా కిందకి వుంది. అయినా గది మాత్రం వెడల్పుగానూ పొడుగ్గానూ వుంది — ఇంచుమించు నలుచదరంగానే వుందని చెప్పవచ్చు. గదికి వున్న రెండు గుండ్రని కిటికీలూ స్టీమరులో కేబిన్‌ల

కుండే ''పోర్ట్ హోల్స్''లా కనబడ్డాయి. వాటిలోనుండి వెల్తురు రావడం లేదన్నమాటే. మొత్తంమీద ఆ గది తీరు చూస్తే, సరుకులు వేసుకునే స్టీమరులో భోజనాల కేబిన్ వుంటుందే, సరిగ్గా అలాగే కానొచ్చింది. ఒక వైపున్న గోడదరిని ఇరుకుగా వున్న మంచం. మరో గోడను ఆనుకొని పెద్ద వెడల్పాటి సోఫా, పాతబడి బాగా అరిగిపోయినా భేషైన టర్కోమన్ రగ్గు ఆ సోఫామీద వేసుంది. ఇక గది నడిమధ్యను ఉక్రేనియన్ టేబిలు గుడ్డ పరచిన బల్ల.

ఆగంతువులకు ఆ గదిలో వున్న వ్యక్తి ముఖం మొదట కనబడలేదు. అతడు గందరగోళపడి చేతులు నులుముకుంటూ కిటికీ వైపు వీపుతిప్పి నిలబడ్డాడు. మనిషి నీర్సంగా వున్నాడు. పొడవుగా, పట్టువలే మెత్తని తలవెండ్రుకలు.

''జెల్తోవ్‌గారంటే మీరే కదూ?'' అంటూ నికొలాయ్ నికొలాయెవిచ్ అభిజాతంగా అడిగాడు.

''జెల్తోవ్‌ను నేనేనండి. దయచేయండి, చాలా సంతోషం!'' అన్నాడు వారిని ఆహ్వానిస్తూ, కరచాలనం చేద్దామని అతడు చేయి చాచి తుగనోవ్‌స్కి కేసి రెండడుగులు వేశాడు. తానది చూడనట్టు నటిస్తూ, సరిగ్గా అదే క్షణంలో షేయిన్ కేసి నికొలాయ్ నికొలాయెవిచ్ చటుక్కున ముఖం తిప్పి:

''ఈయనే అవుతాడని నీతో నేనన్నానుగా!'' అన్నాడు.

జెల్తోవ్ గాభరాపడ్డాడు. గాభరాతో వణకిపోతూన్న సన్నని వేళ్లు అతడు తొడుగుకున్న గోధుమరంగు చొక్కాయ గుండీలను పెట్టనూ, విప్పనూ అదేపనిగా ఎగాదిగా నడవసాగాయి. ఎలాగైతేనేమి చివరకి ఎంతో

కష్టపడి ప్రయత్నించిన ఫలితంగా, సోఫా వైపు చూపుతూ, కంగారు పడుతూ వంగి నమస్కరించి:

"దయచేసి కూచోండి" అన్నాడు.

ఇప్పుడతని ముఖం స్పష్టంగా కనబడింది: ముఖం బాగా పాలిపోయుంది, ఆడపిల్ల ముఖంలా నాజూగ్గా, తీరుగా వుంది. నీలిరంగు కళ్లు. మారంవేసుకుని కూచునే పిల్లాడి ముఖంలా గడ్డానికొక లొత్త, ముప్ఫై, ముప్ఫై ఐదేళ్లు వుండవచ్చు.

"ధన్యవాదం" అని రాజకుమారుడు షేయిన్ ముక్తసరుగా ప్రత్యుత్తరమిచ్చాడు, అతని ముఖం దీక్షగా పరికించుతూ.

"Merci*" అని తుంచేసినట్టు ప్రత్యుత్తర మిచ్చాడు నికొలాయ్. "మేం మీ ఇద్దరూ మాత్రం కూచోకుండా నిల్చునే వుండిపోయారు. "మేం మీ దగ్గరకు వచ్చిన పని రెండు నిమిషాలు పట్టదు. ఈయన రాజకుమారుడు వసీలి ల్వోవిచ్ షేయిన్, ఈ రాష్ట్రంలో కులీనవంశ శ్రేణి ప్రధానాధికారి. నా పేరు మీర్జా బులాత్-తుగనోవ్స్కి. అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటర్ని. మీతో మేం మాట్లాడదల్చుకున్న విషయం, రాజకుమారునికీ నాకూ, మా ఇద్దరికీ కూడా సంబంధించినదే; అదే ఇంకా విడమర్చి చెప్పాలంటే, రాజకుమారుని సతీమణి అయిన నా సోదరికి సంబంధించిన విషయం."

ఈ మాటలు విని జెల్త్కోవ్ పూర్తిగా డిల్లపడిపోయి తటాలున సోఫాలో చతికిలబడి, నోట మాటరాక, ప్రాణంలేని స్వరంతో, వసీలి ల్వోవిచ్ వైపు బతిమాలుకుంటూన్న చూపుతో: "అయ్యో, దయచేసి కూచోండి!"

---

*ఫ్రెంచి భాషలో 'కృతజ్ఞత' — అనువాదకుడు.

అన్నాడు. అలా అంటూనే, తానిదివరకే వాళ్లని కూచోమని కోరానే అన్న సంగతీ, తాను అలా ఆహ్వానించినప్పటికీ కూడా వారు అలా నిలబడే వున్నారన్న సంగతీ జ్ఞప్తికి తెచ్చుకునే వుండాలి. బహుశా అందుచేతనే మరి, చప్పున సోఫాలోంచి చెంగున లేచిపోయి, రేగిపోయిన తన జట్టుతోనే కిటికీ దగ్గరకు ఆదరా బాదరా వెళ్లి, తాను వెనుక నిల్చున్న చోటకే మళ్లీవచ్చి నిలబడ్డాడు. వణకిపోతూన్న చేతులతో యథాప్రకారంగా చొక్కాయ గుండీలు పెట్టుకుంటూ విప్పుకుంటూ, ఉండుండి తన లేత ఎరుపువాగు మీసాన్ని పెరుక్కుంటూ, అనవసరంగా ముఖం తడుముకుంటూ అలా నిలబడుండి పోయాడు.

''చిత్తం, తమరేమి సెలవిస్తారో సెలవివ్వండి!'' అంటూ వసీలిల్యోవిచ్‌కేసి అతిదీనంగా చూశాడు.

కాని షేయిన్ మాత్రం ఏమీ ప్రత్యుత్తరమివ్వలేదు. నికొలాయ్ నికొలాయెవిచే మా ్లడాడు:

''మొదటి విషయ మేమిటంటే, మీకు చెందిన వస్తువును మీకు వాపసు ఇచ్చివేయాల్సుంటుంది'' అంటూ అతడు తన జేబులోనుంచి ఎర్రనిపెట్టెను తీసి దానిని జాగ్రత్తగా బల్లపైన పెట్టాడు. ''మీ అభిరుచికి ఈ వస్తువు చక్కని తార్కాణం అనడంలో ఎట్టి సందేహమూ లేదు. అయినప్పటికీ, ఇటువంటి హఠాత్ చర్యలను ఇటుపైనుండి మా మీద ప్రయోగించవద్దని మిమ్మల్ని కోరుతున్నాం.''

''నన్ను క్షమించండి... తప్పు అంతా నాదేనని నాకు పూర్తిగా తెలుసు'' అని జేవురించిన తన ముఖాన్ని దించేసుకుని, నేలకేసిచూస్తూ మెల్లగా అన్నాడు: ''కాస్త టీ తెప్పించమన్నారా?''

జెల్‌త్కోవ్ అన్న మాటలు తాను విననట్టుగా:

''ఇదిగో చూడండి, జెల్‌త్కోవ్‌గారూ!'' అంటూ నికొలాయ్ నికొలాయెవిచ్ తన మాటలనే సాగించాడు. ''మీరు మర్యాదస్థులూ పెద్దమనుషుల్లాగానే కనబడుతున్నారు, నాకు చాలా సంతోషంగా వుంది. నా మనస్సులో వున్న మాట మీరు గ్రహించుకున్నారు. మనం చెప్పిన ఒక ఒప్పందానికి తప్పక వచ్చేస్తామనే నేననుకుంటాను. గత ఏడెనిమిదేళ్లయి మీరు రాజకుమారి వేర నికొలాయెవ్న వెంటబడుతున్నారు, ఏం అంతేనా?''

''అవునండి'' అని భయపడుతూ తన కనురెప్పలను దించేసి మెల్లగా ప్రత్యుత్తరమిచ్చాడు జెల్‌త్కోవ్.

''అయినప్పటికీ, మీ మీద మేం ఇంతవరకూ ఎట్టి చర్యా తీసుకోలేదు; ఆలా ఒకవేళ మేం తీసుకొనే వుండినట్టయితే అది పూర్తిగా న్యాయసమ్మత మయినదేననీ, ఆలా మేం తప్పకుండా తీసుకునే వుండాల్సిందనీ మీరే ఒప్పుకుంటా రనుకుంటాను. ఏం, నిజమే అంటారా?''

''అవునండి.''

''సరే. ఇక అయితే, మీ ఆఖరి చేష్ట, అనగా ఈ కెంపుల కంకణం పంపించడం, ఇది ఇదివరకటి మీ చేష్టలన్నిటినీ తలదన్ని, ఇన్నాళ్లూ ఓర్చుకుని భరించిన వాళ్లం, ఇకమరి ఓర్చుకుందుకు మాకు శక్యం కావడంలేదు — నా మాట అర్థమైందా మీకు? — ఇకమరి ఓర్చుకుందుకు మాకు శక్యం కావడంలేదు. ఈ సంగతంతా అధికార్లకు తెలియజేసి వారి సహాయం అడుగుదామనే అనుకున్నాం మొట్టమొదట్లో, మీతో దాపరికం లేకుండానే చెబుతున్నాను. కాని మళ్లీ ఆ ఉద్దేశం మానుకున్నాం. మానివేయడం

నాకిప్పుడు సంతోషంగానే వుంది, ఎందుచేతో వినండి, మళ్లీ చెబుతున్నాను, మీరు మర్యాదస్థుల్లా కనబడుతున్నారు గనుకనే.''

''క్షమించండి. ఏమన్నారు?'' అని జెల్తోక్వ్ తటాలున అడిగి, ఫక్కున నవ్వాడు. ''అధికార్లతో చెబుదామనుకున్నారా?.. అదేకదూ మీరన్నది?''

అతడు చేతులు జేబుల్లో పెట్టుకుని, సోఫాలో ఒకమూల హాయిగా కూచుని, జేబులోనుంచి సిగరెట్టుకేసూ అగ్గిపెట్టె తీసి, సిగరెట్టు వెలిగించుకున్నాడు.

''మీరిందాక అన్నది ఈ విషయం అధికార్లతో చెప్పాలనుకున్నామని కదూ?.. నేను కూచున్నందుకు క్షమించండి, దేవరవారు!'' అంటూ షేయిన్ కేసి చూసి, ''సరే, తరువాత?'' అన్నాడు.

బల్లదగ్గరకు ఒక కుర్చీని ఈడ్చుకుని, అందులో రాజకుమారుడు కూచున్నాడు. తన చూపును ఈ చిత్రమైన మనిషినుండి ఇక తిప్పుకోలేక, పూర్తిగా తబ్బిబ్బయిపోయి, తదేకధ్యాన్నంతో అతి ఆత్రంగా అమిత ఉత్సుకతో మంత్రముగ్ధుడైపోయినట్టు, రాజకుమారుడు అతనివైపే చూడడం మొదలెట్టాడు.

''చర్యేగనక మేం తీసుకోదలుస్తే, ఎప్పుడు పడితే అప్పుడే మేం తీసుకోగలం మీ మీద, తెలిసిందా అయ్యా?'' అని నికొలాయ్ నికొలాయెవిచ్ కొంచెం అమర్యాదాగానే మాట్లాడసాగాడు. ''ముక్కూ మొహమూ తెలియనివాళ్లను మా కుటుంబవ్యవహారాల్లో కలుగజేసు కోనిస్తామా...''

''క్షమించండి మీ మాటకు అడ్డుపడినందుకు...''

''నన్ను క్షమించండి మీ మాటకు అడ్డుపడినందుకు'' అంటూ అసిస్టెంటు ప్రాసిక్యూటరు గట్టిగా, అరచినంత పని చేశాడు.

''సరే, దానికేమిలెండి, మీరే మాట్లాడండి, మించిపోయిందేమీ లేదు, నేను వింటున్నానుగా. రాజకుమారులు వసీలి ల్వోవిచ్ గారితో మాత్రం ప్రత్యేకంగా ఒక మాట చెప్పాలని వుంది నాకు...''

ఆలాగంటూ తుగనోవ్‌స్కి అక్కడున్నట్టే లెక్కచేయకుండా, అతడు వసీలితో ఇలా అన్నాడు:

''నా జీవిత మంతటిలోనూ ఇదే అతి కష్టసమయం. అందుచేత మామూలు మర్యాదలూ సాంప్రదాయాలూ వెనక్కినెట్టి, నేనిక మాట్లాడాలి, దేవరవారు మన్నించి వింటానంటేనూ?.. చెప్పమని సెలవా?''

''నేను వింటూన్నాను, చెప్పండి'' అన్నాడు షేయిన్. ''కోల్యా! నువ్వొక్క గడియ ఊరుకుందూ!'' అంటూ తన మాటకి అడ్డురావడానికి సిద్ధంగానూ కోపంతో మండిపడుతూనూ వున్న తుగనోవ్‌స్కిని వారించి, ''చెప్పండి!'' అన్నాడు.

తన మాటలు మొదలుపెట్టే ముందు కొద్ది క్షణాలు ఊపిరి ఆడక, నోటితో గుటకలు మింగి, ఇంచుమించు ఉక్కిరిబిక్కిరై, తటాలున గడగడమంటూ మాటలు మొదలుపెట్టి, మళ్లీ కాస్సేపటికల్లా, అక్కడికి తుంచేసినట్టు చటుక్కున ఆగిపోయి, మళ్లీ గడగడ మొదలెట్టేవాడు. అతడు మాట్లాడుతూన్నంత సేపూ అస్తమానమూ దవడలు ఆడుతూండేవి, పెదవులు తెల్లబడిపోయి, చచ్చినవాడికి మల్లే వాటిలో చలనమే వుండేదికాదు.

''నాకు చెప్పడమే ఎంతో కష్టంగా వుంది... ఆ మాట అనడానికే నాకు నోరు రావడంలేదు... మీ భార్యను నేను ప్రేమించాను. కాని సప్త సంవత్సరాల కాలపు నిరాశాపూరితమైనట్టే, ఇతరుల పరువు ప్రతిష్ఠలకు

భంగం కలుగనట్టి ప్రేమానుభూతిని పొందిన తరువాత, ఆ మాటనడానికి నాకు హక్కు కలుగుతూంది. మొదట్లో ఇంకా వేర నికొలాయెవ్న అవివాహితగానే వున్నప్పుడు, ఆమె పేర నేను పిచ్చిపిచ్చి వుత్తరాలు రాయడమే కాకుండా, వాటికి ఆమెనుండి ప్రత్యుత్తరం వస్తుందని కూడా నేను ఆశించాన్న సంగతి ఒప్పుకుంటున్నాను. అంతేకాదు, నా ఇటీవలి చేష్ట, అనగా ఈ కంకణం పంపించడం అన్నిటికంటే మించిన తెలివితక్కువ చేష్టే అని కూడా నేను ఒప్పుకుంటున్నాను. అయినప్పటికీ... నేనిప్పుడు మీ ముఖంకేసి సరాసరి చూస్తూంటే, నన్ను మీరు అర్థం చేసుకున్నారనే నాకు అనిపిస్తూంది. ఆమెను ప్రేమించకుండా వుండడం నా శక్తికి మించిన పని అని నాకు తెలుసు... తమరే సెలవివ్వండి... తమకిదంతా లవలేశమూ ఇష్టం లేదనే అనుకుందాం... నాలోవున్న ఈ భావాన్ని అంతమొందించుకోడానికి నన్నేమి చెయ్యమంటారు?.. తమరే సెలవియ్యండి. నికొలాయ్ నికొలాయెవిచ్ సలహాయిచ్చినట్టు, మూటాముల్లే కట్టి నన్ను మరో వూరికి ప్రవాసం పంపించేస్తామంటారా? ఎక్కడున్నా నాకంతా ఒక్కటే, ఇక్కడున్నట్టే అక్కడ కూడా నేను వేర నికొలాయెవ్నను ప్రేమిస్తూనే వుంటాను. నన్ను ఖైదులో పెట్టిస్తామంటారా? ఖైదులో వున్నప్పటికీ కూడా, నా ఉనికి గురించి ఆమెకు తెలియజేయడానికి ఏదో ఒక మార్గం నేను కనిపెడుతూనే వుంటాను. అందుచేత, ఇవన్నీ తప్పితే కేవలం ఒక్కటే మార్గం వుంది – అదేమిటంటారా? – మృత్యువు... తమరు ఎటువంటి మరణశిక్ష విధించినా సరే, అది నాకు శిరోధార్యమే.''

''వ్యవహారం ఏదో మనం తేల్చుకోవడం బదులు, ఈ భాగోతం ఆడుతూ కూచుంటున్నా మేమిటి మనం?'' అంటూ టోపీ పెట్టేసుకున్నాడు

నికొలాయ్ నికొలాయెవిచ్. "ప్రశ్నంతా రెండు ముక్కల్లో తేలిపోతుంది: ఈ రెండింటిలో ఏదో ఒకటి మీరు తేల్చుకోండి – రాజకుమారి వేర నికొలాయెవ్న వెంటపడడం మీరు ఏమైనా సరే ముమ్మాటికీ కట్టి పెట్టేనా కట్టిపెట్టేయాలి, అందుకు మీరు అంగీకరించమంటారా మాకు తోచినట్లూ, మా హోదా, మా పలుకుబడీ, మా తాహతూ వగైరాలు ఉప యోగించి మా చర్య మేం జరిగించుకుంటాం."

నికొలాయ్ నికొలాయెవిచ్ ఇన్ని చెబుతూన్నా, అతని మాటలు విన్న ప్పటికీ కూడా, అతనికేసి కన్నెత్తి చూసేనా చూశాడుకాదు జెల్‌త్కోవ్. అతడు రాజకుమారుడు వసీలి ల్వోవిచ్‌కేసి తిరిగి:

"తమరు సెలవిస్తే నేను గదిలోంచి బయటకు వెళ్లి పదినిమిషాల్లో మళ్లీ వచ్చేస్తాను. నేను మరెక్కడికీ వెళ్లడంలేదు, రాజకుమారి వేర నికొలాయెవ్నతో టెలిఫోనులో మాట్లాడేందుకేనని కూడా తమతో చెప్పేస్తు న్నాను. మరొకటి కూడా తమతో చెబుతున్నాను: నేనామెతో మాట్లాడి వచ్చిన తరువాత, ఆ సంభాషణ అంతా సాధ్యమైనంత వివరంగా తమకు తెలియపరుస్తానని కూడా మాట యిస్తున్నాను."

"సరే, వెళ్లండి" అన్నాడు షేయిన్.

అతడు వెళ్లిపోగానే, తాము ఇద్దరూ, వసీలి ల్వోవిచీ, తానూ ఒంట రిగా వుండడం చూసుకొని, నికొలాయ్ నికొలాయెవిచ్ తన బావగారిమీద విరుచుకుపడ్డాడు.

"ఇదంతా శుద్ధ తప్పు!" అని తన అలవాటు ప్రకారం తన మనసులో వున్న ఏదో కనబడని బరువును తీసిపారేస్తున్నట్టు తన కుడిచేతిని అమాంతంగా విదలించుకుంటూ పెద్దగా అన్నాడు. "ఈ వ్యవహారమేమీ బాగుండ

లేదు. నా చేతిలో వదిలిపెట్టవయ్యా, దాని అంతు తేల్చిపారేస్తాను అని నీతో నేను మొదటినుండీ మొత్తుకుంటూనే వున్నానాయె. ఇప్పుడేమిటో నువ్వు మెత్తబడిపోయి, పప్పులో కాలేసి, అతగాడిని పురూకే అతడి వికారాల గురించి నానా వాగుడూ వాగనిచ్చావాయె. కుండ బద్దలుకొట్టినట్టు రెండు మాటల్లో నేను అంతా తేల్చి చెప్పేశానే!''

''ఒక్క నిమిషం ఆగవయ్యా'' అన్నాడు రాజకుమారుడు వసీలి ల్వోవిచ్. ''ఒక్క నిమిషంలో అంతా తేలిపోతుంది. అసలు అన్నిటికంటే ముఖ్యమైన విషయమేమిటంటే: ఇతని ముఖం చూస్తేనే తెలిసి పోతూంది, ఇతడికి మోసమూ, బుద్ధిపూర్వకంగా అబద్ధమాడడమూ చేతకావని. ఒక్క విషయం నిజంగా ఆలోచించు నువ్వే, కోల్య — ప్రేమించడంలో అతడు నేరం చేశాడా? అసలు ప్రేమ ఎటువంటి మనోవికారమో ఇంత వరకూ ఎవ్వరూ ఇదమిద్ధమని నిర్వచించి చెప్పలేకుండా వున్నారే — అటువంటి మనోవికారాన్ని అతడు తన అదుపాజ్ఞల్లో పెట్టుకోలేక పోవడం అతని నేరమా?'' రాజకుమారుడు ఒక్క క్షణం ఆగి, తనలో తానేదో ఆలోచించుకుని, మళ్లీ అన్నాడు: ''ఇతడిని చూస్తే నాకెంతో జాలి వేస్తూంది. అంతేకాదు, ఒక్క జాలి వేయడమే కాదు — ఇతడిని చూస్తూంటే, ఏదో ఒక మహత్తరమైన ఆత్మవిషాద నాటకాన్ని నాకళ్లారా నేను దర్శిస్తున్నాననే అనుభూతి ఒకటి నాలో కలుగుతూ, వీధి భాగోతంలో హాస్యగాడిలా నేనిక్కడ ప్రవర్తించకూడదనీ నాకనిపిస్తూంది.''

''ఇది వుత్త భావక్షీణత!'' అనేశాడు నికొలాయ్ నికొలాయెవిచ్.

పదినిమిషాలు అయిందో లేనేలేదో జెల్త్కోవ్ తిరిగి గదిలోకి వచ్చేశాడు. అతని కళ్లు మెరుస్తూ, గుంటలు పడిపోయి, నేలరాల్చని అశ్రువులతో

నిండినట్టున్నాయి. తానీ ప్రపంచంలో వున్నాననీ, ప్రపంచపు కట్టుబాట్లను మన్నించాలనీ, తాను ఎక్కడ కూచోవాలో, ఎదుటివారు ఎక్కడకూచున్నారో పూర్తిగా మరచిపోయి, తన పెద్దమనిషి తరహా మర్యాద పాటించడం కూడా విస్మరించాడు. అయినప్పటికీ దీనికంతటికీ కారణమేమిటో మళ్ళీ మరొక సారి రాజకుమారుడు షేయిన్ సూక్ష్మబుద్ధితో అర్థం చేసుకోగల్గాడు.

''నేను సిద్ధంగా వున్నాను'' అన్నాడు జెల్త్కోవ్. ''రేపటినుండి ఇక నేనెక్కడ వుంటానో ఏమిటో నా అయిపూ జాడా రవంతైనా మీ చెవిని పడదు. మీకు సంబంధించినంత వరకూ నేను చచ్చి పోయానే అనుకోండి. అయితే ఒక్క షరతు మాత్రం వుంది — ఈ సంగతి తమరితో చెబుతున్నాను సుమండీ, రాజకుమారులు షేయిన్‌గారూ! — నేను ప్రభుత్వపు సొమ్ము అపహరించాను, అందుచేత నేనెలాగూ ఈ వూరినుండి పరారికాక తప్పదు. ఆఖరి సారిగా రాజకుమారి వేర నికొలా యెవ్న పేర ఉత్తరం ఒకటి రాయాలని నాకొక కోర్కె వుంది, అందుకు తమరు అంగీకరిస్తేనూ?''

''మళ్ళీ ఉత్తరంలేదు గిత్తరంలేదు. ఒకమాటు రాయనని ఒప్పుకుంటే ఇక మరి రాయకపోవడమే'' అని అరిచాడు నికొలాయ్ నికొలాయెవిచ్.

''సరే, అలాగే రాయండి'' అన్నాడు షేయిన్.

''దీనితో ఇకనంతా సరి'' అంటూ అహంకారంగా నవ్వుతూ ఆ మాటలను ఉచ్చరించాడు జెల్త్కోవ్. ''నా విషయమై ఇక మీకు ఏ కబురూ అందదు, మీకంట నేను పడేపడను. ససేమిరా, నాతో పల్లెత్తుమాటైనా మాటాడను పొమ్మంది, రాజకుమారి వేర నికొలాయెవ్న. ఆమె

కంటబడకుండానే ఆమెను అప్పుడప్పుడు చూసేందుకని నేనీవూరిలోనే వుండొచ్చునా అని నేనడిగేసరికి, 'అబ్బ! నిజంగా మీకు చెబుతున్నాను, ఇప్పటికే నా ప్రాణం వినికిపోయింది, దయచేసి దీనంతటికీ ఎంత త్వరగా స్వస్తిచెప్ప గల్గుతారో అంత త్వరగా స్వస్తిచెప్పేయండి' అందామె. అందుకనే దీనంతటికీ త్వరగానే స్వస్తిచెప్పేస్తున్నాను. చెప్పండి మరి, నేను చేయగల్గినదంతా చేశానంటారా లేదా?'' అన్నాడతడు.

ఆ సాయంకాలం బంగాళాకి తిరిగి చేరుకున్న తరువాత, జెల్త్కోవ్‌తో జరిగిన భేటీ సంగతులన్నీ సవివరంగా చెప్పాడు తన భార్యతో రాజకుమారుడు వసీలి ల్వోవిచ్. ఆమెతో చెప్పడం తన విద్యుక్త ధర్మమని అతనికి అనిపించింది.

అదంతా విని వేర కలవరపడిందే గాని, ఆశ్చర్యపడనూ లేదు, విస్మయము చెందనూ లేదు. తరువాత, రాత్రి తన పడకలోకి పెనిమిటి చేరుకున్నప్పుడు, తన ముఖాన్ని తటాలున గోడకేసి తిప్పేసుకుని:

''నన్ను ప్రశాంతంగా వుండనియ్యి — ఆ మనిషి ఆత్మహత్య చేసుకుంటాడనే నాకు తెలుసు'' అందామె.

## 11

రాజకుమారి వేర నికొలాయెవ్‌న దినపత్రికలను ఎప్పుడూ చదివేది కాదు. ఎందుకంటే, మొదటిది: దినపత్రికలను ముట్టుకుంటేనే సరి చేతులు మురికి అయిపోతాయిట; రెండోది: ఈనాడు ఆ పత్రికలవాళ్లు రాసే భాష అయోమయంగా వుండి తనకేమీ కొరకబడదట.

అయితేనేమి, నొసట రాత ఎవరు తప్పించగలరు? ఏనాడూ పత్రిక ముట్టుకోనిది, ఈనాడామె పత్రిక తీసి విప్పేసరికి ఈ కింది వార్త ఆమె కళ్లబడింది:

''నిగూఢమైన మరణం. నిన్న సాయంకాలం సుమారు ఏడు గంటలకు బోర్డ్ ఆఫ్ కంట్రోల్ కార్యాలపు ఉద్యోగి, గె.ఎస్. జెల్త్కోవ్ అనే వ్యక్తి ఆత్మహత్య చేసుకుని మరణించాడు. శవపంచాయితీలో వచ్చిన సాక్ష్యాన్ని బట్టి ప్రభుత్వ ధనం అపహరణే ఆత్మహత్యకు కారణమని తెలుస్తూంది. ఆ సంగతి తెలియజేస్తూ అతడు ఒక జాబు రాసి వుంచినట్టు తెలిసింది. సాక్ష్యులిచ్చిన వాంగ్మూలాన్నిబట్టి ఆత్మహత్యే అతని మరణానికి కారణమని నిర్ధారణ కావడంవల్ల శవపరీక్ష అనవసరమని నిర్ణయించబడింది.''

వేర మనస్సులో ఆలోచనలు మెదలసాగాయి: ''ఇలా జరుగుతుందని నాకు ముందుగా ఎందుకనిపించింది? అసలు ఇంత విషాదంగా పరిణమించడమా? ఇంతకీ దీనికి కారణమేమిటి: ప్రేమా, లేకుంటే పిచ్చా?''

ఆ రోజంతా ఆమె పువ్వులతోటలోనూ పళ్లతోటలోనూ ఆలా తిరుగుతూనే వుంది. మనస్సులో ఏమిటో ఆలాగు కలతపెట్టేస్తున్న ఆందోళన, క్షణక్షణానికి అధికమైపోతూండడంవల్ల ఒక గడియ కూడా ఒక చోట కూచోడానికి ఆమెకు బుద్ధిపుట్టలేదు. తాను ముక్కూ ముఖమేనా ఎరగనట్టి, తానెన్నడూ చూడనట్టి, ఇకముందు చూసే అవకాశం లేనట్టి — ఆ మనిషి పేరు తల్చుకుంటేనే నవ్వొస్తుంది — ఆ పె.పె.షె. మీదనే వున్నాయి ఆమె ఆలోచనలన్నీ.

''నీ జీవితపథంలో యథార్థమైనట్టీ నిస్వార్థమైనట్టీ ప్రేమ నీకు ఎదురైందేమో సుమా, ఎవరు చెప్పగలరు?'' అని అనోసావ్ అన్న మాటలు ఆమెకు జ్ఞప్తికొచ్చాయి.

ఆరుగంటలకి పోష్టుజవాను వచ్చాడు. జెల్‌త్కోవ్ దస్తూరీని ఈసారి వేర నికొలాయెవ్‌న పోల్చుకుంది. పోల్చుకుని అప్రయత్నంగానే ఎంతో ఆప్యాయంగా అభిమానంతో ఆ వుత్తరం విప్పి చదువుకుంది — అంత ఆప్యాయత, అంత అభిమానము తనలో వున్నాయా అని ఆమెకే ఆశ్చర్యంవేసింది.

ఆ వుత్తరంలో జెల్‌త్కోవ్ ఇలా రాశాడు:

''మిమ్మల్ని ప్రేమించడమనే మహత్తర సౌభాగ్యాన్ని దేవుడు నాకు కటాక్షించాడంటే, ఆ తప్పు నాదికాదు. రాజకీయాల గురించిగానీ, విజ్ఞాన శాస్త్రం గురించిగానీ, తత్వశా ం గురించిగానీ, మానవుని భావికల్యాణం గురించి ప్రయాసపడి తెలుసుకుందామనే జిజ్ఞాసగానీ నా జీవితంలో రవంతైనా ఆసక్తిని నాకెన్నడూ కల్గించలేదు — నా జీవిత సర్వస్వమంతా మీపై నేలగ్నమైంది. మీ గుండెల్లో ములుకువలె నేను మీ జీవితంలో చొరబడ్డానే అని ఇప్పుడు నాకు అనిపిస్తూంది. అందుకు మీరు నన్ను మన్నించగలుగుతే మన్నించమని ప్రార్థిస్తున్నా. ఈ రోజు నేను యాత్రమీద వెళ్లిపోతున్నాను. ఆ యాత్రనుండి ఇక తిరిగి రావడమంటూ వుండదు. నన్ను జ్ఞప్తికి తెచ్చుకుందుకైనా మీకిక ఏదీ వుండదు.

''ఈ ప్రపంచంమీద మీరు మనుతూన్నందుకే నేను మీకెంతో కృతజ్ఞుణ్ణి. నామనస్సును నేను క్షుణ్ణంగా పరీక్షించుకున్నాను — ఇదొక రుగ్మతకాదు, ఇదొక ఉన్మాదంకాదు — ఏ కారణం చేతనో దేవుడు నన్ను గ్రహించి నాకు ప్రసాదించిన వరమే ఈప్రేమ.

''మీ దృష్టియందూ మీ సోదరుడు నికొలాయ్ నికొలాయెవిచ్ దృష్టియందూ నేనొక అల్పాటి అప్రాయలాగే కనబడివుండొచ్చు. నేను నిష్క్రమించేముందు మిమ్మల్ని నేను మహదానందంతో స్మరించుకుంటున్నాను: 'నీ పావన నామము సదా వర్ధిలుగాక!'

''ఎనిమిదేళ్ల క్రితం ఒక సర్కస్ ప్రదర్శనంలో మీరు బాక్సులో కూచుని వుండగా మిమ్మల్ని నేను మొట్టమొదటి సారిగా చూశాను. మిమ్మల్ని చూచిన ఉత్తరక్షణమే నేననుకున్నాను: నేనీమెను ప్రేమిస్తున్నాను, ఎందుచేతనంటే ఈ భూమిమీద ఈమెవంటి వస్తువు, ఈమెవంటి ఉత్తమమైన వస్తువు మరొకటిలేదు. స్థావర జంగమములలోగానీ, నక్షత్రకోటిలోగానీ, మానవాళిలోగానీ సౌందర్యంలోనూ సౌకుమార్యంలోనూ మిమ్మల్ని మించినది వేరొకటిలేదు. ఈ భూప్రపంచం సౌందర్యమంతా మీలో మూర్తీభవించింది...

''నేనేమి చెయ్యడమో మీరో చెప్పండి? ఈ వూరు వదిలేసి మరో వూరికి వెళ్లిపోవడమా? ఎక్కడికి వెళ్లినా నా మనస్సెల్లప్పుడూ మీయందే వుంటుంది, మీ పాదపద్మముల చెంతనే వుంటుంది, ప్రతి క్షణమూ మీతోనే సంతృప్తమై, మీ చింతలోనే నిమగ్నమై, మీగురించే కలలు కంటూ, మధురోన్మాదతప్తమయే వుంటుంది... తెలివిమాలినవాడినై ఆ కంకణం మీకు పంపినందుకు నేనెంతో లజ్జపడుతూ మనస్సులో ఎంతగానో కుమిలిపోతున్నాను — కాని, ఏంజేయను? పొరపాటు జరిగిపోయింది. మీ అతిథుల మనస్సులపై అది ఎట్టి ముద్రవైచిందో నేను ఊహించుకోగలను.

''ఇక పదినిమిషాల్లో నేను వెళ్లిపోతాను. ఈ పదినిమిషాల వ్యవధీ, ఈ వుత్తరానికి పోష్టుబిళ్ల అంటించి, ఇతరుల నెవ్వరినీ అర్థించకుండా

నేనే దీనిని పోష్టుపెట్టెలో పడవేయడానికి సరిపోతుంది. ఈ వుత్తరాన్ని కాల్చి భస్మం చేసేయమని నా ప్రార్థన. నాగదిలో పొయ్యిగూటిని ఇప్పుడే రాజపెడుతున్నాను. నా జీవితంలో అమూల్యములని నేనెంచుకున్న వస్తువులను అగ్నికి సమర్పించబోతున్నాను: నేను సంగ్రహించిన మీ చేతిరుమాలు — దానిని అపహరించానని మీముందు నేనిప్పుడు ఒప్పుకుంటున్నాను. ఒక నాడు దానిని మీరు కులీనవంశజుల సమావేశపు విందులో కుర్చీపై వదిలేసి మర్చిపోయారు. మీపేర నేనిక ఉత్తరాలు రాయకూడదని మీరు నాకు రాసిన చీటి — దానిని నేను ఎంతగా ముద్దుపెట్టుకున్నానో కదా! మీ చేతులతో మీరు ఒకసారి పట్టుకున్న కళాప్రదర్శన కార్యక్రమం ఒకటి — దానిని మీరు నిష్క్రమణ ద్వారంవద్ద కుర్చీ ఒకదానిపై పెట్టి, ఏమరుపాటున వదిలేశారు... ఇప్పుడదంతా ఇకసరి. అన్ని బంధనాలనూ నేనిక తెంచేసుకున్నా. అయినప్పటికీ, నన్ను మీరు అప్పుడప్పుడు తల్చుకుంటూంటారని నాకొక ఆశే కాకుండా, నాకొక దృఢమైన నమ్మకం కూడా కలుగుతూంది. అలాగు మీరు నిజంగా నన్ను తల్చుకునే మాటుంటే — మీరు సంగీతకళాభిజ్ఞులని నాకు తెలుసు, ఎందుకంటే బేతోవెన్ క్వార్టెట్ కాన్సర్ట్ లలోనే మిమ్మల్ని నేను ముఖ్యంగా చూస్తూండేవాణ్ణి — నిజంగా మీరు నన్ను తల్చుకున్నప్పుడు, D-dur స్వరంలో, 2వ గేయకావ్యంలో 2వ కృతిని మీరు వాయించండి, లేకుంటే ఇంకెవరినేనా వాయించమని మీరు వినండి.

''ఈ వుత్తరం ఎలా ముగించాలో నాకు తెలియడంలేదు. నా జీవితంలోని ఏకైక ఆనందానికి మీరే కారణం, మీరే నాకు ఏకైక ఉపశమనదాయకులు, మీరే నా ఏకైక చింతన. దేవుడు మీకు సర్వసౌఖ్యములనూ—

ప్రసాదించుగాక! క్షణభంగురమూ సర్వసామాన్యమూ అయిన దేదీ కూడా సర్వసుందరమైన మీ ప్రత్యగాత్మ శాంతికి భంగము కలుగజేయకూడదనే నేనాకాంక్షించుచున్నాను. మీచేతులను నేను ముద్దుపెట్టుకుంటున్నాను.

గె.ఎస్.జె.''

ఏడుపుతో కళ్లు ఎర్రబడిపోయి, కళ్లవెంట నీళ్లు బొటబొట కారి, పెదవులు వాచిపోయిన ముఖంతో ఆమె తన పెనిమిటి దగ్గరకు వెళ్లి ఆ వుత్తరం అతనికి చూపిస్తూ:

''నీ దగ్గరనుంచి ఏదీ దాచడానికి నాకిష్టంలేదు. కాని ఏదో మహాఘోరం ఒకటి మన జీవితంలో చొరబడినట్లు నాకనిపిస్తూంది. చూడగా, నువ్వూ నికొలాయ్ నికొలాయెవిచ్చీ ఈ వ్యవహారాన్ని ఏవిధంగా తీర్మానం చేసి వుంటే బాగుండేదో ఆవిధంగా చేసినట్లు కనబడడంలేదు'' అంది.

రాజకుమారుడు షేయిన్ ఆ వుత్తరం దీక్షగా చదువుకుని, మళ్లీ సరిగ్గా మడతపెట్టి, చాలాసేపు దీర్ఘాలోచనలో మునిగి, తరువాత అన్నాడు:

''ఈ వ్యక్తి నిష్కాపట్యంలో నాకేమీ సందేహంలేదు. అంతేకాదు, అంతకుపైపెచ్చు, నీమీద అతనికుండిన చిత్తవృత్తులను పరిశీలించేందుకు కూడా నేను సాహసించను.''

''అతడు నిజంగా చనిపోయాడంటావా?'' అంది వేర.

''అవును, అతడు చనిపోవడం నిజమే. అతడు నిన్ను యథార్థంగా ప్రేమించాడనే, అదొక పిచ్చి ధోరణేమీ కానేకాదనే నేనంటాను. అతని కళ్లను నేను కనిపెడుతూనే వున్నాను, అతని హావభావాలనూ, అతని ముఖ కళవళికలను ప్రతిదానినీ నేను చూస్తూనే వున్నాననుకో. ఇక అతనికి నువ్వు

లేకపోతే మరి బతుకే లేదు. అతనిని చూస్తూంటేనే, మానవుల మరణానికి కారణమయే మహత్తర యమయాతన కట్టెదుట నేనున్నానని నాకనిపించి, నా ఎదుటనున్న మనిషిని మృత్యువు అప్పుడే పొట్టబెట్టుకుందనే నాకించుమించు అర్థమయిపోయింది. నేనేలా ప్రవర్తించాలో, ఏం చెయ్యాలో నాకు తెలియలేదనుకో, నేను నిజంగా చెబుతున్నాను, వేర...''

''ఇదుగో చూడు, వాస్య!'' అంది వేర అతని మాటల మధ్య, ''అతనిని నేనొకసారి చూడడానికి వెళితే, నువ్వు బాధపడతావా ఏమిటి?''

''అబ్బే, నేనలా ఏమీ బాధపడను, వేర. నువ్వు తప్పకుండా వెళ్లు. నామటుకు నాకు కూడా నీతో రావాలనే వుంది. కాని, వున్నవాడు ఉండకుండా, నికొలాయ్ వ్యవహారమంతా నాకెటూకాకుండా పాడుచేశాడు. ఇప్పుడు నేనక్కడకి వస్తే, నాకు మతిపోతుందేమోనని భయం వేస్తూంది.''

## 12

ఇంకా మరిరెండు వీధులు దాటితే లూతెరాన్‌స్కయ వీధి వస్తుందనగా వేర నికొలాయెవ్న తన గుర్రపుబండీ దిగిపోయి, బండీని అక్కడే తనకోసం కనిపెట్టుకుని వుండమని చెప్పి, తానావీధికి నడిచే వెళ్లింది. జెల్‌త్కోవ్ బస కనుక్కోవడం ఆమెకు ఏమంత కష్టమనిపించలేదు. స్థూలకాయమూ, బూడిదరంగు కళ్లూ, నెరసిన జుట్టూ, వెండి సులోచనాలూ — సరిగ్గా ఆ ముసలావిడే తలుపు తీసి, సరిగ్గా నిన్నట్లాగే అడిగింది:

''ఎవరి కోసమండి?''

''జెల్‌త్కోవ్‌గారి కోసం.''

వేర ధరించిన దుస్తులో – ఆమె టోపీ, గ్లౌవ్సు – కొద్దిగా అహంకారపు గొంతుకో, మరెందువల్లనో చెప్పలేంగానీ, వేరని చూడగానే ముసలామెపై గొప్ప ప్రభావమే కలిగింది. దానితో ముసలామె మాట్లాడడం మొదలు పెట్టింది.

"దయచేయండి, లోపలికి దయచేయండి, ఎడంచేతి వేపు, మొదటి గది, ఆ గదే... ఒక్క క్షణం... నేనూ వస్తున్నా... ఇంత ముందుగానే మమ్మల్ని వదిలేసి వెళ్లిపోయాడు. ఏమిటోగాని, డబ్బు అపహరించాడంటున్నారు మరి. ఈ ఒంటరిగాళ్లకి గదులు అద్దెకిచ్చి వందలూ వేలూ మేమేమీ వెనకేసుకోవడం లేదుగాని, అయినా, ఏ ఆరువందల రూబుళ్లో, ఏ ఏడు వందల రూబుళ్లో అయివుంటే, నేనే అక్కడా ఇక్కడా ఆ పిసరూ ఈ పిసరూ జాగ్రత్తచేసి అతనికి ఇచ్చివుండేదాన్నే – ఎంతపని చేశాడు! తమరికి తెలుసునో తెలియదోగాని, ఎటువంటి మనిషనుకున్నారు? అద్భుతమైన మనిషి. ఎనిమిదేళ్లన్నాడు నాయింట్లో గది అద్దెకు పుచ్చుకుని, అతడిని చూసి కన్నకొడుకే అనుకునేవాన్ని."

వసారాలో కుర్చీవుంటే ఆ కుర్చీలో చతికిలబడింది వేర.

"మీ ఇంట్లో అద్దెకుండిన ఆయనతో నాకు కొంత పరిచయం వుండేది" అంది వేర, తన మాటలను జాగ్రత్తగా ఆచితూచి ఎంచుతూనూ. "చనిపోయేముందు ఆఖరి గడియల్లో ఏంచేశాడో, ఏమన్నాడో – దాని గురించి కాస్త నాకు దయచేసి చెప్పండి."

"చిత్తం, అమ్మగారూ! అతనిని చూడడానికని ఎవరోగాని ఇద్దరు పెద్దమనుషులు వచ్చారు – వచ్చి చాలా సేపు మాట్లాడి వెళ్లిపోయారు. ఏదో ఒక ఎస్టేటులోనట తనకు మేనేజరు ఉద్యోగం ఇస్తామన్నారని తరువాత

అతను నాతో చెప్పాడు. ఎవరికో టెలిఫోను చేయడానికని ఎజీగారు బయటికి వెళ్లి, కాస్సేపటికల్లా వచ్చేశాడు. ఆ వచ్చేసినప్పుడు అతని ముఖం చుశాను — మహదానందంతో ఇక పొంగిపోతూంది! ఆ పెద్దమనుషు లిద్దరూ వెళ్లిపోయాక, అతడేదో ఉత్తరం రాస్తూ కూచున్నాడు. ఆ వుత్తరం రాశాక, పోస్టుడబ్బాలో వెయ్యడానికని వెళ్లాడు. తరువాత కాస్సేపటికల్లా 'ఢామ్' అని చప్పుడైంది. పిల్లలెవరో ఆడుకుంటూ ఆటలో పిస్తోలు పేల్చారే అనుకుని మేమేమీ పట్టించుకోలేదు. సాయంకాలం ఏడు గంటలకు అతడెప్పుడూ టీ పుచ్చుకునేవాడు. మామూలుగానే ఏడూ కొట్టేటప్పటికల్లా లుకేర్యా — మా పనిమనిషి — వెళ్లి గదితలుపు కొట్టింది, ఇంకోమాటు కొట్టింది, మళ్లీ మరోమాటు కొట్టింది. ఇక తలుపు బద్దలు కొట్టాల్సి వచ్చింది — అప్పుడుగాని లోపలి కెళ్లలేకపోయాం. లోపలికెళ్లి చూసేసరికి — ఇకేముంది — అప్పటికే ప్రాణం పోయుంది.''

''ఆ కంకణం గురించి మీకేదేనా తెలుస్తే కాస్త చెప్పండి'' అని అడిగింది వేర నికొలాయెవ్న.

''అవునవును సుమండీ, కంకణం మాట — నేను నిజంగా మర్చేమర్చిపోయాను. దాని గురించి తమకెలా తెలుసునండి? ఆ వుత్తరం రాశాక, అతడు నాదగ్గరకొచ్చి: 'మీరు కేతలిక్కులు కదూ?' అని అడిగాడు. 'అవును, కేతలిక్కులమే' అన్నాను నేను. అప్పుడన్నాడు కదా: 'మీలో ఒక చక్కని ఆచారముంది — వుంగరాలూ హారాలూ కానుకలూ ఎవరికేనా ఇచ్చేముందు వాటిని ఆశీర్వదించమని పవిత్ర మాత విగ్రహంపైన వుంచుతారు మీరు. నాదొక్క మనవి వుంది: ఈ కంకణాన్ని విగ్రహం మెళ్లో వేసి నాకిప్పిస్తారా?'' అనడిగాడు. సరే అలాగే చేస్తానని ఖరారుచేశాను.''

‘‘అతనిని చూడడానికి వీలవుతుందా?’’ అని అడిగింది వేర.

‘‘చిత్తం! ఇలా దయచేయండి, అమ్మగారూ! ఇదుగో ఇదే, ఎడం చేతి వైపు మొదటి గది. శవాన్ని ఈవేళ ఎనాటమీ తియేటరుకు తీసుకు పోతామన్నారు మొదట. కాని అతని అన్నదమ్ముడట, క్రిస్టియను మతం ప్రకారం అంత్యక్రియలు జరిపిస్తానని దరఖాస్తు పెట్టుకున్నాడట. చిత్తం, ఇలా దయచేయండి.’’

ధైర్యమంతా చిక్కబట్టి తలుపు తెరచింది, వేర. గదంతా ధూపం వాసన వేస్తూంది. గదిలో కొవ్వొత్తులు మూడు వెలుగుతున్నాయి. గదిలో అయిమూలగా వున్న బల్లమీద వుంది జెల్తోవ్ శవం. తల బాగా కిందకి వాలిపోయుంది. తలకింద మెత్తని చిన్న తలగడ ఎవరోగాని ప్రత్యేకంగా తెచ్చి పెట్టినట్టుంది — పెద్ద తలగడైతేనేమి, చిన్న తలగడైతేనేమి శవానికి రెండూ ఒకటేనని గాబోలు. ఏదో ప్రగాఢంగా ఆలోచిస్తూన్నట్టు, కళ్లు మూతపడి వున్నాయి — ఈ జీవితాన్ని చాలించే ముందు ప్రగాఢమూ మధురమూ అయినట్టి సర్వమానవ జీవిత రహస్యాన్నీ తాను తెలుసుకున్నట్టు, చిద్విలాసమూ చిదానందమయమూ అయిన మందహాసం ఆ పెదవులమీద తాండవిస్తూంది. ఇలాంటి ప్రశాంతమైన ముఖవర్చస్సును, మహామహులైన త్యాగమూర్తులు — నెపోలియన్, పూష్కిన్, వీరిద్దరి మృతవదన ముద్రలలో తాను చూచినట్టు ఆమెకు జ్ఞప్తికొచ్చింది.

‘‘తమకు ఏకాంతంగా వుండాలని వుంటే సెలవివ్వండి, నేను మళ్లీ వస్తా’’ అంది ముసలామె, తన స్వరంలో అత్యంత సాన్నిహిత్యాన్ని ధ్వనింప జేస్తూనూ.

—

''సరే, తరువాత మిమ్మల్ని పిలుస్తాను, అప్పుడు రండి'' అంది వేర. అలా అంటూనే తన చొక్కా పక్కజేబులో నుండి పెద్ద ఎర్రని గులాబి పువ్వును తీసి, తన ఎడమ చేతిని శవం మెడకింద వుంచి కొద్దిగా ఎత్తి కుడి చేతితో మెడకింద ఆ గులాబిపూవును వుంచింది. ఎటువంటి ప్రేమను గురించి ప్రతిస్త్రీ కలలు కంటుందో అట్టిప్రేమ తన పక్కనుంచే వెళ్ళి పోయింది కదా అని సరిగ్గా ఆ క్షణంలోనే ఆమె గ్రహించింది. శాశ్వతమూ, ఏకాంతమూ అయిన ప్రేమ గురించి, ఇంచుమించు జోశ్యం చెప్పినట్టే జనరల్ అనోసొవ్ ఆనాడు అనిన మాటలు ఆమె గుర్తుకు తెచ్చుకుంది. ఆ విగతజీవి నుదిటిపై పడివున్న తలవెంట్రుకలను మెల్లగా ఒక పక్కగా తోసి, తన చేతులతో అతని కణతలు గట్టిగా పట్టుకుని, చల్లగా చెమ్మగా వున్న నుదిటిని సుదీర్ఘంగా అమిత అనుకంపంతో ముద్దు పెట్టుకుంది.

ఆమె వెళ్ళిపోతూన్నప్పుడు, ఆ ఇంటి యజమానురాలు ముసలమ్మ ఆమెదగ్గరకు వచ్చి పోలిష్ యాసతో పొగడుతూ అంది:

''ఉత్త చోద్యం కోసం చూడడానికి వచ్చేవాళ్లలా కాకుండా, తమరు కేవలం ప్రత్యేకమైనవారని నేను గ్రహించేసుకున్నానులెండి. దివంగతుడు జెల్త్కోవ్‌గారు చనిపోయేముందు నాతో అన్నాడు: 'నేను చనిపోయిన తరువాత నన్ను చూడడానికని ఒకామె వచ్చినట్టాయెనా, బేతోవెన్ కృతులన్నిటిలోనూ ఇదే గొప్పదని ఆమెతో చెప్పండి' అని, అదేదో ఆ పేరు నాకు జ్ఞాపకం వుండదేమోనని, వెంటనే ఆ పేరు కాగితంమీద రాసి ఇచ్చాడు. ఇదిగో కాగితం...''

''ఏదీ? ఇలా ఇవ్వండి'' అంటూ తటాలున వేర నికొలాయెవ్‌న వెక్కి వెక్కి ఏడ్చేసింది. ''క్షమించండి — ఈ హఠాన్మరణం నా మనస్సుపై

ఎంతటి ప్రభావం కల్గించిందంటే, తమాయించు కోవడం ఇక నాశక్యమైంది కాదు.''

ఆ కాగితంపై తనకు పరిచితమైన దస్తూరీతో రాసివున్న మాటలను ఆమె చదువుకుంది: ''L. van Beethoven. Son. No. 2, op. 2. Largo Appassionato."

## 13

వేర నికొలాయెవ్న ఆ రోజు సాయంకాలం బాగా పొద్దుపోయి ఇంటి కొచ్చింది. ఆమె వచ్చేసరికి ఇంట్లో తన పెనిమిటిగానీ, తన అన్నదమ్ముడు గానీ ఇంట్లో లేకపోవడం చూసి ఆమె చాలా సంతోషించింది.

పియానిస్టు జెన్నీ రెయ్‌టర్ మాత్రం ఆమెకోసం కనిపెట్టుకుని వుంది. తాను ఆ దినం చూచిన దృశ్యమూ, విన్నసంగతులూ వీటన్నిటివల్ల మనస్సు బాగా కలతపడిపోవడంచేత, వేర తన స్నేహితురాలి వద్దకు పరుగెత్తి వెళ్లి, అందంగానూ మంచి వెడల్పుగానూ వున్న ఆమె చేతులను ముద్దుపెట్టుకుని డగ్గుత్తికతో ఎంతో ప్రాధేయపడుతూ అడిగింది:

''జెన్నీ, జెన్నీ, నా తల్లీ! నామీద నీకు అపేక్షవుంటే, ఏదేనా ఒకటి వాయించుదూ, నిన్ను బతిమాలుకుంటాను తల్లీ!'' అలా అడుగుతూనే వెంటనే వేర గదిలోనుంచి బయటకు వచ్చేసి పూలతోటలో బెంచీ మీద కూచుంది.

జెల్‌త్కోవ్ అనే ఆ నవ్వు పుట్టించే పేరుగల్గిన దివంగతుడు ఆ వ్యక్తి

కోరిన సంగీతకావ్యం నుండి ఆ కృతే జెన్నీ వాయించి తీరుతుందని ఆమె ఏమాత్రమూ సందేహించనైనా సందేహించలేదు.

సరిగ్గా ఆమె అనుకున్నట్టే జరిగింది కూడా. పియనో నుండి వెడలిన మొదటి స్వరాలు తన చెవిని పడీపడడంతోనే, అసాధారణమూ ప్రగాఢమూ అయిన ఆ కృతిని ఆమె వెంటనే పోల్చేసుకుంది. ఆ స్వరాలకు తన హృదయం రెండు తునకలు కింద చీలిపోయినట్టే అనిపించిందామెకు. జన్మజన్మాలకూ ఒక్కసారే సంభవించేటట్టి మహత్తరమైన ప్రేమ తన చేయి జారిపోయి తన పక్కనుంచే వెళ్లిపోయిందే అని అదేసమయంలో ఆమె తలపోసింది. జనరల్ అనోసావ్ మాటలను ఆమె గుర్తుతెచ్చుకుని, బేతోవెన్ కృతిని తాను వినాలనీ, అందులోనూ ప్రత్యేకంగా ఈ కృతిని తాను వినాలనీ జెల్త్కోవ్ ఎందుకు కోరాడు చెప్మా? — అని తనను తాను ప్రశ్నించుకుంది. ఆమె మనస్సులో వున్న మాటలు తటాలున పొసగుచ్చినట్టు వాటంతటవే పేరుగా ఏర్పడడం మొదలెట్టాయి. తన మనస్సులోని మాటలు ఆ సంగీతంతో ఎంత పొందికగా అమిరాయంటే, ''నీ పావన నామము సదా వర్ధిల్లుగాక!'' అనే ముకుటంతో ప్రతి చరణమూ అంతమవుతూన్న ఒక భక్తి కీర్తన సాహిత్యంలోని పదాలా అని అనిపించిందామెకు.

''ఆత్మహింసకూ, బాధలకూ, మృత్యువుకూ వినమ్రతతో పరమానందంతో ధారపోసినట్టి జీవితాన్ని ఈ మృదుమధుర స్వరాల్లో నీకిప్పుడెరింగించుచున్నాను. ఎట్టి పరితాపముగానీ, ఎట్టి నిష్ఠురముగానీ, ఎట్టి మృషాగర్వభంగముగానీ నేనెన్నడూ ఎరగను. ఇదే నీ ముంగల నా ప్రార్థన: 'నీ పావన నామము సదా వర్ధిల్లుగాక!'

''అవును, యమబాధలు, రక్తధారలు, మృత్యు దర్శనము — ఇవన్నీ

కళ్ల ఎదుట ప్రత్యక్షమవుతూనే వున్నాయి. ఆత్మను విముక్తి చేయడమంటే ఈ శరీరానికి ఎంత కష్టమో నేనెరుగుదును. అయినప్పటికీ, ఓ దివ్య సుందరమూర్తీ, నిన్నే నేను స్తుతించుచున్నాను, పంచప్రాణాలతో అవ్యాజ ప్రేమతో నిన్ను నేను స్తుతిస్తున్నాను: 'నీ పావన నామము సదా వర్ధిల్లు గాక!'

"నీ ప్రతి పాదముద్రనూ, ప్రతి మందహాసాన్నీ, ప్రతి చూపునూ, నీ చరణముల మృదుశబ్దాన్నీ నేను స్మరించుకుంటూనే వుంటాను. నా అంతిమ స్మృతులకు ప్రశాంత మధుర వేదనలు, దివ్యసుందర వేదనలు వింజామరలు వీస్తున్నాయి. అయినప్పటికీ నా మూలాన నీకెట్టి విచారన్నీ కలుగనీయను. ఏకాకినై మారుమాటాడక నేను వెడలిపోతున్నాను — అదే దైవచిత్తము, అదే నా నొసట రాత. 'నీ పావన నామము సదా వర్ధిల్లుగాక!'

"విషాదపూరితమైన నా తుది గడియలలో నేను నిన్నే ప్రార్థిస్తున్నాను. ఈ జీవితం నాకున్నా ఎంతో సర్వాంగసుందరంగా వుండేదే. ఓ హృదయమా! వెతజెందకు, నికృష్ట జీవితాన్ని అనుభవించిన ఓ హృదయమా! వెతజెందకు. నా మనస్సులో నేను మృత్యువును ఆహ్వానిస్తున్నాను. అయినప్పటికీ, నా హృదకుహరమంతా నీ ప్రస్తుతితోనే నిండి పొరలిపోతూంది: 'నీ పావన నామము సదా వర్ధిలుగాక!'

"నీ వెంతటి సౌందర్యరాశివో, నీకుగానీ, నీ బంధువర్గ పరివారము నకుగానీ తెలియనే తెలియదు. యమకింకరుల ఘంటారావం వినవస్తూంది. మృత్యుసమయం సమీపించింది. ప్రాణానికి వీడ్కోలు చెబుతూన్న ఈ అవ

సాన గడియలలో మృత్యు సమక్షంలో వున్న నేను నీ నామ సంకీర్తననే గానం చేస్తున్నాను — 'నీ కీర్తి వర్ధిల్లుగాక!'

''ఇదిగో, మృత్యువు, సర్వవిజేత మృత్యువు, రానే వచ్చింది. అయినప్పటికీ నీ నామోచ్చారణే నాకు శరణ్యం — 'నీ కీర్తి వర్ధిల్లుగాక!' ''

అక్కడున్న సన్నని అకేసియా చెట్టును తన రెండు చేతులతోనూ పట్టుకొని, దానిని గట్టిగా తన శరీరానికి హత్తుకుని రాజకుమారిక వేర విలపిస్తూంది. ఆ చెట్టు మెల్లగా కదలుతూంది. గాలి మృదువుగా వీచి, ఆమెతో సానుభూతిని తెల్పడానికని ఆకులను కదుపుతూ మర్మరధ్వని కావించింది. నక్షత్రాలను పోలిన పొగాకు పువ్వులు మరింత ఘాటుగా పరిమళించాయి... ఆమె మనస్సులోని ధుఃఖానికి ప్రత్యుత్తర మిస్తూన్నట్టు మహోద్భుతమైన ఆ సంగీతం అలా కొనసాగుతూనే వుంది:

''ప్రియతమా, నీకు మనశ్శాంతి కల్గుగాక! నీకు మనశ్శాంతి కల్గుగాక! నన్ను తల్చుకుంటున్నావా? నీకు నేను జ్ఞప్తికి వస్తున్నానా? నీవే నా ఏకైక ప్రేమ, నీవే నా అంతిమ ప్రేమ. నీకు మనశ్శాంతి కల్గుగాక. నీ చెంతనే వున్నాను నేను. నన్ను తల్చుకున్న తక్షణమే నేను నీ చెంత చేరుతాను. కారణం, మనమిద్దరమూ పరస్పరం ప్రేమించుకున్నాము, ఒక్క క్షణమే — అయితేనేమి, అదే శాశ్వతం. నేను నీకు గుర్తుకు వస్తున్నానా? నన్ను జ్ఞాపకముంచుకున్నావా? నీ అశ్రుకణములను నేనిచ్చట స్పృశిస్తున్నాను. నీ మనస్సుకు శాంతి కల్గుగాక! తీయని నిద్ర, తీయని తీయని నిద్ర నన్నావరించుతూంది.''

కృతి వాయించడం ముగించి, జెన్నీ రెయ్‌టర్ గదిలోనుండి బయటకు

వచ్చి, బెంచీపై కూచుని కన్నీటి వరదలో తడిసి వున్న రాజకుమారిక వేరను చూసింది.

"ఏం జరిగిందేమిటి?" అని అడిగింది ఆ పియానిస్టు.

వ్యాకుల పడుతూ, ఆందోళన చెందిన మనస్సుతో, అశ్రుపూరితములై మెరుస్తూన్న కళ్లతో వేర, జెన్నీ ముఖాన్నీ, పెదవులనూ కళ్లనూ ముద్దు పెట్టుకుని, ప్రత్యుత్తరమిచ్చింది:

"ఏమీలేదు, ఏమీలేదు — ఇప్పుడు నన్నతడు క్షమించాడు. ఇకంతా బాగానే వుంటుంది".

# అన్తోన్ చేహొవ్

## కుక్కపిల్లను వెంటబెట్టుకున్న మహిళ



## 1

బీచిరోడ్డు మీద కొత్తముఖం ఒకటి — కుక్కపిల్లను వెంటబెట్టుకున్న మహిళ — అవుపడిందని అందరూ ఒకరితో ఒకరు చెప్పుకుంటున్నారు. ద్మీత్రి ద్మీత్రిచ్ గూరొవ్ యాల్తా నగరానికి వచ్చి పక్షం దినాలైంది, అందుచేత యాల్తా పోకడలకు అప్పుడే అలవాటుపడి, అక్కడి వారందరిలాగానే

అతడు కూడా కొత్తవాళ్ళు అక్కడకు రాగానే వాళ్ళు ఎవరో ఏమిటో తెలుసు కుందామనే కుతూహలం కనబర్చ నారంభించాడు. వెర్నెల్స్ వరండా కేఫేలో తాను కూచూన్న స్థలంనుండి బీచిరోడ్డుకేసి చూడగా, అంచులేని టోపీ పెట్టుకుని ముగ్ధరాలు ఒకామె అక్కడ షికారు తిరుగుతూండడం అతనికి అవుపడింది; తెల్లని తెలుపు, అట్టే పొడగరి కాదు; ఆమె వెంట తెల్లని పొమిరేనియన్ కుక్కపిల్ల ఒకటి చకచకా పరిగెడుతూంది.

తరువాత రోజూ అనేకసార్లు మ్యునిసిపల్ పార్కులోనూ, చౌకులోనూ ఆమె అతనికి ఎదురయేది. ఎప్పుడు చూసినా ఆమె ఒంటరిగానే వుండేది, ఎప్పుడు చూసినా ఆ అంచులేని టోపీనే పెట్టుకునేది, ఇక ఆ పొమిరే నియన్ కుక్కపిల్ల హమేషా ఆమె వెంట వుండేది. ఆమె ఎవరో ఎవ్వరికీ తెలిసినట్టు లేదు; ఆమె గురించి చెప్పుకున్నప్పుడు అందరూ ఆమెను ''కుక్కపిల్లను వెంటబెట్టుకున్న మహిళ'' అనే అంటూండేవారు.

''పెనిమిటితో కాకుండానూ, స్నేహితులతో కాకుండానూ ఆమె ఒక్కర్తె ఇక్కడకు వచ్చినప్పుడు, ఆమెతో పరిచయం చేసుకోవడమంటే — అదీ ఒక గమ్మత్తుగానే వుంటుంది'' అనుకున్నాడు గూరొవ్.

అతడికింకా నలభయ్యో పడి రాలేదు, అయినా అతడికి అప్పుడే పన్నెండేళ్ల కూతురు ఒకర్తె, బడిలో చదువుకుంటూన్న కొడుకులు ఇద్దరూ. అతడింకా కాలేజీలో రెండవ సంవత్సరం చదువుతూండగానే అతడిని ఏలాగో ఒప్పించేసి పెళ్లిచేసేశారు. అతని భార్య ఇప్పుడు అతనికంటె రమారమి రెండింతలు వయస్సు వున్నదానిలా కనబడుతుంది. ఆమె పొడగరి, చామన చాయ నుదురు, నిటారుగా ఠీవిగా, గోటుగా వుంటుంది; అదీగాక తన్ను గురించి తాను చెప్పుకునేటట్టే, ఆమె ''భావుకురాలు'' కూడానూ. ఆమె గొప్ప

పరిత, తాను ఉత్తరాలు రాసేటప్పుడు, పదాల చివర పరుష సూచక సంకేతా క్షరం రాయడం మానివేసి, కొత్త స్పెల్లింగు ప్రకారం రాసేది. పెనిమి టిని ''దీమ్మిత్రి'' అని పిలవడం బదులు, ''దిమీత్రి'' అని పిలచేది; ఆమె దంతా మిడిమిడి జ్ఞానమేననీ, ఆమె వుత్త సంకుచిత తత్వపు మనిషే అనీ, ఆమెకు నాజూకుతనం లేదనీ అతడు తన అంతరంగంలో అనుకున్నప్పటికీ, ఆమె అంటే మాత్రం అతడికి భయమే; అందుచేత ఇంటిని అంటి పెట్టుకుని వుండడమంటే అతడికి సుతరామూ గిట్టేదికాదు; ఆమెకు తెలియ కుండా అతడు చాటుమాటుగా పరస్త్రీల సాంగత్యం మొదలుపెట్టి ఏనాడో అయింది, ఇక ఇప్పుడు అతడు నిరంతరమూ పరాయి స్త్రీలతోనే సంపర్కం పెట్టుకుంటున్నాడు. బహుశా అందుచేతనే ఆడవాళ్ల గురించి అతడెప్పుడు మాట్లాడినా, వాళ్లను ''అథమ జాతి'' అంటూ తిరస్కారంగా మాట్లాడేవాడు.

తన తిక్తానుభవంవల్ల నేర్చుకున్న అనేక గుణపాఠాల ననుసరించి, ఆడవాళ్లను గురించి తన నోరు ఎలా తిరుగుతే అలాగు అనవచ్చుననీ, కాని వాళ్లను గురించి నానా మాటలూ ఆడినప్పటికీ, ఈ ''అథమ జాతి'' లేనిదే తనకు ఒక్కరోజైనా గడవదనీ అతడు బాగా ఎరుగును. తన తోటిమగ వాళ్లతో వున్నప్పుడు అతడు నిరుద్రేకంగానూ అతి ముక్తసరుగానూ వుండే వాడు, కాని స్త్రీలతో వున్నప్పుడు అతి చనవుగానూ, అతి సరదాగానూ వుంటూ, వారితో ఎటువంటప్పుడు ఏ మాటాడాలో, ఏ సమయంలో ఎలా ప్రవర్తించాలో అతడికి వెన్నతో పెట్టిన విద్య; వారితో వున్నప్పుడు తాను రవంతైనా అనాగరికుడనని అనిపించుకొన కుండానే ఒక్కొక్కప్పుడు మౌనం వహించి వుండడం సహితమూ అతనికి కరతలామలకమే. అతడి తీరులోనూ, రూపంలోనూ, అతడి వాలకంలోనూ స్త్రీలను ఆకర్షించేదీ, వారి సాను

భూతిని చూరగొనేదీ, ఏదో అంతు చిక్కని వశీకరణపు ఒయ్యారం ఒకటి వుండేది. ఈ విషయం తనకీ తెలుసు; దృశ్యమాన గోచరముగాని ఆకర్షణ శక్తి ఒకటి తనను వారివద్దకు లాగుకొని పోతుందని తనమట్టుకు తనకే అనిపించేది.

ఇదివరలో తాను పదే పదే అనుభవించిన బాధాకరమైన అనుభూతుల వల్ల, కొత్త పరిచయం ప్రతీదీ కూడా, ఏకస్థాయిని సాగిపోతూన్న నిత్య జీవితంలో మధురమైన వైవిధ్యాన్ని తొలుత ప్రసాదించి, ఆరంభంలో ఆనంద కరమైన ఒక లఘు సాహసయాత్రలా అగపడినప్పటికీ, మానమర్యాదలు గల్గిన మనుషులలో (అందులోనూ ముఖ్యంగా, జంకుతూ గొంకుతూ ఒకంతట కదలని మనుషులున్న మాస్కోలో) భరించ శక్యంగాని ఇరకాటపు పరిస్థితికి దారితీసేటట్టి విషమ చిక్కులతో కూడిన సమస్యగా తప్పని సరిగా పరిణమిస్తుందని అతడికి స్పష్టంగా తెలుసు. కాని ఆకర్షణీయమైన ఆడది అతని కంటబడేసరికల్లా ప్రతిసారీ కూడా, అతడి హృదయకుహ రంలో నుండి జీవితేచ్ఛ పెల్లుబుకుతూ పొంగి పొరలేసరికి, అదంతా ఒక తేలికైన విషయంగానూ అదొక వినోదంగానూ చటుక్కున అవుపడేదతడికి.

ఇలాగే ఒకనాడు సాయంత్రం, పార్కులో వున్న రెస్టారెంటులో అతడు భోజనం చేస్తూండగా, అంచులేని టోపీ పెట్టుకున్న ఆ మహిళ అక్కడకు వచ్చి, పక్కనున్న బల్లదగ్గర కుర్చీలో కూచుంది. ఆ ముఖం కళవళికలు, నడక తీరు, వేసుకున్న దుస్తులు, కొప్పుపెట్టుకున్న రీతి — ఇవన్నీ కూడా ఆమె ఘరానా తరగతి స్త్రీ అనీ, ఆమె వివాహిత అనీ, యాల్టా నగరానికి రావడం ఆమెకిదే మొదటిసారి అనీ, తాను ఒక్కర్తే ఒంటరిగా వుండడంచేత ఆమెకు విసుగెత్తుతూందనీ చెప్పకనే చెబుతున్నాయి... యాల్టా నగర సంద



7—1

ర్యకులలో నీతినియమాల పట్ల పట్టింపులూ పట్టుదలలూ సడలి వుంటా యంటూ మామూలుగా అందరూ చెప్పే కథనాలన్నీ అతిశయోక్తులే అన డంలో ఎట్టి సందేహమూ లేదు; కాగా అతడు వాటినెప్పుడూ పట్టించు కునే వాడుకాదు, ఎందుచేతనంటే ఈ పట్టింపులనూ పట్టుదలలనూ సంతో షంతో అతిక్రమించేందుకు తమకెట్టి సంకోచమూ లేకపోయినప్పటికీ, అందుకు అవకాశం కల్పించుకునే కిటుకు తెలియక పరితపించే వారే చాలా వరకూ ఈ కాకమ్మ కథలకు సృష్టికర్తలని అతడికి తెలుసు. కాని ఈ మహిళ తనకు పక్కగా నాలుగడుగుల దూరాన్నేవున్న బల్లవద్ద కుర్చీపై ఆసీనురాలయే సరికి, సునాయాస దిగ్విజయాలను గురించీ, వినోద పర్వత యాత్రలను గురించీ కథలన్నీ అతడికి గుర్తువచ్చి, త్రుటిలో ఏర్పడి క్షణమాత్రం సాగిన ప్రణయ వ్యవహారాన్ని చురుకున కుదుర్చుకోవడము, పేరూ వూరూ తెలి యని స్త్రీతో సంపర్కం పెట్టుకోవడము – అత్యాకర్షణీయమైన దుర్బుద్ధి ఒకటి అమాంతంగా అతడిని ఆవహించింది.

ఆ కుక్కపిల్లను చిటికెలు వేసి పిలచాడు. తన దగ్గరకు అది ఒళ్లు తిప్పుకుంటూ వచ్చేసరికి, తన చూపుడువేలు దానికేసి ఝుళించగా అది గుర్రు మంది. గూరొవ్ మళ్లీ తన చూపుడువేలు ఆడించాడు.

ఆ మహిళ తలెత్తి అతనికేసి చూసి, మళ్లీ వెంటనే కళ్లు దించేసింది.

''అది కరవదులెండి'' అంది; ఆలా అంటూనే ఆమె ముఖం ఎర్ర బడింది.

''దానికొక ఎముక ఇవ్వవచ్చునా అండి?'' అని అతడడిగాడు. అంగీ కార సూచకంగా ఆమె తల వూపేటప్పటికి, ఆ సందు చూసుకుని అతడు స్నేహపూర్వకమైన కంఠంతో:

''మీరు యాల్టాకి వచ్చి చాలా రోజులే అయిందేమిటండి?'' అని అడిగాడు.

''నాలుగైదు రోజులైందండి.''

''నేనేమో ఇక్కడికొచ్చి రెండో వారం నడుస్తూంది, నడవడమేమిటి, చీమనడకతో సాగుతూంది!'' అన్నాడు గూరొవ్.

కాస్సేపటి వరకూ ఇద్దరూ మాట్లాడలేదు.

''ఇక్కడ రోజులు పరుగెడుతున్నాయి. అయినా ఇక్కడ విసుగ్గానే వుంది, మరి అదేమిటోగాని!'' అందామె అతడికేసి కన్నెత్తి చూడకుండానే.

''ఇక్కడ విసుపుగా వుందనడం ఒక ఆనవాయితీ లెండి. అదేమిటో చిత్రం — బెల్యేవ్, జీజ్ద్ర లాంటి దిక్కూమొక్కూ లేని ఏ వూళ్లకో వెళ్లి అక్కడ విసుగ్గా వుందని అనే అనరు; అలాంటిది ఇక్కడకు వచ్చిన ఉత్తరక్షణంలోనే: 'అబ్బబ్బ, ఇదేమిటి బాబూ, ఇంత పేలవంగా వుందిక్కడ! దీనికితోడు ఈ దుమ్ము ఒకటీ!' అని ఒక్కటే ఆపసోపాలు పడతారు. అదంతా విని, వీళ్లు ఏ గ్రెనాడా నుండి ఊడిపడ్డారో ఏమిటో అనుకోవాలి, అంతే మరి!'' అన్నాడు గూరొవ్.

ఆమె ఫక్కున నవ్వింది. తరువాత వాళ్లిద్దరూ మరీమీ మాటలులేకుండానే ముక్కూ ముఖమూ ఎరగనివాళ్లల్లా ఎవరి మానాన వాళ్లు భోజనంచేస్తూ కూచున్నారు. కాని భోజనం అయాక ఇద్దరూ కలిసే రెస్టారెంటు నుండి బయటికొచ్చి, తాము ఎక్కడికి షికారెళ్లినా ఒక్కటే, దేని గురించి బాతాఖానీ కొట్టినా ఒక్కటే అని అనుకునేటట్టి సర్వ స్వతంత్రులూ ఆత్మసంతుష్టిపరులూ అయిన వ్యక్తులు సాగించే హాస్యరసభరితమైన లఘు

సంభాషణలోకి వీరూ దిగారు. ఆలా షికారు తిరుగుతూ, సముద్రపు నీటిపై మెరుస్తూన్న వెలుగు ఎంత చిత్రంగా వుందో కదా అని తమ ఆశ్చర్యాన్ని వ్యక్తపరచారు. సముద్రపు నీరు వెచ్చగా, మెత్తని ధూమ్రవర్ణపు ముఖ మల్లులా కానవస్తూంది, నీటిపై పడుతూన్న వెన్నెల బంగారు జల్తారు మైజారులా తళుకులు మెరుస్తూంది. రోజంతా ఎండ కాసిన తరువాత ఇప్పుడు ఎంత ఉక్క పెడుతూందో కదా, అనుకున్నారు ఇద్దరూ ఒకరితో ఒకరు. తాను మాస్కో వాడిననీ, నిజానికి తాను భాషాతత్వ శాస్త్రజ్ఞుడననీ, కాని బ్యాంకులో పనిచేస్తున్నాననీ; ఒకప్పుడు తాను ఒక ప్రయివేటు నృత్యసంగీత నాటక బృందంలో గాయకునిగా తర్ఫీదు పొందినప్పటికీ, తరువాత ఆ ఉద్దేశ్యం మానుకున్నాననీ; మాస్కోలో తనకు రెండు ఇళ్ళు వున్నాయనీ చెప్పాడు... తాను పీటర్స్‌బర్గులో పెరిగాననీ, కాని స— పూరిలో పెళ్లి చేసుకున్నాననీ, తనకు పెళ్లిఅయి రెండేళ్లయిందనీ, ఈ రెండేళ్లనుండి ఆ వూరిలోనే కాపురమనీ, యాల్తలో ఇంకొక నెలరోజులు వుంటాననీ, తన పెనిమిటికి కూడా విశ్రాంతి అవసరం అవడంచేత అతడు కూడా బహుశా యాల్త వచ్చి తనను కలుసుకుంటాడనీ — ఆమె చెప్పింది. తన పెనిమిటి రాష్ట్ర సలహా సంఘంలోనో, లేకుంటే జేమ్‌స్త్వొ పాలకవర్గంలోనో సభ్యుడో తనకు నిజంగా తెలియదనీ ఆమె చెప్పి, తన అజ్ఞానానికి తానే అబ్బురపడుతున్నానంటూ తన్ను తానే పరిహసించుకుంది ఆమె. ఈ భోగట్టాయే కాకుండా, ఆమె పేరు అన్న సెర్గేయెవ్‌న అని కూడా ఆమెనుండి గూరొవ్ తెలుసుకున్నాడు.

అతడు తన బస చేరుకున్న తరువాత, తన గదిలోకి వెళ్లిపోయి, ఆమె గురించే తల్చుకుంటూ, మరునాడు కూడా ఆమెను కలుసుకోవడం తప్పక

సంభవించి తీరుతుందనీ అనుకున్నాడు. అంతేకాదు, అసలు ఆమెను కలుసుకోవడం అనివార్యమేనని నిశ్చయించుకున్నాడు. అతడు పడుకుని నిద్రపోయే ముందు, తన కూతురిలాగానే, ఆమె నిన్నమొన్నటి వరకూ, ఇంకా పాఠాలు నేర్చుకునే బడిపిల్లేనన్న విషయం గుర్తుచేసుకుని, ఆమె నవ్వులోనూ, పరాయి వాడితో ఆమె సంభాషించే తీరులోనూ ఎంత బిడియమూ జంకూ దాగి వున్నాయో జ్ఞప్తికి తెచ్చుకున్నాడు — తాను ఒక్కరితే ఒంటరిగా వుండడము ఆమె జీవితంలో ఇదే తొలిసారి అయి వుంటుందనీ, పరాయి మొగవాళ్లు తన వెంటబడి, తనను అదే పనిగా నఖశిఖపర్యంతమూ గమనిస్తూ, తనతో మాట్లాడుతూంటారనీ, ఇదంతా జరుగుతూన్నంత సేపూ వాళ్లమనస్సులో వున్న రహస్యపు కోర్కెను తాను సులభంగానే ఊహించుకో గలిగే వుంటుందనీ అతడు అనుకున్నాడు. ఆమె కోమలమైన సన్నని మెడనూ, సుందరమైన పాంశువర్ణపు కళ్లనూ అతడు జ్ఞాపకం చేసుకున్నాడు.

''అయినప్పటికీ ఆమెను చూస్తే అదొక విధమైన జాలి పుడుతూంది'' అనుకున్నాడు. ఆలా అనుకుంటూనే అతడికి నిద్రపట్టిపోయింది.

## 2

వారిద్దరికీ పరిచయం ఏర్పడి అప్పుడే ఒక వారం అయింది. ఆనాడు ఏదో సెలవు దినం. ఇంట్లో కూచుంటే ఘుమాయించి చంపేస్తూందని చెప్పి, బయటికి వచ్చేసరికి ధూళిదుమారం మేఘంలా లేచి, వీధిలో వున్నవాళ్ల టోపీలను ఎగరేసుకు పోతూంది. ఆనాడు విపరీతంగా దాహం

వేసి గొంతుకలు ఆర్చుకు పోతున్నాయేమో, విధివిరామం లేకుండా వీధి వరండాలో ఆరుబైటనున్న కేఫేకి వెళ్లనూ, షర్బత్తూ ఐస్‌క్రీమూ తీసుకొచ్చి అన్న సెర్గేయెవ్‌నకి అందివ్వనూ — ఈ పనిలోనే మునిగిపోయున్నాడు గూరొవ్. ఆ తాపం భరించ శక్యం కాకుండా వుంది.

సాయంకాలానికికల్లా గాలి తగ్గిపోయే సరికి, స్టీమరు వస్తూంటే చూడ్డానికని వారిద్దరూ కలిసి రేవులోకి వెళ్లారు. బల్లకట్టు ప్లాట్ఫారం మీాద కావలసినంతమంది జనం వున్నారు, పచారుచేస్తూ షికారు తిరుగుతూనూ. చేత పువ్వులగుత్తులు పట్టుకుని స్టీమరులో వస్తూన్న తమ స్నేహితులను ఆహ్వానించేందుకు వచ్చారు కొందరు. షోకుగా నీటుగా వున్న యాల్తమూాకకున్న రెండు విశిష్టగుణాలూ కళ్లకు కొట్టొచ్చినట్టు అవుపడుతూనే వున్నాయి — వయస్సు మళ్లిన ప్రౌఢలందరూ ముగ్ధలుగా అవుపడాలనే తాపత్రయంతో ముస్తాబయారు; ఎక్కడపడితే అక్కడే కుప్పతిప్పలుగా అవుపడుతున్నారు జనరల్సు.

సముద్రం కల్లోలంగా వుండడంచేత, ఎంతో ఆలస్యంగా వచ్చింది స్టీమరు; స్టీమరు వచ్చేసరికి సూర్యాస్తమయం అయిపోయింది. ఇక ఎంతో ప్రయాసపడి విన్యాసం సాగించుతేనేగాని స్టీమరు బల్లకట్టు ప్లాట్ఫారం పక్కకు చేరలేకపోయింది. అన్న సెర్గేయెవ్న తన చేతి సులోచనాలకట్టుతో, తనకు తెలిసినవారు ఎవరికోసమో వెతకుతూన్నట్టు, స్టీమరునీ, ప్రయాణికులనూ పరికించి, ఇక గూరొవ్‌కేసి ముఖం తిప్పేసరికి, ఆమె కళ్లు చెమ్మగిలి ప్రకాశిస్తున్నాయి. అంతట ఆమె అదే పనిగా నోరు మూాతపడకుండా మాట్లాడడం మొదలుపెట్టి, ఉండుండి ప్రశ్నలవర్షం కురిపిస్తూ, మళ్లీ ఉత్తరక్షణంలోనే తాను వేసినప్రశ్నను తానే మరచిపోతూంది. సరిగా

అప్పుడే ఆ జనం తొడితొక్కిడిలో ఆమె తన చేతిసులోచనాలకట్టును పారేసుకుంది.

షోకుగా నీటుగా ముస్తాబైన ఆ జనసందోహం పలచబడ నారంభించింది, మునిచీకటిలో మనుషులను పోల్చుకోవడం కొంచెం కష్టంగా వుంది, గాలి పూర్తిగా చచ్చిపోయింది; స్టీమరునుండి ఇంకా ఎవరో దిగుతారేమో అని నిరీక్షిస్తున్నట్టుగా గూరొవ్వూ ఆన్న సెర్గేయెవ్నా ఇద్దరూ అక్కడ నిలబడే వున్నారు. ఆన్న సెర్గేయెవ్న మాటా మంతీ లేకుండా మౌనంగా అప్పటప్పట తన చేతనున్న పువ్వులు వాసనచూస్తూ, గూరొవ్‌కేసి చూడకుండా, ఆలా నిల్చుంది.

''మొత్తంమీద సాయంకాలం చల్లబడి బాగానే వుంది'' అన్నాడతడు. ''ఇప్పుడేం చేద్దాం? బండిమీద షికారు వెళ్దామా?''

ఆమె ఏమీ జబాబు చెప్పలేదు.

ఆమె కళ్లల్లోకి అతడు నిదానంగా చూసి, తటాలున ఆమెను తన చేతుల్లోకి తీసుకొని ఆమెను పెదవులపై ముద్దుపెట్టుకున్నాడు, ఆ పువ్వుల పరిమళమూ ఆర్ద్రమూ అతనిని పరివేష్టించాయి; కాని మరు నిమిషమే అతడు దిగులుతో వెనుకకు తిరిగాడు — తమనిద్దరనూ ఎవరైనా చూశారా ఏమిటి కొంపతీసి?

''మీ గదికి వెళ్దాం'' అన్నాడతడు ఆమె చెవిలో.

ఇక వాళ్ళిద్దరూ కలిసి గబాగబా నడుస్తూ అక్కడనుండి వెళ్లిపోయారు.

ఆమె గదిలో ఘుమాయింపుగా వుంది; జపాను దుకాణంలో కొన్న ఏదో అత్తరుతో గది అంతా పరిమళిస్తూంది. గూరొవ్ ఆమెకేసి చూసి,

ఆత్మగతంగా: ''ఇలాటి విచిత్ర ఘటనలతో జీవితం నిండి వుంటుంది కదా!'' అనుకున్నాడు. ప్రణయచేష్టలవల్ల తాము పొందిన ఆనందోద్రేకం ఎంత క్షణికమైనప్పటికీ, తాను వారికి కలుగజేసిన ఆ సుఖానికి తమ కృతజ్ఞతను వెలిబుచ్చిన స్త్రీలు — నిర్విచారులై సహృదయులైన స్త్రీలు అతనికి జ్ఞప్తికి వచ్చారు; ఇక ఇతర స్త్రీలు — తమ ప్రణయచేష్టలు కుటిలబుద్ధితోనూ కపటంతోనూ నటనతోనూ నిండి, ఉన్మాదపూరితమై, అనవసరపు పద జాలంతో వన్నెలు తీర్చి, ఇదంతా ప్రేమా కాదూ, కామమూ కాదూ, అంతటి కంటెసూ మరింత అర్థాత్వమైన విషయమని సూచించే హావభావాలు ప్రదర్శించిన స్త్రీలు — అందులో తన భార్యకూడా ఒకర్తె — అతనికి గుర్తు కొచ్చారు; వీరందరూ గాక, జీవితం తమకివ్వగల్గిన దానికంటె మరింత అధికాంగానే జీవితం నుండి ఆఖరి బొట్టు సహితమూ పిండి అనుభవించుదా మనే వెర్రిపట్టుదలను బైటబెట్టుకునే పేరాశ కళవళికలు ముఖాన పరుగులిడుతూండిన నిరుద్దిక్కులూ రూపసులైన ఇద్దరు ముగ్గురు స్త్రీలు, తమ ప్రథమ యవ్వనానికి ఏనాడో వీడ్కోలు చెప్పి, చంచల మనస్కులై, తమ ఇష్టానిష్టాలకు దాసులై, విశృంఖలులై, బుద్ధిహీనులై, వీరిపట్ల తన ఉద్రేకం చల్లారిన పిదప, వీరి సౌందర్యం తనలో కేవలం జుగుప్సను పుట్టించి, తాము లోపల ధరించిన వలువల లేసు అంచులు చేప పొలుసులను గుర్తుకు తెప్పించిన అందాల బరిణెలు కూడా అతని స్మృతిపథంలో నిల్చారు.

కాని ఇక్కడో — తొలి జవ్వనపు పిరికితనమూ నేర్పులేమీ అనుభవ రాహిత్యమూ ప్రత్యక్షమవుతూనే వున్నాయి; ఎవరో సరిగా ఆ సమయానికే తలుపు తట్టితే కలిగిన కలవరపాటులాంటి అనుభూతి కూడా వుంది ఆ

వాతావరణంలో. అన్న సెర్గేయెవ్న, "కుక్కపిల్లను వెంటబెట్టుకున్న మహిళ", ఈ ప్రణయ విశేషాన్ని, అదేదో ఒక అత్యంత విశిష్టతనుకల్గి, గంభీరమైన ఘటనగా పరిగణించుతూ, అక్కడకు తానేదో పతిత అయి పోయినట్టుగా భావించడం ప్రారంభించింది. కాగా ఆమెలో ఈ భావన తలెత్తడం చూసి, అది అతనికి ఒక విధమైన ఎబ్బెట్టు అనిపించి, తత్తరపాటే కల్గించింది. ఆమె ముఖం మూరెడైపోయి, కుంగిపోయి, నిడుపైన తల వెండ్రుకలు దుఃఖభారంతో ముఖానికి చెరివైపునా వేలబడిపోయాయి. పూర్వకాలపు సాంప్రదాయక చిత్రపటంలో పశ్చాత్తప్తయైన పాపాత్మురాలివలె దుఃఖావృత ధ్యాన్నంలో నిమగ్నురాలైన భంగిమలో ఉంది.

"ఎంతో తప్పు జరిగిపోయింది. ఇక మీకు నామీద గౌరవమే వుండదు" అంది.

బల్లపై కర్బూజా పండొకటి వుంటే, దానిలోనుండి ఒక ముక్క కోసుకుని, నింపాదిగా తినడం మొదలుపెట్టాడు గూరొవ్. అరగంటపైచిలుకు ఇద్దరూ మౌనంగా కూచున్నారు.

జీవితంతో అతిస్వల్పంగా సత్యకాలపు పరిచయం కల్గిన స్త్రీకి సహజమైన నైర్మల్యాన్ని బహిర్గతంచేస్తూన్న అన్న సెర్గేయెవ్నను చూస్తూంటే అతడి మనస్సు ఎంతగానో ద్రవించిపోయింది. బల్లమీద వెలుగుతూన్న ఒక్క కొవ్వొత్తి ఆమె ముఖానికి వెలుగు నివ్వలేకపోయింది, అయినప్పటికీ ఆమె హృదయం విచారభారంతో కుంగిపోతూన్న విషయం మాత్రం స్పష్టంగా ద్యోతకమవుతూనే వుంది.

"నీపట్ల నాకున్న గౌరవం ఎందుకు తగ్గాలి?" అని అడిగాడు గూరొవ్. "నీవేమి అంటున్నావో నీకే తెలియడంలేదు" అన్నాడతడు.

''భగవంతుడు నన్ను క్షమించుగాక!'' అందామె విషాదంతో. ఆమె కంట కన్నీరు కమ్ముకుంది. ''ఎంత ఘోరం జరిగిపోయింది!''

''ఎందుకీ స్వయంసమర్థనంతా?''

''స్వయంసమర్థన ఎలా సాధ్యమౌతుంది గనుక? నేనొక దుర్మార్గురాలిని, పతితను; నన్ను చూసుకుంటే నాకే సర్వాసహ్యమూ వేస్తూ౦దే, అలాంటప్పుడు స్వయంసమర్థన కూడానా, అయ్యో? నా పెనిమిటినే కాదు నేను వంచన చేసినది, ఆత్మవంచనే చేసుకున్నాను నేను. ఈనాడే కాదు, ఏనాటినుండో నేనతని పట్ల ద్రోహం తలపెట్టుతూ వచ్చానే, అయ్యో! నా పెనిమిటి పాపం నిజాయితీ మనిషి, యోగ్యుడు, అయితేనేమి అతడు వుత్త జోహుకుంగాడు. తన ఆఫీసులో ఏమి పాటుపడతాడో నాకు తెలియదుగాని, అతనిది కేవలం జోహుకుం మనస్తత్వం అని మాత్రం నాకు తెలుసు. నేనతడిని పెళ్ళాడినప్పుడు నాకు ఇరవైయ్యేళ్ళే, నేను జిజ్ఞాసతో దహించుకుపోయాను, ఏదో ఉత్కృష్ట జీవితం కోసం పరితపించాను, ఏదో వేరే విధమైన జీవితం ఒకటి వుండి తీరుతుందనీ, దానిని నేను కాంక్షిస్తున్నాననీ, ఆ జీవితాన్ని నేను జీవించాలనీ నాలోనేనెంతో తహతహ పడేదాన్ని... జిజ్ఞాసతో నేను దగ్ధమైపోయేదాన్ని. అది మీకెన్నడూ అర్థంకాదులెండి. అయితేనేమి, భగవంతుడే నాకు సాక్షి. ఇక నేను ఒక్క క్షణమైనా నిగ్రహించుకోలేకపోయాను. ఎట్టి నిర్బంధమూ నన్ను వెనుకకు లాగి వుంచలేకపోయింది. నాకు సుస్తీగా వుందని నా పెనిమిటితో చెప్పి, ఇక్కడకు వచ్చాను... ఇక నన్నేదో పూనినట్టుగా వెర్రిదానిలా ఇక్కడ తిరగడం ప్రారంభించాను... ఇక ఇప్పుడేముంది? వుత్త మామూలు సాదాస్త్రీగా, ఎందుకూ కొరగాని ఆడ

దానిగా దిగజారిపోయాను. నన్ను అసహ్యించుకోడానికి ప్రతి వాడికి హక్కు వుందికదా!''

ఆమె మాటలు వింటూంటే గూరొవ్‌కి చచ్చినంత విసుగెత్తు కొచ్చింది. ఈ నిష్కపట వాచ్యమూ, ఈ ఆత్మసంతాపమూ, ఇదంతా అతనికి అదేమిటో కొత్తగానూ కేవలం అసందర్భంగానూ వున్నట్టనిపించింది. ఆమె నేత్రములు అశ్రుపూరితములై వుండబట్టిగాని, లేకుంటే ఆమె ఏదో వేళాకోళమే చేస్తూందో నాటకమే ఆడుతూందో అనుకోవలిసిందే.

''నీ మాటలు నాకేవీా అర్థం కావడంలేదు'' అన్నాడతడు నెమ్మదిగా. ''ఇంతకీ నీకేమిటి కావాలి?''

అతని వక్షస్థలంలో ఆమె తన ముఖం మరుగు చేసుకుని, అతనిని మరింత దగ్గరగా హత్తుకుంది.

''నామాట నమ్మండి; నన్ను నమ్మమని మిమ్మల్ని బతిమాలుకుంటు న్నాను'' అందామె. ''జీవితంలో వున్న నిజాయితీ నైర్మల్యాన్నంతనూ నేనెంత పవిత్రంగానో భావించుకుంటాను, దౌష్ట్యమంటే నాకు పరమ అసహ్యం. అయినా నేనేమి చేస్తున్నానో చెందుతున్నానో నాకే తెలియడంలేదు. అట్టి వాళ్లను దయ్యం వలలో పడేసుకుందం రు మామూలు పామరజనం. నన్ను కూడా దయ్యం తన వలలో పడేసుకుందని నేనూ అనాల్సిందే ఇప్పుడు.''

''అబ్బే, అబ్బే!'' అన్నాడు గూరొవ్ మెల్లగా.

భయంతో నిండి, కనురెప్ప మూతపడకుండా తేరిచూస్తూన్న ఆమె కళ్లలోకి అతడు నిదానంగా చూచి, ఆమెను ముద్దుపెట్టుకుని, నెమ్మదిగా ఆత్మీయమైన వచనాలతో ఆమెను సంబాళించగా, ఆమె నింపాదిగా కోలు

కొని, మళ్ళీ వెనుకటిలాగానే ఆమె ముఖం వికసించింది. మరొక నిమిషానికి మళ్ళీ ఇద్దరూ ఎప్పటిలాగానే నవ్వుతూ కబుర్లు చెప్పుకో సాగారు.

మరికొద్దిసేపైన తరువాత వారిద్దరూ షికారుకని బయటకు వచ్చేసరికి, బీచిరోడ్డు అంతా నిర్మానుష్యంగా వుంది, ఆ వూరూ వూరిలో వున్న సైప్రసు చెట్లూ ప్రాణంపోయినట్టున్నాయి. కాని సముద్రం మాత్రం హోరుమంటూ వొడ్డును ఫెడీఫెడీమని కొడుతూనే వుంది. ఏకాకి బెస్తనావ ఒకటి కెరటాలపై ఉయ్యాల ఊగుతూంది, దానికున్న దీపం కునుకుతూ ఇటూ అటూ జోగుతూంది.

బీచిరోడ్డున వారికొక గుర్రపుబండి కనబడింది. అదెక్కి ఒరియాండ పల్లెవరకూ వెళ్ళారు.

"నీ పేరు నాకిప్పుడు తెలిసింది, హాలులో బోర్డుమీద వుంటే చదివాను — 'ఫన్ డిడెరిట్స్' అని. నీ భర్త జర్మనుదేశస్థుడా?"

"కాదు. అతని తాత జర్మనుదేశస్థు డనుకుంటాను. నా భర్తది సనాతన చర్చి సంప్రదాయమే."

ఒరియాండ దగ్గర వారు బండి దిగిపోయి, చర్చికి కాస్త దగ్గరగానే వున్న ఒక బెంచిమీద చదికిలబడి, మాట్లాడకుండానే అలా సముద్రాన్ని చూస్తూ కూచున్నారు. ఆ తెల్లవారుఝాము పొగమంచు తెరనుండి యాల్టా నగరం లీలగా కనబడుతూంది, పర్వత శిఖరాలను ఆనుకొనున్న తెల్లని మేఘాలు నిశ్చలంగా పందిరలా పరచుకొనున్నాయి. ఒక్క ఆకైనా ఆడడంలేదు. కీచురాళ్లు పలుకుతున్నాయి. సముద్రపు గర్జన బోలుగా వారి చెవులలో పడి, శాంతిని గురించిన, మనందరి కోసమూ నిరీక్షించి వున్న అనంత సుషుప్తిని గురించిన సందేశాన్ని వారికి ఎరుకపరచింది. యాల్టా, ఒరియాండ నగరాల

నేవి ఏవీ ప్రపంచంమీద పుట్టకముందునుండీ కూడా సముద్రం ఇదే విధంగా గర్జించింది, ఇప్పుడూ ఆలాగే గర్జిస్తూంది, ఇక ముందు కూడా మనమందరమూ ఇక్కడనుండి అంతరించిన తరువాత సహితమూ — ఇంతటి ఉదాసీనతతోనూ, ఇంత బోలుగానూ గర్జిస్తూనే వుంటుంది. ఈ అవిరతంలోనే జీవన్మరణాలపట్ల ఈ కేవల ఉదాసీనతలోనే మన అంతిమ మోక్షంయొక్క, మన భూగోళంపై ప్రవహించుతూన్న జీవితస్రవంతి యొక్క, పరిణతోన్ముఖమైన దాని నిరంతర చలనంయొక్క రహస్యం బహుశ వుండొచ్చేమో కూడా.

ఆ తెల్లవారుకట్ల వెలుగలో — సముద్రమూ పర్వతాలూ మేఘాలూ అఖండంగా ఆవరించి వున్న ఆకాశమూ — దీనంతటి సమ్మోహన సౌందర్యం సమక్షాన లాలితమై మంత్రముగ్ధమై దివ్యసుందరంగా కనబడుతూన్న పడుచు చెంతను కూచుని — ''ఏమాత్రం యోచించి చూచుకున్నప్పటికీ కూడా, జీవితంలోని ఉన్నతాదర్శాలనూ, మానవులమైన మన ఉదాత్తతనూ మనం విస్మరించిన క్షణంలో మన ఆలోచనలూ మన చేష్టలూ తప్ప, ప్రపంచంలోని సర్వమూ నిజంగా ఎంత అందంగా వుందో కదా!'' అని గూరొవ్ తనలో తాను తలపోశాడు.

ఆలా వారిద్దరూ అక్కడ కూచుని వుండగా వారిని ఎవరో ఒక మనిషి — బహుశ చర్చి కావలిజవానే అయివుంటాడు — సమీపించి, వారికేసి చూసి, తన దారిని తాను వెళ్లిపోయాడు. దీనిలో సహితమూ గూఢమైనదీ సుందరమైనదీ ఏదో దాగివున్నట్టే అనిపించింది. ఫియొదోసియా నుండి బయలుదేరి రేవు దిశగా వస్తూన్న స్టీమరులో దీపాలు ఆరిపోయే వున్నప్పటికీ, స్టీమరు ఉషారాగంలో ఉజ్వలంగా వెలిగిపోతూంది.

"గడ్డి మొక్కల నిండా మంచు ఎలా పడిందో!" అంది అన్న సెర్గే యెవ్న, తన మాటలతో నిశ్శబ్దాన్ని పటాపంచలు చేస్తూ.

"అవును. ఇక మనం ఇంటికి వెళ్లే వేళైంది."

వాళ్లు తిరిగి వూళ్లోకి వెళ్లిపోయారు.

ఇది జరిగిన తరువాత, వారిద్దరూ ఇక ప్రతి రోజు మధ్యాహ్నమూ బీచిరోడ్డు మీద కలుసుకుని, రెండు పూటలూ కలిసే భోజనం చేస్తూ, కలిసే షికారు వెళ్లుతూ, సముద్రాన్ని చూసి ఆనందించుతూ, ఇద్దరూ కలిసే తిరుగుతూండేవారు. తనకు రాత్రిళ్లు నిద్రపట్టడం లేదనీ, గుండె దడగా వుందనీ ఆమె అతనితో చెప్పకునేది, వేసిన ప్రశ్నలనే మళ్లీమళ్లీ వేస్తూ, ఈక్షణంలో ఈర్ష్యానుమానాలతోనూ, ఉత్తరక్షణంలో తానంటే అతడికి గౌరవం పోయిందేమో అనే భయంతోనూ డోలాయమానంలో పడి కొట్టుకుపోతూండేది. అంతేకాదు, తరుచుగా చౌకులోగానీ, పార్కులో గానీ కనుచూపు మేరలో ఎవ్వరూ లేనప్పుడు, ఆమెనతడు తనదగ్గరకు తీసుకొని ఉద్రేకంతో ముద్దుపెట్టుకునేవాడు. చేయడానికి పని అంటూ ఏదీ లేక రోజుకు రోజూ బలిసిపోతూన్న బద్ధకమూ, ఈ పట్టపగటి ముద్దులూ, వీటికి తోడు ఒకరినొకరు రహస్యంగా ఓరచూపులతో చూసుకోవడమూ, ఆలా చూసుకుంటూ తామెక్కడ దొరికిపోతామో అనే భీతీ, ఈ ఎండ తాపమూ, సముద్రపు వాసనా, సోమరిపోతులై నీటుగా ముస్తాబై కడుపు నిండా మృష్టాన్నం భుజించిన ఈ జనం నాటకరంగం మీద తిరుగు తూన్నట్టు తమ ఎదుట విధివిరామం లేకుండా అవుపడుతూండడమూ, తనకిదంతా నూతన జీవం ప్రసాదించినట్టే అనిపించింది గూరొవ్‌కి. ఆమె సౌందర్యరాశి అనీ, ఒక్క చూపుతో వశీకరణం చేసుకుంటుందనీ అతడు

అన్న సెర్గేయెవ్‌నతో చెప్పి, పట్టపగ్గాలులేని తన ప్రణయాన్ని ఆమెకు తెలియజేస్తూ, లిప్తమాత్రమైనా ఆమెను వదలక నిరంతరమూ ఆమె చెంతనే వుండేవాడు. ఆమె మట్టుకామె ఎల్లప్పుడూ విచారంతో ఏదో ఆలోచించుతూ, అతనికి తనపై గౌరవం పోయిందనీ, తనపట్ల అతనికి రవంతైనా ప్రేమలేదనీ, తనొక పనికి మాలిన స్త్రీకిందే అతడు పరిగణించుతున్నాడుగాని, అంతకు మించి మరేమీ లేదనీ, అతని నోటనుండే ఆ మాటలు చెప్పించేందుకు ఆమె నిరంతరమూ ప్రయత్నిస్తూండేది. ఇంచుమించు ప్రతిరోజురాత్రీ వారు గుర్రపుబండిలో వూరి బయటకూ, ఒరియాంద గ్రామానికో, జలపాతానికో, మరే రమణీయ స్థలానికో షికారు వెళ్ళేవారు. ఇక ఈ వినోదయాత్రలన్నీ కూడా, వీటిలో ప్రతి దృశ్యమూ రాజస సౌందర్యాన్నీ నిత్యనూతన ప్రతిబింబాలతో వారిని ప్రభావితులను గావించుతూ విజయవంతంగా పరిణమించాయి.

ఆమె పెనిమిటి వస్తాడేమోనని వారు ఇన్నాళ్ళూ కూడా అనుకుంటూనే వున్నారు. కాని ఆమె పెనిమిటి ఆమెపేర వుత్తరం రాస్తూ, ఆ వుత్తరంలో తనకు కళ్ళు జబ్బు చేశాయనీ, అందుచేత సాధ్యమైనంత త్వరగా ఆమెను ఇంటికి వచ్చేయమనీ కోరాడు. ఉత్తరం అందిన వెంటనే అన్న సెర్గేయెవ్‌న తన తిరుగు ప్రయాణం కోసం ఆదరా బాదరా సన్నాహం చేసుకో మొదలుపెట్టింది.

‘‘నేను వెళ్ళిపోవడం మంచికే వచ్చింది’’ అందామె గూరొవ్‌తో. ‘‘విధికృతం అంటే ఇదే మరి!’’

ఆమె గుర్రపుబగ్గీ చేయించుకుని యాల్టానుండి బయలుదేరింది, ఆమెను రైలుస్టేషను వరకూ దిగబెట్టేందుకు అతడామెతో కలిసి బగ్గీలో



15—2

వెళ్ళాడు. రైలుస్టేషను చేరుకుందుకు ఇంచుమించు ఒక రోజంతా గుర్రపు బగ్గీలో ప్రయాణం చేయాల్సి వచ్చింది. ఎక్స్‌ప్రెస్ రైలుబండిలో కెక్కి, రైలు వెళ్ళిపోయేందుకు రెండవ గంట కొట్టిన తరువాత:

"ఇక కడపటి సారి మీా ముఖం చూడనివ్వండి... ఇదే ఆఖరి పర్యాయం, ఇక దీనితో సరి" అంది ఆమె.

ఆమె కంట తడిపెట్టలేదు, కాని మనిషి అతి దీనంగా వుండి, దవడ నరాలు మాటిమాటికీ అదురుతూ జబ్బుమనిషిలా కనబడింది.

"నా మనస్సులో ఎప్పుడూ మిమ్మల్నే తల్చుకుంటూంటాను... నా ఆలోచనలన్నీ మీామీదే వుం యి..." అందామె. "దేవుడు మిమ్ము ఆశీర్వదించుగాక! నన్నెప్పుడైనా తల్చుకుంటే మాత్రం నామీాద దయచూపండి, మళ్ళీ మనం కలుసుకోవడమంటూ వుండదు, ఎన్నటికీ వుండదు, అదే మంచిది కూడానూ, ఎందుచేతనంటే అసలు మనం కలుసుకోకుండానే వుండాల్సింది. ఇక సెలవు, నమస్కారం — దేవుడు మిమ్ము ఆశీర్వదించుగాక!"

రైలు గబాగబా స్టేషనులో నుండి వెళ్ళిపోయింది, మరొక క్షణంలో రైలు దీపాలే మటుమాయమైపోయాయి, ఈ మృదుమధుర హృదయాంధకారాన్ని, ఈ ఉన్మాదాన్ని సాధ్యమైనంత త్వరగా అంతమొందించేందుకు ఈ ప్రపంచంలో వున్న సర్వమూ కుట్రపన్నినట్టుగా — ఆరైలు శబ్దం సహితమూ లిప్తమాత్రంలో మణిగిపోయింది. ఒంటరిగా ఆ ప్లాట్ఫారంపై నిలబడి, అంధకారంలోకి తేరిచూస్తూ, ఇలకోళ్ళ కీచుచప్పుడూ, టెలిగ్రాఫుతీగల ఝూంకారమూ వింటూండేసరికి తాను ఆ క్షణమే నిద్రనుండి మేల్కొన్నట్టు అనిపించింది గూరొవ్‌కి. తన జీవితంలో సంభవించిన సహస్ర సాహసిక ఘటనలలలోనూ ఇది మరోకటి అనీ, ఇది కూడా పూర్తి అయి

పోయిందనీ, కేవలం ఒక్క స్మృతి మాత్రం తప్ప మరే విధమైన జాడగానీ నీడగానీ తన జీవితపథంపై నిడచిపెట్టదనీ... గూరొవ్ అనుకున్నాడు. అతని మనస్సు ద్రవించి, విచారం కలిగి, స్వల్పంగా పశ్చాత్తాపం అనుభవించాడు కూడానూ. ఇంతా చేసి, ఇకమీదట ఎన్నడూ తనకంట పడబోని ఈ ముద్దరాలు తనతో వున్న నాలుగు రోజులూ నిజంగా ఆనందం చవిచూచిందా అంటే ఆదీ లేదు కూడా. ఆమెతో తాను స్నేహంగానూ, ఆత్మీయంగానూ వున్నాడు, అయినా ఆమెపట్ల తన ప్రవర్తన అంతటిలోనూ, తన గొంతు వాడుపులలోనూ, అంతెందుకు — తన లాలింపులలో సహా, అదొక మోస్తరు పరిహాసపు ధోరణి ఒకటి, అందులోనూ, ఆమెకంటె రమారమి రెండింతలు వయస్సు మళ్లిన మగరాజు, అదృష్టవంతుడైన మగరాజు ప్రదర్శించే తిరస్కార సహితమైన ఆప్యాయత ఒకటి, అంతర్వాహినిగా ప్రవహించింది. అతడు సహృదయుడనీ, అద్భుతమైన వ్యక్తి అనీ, ఉదాత్త మనస్కుడనీ పదేపదే అంటూ ఉండేది. తన నిజరూపం కంటె కేవలం భిన్న రూపంలో తాను ఆమెకి అగపడ్డాడన్న సంగతి ప్రత్యక్షంగా కనబడుతూనే వుంది — అంటే దాని అర్థం తానామెను అప్రయత్నంగా మోసపుచ్చాడన్నమాటే...

ఈ రైలు స్టేషను వాతావరణం అప్పుడే శరత్తును రుచిచూపిస్తోందా అన్నట్టు అనిపిస్తోంది; సాయంత్రం చిరుచలి మొదలైంది.

''నేనూ ఇక ఉత్తరాదికి వెళ్లాల్సిందే!'' అనుకున్నాడు గూరొవ్ ప్లాట్ఫారం నుండి వెళ్లిపోతూ.—''అవును, ఏనాడో వెళ్లిపోయుండాల్సింది!''

—

## 3

అతడు మాస్కో చేరేసరికి, చలికాలం అప్పుడే మొదలైంది, ఇళ్లల్లో పొయ్యిగూళ్లు రాజేయడం ప్రారంభించారు, పిల్లలు పొద్దున్న లేచి బడికి వెళ్లేముందు టీ పుచ్చుకొనే వేళకి ఇంకా చీకటిగానే వుండడంచేత, నర్సు కొద్దిసేపటి వరకూ దీపం వెలిగించాల్సి వచ్చేది. చలి మొదలుపెట్టింది. తొలిసారి మంచు పడడం ప్రారంభించి, మొదటిమాటు స్లెయ్ షికారు బయలుదేరే టప్పుడు, తెల్లని నేల, తెల్లని ఇంటికప్పులు చూడడానికి ఎంతో ఇంపుగా వుంటుంది; శ్వాస ఎంతో సునాయాసంగానూ ధారాళంగానూ తేలికగానూ వుంటుంది; ఏనాడో వెళ్లిపోయిన యవ్వనపు రోజులు మళ్లీ జ్ఞాపకం వస్తాయి. మంచు పూతతో నిండిన ముసలి లిండెన్‌చెట్లూ బర్చిచెట్లూ ఎంతో ఆప్యా యతను ప్రదర్శించుతూన్నట్టు అవుపడతాయి, తాళవృక్షాలకంటెనూ సైప్రెసుచెట్లకంటెనూ మానవ హృదయానికెంతో సన్నిహితంగా వుం టాయి, వాటి శాఖలకింద వున్నంతసేపూ పర్వతాల, సముద్రాల స్మృతులు మనలనిక పీడించక మనకు దూరంగా తొలగిపోతాయి.

గూరొవ్‌ది పుట్టుకనుండీ మాస్కో నివాసమే, కాగా రమణీయమైన ఒక చలికాలం రోజున అతడు మాస్కోకు తిరిగివచ్చేశాడు. ఇక తన ఫర్ అస్తరు ఓవర్‌కోటు వేసుకుని, దళసరి గ్లొవ్స్ తొడుక్కొని, పెత్రోవ్‌క వీధిలో షికారు బయలుదేరిన వెంటనే, శనివారం సాయంకాలం చర్చిగంటల ఘంటారావం వినిన వెంటనే తన ఇటీవలి ప్రయాణమూ, తాను దర్శించిన స్థలాలూ అతనిపై వాటికుండిన మహిమను అవి పూర్తిగా కోల్పోయాయి. క్రమేణా అతడు మాస్కో జీవితంలో ఎంతగా నిమగ్నుడై

పోయాడంటే, సూత్రప్రాయంగా మాస్కో వార్తాపత్రికలను తానెన్నడూ చదవనే చదవనని నలుగురిలోనూ ఢంకా బాదదెబ్బకొట్టిన తానే, వార్తా పత్రికల కోసం వాచిపోయినట్టు, రోజుకి మూడు వార్తాపత్రికలు చదివే వాడు. ప్రఖ్యాతి వడసిన న్యాయవాదులూ నటులూ తన యింటికి వస్తూ పోతూ వుంటారనీ, తాను మెడికల్ క్లబ్బులో తన ఉజ్జీగా ఒక ప్రొఫెసరు గారితో చీట్లపేక ఆడాననీ ఎంతో గర్వంతో మిడిసిపోతూ, మళ్లీ యథా ప్రకారంగా రెస్టారెంటులూ క్లబ్బులూ విందులూ ఉత్సవాలూ — ఈ సుడిగుడంలో మళ్లీ ఎప్పట్లా పడ్డాడు. ఇక కడుపు నిండా తినగల్గు తున్నాడు; తిన్న తిండి వంటబట్టుతూంది, మనసు కుదుటబడింది.

నెలరోజులు తిరిగే లోపునే ఆన్న సెర్గేయెవ్‌న అంటే ఏదో ఒక లీలా మాత్రపు ఛాయగానే తన స్మృతిలో నిల్చి వుండబోతుందనీ, అటుపైన ఈమెతో పరిచయం ఏర్పడకముందు కడమవారి లాగానే ఈమెతో కూడా ఆశలను పురిగొల్పే ఈమె మందహాసం అప్పటప్పట మాత్రమే కల లలో కనబడుతూంటుందనీ అతడు నమ్మాడు. ఆ నెల్లాళ్లూ గడచిపోయాయి, శీతకాలం వేడుకలు మంచి ఊపుతో సాగుతున్నాయి. అయినప్పటికీ తాను నిన్నగాక మొన్న మాత్రమే ఆన్న సెర్గేయెవ్‌నను వదలి వచ్చినట్టూ, ఇది వరకటి సంగతులన్నీ తన మనస్సులో అతి స్పష్టంగా గుర్తుకు వస్తున్నాయి. అంతేకాదు ఆ స్మృతులన్నీ అంతకంతకు మరింతగా తనను బల వంతపెట్ట నారంభించాయి. సాయంకాలం పూట తాను చదువుకునే గదిలో కూచుని వుండగా, తమ బడిపాఠాలను చదువుకుంటూన్న పిల్లల గొంతు కలు ఆ సాయంసమయపు ప్రశాంతతను చీల్చి చెండాడుతూ తన చెవిని

పడినప్పుడూ, రెస్టారెంటులో కూచుని వుండగా ఏ గానమో ఏ పాటల పెట్టె ధ్వనో తనకు వినబడినప్పుడూ, పొయ్యిగొట్టంలో నుండి గాలి మ్రో మని కూత పెట్టినప్పుడూ — రేవు వారధిపైన ఉషారాగము, పొగమంచులో దాగి వున్న పర్వతాలు, ఫియొదోసియా నుండి వస్తూన్న స్టీమరు, చుంబనలు — ఇదంతా కళ్లకు కట్టినట్టు మళ్లీ అతని యెదుట ప్రత్యక్షమయేది. ఈ స్మృతులను తల్చుకుని నవ్వుకుంటూ, ఆలా ఎంతోసేపు తనా గదిలో ఎగా దిగా పచారు చేస్తూండేవాడు; క్రమేణా ఆ స్మృతి స్వప్నంగా మారిపోయి, తన ఊహాప్రపంచంలో జరిగినదంతా ఇక ముందు జరుగబోయే భవిష్యత్తుతో మిళితమైపోయేది. అతనికి అన్న సెర్గేయెవ్న కలలో కనబడడమేకాదు, ఆమె నిత్యమూ అతని తోడునీడలా అతనితో కూడానే వుంటూ, అతడు ఎక్కడకు వెళ్లితే అక్కడల్లా అతనికి తోడుగా వుండేది. అతడు కళ్లు మూసుకున్నప్పుడు, ఆమె అసలు యథార్థంగా వున్నదానికంటె మరింత లావణ్యంగా, మరింత యవ్వనవతిగా, మరింత కోమలంగా అచ్చంగా స్థూలదేహంతోనే తన కన్నంట ప్రత్యక్షమయేది. వెనుకటి సంగతుల నన్నింటినీ తాను గుర్తుకు తెచ్చుకున్నప్పుడు, యాల్టలో తాను సహితమూ వెనుకంటెనూ యథార్థంగా ఉత్తమునిగా వుండినట్టే అగపడేది. సాయంకాలం తన పుస్తకాల అలమారాల మధ్యనుండి, పొయ్యిగూటిలో నుండి, ఆ మూలనుండి, ఈ మూలనుండి, తనకేసి చూస్తూన్నట్టే అగపడేది ఆమె; ఆమె శ్వాస, ఆమె ధరించిన పావడ మధుర మర్మరధ్వనులు వినబడేవి. తాను వీధిలో వెళ్తూన్నప్పుడు ఆమెను పోలిన వారు మరెవరైనా కనబడతారేమోనని అతడు తనకు ఎదురైన స్త్రీలనందరినీ తన చూపులతో వెంబడించేవాడు...

తన స్మృతులను మరెవరితోనైనా చెప్పుకొని పాలుపంచుకుందామనే భరింపరాని తీవ్ర ఆకాంక్ష అతనిలో చెలరేగింది. కాని తన ప్రేమను గురించి

తన ఇంట్లో చెప్పుకొన లేకపోయాడాయె, ఇక బయట తాను మనసిచ్చి మాటాడు కుందుకు ఎవరున్నారు గనుక? తన ఇంట్లో అద్దెలకున్న వాళ్లతో వీల్లే దాయె, బ్యాంకులో తన సహోద్యోగులతో ససేమిరా అసలు పొసగదాయెరి. ఇంతకీ చెప్పడానికి ఏముంది గనక? తాను అనుభవించినది ప్రేమా? అన్న సెర్గేయెవ్నతో తనకుండిన సంబంధంలో ఏదైనా అత్యంత దివ్యసుందర మైనదీ, కవితాసమన్వితమైనదీ, ఏదైనా జ్ఞానభోదకమైనదీ, అదీకాకపోతే పోనీ వినోదకరమైనదీ వుంది గనుకనా? ప్రేమ గురించీ, స్త్రీల గురించీ ఏదో ఆకుకు అందనట్టే పోకకు పొందనట్టే అస్పష్టపు సాధారణీకరణాలను ఉచ్చరించడంతో మాత్రమే అతడు సంతృప్తి పడాల్సి వచ్చింది; వాటిని వినినవారెవ్వరూ కూడా తన మనస్సులో వున్నదానిని గ్రహించలేకపోయారు, పోతే తన భార్య మాత్రమే నల్లని కనుబొమలు ముడిపెడుతూ:

''స్త్రీలను వలలో వేసుకునే మిండగాడి పాత్రకు నువ్వు పిసరంతేనా పనికిరావు, దిమీత్రి!'' అంది.

ఒకనాడు సాయంకాలం, తన పేకాట మిత్రుడు ఒకతనితో — అత డొక గవర్నమెంటు ఉద్యోగి — కలిసి మెడికల్ క్లబ్బునుండి వచ్చేస్తూండగా, తనకిక వుండబట్టక:

''యాల్టాలో నాకు ఎటువంటి వయారితో పరిచయం కలిగిందో మీకు తెలుస్తేకద!'' అనేశాడు గూరొవ్.

ఆ ఉద్యోగి తన స్లెయ్‌లో ఎక్కి, బండి కదిలే ముందు కేకేశాడు:

''దీమ్రిత్రి దీమ్రిత్రిచ్!''

''ఏం?''

''మీరన్నది నిజమే, నిజంగానే చేప ఒక్కపిసరు కణరుగా వుంది సుమండీ'' అన్నాడు.

—

మరేకారణం చేతనో మామూలుగా సర్వసాధారణమైన ఈ మాటలు గూరొవ్‌కి వాళ్లు మండిపోయినంతటి కోపం తెప్పించాయి. ఎంతో మొరటుగా తనను అవమానపరచినట్టు ధ్వనించాయి. ఏమి నాజూకైన మర్యాద, ఏమి మనుషులు! ఎంత వ్యర్థంగా వెళ్లబుచ్చిన సాయంకాలాలు, ఎంత విసుగుగా నిరర్థకంగా గడపిన రోజులు! వెఱ్ఱి ఆవేశంతో చీట్లపేకాట, తిండిపోతుతనం, నిరంతరమూ ఆ ఒక్క విషయం గురించే వాగుడు. మనకున్న ఆయుర్దాయంలోనూ శక్తి సామర్థ్యాల్లోనూ అధికభాగం, ఎవరకూ రవంతైనా ఉపకరించని వ్యాపారాల్లోనూ, ఏదో ఒకే పని గురించి చర్విత చరణంగా చర్చించడంలోనూ వృథాగా వినియోగమవుతూంది; పోనీ ఇంతకీ దీని ఫలితం ఏమేనా వుందా అంటే — కేవలం ఒక మరిగుజ్జ బతుకూ, ఇహంతో ముడిపెట్టుకు పోయిన జన్మా, వీటికి తోడు, ఎందుకూ కొరగాని తుచ్ఛమైన నిత్యకృత్య పంపర తప్ప మిగిలిందేమీ లేదు; పోనీ దీనిలోనుండి తప్పించుకుని బయటపడదామా అంటే ఎక్కడకు పోవడానికీ లేదుకదా, ఏ పిచ్చాసుపత్రిలోనో, ఏ ఖైదీల స్థావరంలోనో వుంటే తీరిపోతుం దనిపిస్తుంది.

ఆ రాత్రంతా గూరొవ్‌కి కన్ను మూతపడక, కలవరిస్తూనే వున్నాడు. ఆ మరునాడంతా తలపోటుతో బాధపడుతూనే పని చేసుకున్నాడు. తరువాత రెండు రాత్రులూ కూడా నిద్రపట్టక, మంచంమీద కూచుని ఆలోచించుతూనో గదిలో ఇటూ అటూ పచారుచేస్తూనో గడిపాడు. తన పిల్లలంటే అసహ్యం కలిగింది, బ్యాంకు అంటే అసహ్యం వేసింది, ఎక్కడకు వెళ్లడానికీ, ఎవ్వరితో మాట్లాడడానికీ రవంతైనా బుద్ధి పుట్టిందికాదు.

క్రిస్టమస్ సెలవలు రాగానే, తానొక యువకుడిని సిఫారసు చేయడానికని పీటర్స్‌బర్గ్ వెళ్లవలసి వుందని తన భార్యతో చెప్పి, తన సామాను

సర్దుకుని, స— నగరానికి బయల్దేరాడు. ఎందుకని? ఎందుకనో తనకే తెలియదు. అన్న సెర్గేయెవ్‌నను చూడడం, ఆమెతో మాట్లాడడం, వీలైతే సాంకేతిక స్థలం ఒకటి ఏర్పాటు చెసుకోవడం — ఇదే తనకు కావలసినదాల్లా. ఉదయాన స— నగరం చేరుకున్నాడు. హోటేలులో వున్న గదులలోకల్లా మంచి గది తీసుకున్నాడు. గదిలో తివాచీకి బూడిదెరంగు మిలిటరీ అంచు, బల్లపైనున్న సిరాబుడ్డి అంతా ధూళిమయం, సిరాబుడ్డికి అలంకారంగా వున్న తలకాయ ఎగిరి పోయిన గుర్రపుం తు తన టోపీని తీసి చేతితో పట్టుకున్నాడు. తాను తెలుసుకో దలచుకున్న భోగట్టా అంతా హోటేలు పోర్టరువల్ల అతడికి లభించింది: ఫన్ డిడెరిట్స్ స్తారొ-గొంచార్‌నయ వీధిలో సొంత ఇంట్లో వుంటున్నాడనీ, ఇల్లు హోటేలుకు దగ్గరలోనే వుందనీ, అతడు మంచి దర్జా పురుషుడనీ, భోగభాగ్యాలతో తులతూగుతున్నాడనీ, సొంత గుర్రాలు గుర్రపు బళ్ళా అతనికి వున్నాయనీ, వూరంతా అతనిని ఎరుగుదురనీ పోర్టరు చెప్పాడు. అతని పేరు "ద్రిదెరిత్స్" అని ఉచ్చరించాడు ఆ పోర్టరు.

గూరొవ్ స్తారొ-గొంచార్‌నయ వీధికేసి నింపాదిగా నడచుకుంటూ వెళ్ళి, ఆ ఇల్లు ఎక్కడుందో చూసుకున్నాడు. ఇంటికి ముందు చెక్కతో కట్టి బూడిదెరంగు వేసిన పెద్ద కంచెగోడ వుంది. కంచెస్తంభాల పైన సూదిగా ములుకుల్లాంటి ఇనుప మేకులు దిగ్గొట్టున్నాయి.

"ఆ కంచె చూస్తేనే చాలు, ఇంట్లో నుండి ఎప్పుడు పరుగెత్తి పారిపోదామా అనిపిస్తుంది!" అనుకున్నాడు గూరొవ్, ఆ ఇంటి కిటికీలకేసీ, ఆ కంచెకేసీ చూస్తూనూ.

ఆనాడు పండుగపూట సెలవు అవడంచేత ఆమె పెనిమిటి మూడు

వంతులు ఇంట్లోనే వుంటాడని గూరొవ్ ఊహించుకున్నాడు. ఏది ఏలా వున్నప్పటికీ, ఆ ఇంటికి వెళ్లి ఆమెను చూసి, ఆమెను గందరగోళ పరచడం కేవలం తెలివితక్కువే అవుతుందని గూరొవ్ నిశ్చయించుకున్నాడు. ఇక పోతే, చీటి రాసి ఆమెకు పంపితే, తీరా అది ఆమె పెనిమిటి చేతిలో పడి నట్టాయెనా, కొంపలంటు కుంటాయి. అందుచేత, ఆమెను చూడడానికి అదను కోసం కాచుకుని వుండడమే ఉత్తమం. ఆలా యోచించుకుని, కంచెకు దగ్గరగానే తచ్చాడుతూ వీధిలో ఇటూ అటూ పచారు చేయడం మొదలుపెట్టాడు. ముష్టివాడొకడు ఆ ఇంటి గేటులోకి వెళ్లాడో లేదో, వాడిమీద కుక్కలు విరుచుకు పడ్డాయి. మరొక గంట తరువాత ఆ యింట్లో నుండి పియానో సంగీతం లీలగా అతని చెవిని పడింది. ఆన్న సెర్గేయెవ్న పియానో వాయించుతూంది కదా అనుకున్నాడు గూరొవ్. ఇంతట్లో తటాలున వీధిగుమ్మం తెరచుకుని సుపరిచితమైన తెల్ల పామిరేనియన్ కుక్కపిల్లను వెంటబెట్టుకుని ముసలామె ఒకర్తె బయటకు వచ్చింది. కుక్కపిల్లని పిలవాలనుకున్నాడు గూరొవ్, కాని అతని గుండెలు దడదడమని కొట్టుకోవడంతో, ఆ కలవరపాటులో అతనికి కుక్కపిల్లపేరు ఒకంతట జ్ఞాపకం వచ్చిందికాదు.

ఆ బూడిదెరంగు కంచెను అంతకు మరింతగా ద్వేషించుతూ, తనను ఆన్న సెర్గేయెవ్న ఏనాడో మరచిపోయుంటుందనీ, ఈపాటికి మరెవరో ఇంకొక పరపురుషునిమీద ఆమె మనసు మరలుకొని వుండడం తథ్యమనీ — అవును మరి, పొద్దుటినుండి సాయంత్రం వరకూ ఆ పాపిష్టి కంచెను చూస్తూండ వలసిన యువతికి అది సహజమే కదా! అనీ, ఆగ్రహావేశుడై తనలో తాను తలపోస్తూ ఆలా నడచుకుంటూ వెళ్లిపోయాడు. హొటేలు చేరుకుని,

ఏమి చేయడానికీ తోచక, కొంతసేపు తన గదిలో సోఫాలో కూచుని, ఇక భోజనం పురమాయించాడు. భోజనం చేసుకుని, చాలా సేపు నిద్రపోయాడు.

"ఈ తెలివిమాలిన తనమూ, ఈ గాభరా — ఏమిటిదంతా?" అనుకున్నాడు. నిద్రనుండి లేచి, నల్లబడిపోయిన కిటికీ అద్దాలకేసి చూస్తూనూ. అప్పటికప్పుడే చీకటి పడిపోయింది. "రాత్రి నిద్ర ఇప్పుడే తీసేశానే, ఇక రాత్రి ఎలా గడపడం?" అని ఆలోచించుకున్నాడు.

లేచి, ఆస్పత్రి కంబళీని జ్ఞాపకం తెప్పించే ఆ చవకరకం బూడిదె రంగు బూర్నీసు కప్పుకుని, పక్కమీదనే కూచుని, ఆ చికాకులో తన్ను తానే దెప్పి పొడుచుకోవడం మొదలుపెట్టాడు.

"కుక్కపిల్లను వెంటబెట్టుకున్న మహిళ... సాహసికయాత్ర... వృధా ప్రయాసం!"

ఆ రోజు ఉదయం స్టేషనులో దిగినప్పుడు, తాటికాయలంత అక్షరాలతో పెద్ద పోస్టరు ఒకటి చూశాడు — స్థానిక నాటకశాలలో ఆ రాత్రి "గెయ్‌షా" నాటకం తొలి ఆట అని. ఆసంగతి ఇప్పుడతనికి గుర్తుకొచ్చి, వెంటనే లేచి, నాటకశాలకు బయలుదేరాడు.

"నాటకాల తొలి ఆటలకు ఆమె తప్పకుండా వెళ్తుంది" అని అనుకున్నాడు గూరొవ్.

నాటకశాల జనంతో నిండిపోయుంది. రాజధాన్యేతర నగరంలోని నాటకశాల ఎలా వుండాలో అచ్చంగా అలాగే వుందీ నాటకశాల: దీపపు లష్టర్ల చుట్టూ సన్నని పొగమంచు అలముకొని వుంది; గ్యాలరీలో కూచున్న వారు రొద చేస్తున్నారు. ఆవూరి రంగేలా పురుషులందరూ స్టాల్సులో మొదటి వరుస ఆక్రమించుకుని, వీపువెనుక చేతులు పెట్టుకుని,

ప్రేక్షకజనంకేసి చూస్తూ నిలబడ్డారు. గవర్నరుగారి బాక్సులోని ముందరి కుర్చీలో, మెడలో ఫర్ వేష్టనం వేసుకుని గవర్నరుగారి అమ్మాయి కూచుంది, గవర్నరుగారు చేతులు మాత్రమే పైకిపెట్టుకుని మొగమాటం ప్రదర్శిం చుతూ బాక్సుకున్న తెరమడతల మరుగున కూచున్నారు. తెర కదిలింది. ఆర్కెస్ట్రావారు తమ వాద్యాలకు శ్రుతి వేసుకుంటూ ఎంతో ఆలస్యం చేశారు. ప్రేక్షకులు నాటకశాలలోకి ప్రవేశించి తమ స్థానాలను ఆక్రమించు కుంటూండగా వారినందరినీ గూరొవ్ తదేకధ్యాన్నంతో పరీక్షించాడు.

అన్న సెర్గేయెవ్న కూడా నాటకశాలలోకి వచ్చింది. స్టాల్సు మూడో వరుసలో కూచుందామె; ఇక గూరొవ్ చూపులు ఆమెపై వాలగానే, తన గుండెలు ఆగిపోయాయేమో అని అతనికి తోచి, ప్రపంచ మంతటిలోను, ఆమెకంటె పరమ ఆప్తమూ, ప్రియతమమూ, తన ఆనందసౌభాగ్యాలకు అత్యంత అపరిత్యాజ్యమూ అయిన వ్యక్తి వేరొకటి లేదని తన మనస్సులో మెరపు మెరసినట్టుగా అతనికి తేటతెల్లమైపోయింది. నాగరికతలేని ఈ చిన్న బస్తీ జనం మధ్య వెయ్యి కాకులలో ఒక కాకిగా, ఏవిధంగా ఎన్నిక చేయ డానికీ వీలులేకుండా, పిచ్చి చేతిసులోచనాలకట్టు ఒకటి పట్టుకొన్న ఈ చిన్న పడుచే, ఈమే ఇప్పుడు తన జీవితాన్నంతనూ ఆవరించేసింది, తన దుఃఖమూ తన సుఖమూ, తానిప్పుడు వాంఛించిన సర్వసౌభాగ్యమూ ఈమే; కాగా పేలవంగా యీసురోమని వాయిస్తూన్న వయొలినిస్టులతో కూడిన అక్షుద్రమైన ఆర్కెస్ట్రానుండి ధ్వనులు లాలిపాటలా తనను జోకొట్టి నట్టు అనిపించి, ఆమె ఎంత సౌందర్యవతో కదా అని తల్చుకుని... తల్చు కుని... కలలు కంటూ కూచున్నాడు...

పొడగరీ, గుండ్రని బుజాలూ, చిన్న బుగ్గమీసాలూ వున్న యువకుడు

అన్న సెర్గేయెవ్‌నతో కూడా వచ్చాడు. అతడు వచ్చి ఆమె పక్కను కూచు న్నాడు. అతడు అడుగడుగునా ఎవరినో ఒకరిని చూస్తూ పలుకరిస్తున్నా డేమో అన్నట్టుగా వంగి వంగి నడిచాడు. యాల్టాలో ఒకనాడు ఎంతో విషా దగ్రస్తుయై, ఆ ఆవేశంలో "జోహుకుంగాడు" అని ఆమె పేరుపెట్టి వర్ణిం చిన పెనిమిటే అయుంటాడు కదా అనుకున్నాడు గూరొవ్. ఆ బక్కపలు చని శరీరమూ, ఆ బుగ్గమీసమూ, నడినెత్తిన ఆ గోష్పాదమంత బట్ట తల — అతగాడి విగ్రహం నుండి "జోహుకుంగాడికి" స్వాభావికమైన బాని సమనస్తత్వం నిజంగా ఒలుకుతూన్నట్టే కనబడుతూంది. ఇక అతగాడు తేనెలొలుకుతూన్నట్టు మందహాసం చేస్తూంటే, అతగాడు తనకోటు కాలరు బొత్తాంకన్నంలో తగిలించుకున్నట్టి తళతళ మెరుస్తూన్న ఏ విజ్ఞాన సమితి బాడ్జియో, అచ్చంగా తైనాతీ నౌకరు యూనిఫారానికున్న నంబరు బిళ్లలాగానే కానవచ్చింది కూడా.

మొదటి విరామసమయంలో భర్త పొగతాగేందుకని బయటికి వెళ్లగా, ఆమె ఒక్కర్తే తన కుర్చీలో కూచుని వుంది. గూరొవ్ కూడా స్టాల్సులో కుర్చీకే టిక్కెట్టు తీసుకొని వుండడంచేత, అతడు ఆమెను సమీపించి, ఉద్వేగంతో వణకిపోతున్న గొంతుతో, తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో: "కుశలమా?" అన్నాడు.

ఆమె తలెత్తి అతడికేసి చూచింది; చూడగానే ఆమె తెల్లబోయింది; తన కళ్లనే తాను నమ్మలేక, ముఖం ఝుమూలుమన్నప్పటికీ తమాయించు కుందుకు ప్రయత్నించుతూందేమో అన్నట్టుగా తన చేతనున్న విసనకర్రనూ చేతిసులోచనాలకట్టునూ గట్టిగా అదిమి పట్టుకుని, దిగులుపడిపోయి, మళ్లీ అతడికేసి చూచింది. వారిద్దరూ మాటా మంతీ లేకుండా అలాగే

వుండిపోయారు. ఆమె అక్కడ కూచుంది, ఆమె కంగారు చూచి తాను భంగపాటుచెంది, ఆమె పక్కను కూచుందుకు ధైర్యం చాలక ఆమె పక్కనే నిల్చుండిపోయాడు. వయొలీన్లకూ ఫ్లూట్లకూ శ్రుతి వేస్తూండగా అవి కీచుకీచుమని ధ్వనిస్తున్నాయి. చుట్టూ వున్న బాక్సుల్లోని వారందరూ తమనే పరికించి చూస్తూన్నట్టుగా, వాతావరణంలో ఉద్రిక్తతానుభూతి నెలకొంది. చివరికి ఏలాగైతేనేమి, ఆమె కుర్చీలోనుండి లేచి, నిష్క్రమణ ద్వారం ఒకదాని దిశగా గబగబా నడచింది. ఆమెవెంటే వెళ్లాడు అతడు. ఒక లక్ష్యమూ ఒక గమ్యమూ లేకుండా ఇద్దరూ ఆలా వసారాలు చుట్టబెడుతూ, ఎక్కిన మేడమెట్లు ఎక్కుతూ దిగిన మేడమెట్లు దిగుతూ ఆలా తిరుగుతున్నారు; న్యాయశాఖ ఉద్యోగులూ, ఉన్నత పాఠశాల ఉపాధ్యాయులూ, పౌరశాఖ అధికారులు — ఎవరి యూనిఫారాలలోవారు — అందరూ బాడ్జీలు పెట్టుకుని — మెరుపు మెరసినట్టుగా వారిపక్కనుండి వెళ్లిపోతున్నారు; చర్రుమని విసురుగా తగిలింది గాలి; ఆ గాలితో సిగరెట్టు పీకల వాసనకి కూడా అక్కడకు ప్రవేశం కలిగింది. గూరొవ్ గుండెలు దబాదబా అతి ఉధృతంగా కొట్టుకొంటూండగా అతడీవిధంగా అనుకున్నాడు:

"ఈ జనమూ, ఈ ఆర్కెస్ట్రా, ఇదంతా ఇక్కడ ఎందుకు ప్రత్యక్షమైంది చెప్మా?.."

ఈలా అనుకున్నాడో లేనేలేదో, ఉత్తరక్షణంలో — ఆనాడు సాయంకాలం స్టేషనులో ఆమెకు వీడ్కోలు ఇచ్చిన తరువాత, ఇక దీనితో అంతా అయిపోయిందనీ తాము మళ్లీ కలుసుకోవడమంటూ ఇక ఎన్నటికీ వుండదనీ తాను అనుకున్న సంగతంతా అతడికి తటాలున జ్ఞాపకం వచ్చింది.

అయినా ఇది సర్వమూ సంపూర్ణం కావడానికి ఇంకా ఎంతకాలం గడవాలో అనిపించింది ఇప్పుడతనికి!

ఇరుకుగా చీకటిగా వున్న మేడమెట్లు కనబడితే, ఆ మెట్లమీద ఆగిందామె; ''పై అంతస్తు డ్రెస్ సర్కిల్‌కు దోవ'' అని రాసి వుంది ఆ మెట్ల దగ్గర.

''మిమ్మల్ని చూసి ఏమి హడలిపోయాను!'' అందామె సగం ప్రాణాలు ఎగిరిపోయి, ఇంకా ముఖం ఆలాగే తెల్లబోయి, భారంగా శ్వాస పీల్చుతూనూ. ''అబ్బ, మిమ్మల్ని చూసి ఏమి హడలిపోయాను, బాబూ! ఎందుకొచ్చారండీ మీరు? అయ్యో, అయ్యో, ఎందుకొచ్చారండీ!''

''అన్న! నన్ను అర్థం చేసుకోవాలి నువ్వు, అన్న!.. నిన్ను బతిమాలు కుంటున్నాను, కాస్త అర్థంచేసుకో నన్ను...'' అన్నాడతడు మెల్లగా తొందర తొందరగా.

అతడికేసి చూచిందామె. ఆ చూపులో భయం, వేడుకోలు, ప్రణయం, అన్నీ మిళితమై వున్నాయి. తరువాత, అతని రూపురేఖలనూ, ముఖం తీరునూ తన మనోవీధిలో చిరాంకితమై నిల్చిపోవాలన్నట్టుగా అతనికేసి రెప్పవాల్చకుండా నిదానంగా చూచింది.

''నేనెంతో వ్యధ పడిపోతున్నాను'' అంటూ అతడి మాటలు లెక్క చేయకుండానే, తాను చెప్పనారంభించింది. ''ఇన్నాళ్లూ మీగురించే ఆలో చిస్తున్నాను, మరొక ఆలోచనే ఆలోచించుకో లేకపోతున్నాను. మీగురించి తల్చుకుంటూనే ఇన్నాళ్లూ బతికాను. మిమ్మల్ని మరచిపోదామనే ఎంతో ప్రయత్నించాను — ఎందుకొచ్చారండీ మీరు మళ్లీనీ? అయ్యో, అయ్యో, ఎందుకొచ్చారండీ మీరు?''

ఆ మెట్లపైన వసారా ద్వారంలో బడి కుర్రవాళ్లిద్దరు పొగతాగుతూ, కిందకు చూస్తూ నిలబడ్డారు; కాని గూరొవ్ వాళ్లను చూసినప్పటికీ, చూస్తే చూడనీ అని వాళ్ల గురించి ఏమీ పట్టించుకొనక, అన్న సెర్గేయెవ్నను తన దగ్గరకు లాగుకొని, ఆమె తలను తన చేతులలో తీసుకొని, ఆమె ముఖాన్నీ పెదవులనూ చేతులనూ ముద్దుపెట్టుకోవడం మొదలు పెట్టాడు.

''అయ్యో, అయ్యో! ఏమిటిదంతా? ఏమిటిదంతా?'' అందామె భయంతో వణకిపోతూ, అతని చేతుల్లోనుండి గుంజుకుంటూ. ''మనిద్దరికీ మతిపోయింది. మీరిప్పుడే, ఈ రాత్రే ఇక్కడనుండి వెళ్లిపోవాలి, ఈ క్షణమే... మీ పుణ్యముండేను, మిమ్మల్ని బతిమాలుకుంటాను, మీ కాళ్లు పట్టుకుంటాను... ఎవరో ఇలా వస్తున్నారు.''

ఎవరో మేడమెట్లు ఎక్కుతున్నారు.

''మీరిక్కడనుండి వెంటనే వెళ్లిపోవాలి'' అంటూ అన్న సెర్గేయెవ్న గొంతు దించేసి చెప్పుకుపోయింది. ''నా మాటలు వింటున్నారా మీరు, దీమ్త్రి దీమ్త్రిచ్? నేనే మీదగ్గరకు వస్తాను, మాస్కోకి. నేను సంతోషమంటే ఏమిటో ఎరగను, ఆనందమంటే ఏమిటో ఎరగను. ఇప్పుడు నేనెంతో వ్యాకులపడిపోయి కుమిలిపోతున్నాను. అయ్యో! సంతోషమూ ఆనందమూ మరీ జన్మలో నాకుండదు, ఎన్నటికీ వుండదు – ఎన్నటికీ! నా కింకా బాధ కల్గించకండి! మాస్కోలో మీదగ్గరకే వస్తానని ఒట్టు పెట్టుకుంటున్నాను! వేళైంది, మనమిక విడిపోవాలి! ప్రియతమా! కరుణామయా! ప్రాణప్రియా! మనమిక విడిపోవాలి!''

ఆమె అతని చేయి గట్టిగా ఒత్తి, గబాగబా మెట్లు దిగిపోయింది.

మెట్లు దిగుతూన్నంత సేపూ ఆమె వెనుకకు తిరిగి అతనికేసి చూస్తూనే వుంది. అమె యథార్థంగా మనస్సులో బాధపడిపోతూన్నట్టు ఆమె కళ్లే చెబుతూన్నాయి. తానున్న చోటనే గూరొవ్ కాస్సేపలా వింటూ, నిలబడి పోయి, సద్దు అంతా మణగిపోయిన తరువాత, మెట్లు దిగిపోయి, తన ఓవర్ కోటు తెచ్చుకుని, నాటకశాలనుండి వెళ్లిపోయాడు.

## 4

ఇకపోతే, అతనిని కలుసుకుందుకు ఆన్న సెర్గేయెవ్న మాస్కో వెళ్లుతూండడం ఆరంభించింది. ఆడవాళ్ల జబ్బులో ప్రవీణుడైన ఒక వైద్యుడిని మాస్కోలో చూడాలని తన భర్తతో చెప్పి, ప్రతి రెండు మూడు నెలలకూ స— నగరం నుండి మాస్కోకి వెళ్తూండేది. ఆమె పెనిమిటి ఆమెను నమ్మేనూ నమ్మేవాడు, మళ్లీ నమ్మకనూ పోయేవాడు. ఆమె మాస్కో వెళ్లినప్పుడల్లా ''స్లావియాన్స్కి బజార్'' హొటేలులోనే దిగి, మరు నిమిషమే ఒక ఎర్రటోపీ వార్తాహరునిచే గూరొవ్‌కి కబురు పంపేది. కబురు అందగానే గూరొవ్ ఆమెదగ్గరకు వెళ్లేవాడు. ఈ సంగతి ఆ మహాపట్నంలో మరొక మనుష్యమాత్రుడికి తెలిసేదికాదు.

చలికాలంలో ఒకనాడు మామూలుగా ఆమెను కలుసుకుందుకు వెళ్లాడు గూరొవ్ (అంతకు ముందురోజు సాయంకాలమే వార్తాహరుడు అతని దగ్గరకు కబురు చెప్పేందుకు వచ్చాడు, కాని తాను ఇంట్లో లేకపోయాడు). అతని కూతురు బడి కూడా ఆ దారిలోనే వుండడంచేత, మరేమీ ఫరవా లేదు, ఆమెను బడివరకూ సాగనంపవచ్చునని అనుకుని, కూతురుతో కూడా ఇంటినుండి బయలుదేరాడు.

''తాపక్రమం ఇంకా సున్నకి పైన మూడు డిగ్రీలు వున్నప్పటికీ, మంచు కురుస్తూంది'' అంటూ తన కూతురితో సంభాషణ ఆరంభించాడు గూరొవ్. ''ఐతే ఒకటి సుమా, తాపక్రమం భూమికి సమీపంగా సున్నకి కాస్త పైగానే వున్నప్పటికీ, వాతావరణపు పైపొరలలో తాపక్రమం పూర్తిగా భిన్నంగా వుంటుంది.''

''అయితే, నాన్నా, చలికాలంలో ఎప్పుడూ ఉరుముదేమి?''

ఇది కూడా కూతురికి బోధపరచి చెప్పాడు గూరొవ్. ఈలా కూతురితో మాట్లాడుతూన్నంత సేపూ, తానొక సాంకేతిక స్థలానికి వెళ్లుతున్నాననీ, మరొక కంటివాడికెవ్వడికీ ఈ సంగతి తెలియదనీ, బహుశా ఎన్నటికీ కూడా తెలియనే తెలియదనీ, తనలో తాను పదేపదే గుర్తు చేసుకుంటూ వచ్చాడు. తానొక ద్వంద్వ జీవితాన్ని సాగించుతున్నాడు — ఒకటి, తనతో అన్ని విధాలా సంబంధం వున్న వారందరి మధ్యనూ, బహిరంగంగానూ, సాంప్రదాయ సత్యాలతోనూ, సాంప్రదాయ వంచనలతోనూ సంపూర్ణంగా నిండి వున్నట్టి, తన స్నేహితులూ తన పరిచయస్థులూ జీవించుతూన్న జీవితాలనే అచ్చంగా పోలినట్టి జీవితం; ఇక రెండవది, రహస్యంగా అంతర్వాహినిగా ప్రవహించుతూన్న జీవితం. కాగా ఏదో చిత్రమైనట్టి, బహుశా కేవలం యాదృచ్ఛికమైనట్టి ఘటనా పరంపరల కారణంగానే, ముఖ్యమైనట్టి, అత్యంతావసరమైనట్టి, ఆత్మవంచనకు తాను లోనుగానట్టి, తాను త్రికరణ శుద్ధిగా నమ్మినది సర్వమూ ఏదైతే వుందో ఆ సర్వమూ, తన జీవిత అంతస్సారాన్ని ఇముడ్చుకొని వున్న ఆ సర్వమూ ప్రచ్ఛన్నంగానే సాగిపోతూంది; ఇక తనలో వున్న బూటకము సర్వమూ, ఏ గుల్లలోనైతే తనలో వున్న సత్యముతో సహా తాను కూడా దాగుని శరణు పొందుతూన్నాడో

అది సర్వమూ — బ్యాంకులో తన కార్యకలాపమూ, క్లబ్బులో చర్చలూ, తన ''అధమ జాతీ'', తన భార్యతో సహా తాను హాజరైన వార్షికోత్సవాలూ — పైపైనే నడచిపోతూంది. తన జీవితాన్నిబట్టే ఇతరులను కూడా తాను విలువకట్టడం మొదలుపెట్టుతున్నాడు — తాను తన కళ్లతో చూచిన దానిపై ఇక నమ్మకముపోయి, ప్రతి మనిషిలోనూ వున్న యథార్థమూ, అచ్చంగా ఆసక్తిదాయకమూ అయిన జీవితం రాత్రి మరుగునే రహస్యంగానే సాగుతుందని నమ్ముతూ, తన జీవితాన్నిబట్టే ఇతరులపైన కూడా ఒక నిర్ణయానికి వస్తున్నాడు. ప్రతి వ్యక్తి మనుగడ ఏదో ఒక మర్మం చుట్టూ పరిభ్రమించుతూంటుంది; కాగా స్వీయరహస్యాల పట్ల గౌరవం పాటించాల్సిందని సంస్కారంగల వ్యక్తులు గట్టిగా పట్టుదల చూపడానికి బహుశ ఇదే ప్రధానకారణమేమో కూడానూ.

తన కుమార్తెను ఆమె బడిగుమ్మంలో దిగబెట్టేసి, గూరొవ్ ''స్లావియాన్స్కి బజారు'' దిశగా వెళ్లిపోయాడు. ఆ హోటేలు వసారాలో తన ఓవర్‌కోటును తీసేసి, అక్కడ చిలక్కొయ్యకు తగిలించేసి, మేడమెట్లెక్కి మెల్లగా తలుపు తట్టాడు. తనకు ముఖ్యంగా ఇష్టమైనట్టి ధూసరవర్ణపు గౌను తొడుగుకుని వుంది అన్న సెర్గేయెవ్‌న. ప్రయాణపు బడలికవల్లనూ, ఉద్విగ్నత వల్లనూ నిస్త్రాణ చెంది, క్రితం సాయంత్రంనుండీ అతనికోసం నిరీక్షించుతూంది ఆమె. ఆమె ముఖం వెలవెలబోతూంది. చిరునవ్వు నవ్వకుండానే ఆమె అతనికేసి చూచింది, కాని అతడు గదిలో అడుగు పెట్టడంతోనే అతని కౌగిట చేరింది. ఒకరినొకరు చూచుకొని ఎన్నో యేళ్లు గడచినట్టు, వారి చుంబన మిక్కిలి తాపీగానూ సుదీర్ఘంగానూ సాగింది.

''నువ్వు ఎలా వున్నావు? విశేషాలేమిటి?'' అని అడిగాడు గూరొవ్.

''ఒక్క క్షణం ఆగుతే చెబుతాను... మాటరాకుండా వుంది...''

ఆమె ఏడుస్తూండడంచేత నోట మాటరాలేదు. ఆమె అటువైపు తిరిగి, చేతిరుమాలులో ముఖం పెట్టేసుకుని వలవల ఏడుస్తూంది.

''ఏడుపంతా పూర్తి అయేవరకూ ఆగడమే మంచిది'' అనుకుని అక్కడున్న కుర్చీలో చదికిలబడ్డాడు గూరొవ్.

టీ పురమాయించేందుకని అతడు గంటకొట్టాడు. మరి కాస్సేపయిన తరువాత, తాను టీ తాగుతూండగా, ఆమె ఇంకా అలాగే కిటికేసి ముఖం తిప్పేసుకునే నిల్చునుంది. భావసంచలనంవల్లనూ, తమ జీవితం దుఃఖ భాజనంగా పరిణమించిందేనని గ్రహించడంచేతనూ కలిగిన తీవ్ర మనః క్లేశం వల్లనూ ఆమెకు ఏడ్పు వచ్చేసింది; ఇతరులకు తెలియకుండా చాటు మాటుగా, తామేదో దొంగలైనట్టుగా, ఒకరినొకరు రహస్యంగానే కలుసు కొనవలసి వస్తూందే, తమది భగ్నజీవితంగాక మరేమిటి?

''అయ్యో, ఏడుస్తావెందుకు? ఏడవకు'' అన్నాడతడు.

తమ ఇద్దరి మధ్యనూ నెలకొన్న ఈ ప్రేమ ఇంత వేగంగా అంత మొందదనీ, దాని అంతమెప్పుడో ఎవ్వరికీ చెప్పతరం కాదనీ స్పష్టంగా తెలుస్తూనే వుంది. తనను ఆన్న సెర్గేయెవ్న వెనుకటికంటెనూ మరింత అధికంగా ప్రేమించుతూ పువ్వులలో పెట్టి పూజిస్తూందే; అలాంటప్పుడు ఏనాడో ఒకనాడు ఇదంతా అంతమై తీరాలని ఆమెతో చెప్పడంలో అర్థమేమీ లేదనే అనిపించిందతనికి. నిజానికి ఆలాగని అతడు చెప్పినా ఆమె అతడిని నమ్మివుండేదే కాదు.

—

అతడు లేచి ఆమె దగ్గరకు వెళ్ళి, పిచ్చా పాటీ కబుర్లతో ఆమెను బుజ్జగించాలనే ఉద్దేశంతో ఆమె బుజాలను తన చేతులలోకి తీసుకుందామని అనుకున్నాడు, కాని అతనికి అప్పుడు అద్దంలో తన ముఖం కనబడింది.

తన జుట్టు అప్పుడే అక్కడక్కడ నెరుస్తూంది. ఈ రెండు మూడేళ్ళల్లోనూ తన కింతగా వయస్సు ముదరడం చూసుకొని తనకే ఎంతో వింతగా తోచింది. తన చేతులు ఆనుకొని వున్న బుజాలు వెచ్చగా తగిలి, వణకుతున్నాయి. సౌందర్యం ఉట్టిపడుతూన్న ఈ జీవిపట్ల అతనికెంతో జాలివేసింది, బహుశ అనతికాలంలోనే తనలాగానే ఈ జీవి సహితమూ వాడిపోయి, కుంగిపోతుందేమో, పాపం. తనను ఎందుకింతగా ప్రేమించుతూంది ఈమె? తాను యథార్థంగా వున్నదానికంటె భిన్నమైన మనిషే అని స్త్రీలు తనను ఎప్పుడూ నమ్మేవారు, ఆలా నమ్ముతూ తమ ప్రేమను తనపై వారు లగ్నంచేసినప్పుడు, వాస్తవమైన తనునుగాక, తమ ఊహాజగత్తులో తాము చిత్రించుకున్న పురుషునిగా, తమ జీవితమంతా తాము ఆత్రతతో అన్వేషించిన పురుషునిగా తనను ప్రేమించేవారు. ఇక తరువాత, తమ పొరపాటును వారు గ్రహించుకున్న మీదట సహితమూ వెనుకటిలాగానే వారు తనను ఇంకా ప్రేమిస్తూనే వుండేవారు. కాగా వారిలో ఒక్కరైనా ఎన్నడైనా తనతో సుఖం అనుభవించలేదే. కాలం సాగిపోయింది. ఒక స్త్రీ తరువాత ఒక స్త్రీతో తనకు పరిచయం కల్గింది, ఒక్కొక్క స్త్రీతోనూ తనకు చనవు కుదిరింది, ఒక్కొక్కరి నుండీ తాను విడిపోవడమూ జరిగింది, కాని ఒక్క స్త్రీనైనా తాను ప్రేమించలేదు. తనకీ వారికీ మధ్య రకరకాల సంబంధాలు ఉంటూండేవి, కాని ప్రేమ మాత్రం ఉండేదికాదు.

ఇక ఇప్పుడు, తనకు ముదిమి వచ్చి తల నెరస్తూన్నప్పుడు, సరిగా ఇప్పుడు ఈ వయస్సులో, తన జీవితంలో తొలిసారిగా, సంపూర్ణంగా ప్రేమలో పడిపోయాడు.

అతి సన్నిహితంగానూ అమిత ఆంతరంగికంగానూ వున్న వ్యక్తులలా, భార్యాభర్తలులా, ప్రాణస్నేహితులలా, అతడూ అన్న సెర్గేయెవ్‌న, ఇద్దరూ ఒకరినొకరు ప్రేమించుకున్నారు. ఆమెను అతడూ, అతనిని ఆమె, ఒకరి నొకరు ప్రేమించుకోవాలని విధాత నిర్ణయించినట్లు కనబడింది వారిద్దరికీ; అలాంటప్పుడు — ఆమెకు భర్త అంటూ అప్పుడే ఒక వ్యక్తి వుండడమూ, అతడికి భార్య అంటూ అప్పుడే ఒక వ్యక్తి వుండడమూ ఎందుకో మరి వారి కేమీ అర్థమైందికాదు. స్వేచ్ఛగా వలసపోతూండగా వలవేసి పట్టి, వేర్వేరు పంజరాలలో పెట్టి బంధించిన మగపిట్ట, ఆడపిట్టలాగున వున్నారు వారిద్దరూనూ. గతంలోనూ వర్తమానంలోనూ తమజీవితంలో తాము సిగ్గు పడవలసిన దాని నంతటినీ వారు ఒకరికొకరు క్షమాణ చెప్పకొని, ఒకరి పట్ల ఒకరు అనుభవించుతూన్న ఈ ప్రేమ తమ నిద్దరనూ మార్చివేసినట్టే వారికొక అనుభూతి కలిగింది.

వెనుకటి రోజులలో, తాను వ్యాకుల పడినప్పుడు, తన మనస్సుకు అప్పటికప్పుడు ఏ తర్కం తోస్తే దానితోనే అతడు ఉపశమనం పొందే వాడు. కాని ఇప్పుడో — ఇప్పుడు తర్కంతో తనికేమీ నిమిత్తమే కనబడలేదు, తన హృదయకుహరం ప్రగాఢమైన కరుణతో నిండిపోయి, నిష్కపటం గానూ దయాళువుగానూ వుండాలనే కోర్కె అతనిలో కలిగింది.

“ప్రియతమా, ఏడవకు” అన్నాడతడు. “ఇంత సేపూ నువ్వు దుఃఖించుతూనే వున్నావు. ఇక నువ్వు ధుఃఖం ఆపుకోవాలి... ఇప్పుడు

మనం మాట్లాడుకొన వలసిన తరుణం ఆసన్నమయింది. మొదటికి మనం ఏమి చేయవలసి వుందో మనం ఆలోచించుకుందుకు ప్రయత్నించాలి."

ఇక అప్పుడు కూచుని తమ పరిస్థితిని గురించి చర్చించుకుంటూ, దాపరికము, వంచన, వేర్వేరు వూళ్లలో నివసించడము, సుదీర్ఘకాలం ఒకరి నొకరు ఎడబాసి వుండడము — దీని కంతటికీ వున్న అవసరాన్ని అధిగమించే మార్గం గురించి ఆలోచించ ప్రయత్నించారు. భరించశక్యంగాని ఈ సంకెళ్లను వదలించుకోవడం ఎలాగు?

"ఎలాగు? ఎలాగు?" అని తల పట్టుకుని పదేపదే ప్రశ్నించుకున్నాడు గూరొవ్. "ఎలాగు?"

తలవెంద్రుక వాసిలో ఒక నిర్ణయానికి వచ్చామనే వారనుకున్నారు; ఆ నిర్ణయానికి వచ్చిన తరువాత, ఇక సుందరతరమైన నూతన జీవితం ప్రారంభమవుతుంది. దీని కంతటికీ అంతం ఇంకా సుదూరంలో, అత్యంత దూరంలో వున్నదనీ, అత్యంత కష్టమైనట్టీ, అత్యంత సంక్లిష్టమైనట్టీ జీవితఖండం ఇప్పుడిప్పుడే ఆరంభమవుతూందనీ వారిద్దరూ గ్రహించుకున్నారు.

# రచయితలను గురించి

పూష్కిన్ అలెక్సాంద్ర్ సెర్గేయెవిచ్ (1799–1837) – రష్యన్ సారస్వత పితామహుడు, మహాకవి, గద్యరచయిత, నాటకకర్త.

పూష్కిన్ బీద కులీన కుటుంబంలో జన్మించాడు. అతడు చిన్ననాటే కవిత్వం ఆరంభించాడు. పూష్కిన్ త్సార్‌స్కొయె సేలో నగరంలోని లైసియమ్‌లో – అగ్రవర్గాలకు చెంది విశేషాధికారాలను చెలాయించే కులీనవంశజుల బిడ్డలకోసం ఉద్దేశించబడిన విద్యాసంస్థలో – చదువు పూర్తిచేశాడు. అతని పద్యాలు తొలిసారిగా 1814 లో అచ్చుపడ్డాయి. ఆనాటి కవులందరిలాగానే, పూష్కిన్ కూడా తన పద్యాలలో – "స్వేచ్ఛ", "పల్లెటూరు", "చాదాయెవ్‌కు అంకితం" – నిరంకుశ పరిపాలనను ఖండించుతూ, యమయాతనలకు లోనవుతూన్న ప్రజల రక్షణకు బహిరంగా పిలుపునిచ్చాడు. ఫలితంగా జార్ పూష్కిన్‌న్ని రాజధానీనగరం నుండి వెళ్లగొట్టాడు. రాజకీయాభిప్రాయాలలో పూష్కిన్ డెకబ్రిస్టులకు –

జార్‌కు వ్యతిరేకంగా 1825 డిశంబరులో తిరుగుబాటు సాగించిన రష్యాలోని తొలి విప్లవకారులు — సన్నిహితుడు. డెకబ్రీస్టులను జార్ మహా కిరాతకంగా అణచివేశాడు. పూష్కిన్‌కీ, అతని మిత్రులకూ 1825 డిశంబరు లోనే జైలు శిక్ష అనుభవించక తప్పింది కాదు. ఆనాటి నుండే మహాకవి నిర్బంధ విధానానికి గురి కావలసివచ్చి, చివరకు 1837 లో విషాదాంతమైన ద్వంద్వ యుద్ధంలో పాల్గొని మరణించాడు.

"రష్యన్ కవి భాస్కరుడు" — అని రష్యన్ ఆధుని కులు పూష్కిన్‌న్ని పేర్కొన్నారు. అతని ప్రతిభాసమన్వితమైన రచనా సృష్టి — "ఎవ్‌గేని ఒనేగిన్", "కంచురౌతు", "దుబ్రోవ్‌స్కి", "కెప్టెను కూతురు" — పందొమ్మి దవ శతాబ్ది తొలి మూడు దశాబ్దులనాటి రష్యన్ జీవి తానికి యథార్థమైన విజ్ఞానసర్వస్వం.

"మజిలీ గుమాస్తా" (రచన: 1831) రష్యాలో సామాన్య ప్రజల విషాదాంత జీవితాన్ని ప్రతిబింబింపజేసే కథ. ఎవరి రక్షణకైతే రష్యన్ సాహిత్యవేత్తలు తమ రచనలలో ఎలుగెత్తి చాటారో అట్టి సామాన్య ప్రజల స్మృతిని చిర స్థాయిగా నిలిపే కళామందిరంలో పూష్కిన్ తీర్చిదిద్దిన ఈ సాహితీ చిత్రమే మొట్టమొదటిది.

—

గోగొల్, నికొలాయ్ వసీల్యెవిచ్ (1809 – 1852) – ప్రఖ్యాత వాస్తవిక రచయిత, రష్యన్ సారస్వతంలో విమర్శనాత్మక వాస్తవిక విధాన స్థాపకుడు.

గోగొల్ ఉక్రేనియాలో ఒక జమీందారీ కుటుంబంలో పుట్టాడు. "దికాన్క చేరువనున్న కమతగృహంలో గడపిన సాయంకాలాలు" అనే శీర్షికతో ఉక్రేనియన్ జీవితాన్ని ప్రతిబింబించుతూ హాస్యరసంతోనూ వర్ణవైవిధ్యంతోనూ తొణికిసలాడుతూన్న కథాసంపుటితో అతడు తొలిసారిగా సాహిత్యరంగంలో ప్రవేశించాడు.

గోగొల్ 1829 లో పీటర్స్‌బర్గ్‌లో నివాసం ఏర్పరచుకొని అక్కడ వుంటూండగా, అతనికి పూష్కిన్‌తో స్నేహం కుదిరింది. అప్పటినుండి పూష్కిన్‌ని గోగొల్ తన గురువుగా భావించుకున్నాడు. రష్యన్ అధికారవర్గాన్ని నిర్దాక్షిణ్యంగా నవ్వులపాల్జేసినట్టి ప్రఖ్యాతివడసిన "ఇన్‌స్పెక్టర్ జనరల్" సుఖాంతనాటకానికి కథావస్తువును పూష్కిన్ ప్రేరేపణపైనే గోగొల్ స్వీకరించాడు. ఈ సుఖాంతనాటకం వెలువడగానే అభివృద్ధి నిరోధకులు దానిపై భయానకమైన దాడిని లేవదీశారు. ఫలితంగా గోగొల్ నిర్బంధంగా తన స్వదేశం వదిలిపెట్టేసి బహుకాలం పరదేశాల్లో గడపాల్సి వచ్చింది.

గోగొల్ రచనలలో మకుటాయమానమైనది వచన

రూపంలో మలచిన ఉజ్వల కవిత ''మృత ఆత్మలు.'' భూస్వామ్య కులీనవంశజులు, రష్యా యజమానులు, లక్షలాది కోట్లాది బానిసరైతులను తమ సొంత ఆస్తులుగా కలిగి నీచాతినీచులై క్షుద్రులైన శ్రీమంతులు — ఈ రకరకాల మనుషుల జీవితచిత్రాలను ప్రదర్శించుతూన్న కళామందిరమే ఈ మృత ఆత్మలు. అంతేకాదు — ''మృత ఆత్మలు''లో నాటి రష్యాలో సాగిన జార్ నిరంకుశ పరిపాలపై దారుణ ఖండనను చాటడమే కాకుండా, ప్రజాకోటి సజీవశక్తిపై, రష్యా భవితవ్యంపై తనకున్న విశ్వాసాన్ని కూడా రచయిత ప్రకటించాడు.

''ఓవర్‌కోటు'' కథలో (రచన: 1842), ఓవర్‌కోటును కొత్తది కుట్టించుకోవడమూ, దానిని పోగొట్టుకోవడమూ జీవన్మరణ ఘటనలుగా తయారైన ఒక స్వల్పజీతపు ఉద్యోగస్థుని దౌర్భాగ్య జీవిత గాథను గోగొల్ చిత్రిస్తాడు. సామాజిక దురన్యాయాన్ని దుయ్యబట్టుతూన్న ఒక ముఖ్యమైన నిరసనగా ఈ కథ రష్యన్ సారస్వతంలో విశిష్ట స్థానం ఆక్రమించుకుంది. ప్రజల ఇడుముల పట్ల తన దుఃఖాన్ని వెలిబుచ్చిన మరొక రష్యన్ మహారచయిత దొస్తొయేవ్‌స్కీ తన గురించీ, తనవలెనే కలం చేపట్టిన తోడి రచయితల గురించి ఇలా అన్నాడు: ''మేమందరమూ గోగొల్ 'ఓవర్‌కోటు' నుండి తయారైన వాళ్లమే.''

—

7—1

తుర్గేనెవ్ ఇవాన్ సెర్గేయెవిచ్ (1818–1883)
— సుప్రసిద్ధ రష్యన్ రచయిత.

తుర్గేనెవ్ అర్యోల్‌స్క్‌య రాష్ట్రంలో రైతుకుటుంబంలో పుట్టాడు. అతని తల్లి అనేకమంది బానిసరైతులకు యజమానురాలు. వారినందరినీ ఆమె క్రూరంగా హింసించేది. ఇదంతా తుర్గేనెవ్ కళ్లారచూసి, బానిసరైతు విధానాన్ని నిర్మూలించడానికి తానింకా కుర్రవాడుగా వున్నప్పుడే ప్రతిజ్ఞ పట్టాడు.

"వేటగాని వివరణలు" అనే శీర్షికతో కథావాహిని రూపంలో వెలువడిన ప్రజల జీవితంనుండి కూర్చిన కథానికల రచనతో 1840ల చివరి సంవత్సరాలలో తుర్గేనెవ్ సాహితీ ప్రపంచంలో అడుగుపెట్టాడు. ఈ కథలలో తుర్గేనెవ్, ఎట్టి పౌరసత్వాలనూ అనుభవించని రష్యన్ రైతుల దుర్భర నికృష్ట జీవితాన్ని అత్యంత సానుభూతితో చిత్రించుతూ, సామాన్య ప్రజలలో ద్యోతకమయే ధీశక్తి, ప్రతిభ, ఆధ్యాత్మిక సౌందర్యాలను ఎంతో ఆనందోత్సాహాలతో వర్ణించాడు. ఈ నవలికలు ప్రత్యక్షంగా బానిసరైతు విధాన వ్యతిరేక ధోరణిని ప్రదర్శించిన కారణంగా తుర్గేనెవ్ ప్రభుత్వం నుండి కఠిన నిర్బంధ విధానాన్ని అనుభవించాల్సి వచ్చింది. ఫలితంగా ప్రభుత్వ ఆజ్ఞలననుసరించి, తుర్గేనెవ్

తన ఎస్టేటుకి వెళ్లగొట్టబడి, అక్కడే పోలీసు నిఘా కింద జీవించాల్సి వచ్చింది.

భావవృత్తి అన్వేషణకూ, పందొమ్మిదవ శతాబ్ది మూడవ తొమ్మిదవ దశాబ్దుల మధ్యకాలపు రష్యన్ సమాజ మనస్తత్వ చిత్రణలకు అంకితం చేయబడిన ఆరు నవలలూ బహుళ సంఖ్యాకములైన కథానికలూ కథనాలూ తుర్గేనెవ్ లేఖిని నుండి వెలువడ్డాయి.

తుర్గేనెవ్ రచించిన "ముమూ" కథ గురించి ప్రముఖ ఆంగ్లేయ రచయిత జాన్ గాల్స్వర్దీ ఇలా రాస్తాడు: "నిరంకుశ క్రౌర్యానికి వ్యతిరేకంగా ఇంతటి హృదయ విదారకరమగు నిరసన ఏదీ కళాప్రపంచంలో ఇదివర కెన్నడూ వెలువడలేదు."

తోల్‌స్తాయ్ లెవ్ నికొలాయెవిచ్ (1828–1910) – అప్రతిమాన ప్రతిభాసమన్విత కళాకారుడు, విశ్వ సాహిత్యంలో విమర్శనాత్మక వాస్తవికతా విధానానికి ఉన్న తోన్నత ప్రతినిధి.

తోల్‌స్తాయ్ ఒక పురాతన కులీనవంశీయ కుటుంబంలో జన్మించాడు. ఈ రచయిత తన జీవితంలో అత్యధికభాగం తన కుటుంబపు జమీ ఎస్టేటులో, నిరాడంబర జీవులైన సామాన్య పామరజనంతో వ్యక్తిగత సంబంధాలను నెలకొల్పుకుని తన మనుగడ సాగించాడు. తన మొట్ట మొదటి రచన, "పసితనం" (రచన:1852) అనే కథతోనే రష్యన్ రచయితల అగ్రశ్రేణిలో సుస్థిర స్థానాన్ని తోల్‌స్తాయ్ వెంటనే సంపాదించుకున్నాడు.

"యుద్ధం, శాంతి" అనే నవల – 1812 దేశభక్తియుత సంగ్రామ కాలం నుండి మలచిన ప్రబంధ కృతి, విషయ గాంభీర్యంలోనూ విస్తృత జీవితవస్తు విన్యాసంలోనూ నిరుపమాన కృషిరాజం, కళాప్రపూర్ణ సిద్ధహస్తుని సృష్టి – తోల్‌స్తాయ్‌కి విశ్వఖ్యాతిని చేకూర్చిపెట్టింది.

జగత్ప్రసిద్ధి గాంచిన వేరొక నవల, "అన్న కరేనిన"లో, సుఖసౌభాగ్య జీవితంకోసం ఉవ్విళ్లూరుతూ, ఫాషనబుల్

సమాజపు అంతఃకరణ రహితమైన మోసపు నీతికింద నలిగి శిథిలమైపోయిన ఒక యువతి విషాదాంత జీవితాన్ని ప్రబహత్తర పటిమతోనూ మనస్తత్వశాస్త్రీయ యథార్థతతోనూ తోల్‌స్తాయ్ చిత్రిస్తాడు.

అతని మూడో నవల "పునరుత్థానం" లో నిరంకుశ పాలనా విధాన మూల సూత్రాలను ప్రతిఘటించుతూ ఆగ్రహావేశపూరితమైన నిరసనను తోల్‌స్తాయ్ ఎలుగెత్తి చాటుతాడు. అయినప్పటికీ, ఈ దుష్టప్రపంచంలో జారిస్టు విధానాన్ని జయించేందుకు నైతిక స్వయం పరిణతి ఒక్కటే ఏకైక సాధన అని తోల్‌స్తాయ్ అనుకున్నాడు.

దౌర్జన్యప్రయోగ దౌష్ట్యం పట్ల ప్రతిఘటనా రాహిత్యం అనుసరించడం గురించి తోల్‌స్తాయ్ బోధనలో పితృస్వామ్య రైతాంగవిధాన ఛాయలు తొలిచూపులోనే ద్యోతకమవుతాయి. 1905 విప్లవంలో ప్రధానపాత్ర వహించిన రైతాంగంయొక్క శక్తివంతమూ బలహీనములూ అయిన భావవృత్తులు తోల్‌స్తాయ్ రచనలలోనూ బోధనలలోనూ ప్రతిబింబించుతూండడం కారణంగా, తోల్‌స్తాయ్‌ని "రష్యన్ విప్లవ దర్పణం" అన్నాడు లెనిన్.

"ఏందు తరువాత" (రచన: 1903) అనే కథ మహా రచయిత కడపటి రచన.

కుప్రీన్ అలెక్సాండ్ర్ ఇవానొవిచ్ (1870–1938) – కీర్తి వడసిన రష్యన్ రచయిత, మానవ తత్వవాది, ప్రజా స్వామ్యవాది.

కుప్రీన్ "రజ్నొచీనెత్స్" అని చెప్పబడే – పందొమ్మిదవ శతాబ్ది రష్యన్ సంపన్న కుటుంబాలకు చెందని మేధావి వర్గంలోని వాడు. అతడు మిలిటరీ స్కూలులో చదివి, ఆఫీసరు అయాడు. ఇతని సృజనాత్మక కృషిలో జారిస్టు సైనికజీవితం ఒక ప్రధాన కథావస్తువుగా పరిణమించడానికి కారణం ఈ ఘటనే అని మనకు తెలుస్తూంది.

1894లో అతడు సైన్యాన్ని విడిచిపెట్టేసిన తరువాత, అనేక వృత్తులను చేపట్టి వాటిని మార్చుతూ జీవితం గడపడంచేత, రష్యన్ కార్మికులలో అట్టడుగు స్తరముల జీవితాన్ని తన స్వానుభవం వల్లనే క్షుణ్ణంగా ప్రత్యక్షంగా తెలుకొనగల్గాడు.

రష్యన్ పెట్టుబడిదారీ విధానాన్ని నగ్నంగా ప్రదర్శించిన "మోలక్" (దురాశా పిశాచం) కథారచనతో కుప్రీన్ మహత్తర సారస్వతంలో ప్రవేశించాడు.

కుప్రీన్ సృజనాత్మక వ్యాసంగ వికాసం 1905 విప్లవ ఘటనలతో అత్యంత సన్నిహితసంబంధం కలిగి వుంది. అతని అత్యుత్తమ రచన, "ద్వంద్వయుద్ధం" మక్సీమ్ గోర్కికి

అంకితం చేయబడింది. గోర్కి కూడా ఆ రచనను ఎంతో విలివైనదిగా ఎంచాడు. ఈ కథలో జారిస్టు సైన్యంలో ఉన్నతస్థానాల నాక్రమించుకున్న ఉన్మాదులగు పరదేశీయులను కుప్రీన్ బట్టబయలుచేసి జలకడిగేశాడు.

1917 తరువాత కుప్రీన్ విదేశాలకు ప్రవాసం వెళ్లి పోయాడు. ప్రవాస జీవిత కాలంలో అతడు గణనీయమైన దేదీ రచించలేదు. 1937 లో అతడు తన స్వదేశానికి తిరిగివచ్చే శాడు. ప్రేమ గురించి కుప్రీన్ అద్భుతంగా గానంచేశాడు. ''కెంపుల కంకణం'' (రచన: 1910) అనే శీర్షికతో వెలువరించిన కథానికల సంపుటిలో పవిత్రమూ ఉదాత్తమూ అయిన ప్రేమనుగూర్చిన ''ఒలేస్య'', ''సులమీఫ్'' కథలు అతని లేఖిని నుండి వెలువడిన అత్యుత్తమ కథలలో కొన్నిటికింద ఎంచబడుతున్నాయి.

చేహొవ్ అన్‌తోన్ పావ్లొవిచ్ (1860–1904) – పందొమ్మిదవ శతాబ్దాంతపు ప్రముఖ కథానికారచయిత, నాటకకర్త, ప్రఖ్యాత కళాపిపాసి – నూతన పథాన్వేషి. చేహొవ్ దక్షిణ రాష్యాలోని తగన్‌రోగ్ నగరంలో జన్మించాడు. అతని తాత బానిసరైతు, కాని పరిహారం చెల్లించుకుని స్వేచ్ఛ పొందాడు.

చేహొవ్ వైద్యవిద్య నభ్యసించి, 1884–1885 సంవత్సరాలలో వైద్యవృత్తి చేస్తూండేవాడు. హాస్యరచయితగానూ, వ్యంగ్యరచయితగానూ, కథానికా రచయితగానూ, సునిసిత అవేక్షకునిగానూ చేహొవ్ సాహితీ క్షేత్రంలో వెలశాడు. అతని కథలలో అప్రతిమమైనవి: "ఊసరవెల్లి", "నాన్ కమిషన్డ్ ఆఫీసరు ప్రిషిబేయెవ్", "దుష్టుడు". 1890 సంవత్సరాలలో చేహొవ్ రచించిన నవలికలలో రష్యన్ జీవితంలో ప్రజాదృష్టిని తీవ్రంగా ఆకర్షించినట్టీ, మౌలికమైనట్టీ సమస్యలను కొన్నింటిని అతడు లేవనెత్తాడు. స్వేచ్ఛా చింతనను విజయోన్మాదంతో అణచివేసిన నిరంకుశ పరిపాలన, అజ్ఞానమూ స్వైరవిహారం చేసిన జారిస్టు రష్యాయొక్క సంకేతవిధాన చిత్రణ "వార్డు నెంబరు 6" కథలో మనకు లభించుతుంది. తెలివైనవాడూ, చిత్తశుద్ధిగలవాడూ అయినప్పటికీ,

జిల్లా ముఖ్యపట్నంలో ప్రాక్టీసు చేసుకుంటూన్న వైద్యుడు తన సంకుచితతత్వానికి ఆహుతైపోయి, చిట్టచివరకు ఆధ్యాత్మిక వినాశానికే విధికృతంగా దిగనాసిల్లుతాడు — ఇదీ "యిఓనిచ్" కథ ఇతివృత్తం. పేలవము, ఉదాసీనత, నియమ ఆదర్శములలేమి — వీటి నిశిత విమర్శనే తన సృజనాత్మక రచనల — "గూస్‌బెర్రీ పండ్లు", "శత్రువులు", "తూరీగ", రూపక నాటకాలు: "వాన్య మామయ్య", "ముగ్గురు అక్కచెల్లెళ్లు" — పట్ల చేహొవ్ ప్రదర్శించిన ఉత్సాహాన్ని నిర్ధరించాయి.

తన నిర్యాణానికి కొద్ది కాలం ముందు తాను వెలయించిన తదుపరి రచనలలో — "పెళ్లికూతురు" కథలోనూ, "చెర్రీతోట" నాటకంలోనూ రష్యా దేశపు ప్రజాజీవితంలో అప్పుడప్పుడే అంకురించిన నవీనతకూ, విప్లవ ధోరణులకూ చేహొవ్ స్వాగతం చెబుతూ నమస్సు లర్పించాడు.

తనసిద్ధహస్తంతో చేహొవ్ తీర్చి దిద్దిన రచనలలో "కుక్కపిల్లను వెంటబెట్టుకున్న మహిళ" (రచన: 1899) ఒకటని ప్రసిద్ధి గాంచింది.

పాఠకులకు మనవి

ఈ పుస్తకాన్ని గురించిగాని దీని పేర్పాటుకూర్పు గురించిగాని మా భావిప్రచురణల సహాయర్థం మీ అభిప్రాయాలను సలహాలను మాకు పంప ప్రార్థన.

మా చిరునామా:

Foreign Languages Publishing House.
21, Zubovsky Boulevard, Moscow, USSR.